# మానవ విజయం

రచన:

యం. ఇలిన్
ఇ. సిగాల్



అనువాదం:

వి. ఆర్. శాస్త్రి, బి. ఎస్సి.

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# ప రి చ య ం



ప్రకృతికి బానిసగా వుండే మానవుడు తనసంకెళ్ళ నెలాగ ఛేదించు కున్నాడు ? ఆకూ, అలమూ తింటూ కట్టబట్టలేక, ఉండనిల్లులేక బికారిగా తిరిగే ఒకనాటి మానవుడు యీనాడు యింత ఉచ్ఛస్థితి కెలావచ్చాడు ? ఆ మానవుడు ప్రకృతితో చేసిన పోరాటా లెటువంటివి ? అభ్యుదయపథాన విజ్ఞాన శిఖరాలను ఎలా చేరుకున్నాడు ? మానవుని చారిత్రక పరిణామ మేమిటో ? — ఇవన్నీ సామాన్యులకు తెలియని కఠిన సమస్యలు.

అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్లు, పదవగలిగిన పిల్లలకుకూడా అర్థమయ్యేటట్లు, సామాన్యులకు తెలియని యీ కఠిన సమస్యలకు సమాధానం చెప్పగల సిద్ధహస్తులు యం. ఇలిన్, ఇ. సిగాల్ గార్లు. 'How Man Became A Giant' అన్న ఆంగ్లగ్రంథం ఈ సిద్ధహస్తుల రష్యను మాతృకకు బియాట్రిస్ కిన్‌కడ్‌గారు చేసిన అనువాదం. ఈ ఆంగ్లానువాదాన్ని ఆధారంగా చేసుకొని, ఆంధ్రులకు సులభంగా అవగాహనమయ్యే రీతిని, తేట తెలుగులో 'మానవ విజయం' అనే పేరుతో వి. ఆర్. శాస్త్రిగారు ఈ గ్రంథాన్ని వ్రాసి ఆంధ్రవిజ్ఞాన సౌధంలో ఒక కొత్త దీపాన్ని వెలిగించారు.

అజ్ఞానం చీకటికంటే గాఢమైనది. చీకటిలో నడిచేవానికంటె అజ్ఞానంలో జీవించేవాని పాట్లు అధికమైనవి. మూఢవిశ్వాసాలను, ఆచారాలను తొలగించి మానవాభ్యుదయానికి తీసుకుపోయే మహారథం విజ్ఞానం. ఇట్టి వైజ్ఞానిక గ్రంథాలు మన తెలుగులో వేళ్ళమీద లెక్కపెట్టగలన్నికూడా లేకపోవడం ఆంధ్రుల దురదృష్టం. ఈ లోపాన్ని సరిదిద్దటం మన ఆంధ్రు లందరి విధి. ఈ ఆశయంతో మా ప్రచురణాలయం రాజకీయ ఆర్థిక, సాంఘిక,

చారిత్రక సారస్వత వైజ్ఞానికాది అనేక విషయాలనుగురించి సమర్థులు వ్రాసిన గ్రంథాలను ప్రచురిస్తుంది. కందుకూరి వీరేశలింగం, కొమర్రాజు లక్ష్మణరావు, గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు, కాశీనాథుని నాగేశ్వరరావు గార్లవంటి మన మహనీయులు ప్రారంభించిన వైజ్ఞానిక విప్లవాన్ని కొనసాగించడానికి శాయశక్తులా విశాలాంధ్ర ప్రచురణాలయం ప్రయత్నిస్తుంది. ఈ మహత్తరమైన కార్యభారాన్ని ఒక్క చేతిమీదుగా నిర్వహించడం దుస్సాధ్యం. మన ఆంధ్రదేశంలో అనేక ప్రచురణాలయాలు పూనుకోవలసిన బాధ్యత యిది. ఆంధ్ర జాతీయ వికాసానికి మా అల్పశక్తితో సేవచేస్తున్న మాకు రచయితలు, పాఠకులు, ఆంధ్రమహాజనులందరూ ఆదరాభిమానాల్ని చూపవలసిందిగా ప్రార్థిస్తున్నాము.

ప్రకృతిని జయించి జీవితాన్ని సర్వాంగశోభితంగా మానవు డెలాగ చేసుకున్నాడో యీ పుస్తకం చిత్రించింది. మానవుని అనంతయాత్రకు — అభ్యుదయ యాత్రకు అంతంలేదు. ఒకనాడు అసాధ్యం, అనూహ్యం అనుకున్నవి యీనాడు సులభసాధ్యాలవుతున్నాయి. మానవుని పురోగమనం అపారమైన వేగంతో సాగుతున్నది. ఈ సత్యాన్ని విస్మరించిన మానవ పురోగమనానికి, సౌభాగ్యానికి, సర్వతోముఖాభ్యుదయానికి అడ్డుపడే అభివృద్ధి నిరోధక భావోన్మాదులు, కాలచక్రాన్ని వెనుకకు త్రిప్పడానికి ప్రయత్నించేవారు. మానవ చరిత్రను తల్లక్రిందులు చేయలేరనే నిగూఢ సత్యాన్ని యీ గ్రంథం తెలియచేస్తూంది.

—సంపాదకుడు.

# 1

# ఇదంతా దేన్ని గురించి?

నా చిన్నతనంలో మా ఇంట్లో ఒక నౌకరు ఉండే వాడు. అతనికి అప్పటికి డెబ్బైయేళ్ళుంటాయనుకొంటా. మేము, పిల్లలమంతా, అతన్ని "తాత" అని, చనువుగా పిలిచే వాళ్ళం. సాయంత్రం, భోజనాలయ్యాక, చక్క-చక్కని కథలు చెబుతూ మమ్మల్ని నిద్రపుచ్చేవాడు. పూర్వం రాముడూ, సీతా, లక్ష్మణుడూ దండకారణ్యంలో తిరిగే రోజుల్లో, గొప్ప గొప్ప రాక్షసు లుండేవారట. ఆ రాక్షసు లెంత పెద్దవాళ్ళో, మా లేత మనస్సులకు విశదంకావడానికి, బహుచిత్రంగా వర్ణించేవాడు. ఎట్లాగంటే!

ఒకసారి ఎవడో అరణ్యంలో వెడుతోంటే ఏదో పెద్ద గట్టులాగా కనుపించిందట. దాన్ని ఎంతో ప్రయాసపడి యెక్కి, దాని పొడుగునా నడిచాడట. చాలాసేపు, ఆగట్టు మెత్తమెత్తగా, విచిత్రంగా, అదోరకంగా, తమాషాగా ఉన్న దేగాని, వాడికాళ్లు బురదలో దించుకుపోయేటట్లు, దించుకు

పోలేదట. ఈ గట్టుమీదుగా నడవగా, నడవగా దూరాన ఆకాశానికడ్డంగా పెద్ద కొండలాగా ఏదో కనుపించింది. ఆ కొండప్రక్కనుండీ తెరలు, తెరలుగా బలమైనగాలి వీస్తోంది. ఇంకా కొంచెం సమీపిస్తే బ్రహ్మాండమైన ఒక గుహ ద్వారా న్నుండి కొండప్రక్కలో కనుపించింది. ఆ గుహలోనుండే యీ గాలి వీస్తోంది.........ఇట్లా ఇంకా ఏమేమో విచిత్రంగా వర్ణించి, చివరకు ఆ మనిషి యొక్క, పొడుగునా నడిచింది నిద్రిస్తూన్న ఒక రాక్షసుని చేయి అనీ, పెద్ద కొండ అతని తలా, ఆగుహ అతని నోరూ, వీచినగాలి, అతడు ఊపిరి విడవటం....ఇట్లా చెప్పేవాడు! కొందరు రాక్షసు లెంత పెద్ద వాళ్ళంటే తాటిచెట్లను అవలీలగా పెకలించి, పండ్లు కోసు కొనేవాళ్ళు! మరీ, ఇంకా ఇతరులు చిన్న కొండలతో గచ్చ కాయలూ, గోలీలూ ఆడేవాళ్ళు!!
ఇదంతా దేన్ని గురించి?

ఆలాంటివర్ణనలు వింటూంటే మాకు భయంవేస్తూన్నా, యింకా వినాలనియుండేది.

పూర్వం, నిజంగా అట్లాంటి వ్యక్తులుండేవారో లేదో కాని ఇప్పుడు, యీ మన లోకంలో ఒక బ్రహ్మాండమైన వ్యక్తి యున్నాడు.

పెద్ద రైలు యింజనును అవలీలగా అతని చేతులతో యెత్తేస్తాడు.

ఒక్కరోజులో, ఇతను వేలకొలదిమైళ్ళు నడిచేయగలడు.

మేఘాలపైకి ఏ పక్షీ యెగురలేనంత యెత్తుకు, తన రెక్కలతో యీత నెగురుతాడు.

తన చిత్రమైన రెక్కలు ఆడిస్తూ నీటిపైనా, నీటి యడుగునా ఏ చేపా యీదలేనంత బాగా యీదుతాడు.

మనకంటికి గోచరముకానివన్నీ యితను చూస్తాడు; భూమి కవతలప్రక్కనుండే జనులు మాట్లాడుకొనే విషయాలు బహుసులభంగా వింటాడు.

అతని కెంతబలముందో తెలుసా? చిన్నగా, పెద్ద కొండలో చొరబడి దూరి వెళ్ళేస్తాడు. ఎంతెంత జలపాతాలనైనాసరే ఇట్టే నిలిపేస్తాడు; ప్రవహించకుండా, లోకాన్నంతా తన ఇష్టప్రకారం మార్చేసుకొంటాడు. అరణ్యాలు నాటుతాడు; సముద్రాలను ఒకదాంతో ఇంకోటి కలిపేస్తాడు. ఇసుక యెడారులకు నీళ్ళుపెట్టి, పంటలు పండిస్తాడు.

ఈ బ్రహ్మాండ వ్యక్తి యెవరో తెలుసా?

తెలీదు కాదూ?...సరే, విను చెప్తాను. అతడే మానవుడు.

నీ మాదిరీ, నా మాదిరీ ఉండే యీ మానవుడే ఇంత విచిత్రమైన పనులుచేసే యీ వ్యక్తి అంటే నీవు నమ్మవు. నాకు తెలుసు కాని, మానవుని కీ అద్వితీయమైన శక్తి సామర్థ్యాలు యెల్లావచ్చాయో తెలుసుకొంటే, నా మాటల నిజం నీ కర్థమవుతుంది.

ఈ పుస్తకంలో, దీన్నిగురించే చెప్తాము.



# కంటికి కనుపించని ఖైదు

చాలాకాలంక్రితం మానవుడు ముందుచెప్పిన శక్తు లేవీకాకుండా, సాధారణంగా ఉండేవాడు. ఇప్పు డతనొక మహాత్తరుడంటే, పూర్వం అతనొక మరుగుజ్జు అని అనుకో వచ్చు. ఈ లోకాని కతను అధికారికాక, దానికి దాసుడుగా ఉండేవాడు ఆరోజుల్లో.

సృష్టిలోనుండే మృగాలకూ, పక్షులకూ ఎంత కొద్ది స్వేచ్ఛ ఉన్నదో, అంతే అతనికీ స్వేచ్ఛా, అనుకొన్న పని చేయగల అవకాశమూ ఉండేవి. వాటికన్న రవంతకూడా యితనిది పైచేయిగా నుండేదికాదు.

ఇట్లా అంటే, "పక్షులకు స్వేచ్ఛలేదా ? ఇచ్చవచ్చిన రీతి విచ్చలవిడి విహరించే విహంగాలకు కాకుంటే, నేలను తాకీ తాకనట్లు తన సన్నని వేళ్ళతో పసరికబయళ్ళమీద ఛెంగు ఛెంగున గంతులేస్తూ పరుగిడే లేడి పిల్లకు కాకుంటే, యిం కెవరికి స్వేచ్ఛ ఈ లోకంలో ?" అని నీ వనవచ్చు.

"కొమ్మ కొమ్మకూ, కీచ్ కీచ్ మని అరుస్తూ, తన గుబురుతోకను యెగురవేస్తూ దుమికే, ఉడుతకు స్వేచ్ఛ

లేదంటే, యెవరు నమ్ముతారు? దాన్ని యేబోను నిర్బంధి స్తోంది సృష్టిలో తిరిగేటప్పుడు?" అనే ధర్మసందేహం కలుగ వచ్చు.

ఇటువంటి సందేహం కలగటం సహజమేనని ఒప్పుకో వాలి. ఎందుకంటే సృష్టిలో లేకుంటే, ఈ పక్షులకూ, మృగా లకూ యింకెక్కడ స్వేచ్ఛ ఉండగలదో మనం ఊహించలేము. అవి యిష్టంవచ్చినట్లు ఎగురుతూ, దుముకుతూ, పరుగిడుతూ, జీవిస్తోంటే వానిని నిర్బంధించే ఖైదు యేదో ఉన్నదనటం హాస్యాస్పదంగా ఉంటుందికాదూ? నిజానికి యిట్లాంటి జైలునూ, వీనిని బిగించిపెట్టే పంజరాన్నీ, యెవ్వారూ చూసిన వాళ్ళేలేరు. ఐనా, యీ ఖైదూ, వీనిని గట్టిగా జైలుగోడలకు కట్టివేసే గొలుసులూ ఉన్నాయనే చెప్పాలి. ఇవి మన కగు పించనంతమాత్రాన లేవనటం తప్పు. విద్యుచ్ఛక్తీ, అయ స్కాంత శక్తీ మన కంటికి కగుపించవు. అట్లాగే గాలికూడాను. ఐనా, ఇవి ఉన్నాయని మనకు ఇతరవిషయాలవల్ల తెలుసుగా? అట్లాగే, సృష్టిలో ఈ కనుపించని ఖైదులుకూడా ఉన్నాయని మనం తగిన విధంగా పరిశీలిస్తే తెలుసుకోవచ్చు.

పూర్వం, మనుష్యుడుకూడా యిప్పుడుండే మృగాల లాగా, ఇటువంటి అగోచరమైన పంజరంలో నివసించేవాడు. ఈ పంజరాల రహస్యం గ్రహించడానికీ, మానవుడెట్లా యీ శృంఖలవిముక్తుడయ్యాడో తెలుసుకోడానికీ, ఇప్పటికీ బంధిత జీవితాలుగడిపే మృగాలనూ, పక్షులనూ పరిశీలించాలి.

కాబట్టి, కాలు సాగనిచ్చి, నెమ్మదిగా అడవుల్లోకీ, తోట ల్లోకీ నడిచిపోయి, మృగాలూ, పక్షులూ యెట్లా నివసిస్తు న్నాయో చూడబోదాం; సరేనా?

## "పక్షిలాగా, స్వేచ్ఛగా...."

"పక్షిలాగ స్వేచ్ఛగా రెక్కలు కట్టుకొని, ఆకాశంలో కెగురగలిగితేనా!" అనిపిస్తుంది మన కప్పుడప్పుడు. నిజంగా, పక్షులకు మన మనుకొనేటట్లు స్వేచ్ఛ ఉన్నదా లేక అది మిథ్యాస్వేచ్ఛయేనా అని ఆలోచించాలి. వడ్రంగిపిట్టను చాలా మంది చూచేయుంటారు. నెత్తిన తురాయీ, పొట్టితోకా, సుత్తివంటి పొడుగు ముక్కూ, ఎరుపూ, పసుపూ, గోధుమా, నలుపూ రంగుల రెక్కలూ, మధ్యాహ్నం ఎండవేళప్పుడు, గుబురుగా పెరిగిన తోటల్లో, చెట్లమ్రానుల తొలుస్తూ ముక్కుతో "టక్కు టక్కు" మని సుత్తిదెబ్బలకొట్టే, వడ్రంగి పిట్ట మన మెరుగున్నదేగా? దీని కేంకొరత? హాయిగా, చెట్టు చెట్టుకూ యెగురుతూ, వాటి బొందెల తొలచి పురుగులతింటూ, స్వేచ్ఛగా జీవిస్తుంది అనిపిస్తుంది. దీన్నిచూస్తే ఇష్టంవచ్చిన చోటికల్లా యెగురుతుంది. ఎక్కడ కావాలంటే అక్కడ వ్రాలుతుంది; ఆహా! ఎంత స్వేచ్ఛో దీనికి!

ఈ వడ్రంగిపిట్టను తీసుకుపోయి చెట్లులేని బయలులో వదిలిపెట్టుతామనుకో; ఏమవుతుంది? ఒకటి, రెండు రోజుల్లో అన్నం, నీళ్లూ లేక చచ్చిపోతుంది. చెట్లులేనిదే, అంటే పెద్ద మ్రానులు లేనిదే, దీని జీవితరథం ఒక్క అంగుళమైనా ముందుకు సాగలేదు! మనకు గోచరంకాని శృంఖలా లేవో యీ వడ్రంగి పిట్టను వృక్షాలకు బంధించేస్తూన్నాయి.

ఇదేమాదిరి యింకోపక్షిని గురించి ఆలోచిద్దాం. నీటి కాకి. దీన్ని, నీవు చూచేయుండవచ్చు. నల్లగా, కాకిలాగా, దాదాపు అంతేసైజుగా ఉంటుంది. నీటిమీద, బాతుల్లాగా

తేలుతూ మెడ మామూలు కాకిమెడకన్నా, సన్నగా కొంచెం పొడుగ్గా, వంపుగా వుంటుంది. ఇది నీటిపై తేలుతూ, జలచరాలని భక్షిస్తూ, చెరువుల్లో నివసిస్తుంది. బారులుకట్టి ఇవి అనేకం ఒక్కొక్కసారి తేలికగా గాలిలో యెగిరి, ఈ చెరువు నుంచి దూరంగాపోయి, ఆ చెరువుమీద వాలుతూవుంటాయి. పేరుకూ, రూపానికీ, కాకేగదా అని, దీన్ని తీసుకువచ్చి మన యింటి కాకులమధ్య వదిలామనుకో. దీనిగతి యేమవుతుందో తెలుసా ? చూస్తుండగా, ఏం తినాలో తెలీకా, ఎక్కడ కూర్చోవాలో బోధపడకా, అవస్థపడి చనిపోతుంది. మన మామూలు కాకులా ? ఎప్పటిలాగా, అవి హాయిగా దొరికిన దాన్నల్లా వంటింట్లోంచీ, పిల్లవాళ్ళ చేతుల్లోంచీ, డాబామీద ఆరవేసిన ఊరగాయలూ, అప్పడాలూ, వడియాల రాసుల నుంచీ ఎగరేసుకుపోతూ, చెట్ల కొమ్మలమీదా, ఇంటికప్పు పొడుగూనా కూర్చొని కోలాహలంగా ఉంటాయి.

నీటికాకిని, అది నివసించే చెరువులకు బంధించే విచిత్ర శైదుయేదో గుడుకటుతున్నట్లూ, అది మన కగుపించకపోయినా ఆ శైలుగోడలు దాటివెడితే కఠినశిక్ష, మరణశిక్ష అనుభవించాలని సృష్టి శాసించినట్లూ మనం అనుకోవాలి. అంతే; వేరేవిధంగా యీ విచిత్ర సంఘటనను అర్థం చేసుకోడానికి మార్గంలేదు.

## సాధారణ అడవి

సాధారణ అడవిలోని చెట్లన్నీ చూడగానే ఒకేమాదిరి కనుపిస్తాయి. ఆ యీ చెట్లకు వేర్వేరు పేర్లుండవచ్చు. కాని, అన్నీ చెట్లే; కొన్ని పెద్దవీ, కొన్ని చిన్నవీ. అదేమాదిరి దూరం

నుండి ఎత్తయిన కొండలవంకచూస్తే మొదట్లో పచ్చనిచెట్లతో నిండి వున్నట్లు అనిపిస్తుంది కొండంతా. సాధారణంగా మనం అంత యెత్తయిన కొండలను ఎప్పుడూ చూచిఉండం కాబట్టి మనకలా గనుపిస్తుంది. నీలగిరికొండలలోఉండే ఉదకమండలానికి వెడుతోంటే, రైలులోనో లేక, మోటారు బస్సులోనో కొండయొక్క యెత్తునుబట్టి వృక్షజాలం మారేవిషయం బాగా తెలుస్తుంది. అదిగో! దూరంగా కనిపించే ఆ కొండనుచూడు. దానిమీద, అడ్డంగా యీ ప్రక్కనుండి ఆ ప్రక్కకు ఎత్తుగా చారలు గీచినట్లూ, ఏదో మేడయొక్క అంతస్తుల్లాగానూ దానిపైనుండే వృక్షజాలం కనుపిస్తోంది. సుమారు నాలుగైదు చారలు యిటువంటివి ఆ పచ్చని చెట్లతోనిండిన కొండ పార్శ్వం పొడుగునా కనుపిస్తున్నాయి. కొండయెత్తు పెరిగేకొలదీ అక్కడుండే శీతోష్ణాలనుబట్టీ, నీటిసమృద్ధీ, నేలతీరూ వీనిని బట్టీ కొంతకొంత యెత్తులో కొన్నిరకాల వృక్షజాతులే పెరుగుతున్నాయి. ఒక రకం రెండువేల అడుగుల యెత్తుమీద పెరుగలేదు. అదే మాదిరి ఆరువేల అడుగుల ఎత్తులో పెరిగేచెట్ల జాతులు, అదిగో! కనుబడే ఆ నాలుగువేల అడుగుల యెత్తులో పెరుగలేవు. అందుకనే, కొన్నేసివేల అడుగుల యెత్తునా అంతస్తు, అంతస్తులుగా చెట్లజాతులు పెరుగుతున్నాయి. ఒక అంతస్తులోని వృక్షజాలానికీ, దానిపై వృక్షసమూహానికీ యెంత భేదమున్నదంటే, దూరాన్నుండే కొండకు అడ్డంగా ఏవో గీతలు గీచినట్లూ, బెల్టులు లాగి బిగించినట్లూ, యీ అంతస్తులు మనకగుపిస్తున్నాయి. సరీగా చేతగాని మంగలి క్రాపుచేస్తే, జుట్టు అంతస్తులు అంతస్తులుగా, కొండమెట్లు పేర్చినట్లు తయారవు

తుంది. అంతా జుట్టేఅయినా దాన్ని కత్తిరించటంలో ఒక చోట కత్తెర ఎక్కువగానూ, ఇంకో చోట తక్కువగానూ పట్టు బట్టటంచేత మేడమెట్లులాగా క్రాపు తయారయింది. ఈ మెట్లు స్పష్టంగా కనుపించాలంటే కొంచెం దూరంగా నిలబడి పరీక్షించాలి; దగ్గరగా ఉంటే లాభంలేదు. ఇదేమాదిరి, దూరం నుండి చూడగానే, అంతస్తులుగా వృక్షజాలం పెరిగే విషయం ఈ నీలగిరి కొండలమీద చూడవచ్చు. ఇంతా చేస్తే నీలగిరులలో ఎత్తయిన శిఖరం, "దొడ్డ బెట్ట" అనేది ఎనిమిదివేల అడుగులే ఉన్నది. దీనికన్నా, ఇంకా ఎత్తయిన పర్వతాలను పరీక్షిస్తే, యీ అంతస్తులు యింకా యెక్కువ స్పష్టంగా కనుపిస్తాయి.

కొండ యెత్తు యెక్కేకొలదీ చలి యెక్కువవుతుందిగా! అందుకని వేడిదేశాల్లోవుండే కొండల అడుగుభాగాన, చుట్టు ప్రక్కల పెరిగే వేడి వాతావరణపు వృక్షాలే పెరుగుతాయి. ఎత్తు ఎక్కేకొలదీ, అంటే వేడి తగ్గేకొలదీ, చెట్ల జాతులు మారుతూ, పైన నుడివిన బెట్టలమాదిరి వృక్షాలు పెరుగుతాయి.

కొండ అడుగునుండి సుమారు రెండుమూడు వేల అడుగుల ఎత్తుదాకా పొదలూ, లతలూ, గుబురుగా పెరిగే ముండ్లతో నిండిన సీకాయీ, తుమ్మా, లంటానా, అడవిగులాబీలూ, ఒకదానితో నింకొకటి పెనగులాడుతూ కనుపిస్తాయి. వీనిమధ్య మామిడీ, కుంకుడూ, కరక్కాయా, అడవిమల్లే, అచ్చుటచ్చుట యింతింత ఆకులుగల టేకూ వగైరాలుంటాయి. ఇంకా ఎత్తుకు వెడితే, యీ రకాలు మారిపోతాయి. చలి యెక్కువయింది

కాదూ? అందుకనే గుబురుగా, జడలు విరబోసుకొన్నట్లూ, గుమ్మటాల్లాగా, తెరచిన గొడుగుల్లాగానుండే వృక్షరాజాలు ఇచ్చట లేవు. గుడిగోపురాల్లాగా, క్రింద గుండ్రంగా, పోనుపోను సన్నగిలుతూ, సర్వీచెట్లమాదిరి సన్న ఆకులుగాచీలిన గోపురాకారపుచెట్లు యిక్కడ పెరుగుతున్నాయి. ఎత్తుగా పెరిగి గాలినంతా సువాసనతో నింపుతూ, విచిత్రమైన కొడవళ్ళమాదిరి ఆకులూ, అసంఖ్యాకమైన తెల్లని పూవులూగల కర్పూర తైలపుచెట్లు యిక్కడ విరివిగా పెరుగుతున్నాయి. ఇట్లాగే యింకా యెత్తు వెళ్ళేకొలదీ, చెట్లజాతులు మారుతాయి. పోను పోను చలి మరీ యెక్కువయి పెద్దచెట్లు పెరుగనేలేవు. ఆ చలి ప్రదేశాల్లో గరికమాత్రం పెరుగుతుంది. ఇంకా పైకి పోతే, ఆ గడ్డీ పెరుగదు; పచ్చగా నాచుమొక్కలు అంతటా కనుపిస్తాయి. సాధారణంగా నాచు, నీటిపారుదలకల చోటా, రాళ్ళమీద, తడిగానుండే పాత నూతిగోడల అంచునా, పచ్చగా పాకుడులాగా ఉండటం మనమెరిగున్నాము. కాని ఈ ఎత్తయిన కొండ శిఖరాలమీద చక్కగా, ఏడెనిమిది అంగుళాల యెత్తుకు, పచ్చని, మృదువైన మొక్కల్లాగా యీ నాచు పెరుగుతుంది. ఇంకా యెత్తుకు పోతే, నాచూ పెరుగలేనంత చలి ఉండబట్టి, ఒకవిధంగా యెడారిమాదిరి మారుతుంది, కొండ శిఖరప్రాంతం. అయితే, ఇది చలి యెడారి అని జ్ఞప్తికుంచుకోవాలి. ఎండ యెక్కువగానుండి, వానలే కురవనిచోట, ఆకూ, అలం, ఏవీ పెరుగవనీ, ఇసుకబయళ్ళతో నిండిన యెడారులుంటాయనీ, తెలుసుగా మనకు? ఇట్లాంటివి వేడి యెడారులు; పర్వత శిఖర ప్రాంతపుదీ యెడారే; కాని అది చలి యెడారి. ఇంకా పైకి

పోతే! అంటే, కొండ శిఖరం ఎట్లా వుంటుంది? మంచు మయం. తెల్లగా ధగధగా సూర్యునిచేత యెండలో మెరిసి పోతూ తెల్లనిమంచుటోపీ వేసుకొన్నబా తలకు అన్నట్లు పర్వతాగ్రం కనుపిస్తుంది. జపానులో 'ఫ్యూజియామా' అనే అగ్నిపర్వతం ఉన్నది. ఇది చాలా యెత్తయినది; దాని శిఖరం మంచుమయంగా వుంటుంది. కాని, ఆ మంచు శిఖరంలో గల పెద్ద నోటినుండి పొగలూ, ఆవిరీ, ధూళీ, గర్జనధ్వనులూ, గంధకమిళితమై లోహాలూ, శిలలూ కరిగి, సలసల కాగుతూ క్రిందికి దిగజారే 'లావా' అనే ప్రవాహాలూ అది ప్రేలినప్పు డల్లా వస్తూఉంటాయి; తమాషాగా లేదూ? ఇట్లాంటి అగ్ని పర్వతాలు ఇటలీ, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలోకూడా ఉన్నాయి.

ఇట్లా, పైన చెప్పినట్లు వృక్షజాలం మారుతూ పెరుగు తుంది ఎత్తునుబట్టి. ఒక్కొక్క అంతస్తులోని వృక్షసమూహానికి అనుగుణ్యంగా పెరుగనేర్చిన జంతుజాలము అక్కడ, ఆ చెట్లపై ఆధారపడి నివసిస్తుంది. ఈ మూడువేల అడుగులఎత్తువరకూగల కొండమీది జంతువులకు, ఆపై అంతస్తులోనివానికీ, చాలాభేదా లున్నాయి. ఒక అంతస్తులోని పక్షులూ, జంతువులూ ఆ పైఅంతస్తులో వసించలేవు. ఈజంతువులకుండే స్వేచ్ఛా, స్వాతం త్ర్యములు నిజానికి స్వాతంత్ర్యమనడానికే వీలులేదు. ఎందు కంటే, అవి పెరిగేచోటుకాక, ఇంకోచోటుకు వానిని మారిస్తే అవి నశిస్తాయి. వాని స్వాతంత్ర్యమంతా, ఆ ప్రత్యేక వాతా వరణం అనబడే ఖైదులోనేగాని, ఆ జైలు గోడల వెలుపల కాదు, మన కంటికి కనుపడనివీ, పెట్టనిగోడలని చెప్పవలసినవీ

యేవో కొన్ని ప్రతి జీవినీ, అది పెరిగి, నివసించే వాతావర ణానికీ, చుట్టుప్రక్కలనుండే చెట్టు, చేమలకూ, శీతోష్ణాలకూ బంధించి ఖైదీగా చేస్తున్నాయి. కాబట్టే, జంతుజాలానికి స్వేచ్ఛకలదనుకోటం మిధ్య అని మొదట్లో వ్రాసింది.

ఎత్తునుబట్టి కొండమీది చెట్లు మారేటట్లే, ఏదైనా గొప్ప అరణ్యసమూహపు చెట్లను తిలకించినా, ఈ రకరకాల అంతస్తులవంటి యేర్పాటు స్పష్టమవుతుంది.

## అ మె జా ను అ ర ణ్యం

అనేది, భూలోకపు అరణ్యాల్లోకల్లా, చాలా బ్రహ్మాండ మైనది. దీనివంటివే కాంగో అరణ్యం, హిందూచైనా ప్రాంతపు వేడిఅరణ్యాలూ ఉన్నాయి. ఈ అమెజాను అరణ్యం, దక్షిణ అమెరికాలో చాలా వేడిగా ఉండే ప్రాంతంలో ఉన్నది. అక్కడ అమెజాను అనే గొప్పనది ప్రవహిస్తోంది. కావలసినంత సూర్యరశ్మి, నీటి సదుపాయమూ ఉండబట్టి యీ అరణ్యం తయారైంది.

మనం ఇటువంటి అరణ్యాన్ని పైనుండి, అంటే వృక్ష శిఖరాలనుండి, క్రిందికి నెమ్మదిగా తిలకిస్తూ వచ్చామను కొందాం. ఇట్లాచూస్తే మొదటిది, అంటే చిటారుకొమ్మల ప్రదేశం అన్నిటికంటె పై అంతస్తు అనాలి. ఈ అంతస్తులో కావలసినంత గాలీ, వెలుతురూ ఉంటాయి. వృక్షరాజాల శిఖరాలు పచ్చని ఆకులతోనూ, రాగిరంగుల చిగురుటాకుల తోనూ నిండి ఆకుపచ్చని మహా సముద్రంలాగా కనుపిస్తుంది. అంతా క్రిందినుండీ బ్రహ్మాండమైన కొండచిలువల్లాగా చెట్ల ప్రమానులకెగబ్రాకిన అరణ్యలతలు, ఈ గాలి వెలుగుల

పై భాగానికి చేరి, విరివిగా నలుప్రక్కలా అల్లిబిల్లిగ అల్లుకుపోయి తమ తమ రంగుటాకులూ, పూవులతోనూ కనుపిస్తాయి. ఆకు రాలుకాలానికి పచ్చనిదృశ్యమంతా మారిపోయి, రంగు రంగుల పండుటాకులతో బహు పసందుగా వుంటుంది. ఈ అంతస్తులో సీతాకోక చిలుకలు, పూవులలో పూవులమాదిరి కలిసిపోయి ఎగురుతూ ఉంటాయి. పెద్ద పందికొక్కులంతేసి అడవి ఉడతలు కొమ్మ కొమ్మకూ లంఘించి ఎగురుతూంటాయి. చిలుకలూ, రకరకాల రంగుల పక్షిజాతులూ తమ తమ కూతలతో గాలిని నింపేస్తాయి. క్రిందనుండి చెట్లబోదెల కెగబ్రాకిన తొండ జాతులు కొమ్మలమీదా, ఆవల మధ్యా పొంచుండి ఎగిరే కీటకజాతులను తమ జిగురు నాలుకలతో అద్దేసి, మ్రింగుతూ ఉంటాయి. ఈ పై అంతస్తుకు అనుగుణ్యంగా మనం చెప్పిన జంతుజాలం జీవిస్తూ ఉంటుంది.

పై నుడివిన భాగాన్ని వదలి క్రిందకు దిగామనుకో. ఇప్పుడు దృశ్యం ఎల్లా మారుతుందో తెలుసా! అంతా చాలా భాగం చీకటిగా వుంటుంది. పైనుండే దట్టమైన ఆకుల పందిరిలోని చిన్న ఖాళీ భాగాలనుండి పడే సూర్యరశ్మి పచ్చ పచ్చని మచ్చల్లాగా కనుపిస్తుంది. చెట్లబోదెలమీద, అరణ్యా లతలమీదా వుండే చీకటిపై యీ వెలుతురుమచ్చలు పడి ఏది లతో, ఏది పొదల పొదల కొండచిలువో తెలియకుండా దిగ్భ్రమ జనిస్తుంది. మనకు చెట్లమ్రానులలో రంధ్రాలు తొలుచుకొని తమ గ్రుడ్లనిడి పిల్లలుచేసే పేడపురుగుల జాతు లనేకం ఉంటాయి. తన ముక్కుతో చెట్లబోదెల టక్కుటక్కున కొట్టి, బోలు శబ్దంవచ్చినచోట రంధ్రం తొలిచి, ఈ రెవంటి

తన నాలుకను లోనికి జొప్పించి పైచెప్పిన క్రిముల గుచ్చితినే వడ్రంగిపిట్ట లిక్కడుంటాయి. చీకటి వెలుగు దాగుడుమూత లాడే యీ విచిత్రపు టంతస్తులో చెట్లమ్రానుల బొరియలలో నివసించి, నిశ్శబ్దంగా ఎగిరి పురుగులనూ, తొండలనూ పట్టి తినే గుడ్లగూబలూ, తలక్రిందుగా తపస్సుచేసే అడవి గబ్బిల జాతులూ, మ్రానుబెరడుల అంటిపెట్టుకొని గింగురుమని కూసి, అనేక విధమైన భయాన్నీ, ఒంటరితనాన్నీ కలిగించే యిలకోడులూ ఇక్కడుంటాయి. ఇదీ, యీ అంతస్తూ, దాని యందలి జీవరాసులవిషయమూ.

ఇంకా క్రిందికి దిగుతే అల్లిబిల్లిగ నల్లుకొని, కొక్కెముల వంటి ముండ్లచే తమ బలము తక్కువ శాఖలు ప్రక్కలనున్న మొక్కల కతిగించి నిలబెట్టుకొనే గుబురైన పొదలజాతు లగు పిస్తాయి. అంత ఎత్తు లేకపోయినా, గిడసబారిన సన్నని శాఖలూ, చిన్న చిన్న ఆకులూ, ముండ్లూ ఇదంతా యింకో రకపు విచిత్రపు టంతస్తు. ఇచ్చట రకరకాల కూతలు కూస్తూ పొదలలో ఎగురుతో పక్షులుంటాయి.

వీని క్రింద యింకో అంతస్తు; గడ్డి, గడ్డిజాతి మొక్కలూ, వాని పూవులూ ఉంటాయి. ఈ గడ్డిజాతులూ వగైరాలను తిరిగీ చిన్న అంతస్తులుగా విభజించాలి. పైగా నీలం, ఊదా రంగుల గ్రామఫోను గొట్టాలవంటి పూవుల మొక్కలుండే భాగం. తరువాత క్రింద యింకా తడీ, చీకటీ ఎక్కువ అవటం చేత ఫరన్‌జాతులూ, వానిక్రింద మరీ వెలుతురు చాలనందున నాచుమొక్కల అంతస్తూ ఉంటాయి. నాచుమొక్కలతో మనం నేలను తాకామన్నమాట. ఇచ్చటినుండి తలయెత్తి పైకి

చూస్తే ఏదోయొక విచిత్ర రాక్షసుని ఖైదులో మనం బంధింపబడ్డట్లుంటుంది. గాలి వెలుతురులు లేవు సరిగదా, భయం గొలిపే ఆ వృక్షమానుల మధ్య, ఒంటరిగా, ఎక్కడో నలుసంతగా మనం ఉంటే "నా అంతవాడు లేడను" కొనే అహం యేదన్నా మనలోఉంటే, అది చటుక్కున చచ్చిపోతుంది.

నేలను తాకినంత మాత్రాన మన అరణ్యాపు టంతస్తులు అయిపోలేదు. నేలమీద తడిగా, చీకటిగా నుండేచోట రాలిన ఆకులు కుళ్లుతూ, వెచ్చగా వుంటుంది. ఈ కుళ్ళేఆకులు యెరువుగా మారుతూ ఉండేచోట కుక్కగొడుగులూ, చెదలూ, చీమలజాతులూ, ఎరువును గోలీలుగాచేసి దొర్లించుకుపోయే పురుగుల జాతులూ ఉంటాయి. అడవికోడి నివాసం యిక్కడే. ఈ నేల కడుగున, చెట్లవ్రేళ్లు అల్లుకొన్న భూమి యడుగు ఆఖరు అంతస్తు ఉన్నది. ఇచ్చట వానపాములూ, భూమి యడుగున గ్రుడ్లు నిడి, అచ్చటి వేడికి పొదిగి పిల్లలయ్యే జీవులగ్రుడ్లూ, వాని పిల్లలూ, కలుగులు తొలుచుకొని వసించే ఎలుకలజాతులూ వుంటాయి.

ఈ మహారణ్యంలో కాబట్టి యెన్ని అంతస్తులున్నాయో చూడు: పైవి గాలిమేడలనవచ్చు. కావలసినంత వెలుతురూ, వెచ్చతనం, గాలీ. నేలమీదివి చీకటి గుయ్యారాలు; తడీ, చలీ.

ఇక నేల అడుగు భాగాన్ని చూస్తే అదీ విచిత్రమైన అంతస్తే అనాలి. బాగా చలిగానుండే రోజున నేలమట్టానా, నేలలో సుమారు నాలుగైదు అడుగుల గోయి త్రవ్వి, అక్క-

డా వేడిని ధర్మామీటరుతో కొలిచి చూస్తే, రెంటికీ సుమారు నలభై డిగ్రీలభేద ముంటుంది. భూమట్టానకన్న లోపల అంత యెక్కువవెచ్చగా వుంటుంది.

పెద్ద వృక్షపుతొర్రి, ఇతర భాగాలకన్నా చాలా చల్లగా వుంటుంది. అందుకనే ఎండకాచి, వేడిగావుండే పగటివేళ బయటికి రాలేని గుడ్లగూబలూ, గబ్బిలాలూ ఇట్లాంటి తొర్రిలలో చల్లగా పడుకొంటాయి. చీకటిపడితేసరి, ఆహారాన్వేషణం ప్రారంభిస్తాయి. రాత్రిపూట ఆ తొర్రిలో పడుకొంటే చలిని భరించలేవు.

ఇట్లా అరణ్యంలో వేడివీ, చల్లనివీ, తడివీ, పొడివీ, గాలిపోసుకోనేవి, చీకటిగానుండేవీ అనే రకరకాల అంతస్తులున్నాయి. మనకేదన్నా ఒక యిల్లు బాగుండకపోతే, దాన్ని వదిలి, ఇంకోచోటికి పోతాము. కాని, ఈ అరణ్యంలో ఒక అంతస్తులోని జీవాలు, ఇంకోదానికి పోవడానికి వీలులేదు. ఎందుకు? ఆయా వాతావరణానికి అవి ఖైదీ లైపోయాయి. నేలమట్టాన చీకటిపొదలమధ్య తిరుగులాడే అడవికోడి తన యిల్లును, వృక్షశిఖరాల్లో నివసించే డేగతో మార్చుకోడానికి వీలులేదు. అట్లా మార్చితే, రెండూ నశిస్తాయి. కొద్దిరోజుల్లో చెట్ల మ్రానుల్లో బొరియలు తొలిచి దాక్కొన్న క్రిములలాగి తినే వడ్రంగిపిట్టను, అడవికోడి నివసించే, భూమట్టభాగానికి దింపితే ఏంచేయాలో దానికి తెలియదు. నేలను తన ముక్కుతోనూ, కాలివ్రేళ్ళతోనూ పెకలించి పురుగుల బెదరగొట్టి భక్షించే అడవికోడిని, చెట్టుమ్రానుమీద మనం ఎక్కించి వదిలితే, ఏంచేయాలో దానికీ తెలియదు.

ఈ విధంగా, ఒక్కొక్క రకం జీవి ఒక్కొక్క పరిస్థితుల లోనే నివసించగలుగుతోంది. దానికి ఆ ప్రత్యేక వాతావరణం దాటితే స్వేచ్ఛ లేనే లేదు; మరణమే.

## ఆహార లంకెలు

వడ్రంగిపిట్టను గురించి పైన చెప్పబడింది. ఇది కొన్ని పురుగుల క్రిములను చెట్ల ప్రానులలోని బొరియల నుండి వెదికి తింటుంది. ఈ పురుగుల క్రిములు, కొన్ని ప్రత్యేకరకపు చెట్ల ప్రానుల్లోనే కాని, అన్ని ప్రానులమీదా పెరుగవు. దీన్ని బట్టి ఆయా ప్రత్యేక చెట్ల ప్రానులే యీ పెరిగే క్రిములకు తగిన ఆహారం అని తెలుసుకోవాలి. కాబట్టి ఆహారం సంపాదించుకోటంలో కొన్ని కొన్ని జంతువులకు లంకె లేర్పడుతాయి. ఇది మూడులంకెల గొలుసు: చెట్టూ - పురుగూ - వడ్రంగిపిట్టా. ఇట్లాంటి లంకెలే ఎన్నో సృష్టిలో ఉన్నాయి.

చలిదేశపు అడవుల్లో డేగలాంటి గుడ్లగూబ లాంటి పక్షి ఎగురుతూ వుంటుంది. ఇదెందుకు ఎప్పుడూ ఆ అడవుల్లోనే ఎగరాలి? ఎందుకంటే, ఆ అడవిలోవుండే ఉడతలు దీని కాహారం. ఈ ఉడతలు అరణ్యంలో ఎట్లా బ్రతుకుతాయి? ఒకసారి కొందరు వేటకాండ్రు తాము పట్టిన యీ అడవి ఉడత పొట్ట చీల్చిచూచారు. అది ఏం తింటుందోనని. అక్కడుండే ఫర్ వృక్షాల కాయలూ, కుక్కగొడుగులూ దాని కడుపునిండా ఉన్నాయి. అయితే అడవిలో యీ కుక్కగొడుగు లేల పెరుగుతాయి? కుక్కగొడుగులు, క్రిందపడి కుళ్ళిపోతున్న ఆకులూ, ప్రానులమీదా పెరుగుతాయి. ఆ కుళ్ళే పదార్థాల లోని ఆహారాన్ని మాత్రం యివి గ్రహించగలవేగాని, నేలలో

సాధారణ మొక్కల్లాగా పెరుగలేవు. మరి, అడవిలో ఇట్లా కుళ్ళుతూన్న గడ్డీ, నాచూ, చిన్న కొమ్మలూ ఎన్నో ఉంటా యిగా? అందుకనే, కుక్కగొడుగు లిచ్చట పెరుగుతాయి. ఏ యెడారిలోనో, సముద్రంఒడ్డునో యివి పెరగాలంటే, వీలుకాదు.

ఇది యింకో ఆహార లంకె:

డేగవంటి పక్షి—ఉడతా — కుక్కగొడుగులూ — కుళ్ళుతూన్న ఆకూ, అలమూ.

ఈ విధంగా యీ ఆహార లంకెలచేత బంధించబడి, మృగాలన్నీ ఒక్కొక్కరకంవి ఒక్కొక్కచోట ప్రత్యేకించి నివసిస్తాయి— ఇతరులు లోనికి రాకూడదు

ఇంతవరకూ అరణ్యప్రదేశాన్ని గురించే చెప్పాము. భూలోకంలో అరణ్యాలే కాక, యెడారులూ, గడ్డిమైదానాలూ, పర్వతాలూ, చలి యెడారులూ, సముద్రాలూ, సరస్సులూ ఎన్నెన్నో ఉన్నాయి. ఈ ఒక్కొక్క రకపు వాతావరణంలోనూ మనకగుపించని జైలుగోడలు అచ్చటి మృగాలను ఆయా ప్రదేశాలకు బంధించివేస్తున్నాయి.

యూరోపులో దక్షిణాన, నల్లసముద్రం అని ఒక సముద్రం ఉంది. ఇది చాలాభాగం నలుప్రక్కలా భూమితో ఆవరింపబడి యుంది. దీన్ని పైనుండే అంటే నీటిమట్టాన్నుంచి పరీక్షిస్తే లోతునుబట్టి యెనిమిది అంతస్తులుగా విభజించడానికి వీలవుతుంది. సముద్రం ఒడ్డుగా కొండలువచ్చి నిలబడి వుంటాయి. ఈ కొండలూ, నీరూ సంధించేభాగం మొదటి అంతస్తు. ఇచ్చట పీతలూ, కొండరాళ్ళకు పట్టుకొని చిన్న గుమ్మడి

గింజల్లాగా ఉండే "బార్నకిల్సూ" అనేవి ఉంటాయి. తరువాత రెండో అంతస్తులో శంఖు గొట్టాలలో దాక్కొని, తప్పించుకు తిరిగే బైరాగి పీతలు ఇసుకమయమైన ఆ నీటి అడుగుభాగాన తిరుగుతూంటే, ఆ యిసుకలో దూసుకుపోయి దాక్కొని సుల్తానుచేపలు బ్రతుకుతాయి. నాలుగో అంతస్తులో ఆలు చిప్పల జాతులుంటాయి. అన్నిటికన్నా అడుగుది అంటే, ఎనిమిదో అంతస్తులో గంధకమిళితమయిన ఒక విషవాయువు (Sulphuretted Hydrogen) నిండివుంటుంది. విషవాయువు వున్నదిగదా, ఇచ్చట యెట్టి ప్రాణులూ ఉండవుకాబోలు అని అనుకోవద్దు. ఒక విధమైన సూక్ష్మక్రిములు - బాక్టీరియా - ఇచ్చట బహు కులాసాగా జీవిస్తాయి. ఈ గాలి, ఇతర జీవులకు విషమైతే మనకు ప్రాణవాయువెట్లాగో, వానికది అట్లా.

భూలోకంలో సుమారు పదిలక్షలకుపైగా విశివిధిరకాల జీవులున్నాయి. ప్రతీదీ తాను వసించే ప్రదేశానికి ప్రత్యేకించి పుట్టినట్లుగా అలవాటుపడి వుంటుంది. కొన్ని నీళ్ళలో, మరి కొన్ని పొడినేలమీదా, కొన్నిటికి వెలుతురంటే గిట్టదు. మరి కొన్నిటికి చీకటంటే చీకాకు; కొన్ని వేడి ఇసుకలో దూరి పడుకొంటే, వేరే కొన్ని ఎప్పుడూ నీళ్ళుఊరే ఊబి భూమిలో చొచ్చుకుపోయి వసిస్తాయి; ఒక రకం జీవిని ఈ ప్రదేశం "సుస్వాగతం" అని ఆహ్వానిస్తూంటే, అదే ప్రదేశం యింకో రకం జీవితో "ఇతరులు లోనికి రాకూడ" దంటూ ముఖాన తలుపుమూస్తుంది.

పక్షులు పెరిగే తావుల్లో చేపలు నశిస్తాయి. పెద్ద వృక్షాలన్నీ చాలా గుబురుగా క్రిక్కిరిసి పెరిగేచోటు నాచు

మొక్కలు పెరుగడానికి బహు బాగుంటుంది. పెద్ద వృక్షాల అడుగునుండే చీకటీ, చల్లదనాలకు యీ నాచు మొక్కలు తప్ప వేరే మొక్క లేవీ పెరుగవుగా? ఎంత విచిత్రమో యీ సంఘటన ఆలోచించి చూడు!! నిలబడే స్థలం పెద్ద వృక్షాలకూ, మొక్కలకూ లేకపోయేకొలదీ, నాచుకు అంత కంత కెక్కువస్థలం చేజిక్కుతోంది.

భూలోకంలో ఏదీ లేని స్థలాలని లేవు; జీవులు చొరబడని భాగాలని లేవు. ఒక రకం ప్రాణి జీవించనిచోట, మరో రకం ప్రాణి వసించగలుగుతోంది. భూమియొక్క అతి శీతలమైన ధృవప్రాంతాల్లో, మండుటెండల భూమధ్య రేఖ పరిసరాల్లో, మంచుమయ పర్వతాగ్రాల దగ్గరా, సముద్రపు లోతునీళ్ళల్లో-అన్ని చోట్లా జీవులున్నాయి. ఈ జీవులు ఆ ప్రదేశాల్లోనే గాని, యితరచోట్ల బ్రతుకలేవు.

ధృవప్రాంతాల్లో ఉండే తెల్ల యెలుగుబంటిని తెచ్చి, వేడి అరణ్యంలోఉంచితే చనిపోతుంది. ధృవభాగం దగ్గరుండే అమిత చలిని భరించడానికి, దాని శరీరం మీద దట్టంగా పెరిగిన కంబళీలాంటి బొచ్చున్నది. వేడి అరణ్యంలో ఈ బొచ్చు మూలాన, ఎలుగుబంటి ఉడికి, కాగి చనిపోతుంది. ఇదేమాదిరి వేడిఅరణ్యప్రదేశాల్లో జీవించే యేనుగును ధృవప్రాంతానికి తీసుకువెళ్ళి వదిలితే, చలికి గజగజా వణకి చనిపోతుంది. ఏనుగుశరీరంమీద ఎలుగుబంటికిలాగా బొచ్చు లేదుగా? ఎప్పుడుచూచినా, ఒంటిమీద ఏమీ లేకుండా అప్పటికప్పుడు స్నానానికి వెడుతూన్నట్లు, ఏనుగు దిగంబరంగా వుంటుంది.

ఎక్కడెక్కడ జంతువులనూ ఒకేచోట చూడాలంటే మనుష్యులేర్పరచిన జంతు ప్రదర్శనశాలల్లో వీలవుతుందేకాని, ప్రకృతిలో అట్లా సంభవించదు. ఆఫ్రికా, ఆస్ట్రేలియా, దక్షిణ అమెరికా, యిట్లా వివిధ దేశాల మృగాలనూ ఒకదానిప్రక్క ఒకటిగా యిటువంటి ప్రదర్శనశాలల్లో చూడ్డానికి ఎందుకు వీలవుతుందో తెలుసా?

మానవుడేర్పరచిన యీ శాలల్లో ప్రతియొక్క జంతువుకూ దానికి సహజమైన వాతావరణం కల్పించబడుతుంది. సముద్రానికి బదులు, ఈ పెద్దనీటితొట్టె ఒకజంతువుకూ; ఇరవై చదరపుటడుగుల ఆ ఇసుకతొట్టె ఇంకొక యెడారి జంతువుకూ, యిట్లా యేర్పాట్లు చేయాలి. ఒకదాన్ని యింకొటి తినివేయకుండా తగిన బందోబస్తు చేయాలి. ధృవపు ఎలుగు బంటికి చన్నీళ్ళస్నానానికీ, కోతులకు వేడినీళ్ళ స్నానానికీ యేర్పాట్లుండాలి [చలిదేశాల్లో ఉండే జంతుప్రదర్శన శాలలలోని కోతులకు మనదేశాల్లోమాదిరి చన్నీళ్ళస్నానం చేయిస్తే బిగుసుకుపోయి, చస్తాయి!!]. సింహానికి ప్రతిదినం దాని అలవాటుచొప్పున పచ్చిమాంసముండాలి. రాబందుకు బాహాటంగా రెక్కలుచాచేటందుకు విశాలమైన పంజర ముండాలి. ఇన్నిన్ని విధాలుగా, అవి అలవాటుపడిన పరిస్థితుల నేర్పచ్చి వానిని కాపాడితేకాని యీ రకరకాల మృగాలూ, పక్షులూ జీవించలేవు.

అన్నివిధాల ప్రాణులనుగురించీ చెప్పినా, మానవుని మాట యింతవరకూ మనం యెత్తలేదు; ఇది నీవు గమనించావో, లేదో నాకు తెలియదు. మానవుడు యే వాతా

వరణపు జీవి ? "అడవి మనుష్యు"డనీ, "యెడారి మానవు"డనీ, "ఊబినేలల మనుష్యు" డనీ ఆ యా ప్రదేశాల్లో వసించే మనుష్యులకు వేర్వేరు పేర్లున్నాయా ? అట్లా మనం పిలుస్తామా?

పిలువమనేది నీకు తెలుసు. ఎందుకో తెలుసా ? అడవిలో వసించే మానవుడు బయిళ్ళలోనూ, చిత్తడినేలలవాడు పొడి నేలల్లోనూ వసించగలడు.

లోకంలో, మనుజుడు వసించనేరని ప్రదేశమనేది లేదు. "ఇతరులు లోనికి రాకూడ" దనే నోటీసు మానవునికి ప్రపంచంలో ఎక్కడా కనుపించదు. పాపినిన్ అనే దేశపరిశోధకుడు తన స్నేహితులతో తొమ్మిది నెలలు సముద్రంమీద తేలుతూన్న మంచుగడ్డ దిబ్బమీద వసించాడు ధృవప్రాంతాల్లో ! వారినే, కాలే వేడియిసుక ఎడారికి వెళ్ళమన్నా వెళ్ళి, బ్రతికి, తిరిగి రాగలిగేవారే.

మానవుని అడుగుజాడలు ప్రపంచమం దన్నిచోట్లా కనుపిస్తాయి. మహోన్నత పర్వత శిఖరాలనూ, భయంకర సముద్రపు పాతాళప్రదేశాలనూ, సహారా యెడారినీ, మంచు గడ్డల మయమైన ఉత్తరధృవభాగాలనూ, భూగర్భ రహస్య గుహాలనూ, మేఘమండలానికి పైనున్న నూతన మండలాలనూ మానవుడు తిరిగి చూచేడు.

కాని పురాతనంనుండి యీ విధంగా మనుష్యులు సమస్త ప్రదేశాలనూ ఆక్రమించుకొన్నారని అనుకోరాదు. ఒకానొకప్పుడు యిప్పటివలె యీస్వేచ్ఛనూ, శక్తినీ యెఱుగక, యితర మృగాల్లాగా మనుజుడూ సృష్టిలో ఖైదీగా వుండేవాడు.

## మన పూర్వీకులు

మన పూర్వీకులైన ఆ పురాతన మనుష్యులు యెట్లా ఉండేవారో మరి? ఇది తెలుసుకోవాలని నీకు ఆశగా లేదూ? ఐతే సరే, ఆ సంగతి చెప్తాను.

లక్షలకొలదీ యేండ్లకుపూర్వం మన లోకం యిప్పటి మాదిరుండేదికాదు. ఇప్పుడుండే అరణ్యాలూ, చెట్లూ అప్పుడు లేవు సరిగదా, క్రొత్తరకాల మృగాలూ, పొదలూ, గడ్డిజాతులతోనిండి, అంతా వేరే రకంగా వుండేది. ఆ కాలపు వృక్షరాజాలతో పోలిస్తే మన యీ కాలపు పెద్దవృక్షాలు, ఆజానుబాహునిముందు మఱుగుజ్జువాడిలాగా ఉంటాయని చెప్పాలి.

ఆ కాలపు టరణ్యంలో అన్నిటికన్నా పై అంతస్తు ఎంతో ఎత్తుగా నుండేది. సాధారణ రెండంతస్తుల మేడకూ, అమెరికాలోని యీ కాలపు స్కై-స్క్రేపరులనే అసంఖ్యాకపు టంతస్తుల భవనాలకూ ఉండేటంత భేదం, ఆ పూర్వకాలపు టరణ్య శిఖరాలకూ, ఈ కాలపు టడవులకూ ఉండేదంటే సరిగా ఉంటుంది. ఆ యెత్తుపాటి అంతస్తుల్లో వెలుతురూ, శబ్దమూ ఉండేవి ఎక్కడచూచినా. రంగు రంగుల పక్షులు, పెద్దరంగుపూవులమధ్య తమ కూతలతో గాలిని నింపేస్తూ తెగ యెగిరేవి. కొమ్మలమీద పడిపోకుండా తిరుగుతూ, ఛెంగు ఛెంగున చెట్టు చెట్టుకూ దుముకుతూ కోతుల గుంపులుండేవి ఆ పై అంతస్తులో.

ఒక రకంకోతులు చెట్లకొమ్మలమీద, ఏదో వంతెనపై పరుగిడినట్లు సునాయాసంగా పరుగెత్తేవి. తమ పొట్టలకు గట్టిగా పిల్లల అదుముకొని, కాయలూ, పప్పులూ కొరికి

కోరికి తమ బుగ్గసంచుల్లో దాచుకొంటూ తల్లికోతులు తిరుగులాడేవి. కొంచెం పెద్దవైన పిల్లలు తల్లి కాళ్ళను పట్టుకు వ్రేలాడుతూ తిరిగేవి. ఈ కోతులగుంపుకంతా పెద్దదైనకోతి, సునాయాసంగా చెట్టుమ్రానుకెగబ్రాకేది. ఒంటినిండా బొచ్చూ అదీ బలే భయమేస్తూ ఉండేది. తక్కిన కోతులన్నీ అది చూపినత్రోవనే సాగిపోయేవి.

ఇ వెటువంటి కోతులో? మనం యిటువంటివానిని చూచామా, యెప్పుడన్నా?

లేదు, ఏ జంతు ప్రదర్శనవనంలోనూ యిట్టి కోతు లగుపించవు. ఈరోజుల్లో అవ్వోరకం ఒకజాతి కోతులు. వాని నుండే చింపాంజీ, గొరిల్లా, మనుజుడూ పుట్టుకువచ్చారు. చెట్లపై తిరుగాడే ఆ కోతులే పురాతన మానవులు; అవే మన పూర్వీకులు !!

మన పూర్వీకులైన యీ కోతులు వడ్రంగిపిట్టలాగా అరణ్యాపు పై అంతస్తుల్లో నివసించేవి. కాలగతిని మనుజుడుగా మారవలసిన యీ కోతులు చెట్ల కొమ్మలను, గాలిలో నిర్మించిన వంతెనలుగా, డాబాలుగా, మేడమెట్లుగా ఉపయోగించుకొని తిరిగేవి. ఆ అరణ్యమే వాని యిల్లు; చెట్లకొమ్మలు పంగలుగా చీలినచోట తమ గూళ్ళను నిర్మించుకొనేవి. రాత్రులందా గూళ్ళలో పరుండేవి.

ఆ అరణ్యాపు పై అంతస్తుల్లో, తమ శత్రువులనుండి యీ కోతులు దాక్కొనేవి. నేలపై తిరుగాడే ఖడ్గములవంటి పొడుగు పండ్లుగల పెద్దపులి వీనికి ప్రాణశత్రువు. దాని వాడి కోరలజూచి

# వీళ్ళే మన తాతయ్యలు!



ఆ అరణ్యపు పై అంతస్థుల్లో తమ శత్రువులనుండి
ఈ కోతులు దాక్కొనేవి.

చెట్ల పై యంతస్తుల కురికి, యీ కోతులు దాక్కొనేవి. ఆ పై యంతస్తే వానిని రక్షించే దుర్గమని చెప్పవచ్చు.

ఆ అంతస్తే వాని ఆహారపదార్థాలు దాచుకొనే గాదె అని అనాలి. పండ్లూ, పప్పుబద్దల దినుసులూ ఆ చెట్ల శాఖల్లో యివి దాచుకొనేవి.

చెట్లపై కొమ్మకొమ్మకూ దుమికేందుకూ, కొమ్మల పట్టుకు ఊగిసలాడి ఛెంగున దూరానికి దాటేందుకూ, ఆ ఊపు లోనే పండ్లగుత్తులపట్టి లాగి కోసేటందుకూ వాని వ్రేళ్ళు పొడూగ్గా పట్టు చిక్కించుకొనేవిగా నుండేవి. తీక్ష్ణమైనదృష్టి, గట్టిపల్వరుసా వాని వివిధ కార్యాలకూ బహు అనుగుణ్యంగా వుండేవి.

మన యీ పూర్వీకులు అరణ్యానికి మూడువిధాల గొలుసులతో బంధించబడి జీవించేవారు. అందులోనూ వారి జైలు అరణ్యపు పై చిగురు టంతస్తుల్లోనే యుండేది. ఈ గొలుసుల నెట్లా మన పూర్వీకుడు వదిలించుకోగలిగాడు! తన ఖైదు గోడలదాటి యీ పురాతన కోతిజాతి యెట్లా బయటపడింది! అరణ్యప్రాంతాలనుండి క్రమేణా భూమియొక్క యితర స్థలాల కెట్లా వ్యాపించాయి ఈ కోతులు?

ఇదంతా వినాలని కుతూహలంగా ఉన్నదా? సరే చెప్తాను ఊకొట్టు సరీగ్గా!



# మన పూర్వీకుడూ, ఆతని బంధువులూ

ఏ గ్రంథకర్తయినా ఒకని జీవితచరిత్ర వ్రాస్తే, ఆ వ్యక్తి యొక్క పూర్వీకులనుగురించీ, వారుండిన ప్రదేశాన్నిగురించీ ప్రారంభించటం అలవాటు. మొదటి పుటల్లో ఆతని అమ్మమ్మ చిన్నప్పు డెట్టి దుస్తులు ధరించిందో, ఏ యే నగలు పెట్టు కొన్నదో అనేటటువంటి విషయాలనుండి ప్రారంభమై, ఆమె పెండ్లినా డేవిచిత్రపుటావేశాలు యీతని తల్లి హృదయంలో పెనగొన్నాయో వర్ణించబడుతుంది. క్రమంగా చిన్న పాపాయిగా మన మహాపురుషుడు పుట్టటమూ, ఆతని ముఖమందలి పోలికలూ, తప్పటడుగులు వేయడం, పసితనపు విచిత్రచేష్టలూ— యిట్లా గ్రంథం సాగుతుంది.

పది, పన్రెండు ప్రకరణాలు గడిచేటప్పటికి యీతను బడిలో చేరుతాడు. మొదటి పుస్తకం ఆఖరులో వివాహ వర్ణనా, నూతన దంపతుల అన్యోన్యానురాగమూ వస్తాయి. క్రమంగా జీవితంలో సంధించిన ఆటంకాలూ, విచిత్ర సంఘటనలూ, వాటి నెట్లా ఎదుర్కొన్నదీ చెప్పబడుతాయి. పుస్తకం ముగిసేటప్పటికి, ఈతనూ, అతని భార్యా పెద్దవాళ్ళవుతారు.

ముది పెంగా తమ మనుమడు తప్పటడుగులు వేస్తూంటే వీరిద్దరూ వరండాలో కూర్చొని చూస్తూ ఉంటారు. ప్రాతఃకాలపు లేత యెండలో వెండితీగల్లాగా కొన్ని నెరసిన వెంట్రుకలు మన వ్యక్తియొక్క నల్లని తలజుట్టు మధ్య మెరుస్తూ కనుపిస్తాయి. ఈ విధంగా గ్రంథం వ్రాయటం మన మెచ్చుకున్న విషయమే.

ఇదేవిధంగా మన పూర్వీకుడైన మనుజునియొక్క యీ జీవిత చరిత్రలోకూడా ఆతని అనుభవాలూ, కష్టసుఖాలూ అన్నీ వరుసగా నీకు తెలియబర్చాలని ఆశగావుంది. ఈతనేకాలంలో భూమిపై అవతరించాడు? ఆతని బంధువర్గం యెవరు? యెట్లా ఉండేవాళ్ళు? నడకా, మాటలాడటం, యిటువంటి పనులెట్లా ఆతనికి అలవడ్డాయి? ఆత డెట్లా ఆహారపానీయాలు సేకరించాడు? ఎట్టెట్టి కష్టసుఖాలూ, జయాపజయాలూ ఆత డెదుర్కొన్నాడు? ఇదంతా నీకు తప్పక చెప్పాలికాదూ మరి?

ఇట్లా సలక్షణంగా యీ కథ ప్రారంభించాలంటే, ఓం ప్రథమంలోనే గొప్ప చిక్కొకటి వస్తోంది. ఈతని అమ్మమ్మా, తాతయ్యా యెట్లా ఉండేవారో చెప్పటం కష్టం. ఎందుకంటే మన పూర్వీకుడు, తానే ఒక కోతిజాతి జీవాయె! అటువంటప్పుడు ఆతని తాత ముత్తాత లెట్లా ఉండేవారో మన కెట్లా తెలుస్తుంది? వాళ్ళ పటాలూ, బొమ్మలూ యెక్కడా మనకు కనుపించవు. ఎందుకంటే కోతులు పటాలు వ్రాయలేవు. ఏదన్నా వస్తుప్రదర్శనశాలలోని జంతుశాఖకు వెడితే ఈ పురాతన జీవులగురించి యేవో కొన్నివిషయాలుమాత్రం తెలుస్తాయి. వాని అస్థిపంజరమైనా పూర్తిగా యింతవరకూ యెక్కడా

యెవరికీ దొరకలేదు. ఏవేవో కొన్ని యెముకలుమాత్రం దొరికాయి. ఇన్ని పళ్లూ, వెన్నుపూసలూ, ఇక్కడో కాలి యెముకా, అక్కడో క్రింది దవుడయెముకా ఇట్లా అక్కడక్కడ ఆఫ్రికా, ఆసియా, యిరోపా ఖండాల్లో దొరికాయి, అంతే.

మన యింట్లో ముసలమ్మలున్నారంటే, వాళ్ళకి నోట్లో పళ్ళుండవు. ఇది మన మెఱిగున్న విషయమే. కాని, మన పూర్వీకుని అమ్మమ్మ విషయంలో మనకు మిగిలిందంతా ఆమె పళ్ళే! శరీరపు టితర భాగాలేవీ మనకు దొరకవు!

పూర్వం మానవుడు అడవిలోనుండి వెలుపలకు వచ్చి, చెట్లు దిగి, నేలపై నిలుచుండే రోజుల్లో ఆతనిదగ్గర జీవులన్నీ అడవి మృగాలుగానే ఉండేవి. చింపాంజీ, గొరిల్లా, ఉరాంగ్ ఉటాంగ్, గిబ్బన్ - ఇటువంటి పెద్దరకంకోతులే ఆతని దగ్గిర బంధువర్గం. నవనాగరికుడైన యీ కాలపు మనిషికీ, యీ కోతి జాతులకూ సంబంధమున్నదంటే మనలో అనేకమందికి కోపం వస్తుంది. కాని, మనకు గిట్టనంతమాత్రంచేత నిజం యెట్లా అబద్ధమవుతుంది?

కొన్ని యేండ్లక్రితం యీ విషయమై ఒక కోర్టులో పెద్ద కేసు అయింది. ఒక ఉపాధ్యాయుడు మనుజులంటే కోతి జాతినుండే ఉత్పత్తి అయ్యారని తన బడిలో బోధించాడట! ఆ ఊరిలో వుండే పెద్దవాళ్ళందరికీ ఈతనిమీద పట్టరానికోపం వచ్చింది.

"మేము కోతులం కాము - మమ్మల్ని కోతులుగా చేయటం ఎవరితరమూ కాదు."

అనే బొప్పుటాలు పట్టుకొని ఊరంతా తిరిగి, పెద్ద గల్లంతు చేసారు ఆ వూరి ప్రజలంతా పాపం! ఈ బడి పంతులుమీద తిరుగబడ్డారు. పెద్ద కేసు జరిపించారు. కోర్టులో జడ్జి యితన్ని అవకతవక ప్రశ్నలువేసి వేధించాడు.

"ఇతని కేదో మతిపోయింది. రెండురెండ్లు నాలుగనే విషయాన్ని గురించి కేసుపెడితే యెట్లా ఉంటుందో, అట్లా ఉన్న దీ తతంగమంతా" అనుకొన్నాడా పంతులు తనలో!

బ్రహ్మాండంగా, ఆర్భాటంగా కేసు జరిపారు. సాక్షులందరూ తీవ్రంగా ఖండిస్తూ యేవేవో సాక్ష్యాలిచ్చారు. మన మాష్టరుగారు తాను చెప్పుకోదలచిన ఆఖరుమాటలు చెప్పుకొన్నారు; తరువాత జడ్జి యీ క్రింది తీర్పు చెప్పాడు:

1. మనిషికీ, కోతులకూ యెట్టి సంబంధమూ లేదని నిరూపింపబడింది.

2. ఈ పంతులుకు వందడాలరుల జరిమానా విధించబడ్డది!!

అట్లా తీర్పుచెప్పి, డార్విన్ మొదలైన గొప్ప శాస్త్రవేత్తలు నిరూపించిన విషయాలన్నీ అబద్ధమనీ, అవన్నీ ఉట్టి అపోహాలనీ ఋజువుచేశాననుకొన్నాడు ఆ అమెరికన్ జడ్జి పాపం.

కావాలంటే మనిషికీ, కోతులకూ ఉండే యీ గొప్ప బాంధవ్యం చూపడానికి, ఎన్నో గ్రంథాలు వ్రాసేయవచ్చు; ఈ విషయం సత్యమని నిరూపించవచ్చు. కానీ, యీ గొడవంతా అవసరంలేకుండానే నిష్పక్షపాతంగా చూచేవాడికి,

యే చింపాంజీనో, ఉరాంగ్ ఉటాంగునో గమనిస్తే దీనిసత్యం దానంతట అదే తెలిసిపోతుంది.

## రోజా – రాఫేల్

రష్యాలో కోటూషీ అనే ఒక ఊరుంది. దీన్నే పవలావ్ అనీ అంటారు. కొన్నేండ్ల క్రితం ఈ ఊరిలో ఇవాన్ పెట్రోవిక్ పవలాల్ అనే శాస్త్రజ్ఞుడుండేవాడు. ఒకరోజు రెండుచింపాంజీ కోతులు ఇతని పరిశోధనాలయానికి వచ్చాయి. వాటిపేర్లు రోజా, రాఫేల్.

సాధారణంగా ఏవన్నా అడవిమృగాలను పట్టుకువస్తే మనుష్యులు వానిని వెంటనే బోనులో బిగించేస్తారు. భయపెట్టీ, తిండిపెట్టకా వానిని క్రమంగా అలవాటు చేసుకొంటారు. కాని యీ రెండు చింపాంజీలకు రాగానే బహుతమాషా ఆహ్వానం యివ్వబడింది. ఒక పెద్దయిల్లు పూర్తిగా వాటికనే యేర్పాటు చేయబడ్డది. పడకగదీ, భోజనాల చావడీ, స్నానాల కొట్లూ, ఆఫీసుగదీ, ఆటలాడేగదీ; ఇట్లా ఎన్నెన్నో యేర్పాట్లు చేశారు. ఒక్కో చింపాంజీకి చక్కని మంచం పడుకొనేందుకూ, భోజనాలుచేసే బల్లమీద అందమైన అల్లికబట్టా, రకరకాల తినుబండారాలతో నిండిన అలమారులూ, బీరువాలూ, ఏర్పాటుచేయబడ్డాయి.

వాటి గదుల్లో అవి మనుష్యులు కావు, కోతులేనని సూచించేటట్టి ఒక్క వస్తువైనా లేదు. భోజనం చేయడానికి, పాశ్చాత్యుల అలవాటుప్రకారం కత్తులూ, చెంచాలూ, ముల్లులూ సిద్ధంగా ఉంచారు. మెత్తని పరుపులూ, వెచ్చని శాలువలూ, తలగడలూ వాని కిచ్చారు. అప్పుడప్పు

డాచింపాంజీలు చేసిన యేర్పాటులకు తగినట్లు వర్తించేవి కావు. భోజనంచేసేటప్పుడు చెంచాలుక్రిందపెట్టి, గిన్ని యెత్తి సాఫుగా నాకేసేవి. రాత్రి నిద్రించేటప్పుడు తలగడమీద తలనాన్చి పడుకోనేవి కావు. దిండ్లనెత్తి తమ తలలమీద మూసుకొని నిద్రించేవి

పూర్తిగా ఈ రోజా, రాఫేలులు మనుష్యుల్లాగా వర్తించకపోయినా ఎన్నో విషయాల్లో మానవునిమాదిరే నడుచుకొనేవి. తాళంచెవులగుత్తిని తీసుకొని రోజా వివిధ అలమారులనూ, అచ్చంగా మనమాదిరే తెరిచేది. ఆ యింటి కాపలా జవాను ఈ తాళాలను తన జేబులో ఉంచుకొనేవాడు. సాధారణంగా నెమ్మదిగా రహస్యంగా వెనుకనుండి రోజా వచ్చి చటుక్కున ఆ తాళాల నతనిజేబునుండి లాగేసేది. రెండు మూడు గంటల్లో భోజనాలగదికి వెళ్ళి, గాజుతలుపుల అలమారాముందు కుర్చీ వేసుకొని కూర్చునేవి. ఆ అలమారు నిండా ద్రాక్షలూ, ఆప్రికాటులూ మొదలైన పండ్ల దినుసు లుండేవి. చమత్కారంగా తాళంచెవిని తాళంలోదూర్చి ఒక్కసారి యిట్టా త్రిప్పేది; తలుపు తెరుచుకోగానే ద్రాక్ష గుత్తిని యెగురవేసుకుపోయేది.

ఇక రాఫేలుసంగతో! అబ్బో అది చదువుకొనేటప్పుడు దాన్ని చూచితీరాలి; అప్పుడుగాని దాని తెలివితేటలు తెల్లం కావు. కొన్ని ఆప్రికాటుపండ్లు పైగా - యెత్తుగా ఒకచోట కట్టి ఉంచేవారు. ఆ గదిలో రకరకాల సైజులవి కొయ్యపెట్టెలు; వస్తువులు పేక్ చేస్తారే దేవదారు పెట్టెలు, అట్లాంటివి ఎన్నో యుండేవి. వానిలో అన్నిటికన్నా చిన్నది మన సాధారణ

ముక్కాలుపీటంత యెత్తుగా ఉండేది. ఈ పెట్టెల పేర్చి, వాని పైకెక్కి, ఆ పండ్లు తీసుకొనే ఉపాయమూ, నేర్పరితనమూ నేర్చుకోటమే దాని చదువు.

మొదట్లో రాఫేలు కేమిచేయాలో ఏదీ తెలిసిందికాదు. అంతా అగమ్యగోచర మనిపించింది. అడవిలో ఉండేటప్పుడు చెట్ల కెగబ్రాకి అవలీలగా కావలసినన్ని పండ్లు కోసుకుతినేది. ఇక్కడో! ఈ పండ్లు విచిత్రంగా, త్రిశంకు స్వర్గంనుండి వ్రేలాడుతున్నాయి! వాటినందుకోవాలంటే, అక్కడుండే పెట్టెల పైకెక్కాలి. అన్నిటికంటే పెద్ద పెట్టె నెక్కినా, ఆ పండ్లు దాని కందాయికావు.

ఏదీ తోచక ఆ పెట్టెల నటూ, యిటూ దొర్లిస్తూంటే, రాఫేలుకో ఆలోచన కలిగింది. ఒకదానిపై నింకోటిగా, ఆ పెట్టెలపేరిస్తే నెమ్మదిగా మొదట మూడూ, తరువాత నాలుగూ, ఐదూ పెట్టెల పడిపోకుండా ఒక దానిపై నొకటి దొంతరగా పేర్చటం నేర్చుకొంది. ఏదో యిష్టంవచ్చినట్లు అనకతవకగా ఆ పెట్టెల పేరిస్తే లాభముండేదికాదు. అన్నిటి కంటే పెద్దది అడుగునా, కొంచెం చిన్నది పైనా, యింకా చిన్నది దానిమీదా యిట్లా వాటి సైజుప్రకారం పేర్చాలని నేర్చుకొన్నది యెన్నో అవస్థలుపడి.

ఎన్నోపర్యాయాలు చిన్నవానిని అడుగునా, పెద్ద పెట్టెల పైనా పెట్టింది. ఆ దొంతరంతా ఊగిసలాడుతూ, "నన్ను ముట్టుకోవద్దు, నామాలకాకి" అన్నట్లు ప్రమాదకరంగా నిలబడేది. చూస్తూండగా రాఫేలుతోసహా ఆ దొంతరంతా అమాంతంగా కూలిపోతుందా అనిపించేది. కాని, ఎట్లాగైనా

కోతి కాబట్టి, కనురెప్పపాటులో, ఛటుక్కున క్రిందకు దుమికే సేది రాఫేలు.

చివర కెట్లాగైతేనేమి క్రమంగా ఒకదానిపై నొకటిగా ఆ యేడు పెట్టెలనూ పేర్చింది. ఒకటీ, రెండూ, మూండు అని వానిమీద అంకెలువేసి గుర్తించినట్లు, సైజుప్రకారం, ఒక్కటైనా తప్పులేకుండా, దొంతర పేర్చబడింది.

ఆ గోపురంపై కెక్కింది రాఫేల్. చెయిజాచి ఆప్రికాట్ పండ్ల నందుకొంది. ఊగుతూన్న ఆ గోపురాగ్రాన కూర్చుని పండ్లుకొరుకుతూ అవన్నీ తినేసింది.

ఏ యితరమృగమైనా యీ విధంగా వర్తించగలుగు తుందా? ఆలోచించు. మనిషిలాగా, ఇతరజంతువేదైనా యిట్లా దొంతరగా పెట్టెల పేర్చగలదా? కుక్కలు కొన్ని చాలా తెలివైన వుంటాయి; కాని, ఏ కుక్కా యిటువంటి పనిని చేయలేదు. ఇదీ చిత్రం.

రాఫేలు యీ పెట్టెల దొంతరను పేర్చేటప్పుడు అచ్చంగా మనిషిలాగా వర్తించేది. ఒక పెద్ద పెట్టెను భుజాని కెత్తుకొని, ఒక చేత్తో పడిపోకుండా దాన్ని పట్టుకుంటూ, దొంతర పై కెక్కేది. అది అచ్చట సరిపోకపోతే నెమ్మదిగా ఆ పెట్టెను నేలకు దించేది. ఏదో ఆలోచిస్తున్నట్లు ఆ దొంతర వంకచూస్తూ దింపిన ఆ పెట్టెమీద కూర్చునేది. కొంత విశ్రాంతి తీసుకొని తిరిగీ యింకో సైజు పెట్టెను మోసుకు పోయేది. ఇట్లా అనుభవంమీద ఏ పెట్టె పెట్టాలో గ్రహించు కొన్నదా అన్నట్లు, చివర కాపెట్టెల గోపురాన్ని పూర్తి చేసింది.

## చింపాంజీని మనిషిగా మార్చవచ్చా ?

పై చెప్పిన రాఫేలు, రోజాల విషయం విన్న తరువాత చింపాంజీలకు తగినతరిఫీది స్తే మనుష్యుల్లాగా నడవటం, మాట్లాడటం, ఆలోచించటం, రకరకాలపనులు చేయటం నేర్చుకో గలవా అనే సందేహం జనిస్తుంది.

ఇది వీలవుతుందని ఒక గొప్ప శాస్త్రజ్ఞుడు గట్టిగా నమ్మి మైమస్ అనే ఒక చింపాంజీకి ఎంతో గొప్ప తరిఫీదిచ్చాడు. మైమస్ ఎన్నో చిత్ర విచిత్రమైన పనులు తెలివైనవి చేసింది. నేర్చుకొన్నది. చెంచా నుపయోగించేది. భోజనంచేసేటప్పుడు శరీరంమీద చిందిపడకుండా మెడకు బట్టకట్టుకునేది. కుర్చీమీద కూర్చొని, బల్లమీది గిన్నెలోని పులుసు ఒక్క చుక్కన్నా చిందిపోకుండా చక్కగా తినేది. చక్రాలు లేని స్లెడ్జిబండీమీద కూర్చొని కొండఅంచున, స్లోపుగా ఉండేచోట జారుతూ ఆడుకొనేది.

ఇన్నీ చేసిందేకాని, ఆ చింపాంజీ మనిషిగామారింది కాదు.

ఎందుకో తెలుసా ? దాని శరీర నిర్మాణానికీ, మన శరీర నిర్మాణానికీ యెన్నో భేదాలున్నాయి. దాని చేతులు మన చేతులమాదిరి లేవు. దాని కాళ్లూ, పాదాలు మన కున్నట్లు ఉండవు. దాని మెదడుకూ, మన మెదడుకూ చాలా భేదముంది. దాని నాలుక మన నాలుకలాగా ఉండదు.

చింపాంజీ నోరు తెరిస్తే, యెప్పుడన్నా చూచినవారి కిది బోధపడుతుంది. బలే గట్టిగా కొరుకుతాయి చింపాంజీలు. కాబట్టి అట్లాచూచే టప్పుడు కడు జాగ్రత్తగా ఉండాలి. దాని

నాలుక నలు ప్రక్కలా ఇటూ అటూ తిరుగడానికి చింపాంజీ నోట్లో తగినంత ఖాళీ లేదు. ఉండే కొద్ది స్థలమూ పెద్ద పార ల్లాంటి పళ్ళతో నిండిపోతుంది.

నాలుక స్వేచ్ఛగా తిరిగేటందుకు తగినస్థలం లేనుకాబట్టే చింపాంజీకి ఎన్నడూ మనలాగా మాట్లాడ్డానికి శక్యంకాదు. మనం మాట్లాడేటప్పుడు మన నాలుక ఎన్నెన్ని విధాలో మడతబడీ, సాగీ, వంగీ, పైకదిమీ మెలికలు తిరుగుతుంది. మననోటిలో యిట్లా నాలుక మెలగడానికి తగినంత ఖాళీ ఉంది. చింపాంజీ కిది వీలేకాదు ఎంత ప్రయత్నించినా.

రెండో విషయం ఏమిటంటే చింపాంజీ తన చేతులను మనలాగా ఎన్నటికీ ఉపయోగించలేదు. చింపాంజీ బొటన వ్రేలు దాని చిటికెనవ్రేలుకన్నా చిన్నదిగా ఉంటుంది. ఇతర వ్రేళ్ళకు దూరంగా, అడ్డంగా మన చేతులకున్నట్లు చింపాజీ యొక్క బొటనవ్రేలుండదు. మనం చేతులతో చేయగల అనేక పనులు యిట్లా మన బొటనవ్రేలు ఇతర వ్రేళ్ళకు ఎదురుగా, దూరంగా చాచడానికి వీలుండబట్టే సాధ్యపడుతున్నాయి. మన బొటనవ్రేలు ప్రతి యితర ఒక్కొక వ్రేలుకూ ఎదురుగా అదమ డానికి ఒకసారే అన్నివ్రేళ్ళకు ఎదురుగా పట్టు చిక్కించుకోడా నికీ వీలయేటట్లు సర్దించబడిఉన్నది. ఇందుమూలానే రకరకాల పనిముట్లను మన చేతు లుపయోగించగలుగుతున్నాయి.

చింపాంజీ అరచేతులు మనుష్యుని పాదాల్లాగానే వుంటాయి. కొమ్మలమీద నడచిపోయే చింపాంజీ తన చేతు లతో ఏదన్నా కొమ్మనుపట్టుకొని వ్రేలాడుతూంటే సునాయా సంగా కాలితో పండ్లను కోస్తుంది. నేలమీద నడిచేటప్పుడు

చేతులను నేలమీద మోపి, నాలుగుకాళ్ళమీద నడిచే మృగా ల్లాగా నడుస్తుంది. కాళ్ళను చేతుల్లాగానూ, చేతులను కాళ్ళ మాదిరీ చింపాంజీ ఉపయోగిస్తుంది.

మనంకూడా కాళ్ళూ, చేతులూ తమతమ పనులను మార్చి చేసుకోనేట్లు ప్రయత్నించామనుకో? మనం ఏ విధ మైన పనిగాని చేయడానికి వీలేవుండదు.

నాలుకా, కాళ్ళూ, చేతులేకాక ఇంకో ముఖ్యవిషయంలో కూడా చింపాంజీ మనుష్యునిమాదిరి ఉండదు. దాని మెదడు మన మెదడుకన్నా చాలాచిన్నది; దాని మెదడుపైన మన మెదడుకున్నన్ని ఎత్తుపల్లాలూ, వంకరటింకర కాలువలూ లేవు. ఎన్నో కొన్నిలక్షల యేండ్లుగా మారితేనేగాని కోతి జాతుల నుండి మానవుడు పెఱిగాడుకాదు. ఈ మెదడులలోనుండే భేదాలమూలాన చింపాంజీ యెన్నటికీ మనిషిలాగా ఆలోచించ లేదు. మనిషికుండే ఆలోచనాశక్తి అతని మెదడుయొక్క విచిత్ర నిర్మాణంమీదా, సైజుమీదా ఆధారపడియుంది. చింపాంజీ చేష్టలన్నీ పొంకంగా, వరుసక్రమంగా నుండక, గందర గోళంగా నుండటం, దాని మెదడుయొక్క గందరగోళపు నిర్మా ణాన్నే సూచిస్తున్నాయి.

కొన్ని లక్షల యేండ్ల తరబడిగా అది అలవాటుపడి యున్న అరణ్యప్రదేశాలలో సక్రమంగా జీవించడానికీ, అచ్చటి సమస్యల నెదుర్కొనేటందుకు కావలసిన చాకచక్యానికీ తగిన తెలివితేటలు చింపాంజీయొక్క మెదడు దానికి యివ్వగలుగు తోంది అంతే. మనుష్యునిమాదిరి మారడానికి దాని మెదడు కన్నా మించిన గొప్ప ఆటంకం యింకోటిలేదు.

ఒకసారి రోజా, రాఫేలులను సినిమా తీయాలని ఒక చిత్రకారుడు వచ్చాడు. అవి సహజంగా ఆరుబయట విహరిస్తూ న్నట్లుకూడా సినిమా తీయాలని ఆతడడిగాడు. సరేనని, వాని బయటకు తోలారు. అంతే: వెంటనే పరుగిడి దగ్గరనున్న చెట్లెక్కి, కొమ్మకొమ్మకూ గంతులేస్తూ, ఏమిటేమిటో వాని భాషలో కీచుకీచని గుక్కతిప్పుకుండా మాట్లాడటం మొదలు పెట్టాయి ఆ చింపాంజీలు రెండూ. అన్నిరకాల ఏర్పాటులు చేసినా, వానికి ఇంట్లోకన్న యీ చెట్లమీదే బహుబాగుండింది జీవితం.

ఆఫ్రికా అరణ్యాల్లో పైభాగాన, చెట్ల చిటారుకొమ్మల అంతస్థులో చింపాంజీ నివసిస్తుంది. చక్కని గూడును కొమ్మ చీలికల్లో కట్టుకొంటుంది. దాని శత్రువులనుండి యీ కొమ్మ ల్లో దాగుకొని తప్పించుకొంటుంది. దానికి కావలసిన ఫలాలూ, పప్పులూ చెట్లమీదే దొరుకుతాయి. చెట్ల కొమ్మలమీద, భూమిపైకన్న బహు సునాయాసంగా అది పరుగిడుతుంది. చెట్లులేని ప్రదేశాల్లో చింపాంజీలే వుండవు.

ఆఫ్రికాతీరాన కేమరూనులనే లంకలున్నాయి. అచ్చట చింపాంజీలు తమ జీవితాల నెట్లా గడుపుతాయో పరిశీలించా లని శాస్త్రజ్ఞుడొకడు వెళ్ళాడు. పది పండ్రెండు చింపాంజీలను పట్టి తన యింటిచుట్టూగల అడవిలో వానిని వదిలాడు. అవి తప్పించుకొని పారిపోకుండా వాని కగుపించనట్లు అత డొక పెద్ద బోనును నిర్మించాడు. అంటే చింపాంజీలను వదలిన చెట్లచుట్టూ అన్నిప్రక్కలా కొంతదూరానికి ఏవిధమైన చెట్టూ లేకుండా

కొట్టించివేశాడు. ఈ చింపాంజీలను సముద్రంమధ్య లంకలో మాదిరిగా ఆ చెట్లున్న మధ్యభాగంలో వదిలాడు.

అంతా అతడనుకొన్నట్లే జరిగింది. చింపాంజీ అరణ్యామృగం. అంటే తనంతట తానే కావాలని ఎన్నడూ అడవిని వదలిపోదు. ఆ డజను చింపాంజీలు గోడలు లేని ఆ ఖైదులోనే ఆగిపోయాయి. వెలుపలకు పోనేలేదు.

చింపాంజీ అడవినివదిలి రాలేదు. చింపాంజీయొక్క దగ్గిరబంధువు మానవుడు. ఈ రెండు విషయాలూ సరిగ్గా అతికేట్లు తోచటంలా కాదూ? చింపాంజీలు అడవిలోనే ఉంటే, వాని సంబంధీకుడైన మనుష్యుడెట్లా అడవిని వదలి బయటపడ్డాడు? ఈ విషయాన్ని గ్రహించడానికి ప్రయత్నించాలి యిప్పుడు.

## మన పూర్వీకుడు నడక నేర్చుకోటం

మన పూర్వీకుడైన జీవి ఒక్కరోజులో ఉన్నట్లుండి అరణ్యాన్ని వదిలి బయటపడ్డాడనుకోరాదు. కొన్ని లక్షల యేండ్లు గడిచాయి. క్రమంగా ఆత డడవినుండి మైదాన ప్రదేశాలకు మారేలోగా, అరణ్యపు చిటారుకొమ్మలకు ఆతనిని బంధించిన సంకెళ్ళను వదిలించుకొంటేనేగాని, నేలపై నడవడానికి శక్యమయింది కాదు మనిషికి.

ఈ రోజుల్లోనైనా నడక నేర్చుకోటం ఎంత కష్టమో మన చిన్నబిడ్డల గమనిస్తే బోధపడుతుంది. మొదట్లో చతుష్పాదులై, పసిబిడ్డలు ఇల్లంతా తిరగటం నేర్చుకొంటారు. కొన్ని నెలలైతేనేగాని నిలబడటం, నడవటం పసిబిడ్డకు చేతకావు.

ఏదీ పట్టుకోకుండా నిలబడి నడవటం, సైకిలు తొక్కడంకన్నా కష్టమైనపని.

కొన్ని నెలలలో మన పసిబిడ్డలు నేర్చుకొనే ఈ నడవట మనేకార్యం ఎన్నోలక్షలయేండ్లుగా సాధనచేస్తేనేగాని మన పూర్వీకుని కలవాటైందికాదు. చెట్లకొమ్మల్లో వసించే కాలంలో, అప్పుడప్పుడు నేలమీదికాతను దిగేవాడు. బహుశః చేతులు నేలపై ఆనించకుండా రెండుమూడు దుముకులు దుమికేవాడేమో కూడా! చింపాంజీ లప్పుడప్పు డిట్లా దుముకు తాయి.

రెండుమూడడుగులు ఎగిరి గంతువేయడానికీ, యాభై అడుగులు నిలబడి నడవడానికీ ఎంతో భేదమున్నది. కాబట్టి చాలాకాలం మనపూర్వీకుడు చతుష్పాద జంతువుగానే ఉండే వాడు. అప్పుడతనిని మనుష్యుడని పిలవటం సరిగ్గా ఉండదని నా ఊహ. మనిషిగా మారినతరువాత నడవడానికి ఆతనికి చేతుల అవసరం తప్పింది. నడకనుండి విముక్తి చెందిన ఆతని చేతులకు! ఎంతపనో! ఎంతోపని కనిపెట్టుకున్నది!!

## చే తు లూ - ప నీ

చెట్లమీద వసించేరోజుల్లోకూడా మన పూర్వీకుడు తన చేతులను ఒక్కొక్కసారి నడిచేకాళ్ళమాదిరి కాకుండా, ప్రత్యే కించి కొన్ని పనుల కుపయోగించేవాడు. కాయలూ, పండ్లూ కోయటమూ, చెట్టు కొమ్మల్లో గూళ్ళుకట్టుకోటమూ - ఇట్టి పనులన్నీ చేతులే చేసేవి.

ఏదన్నా పండును కోయగలచేయి ఒక రాతినో, లేక కట్టెనో పట్టుకోవచ్చుగా? అట్లా చేతితో కట్టెను పట్టుకోటంచేత

మామూలుకంటే ఆ చేయి పొడుగ్గా మారినట్లుపయోగపడు తుంది. అదేమాదిరి, రాతిని చేతిలో పట్టుకొంటే చేతికి మునుపటికన్న ఎక్కువబలం వచ్చినట్లుపయోగ పడుతుంది. ఇదెట్లాగో చెప్తాను చూడు.

రాతితో, పండ్లు కొరకలేని, గట్టి డిప్పలున్న కాయలను పగులగొట్టవచ్చు. అదేమాదిరి, కట్టితో నేల అడుగునున్న దుంపలనుకూడా అందుకోవచ్చు త్రవ్వి.

క్రమంగా మనపితరుడు కొత్తరకాల పదార్థాలను తినటం ప్రారంభించాడు. పక్షులూ, ఎలుకలూ, మొదలైనవి తినేవస్తువు లితను తినటం మొదలుపెట్టాడు. అప్పుడప్పుడు కోతి జాతులు ఇతను సాధారణంగా తినే పండ్ల దినుసులన్నీ ధ్వంసం చేసిపోయేవి. అటువంటప్పు డితను క్రొత్తరకపుటాహారానికి అలవాటుపడ్డాడు. క్రమంగా ఈ నూతన ఆహారం అలవాటయి, చెట్లనుండి తరుచుగా నేలకుదిగివచ్చి దానికని వెతికేవాడు. కట్టితో నేలనుత్రవ్వి దుంపజాతులు తినేవాడు. కుళ్ళిపోయే చెట్లమోదుల రాళ్లతో చీల్చి లోపలి పురుగులను భక్షించే వాడు.

చేతు లిట్లా క్రొత్తపనులు చేయడానికి అలవడేకొలదీ, నడిచేటప్పుడు మునుపటంత తరుచుగా తన చేతులను నేల కానిచ్చేవాడుకాదు. ఆ పనంతా కాళ్ళే జేయటం అలవాటైంది.

చేతులు, కాళ్ళకు స్వేచ్ఛనిచ్చి నడవటమే వాని పనిగా ఏర్పర్చాయి. కాళ్ళు ఇదేవిధంగా చేతులకు స్వేచ్ఛనిచ్చి వస్తువుల పట్టుకొని రకరకాల పనులు చేయమన్నాయి. ఇందు చేత వెనకకాళ్ళమీద నడుస్తూ, ముందుకాళ్ళతో అంటే భావి

చేతులతో పనులుచేయటం మన పూర్వీకునికి అలవాటు కాజొచ్చింది.

ఆ విచిత్ర మృగాన్ని చూస్తే "ఇది నిజంగా మృగమే, కాని, ముందుకాళ్ళతో పనులు చేయటం చూస్తే, ఏదో మనిషి మాదిరే కనిపిస్తోందని" మన కనిపించేది. ఏ జంతువూ, మనిషి లాగా ప్రత్యేక పనిముట్లు నుపయోగించదు తన పనులు చేయడానికి.

చుంచులూ, ఎలుకలూ నేలను త్రవ్వాలంటే, అవి పారల నుపయోగించవు. పారలలాంటి వాని పాదా లుపయోగించబడుతాయి. పందికొక్కులు గోడలనూ, తలుపులనూ ఉలితోనూ, రంపంతోనూ కోయవు; వాని దంతాలే ఆ విధంగా పనిచేస్తాయి. వడ్రంగిపిట్ట బర్మాను తీసుకొని మ్రానులలో రంధ్రాలు కోయదు; తన ముక్కుతోనే వానిని చేస్తుంది.

మన పితరునకిట్టి పారపాదాలూ, బర్మావంటి నాలుకా, రంపంవంటి గోళ్లూ ఉండేవికావు. ఆతనికి చేయిమాత్రం ఉండేది; దానితో రాతిరంపాలూ, కొయ్య పటకారులూ ఆతను నిర్మించి వాని నుపయోగించేవాడు.

## నే ల కు  ది గి వ చ్చు ట

పైన చెప్పినవిధంగా మన పూర్వీకుడు క్రొత్తపనులు చేయటం నేర్చేరోజుల్లో భూలోకపు శీతోష్ణస్థితి మారడానికి మొదలుపెట్టింది. లోకంలో చలి రానురాను యెక్కువ అయింది. ఉత్తరధృవపు మంచుయెడారులు క్రిందికి నెమ్మదిగా ప్రాకుతూ వచ్చాయి. పర్వతాగ్రాల మంచుటోపీలు పెద్దవై చొక్కాలంత

పొడుగ్గా పర్వతాల కప్పటం ప్రారంభమైంది. చలి విశృతంగా పెరిగిపోయింది.

ఈ చలిచేత పర్వతాల, పై అంతస్తుల్లో మునుపు పెరిగే చెట్లజాతులు నశించాయి. చల్లదనాన్ని భరించగల గోపురాకారపు చెట్లూ, చలికాలంలో ఆకురాల్చి, మోడుల్లాగా నిలబడి, తిరిగి వసంతం ప్రారంభంకాగానే చిగిర్చే రకాలూ పెరిగాయి.

మేడిచెట్లూ, ద్రాక్షతీగలూ చలి యెక్కువయ్యేకొలదీ పర్వతాల దక్షిణ ప్రాంతాల్లోనూ, — ఉత్తరాన్నుండి చలి వ్యాపిస్తూంటే, దక్షిణభాగం వెచ్చగా ఉండదూ, మరి ? — కొండలోయల్లోనూ పెరగనేర్చాయి. వేడిఅరణ్యం క్రమక్రమంగా దక్షిణభాగానికి జరుగుతూవచ్చింది. దానితో అందుండే జీవరాసులూ జరిగాయి. మాస్టోడన్ అనే ఒక పెద్ద యేనుగువంటి మృగముండేది; దానినుండే యీ కాలపు యేనుగులు పెరిగాయి. అది ఆ చలికి చనిపోయింది. ఖడ్గపులి అదృశ్యమై పోయింది.

పూర్వం అడవుల్లో చెట్లమధ్య కాలుపెట్టడానికి వీలుకాని దట్టమైన పొదలుండేచోట, విశాలమైన బయళ్ళు తయారయ్యాయి. ఆ బయళ్ళమీద జింకలూ, లేళ్ళూ, ఖడ్గమృగాలూ మందలు మందలుగా మేసేవి. కోతిజాతుల్లో కొన్ని చనిపోయాయి, కొన్ని తప్పించుకొని బ్రతికాయి.

ఈ నూతన పరిస్థితులకు అలవాటుపడటం, జీవులకు కష్టమైంది. కోతులకు తగిన ఆహారం మునుపటంత విరివిగా దొరికేదికాదు. ద్రాక్షా, బొంత అరటీ, మేడిపండ్లూ కష్టపడి

వెతికి తేనేగాని యెక్కడో ఒకచోట దొరికేవి కావు. చెట్టునుండి చెట్టుకు దుముకుతూ పోవటం మునుపటంత సులభంగా వుండేది కాదు. చెట్లగుబురుల మధ్యనుండే ఖాళీజాగాలలో త్వరగా పరుగెత్తవలసిన అవసరం యేర్పడింది. అసలు చెట్టునుండి క్రిందకు దిగుటయే యెంతో కష్టమనుకొంటే, నేలమీద నడిచే టప్పుడు, ఇటూ అటూ ఏదన్నా శత్రుమృగం వస్తుందేమోనని చూస్తూపోవలసిన పనికూడా కల్పితమైంది మన పూర్వీకునకు.

కాని, అట్లా నేలపై దిగి తిరగటం అతనికి తప్పిందికాదు. కడుపు కాలుతోంటే మరి యేంచేయాలి? పూర్వం యేకోతీ తిననటువంటి ఆహార వస్తువులను వెతకి, అతను తినేవాడు. "ఆకలి రుచినెఱుగదు, నిద్ర సుఖ మెఱుగ" దనే సామెత నీకు తెలుసుననుకొంటూ.

ఇంతవరకూ తా మలవాటుపడిన పరిస్థితులనుండి వెళ్ళ వలసిన అవసరం అనేక మృగాలకు కలిగింది. వానిని బంధించి, వాని పరిస్థితులలో ఖైదీలుగా వేసిన గొలుసులూ, జైలు గోడలూ సడలిపోయాయి. ఈ మార్పులమూలాన జంతువులలో కొంగ్రొత్త మార్పులు తలలెత్తాయి.

అడవిలోనుండే ఉడత సాధారణ గడ్డి మైదానానికి తన నివాసాన్ని మార్చాలంటే యేం జరుగుతుంది? మైదానంలో దానికి కాయలూ, పప్పుబద్దలూ దొరకవు; గడ్డిని తిన వలసి వస్తుంది. అట్లా గడ్డి తినాలంటే దాని పండ్లూ, వాని నిర్మాణమూ మారాలి. మైదానంలో అది వసించడానికి ఏదన్నా బొరియను నేలలో త్రవ్వుకోవాలి. అంటే దాని కాలి గోళ్ళుకూడా మారాలి. కొమ్మకొమ్మకూ యెగిరేటప్పుడు

తూలిపోకుండా దాన్ని నిలబెట్టే గుబురుతోక, నేలమీద తిరిగే టప్పుడు అనవసరం, అడ్డం. ఎంతదూరాన్నుంచైనా శత్రు మృగాలూ, పక్షులూ యీగుబురు తోకనుచూచి, "ఓహో! అక్కడ ఉడత ఉన్నద"ని సునాయాసంగా తెలుసుకో గలవు.

కాబట్టి అడవిని వదలి, మైదానానికి మారేముందు, ఉడుత తన గుబురుతోకనూ, పళ్ళనూ, కాలిగోళ్ళనూ మార్చు కోవాలి. అంటే యేమిటో తెలుసా? ఆ ఉడుత, ఏమాత్రమూ ఉడత మాదిరి ఉండటానికి వీలుండదు.

లోకంలో పక్షులూ, జంతువులూ యెప్పుడూ ఒకే మాదిరి ఉండవనేమాట నిజమే. ప్రతి శిశువూ, తన తల్లి తండ్రులనుండి యేవో కొన్ని కొన్ని విషయాల్లో భేదంగానే ఉంటుంది. లోకంలో ప్రతి జీవి మారుతూనే ఉన్నది. ఐనప్ప టికీ ఏదైనా సరిక్రొత్తరకపు జీవి తయారుకావాలంటే ఎన్నో తరాలు గడిచిపోతేనేగాని వీలుండదు. ఊరికే చూస్తూండగా ఇట్టే, కొత్తవిధమైన జీవులు పెరగాలంటే వీలుపడదు.

కాబట్టి మన పూర్వీకు డారోజుల్లో క్రమక్రమంగా ఎట్లాంటి మార్పులు చెందాడో పరిశీలించిచూద్దాం. ఉత్తరా న్నుండి చలి వ్యాపించే కొలదీ, దాన్నుండి తప్పించుకోడానికి దక్షిణానికి జరుగుతూ వెళ్ళడానికి ఆ రోజుల్లో వీలయింది. తనచేతులతో రాళ్ళూ, కఱ్ఱలూ పట్టుకోటం నేర్చియుండబట్టి, వాని సహాయంచేత మన పూర్వీకుడు రకరకాల ఆహార పదార్థాలు సంపాదించుకో నేర్చాడు. ఇంతేకాక, చెట్లగుబురుల మధ్యగల ఖాళీస్థలాలలో పరుగెత్తటం అతని కలవాటైంది. అట్లా పరుగిడేటప్పు డేదన్నా శత్రువు ఎదురైతే, నిర్భయంగా

తన చేతిలోని రాళ్ళతోనూ, గదలతోనూ దాన్ని ధిక్కరించే వాడు. ఆ "సగం మనుష్యులు" తరుచుగా గుంపులుగా సంచ రించేవారు; కాబట్టి శత్రువుల నెదుర్కోడానికి మరీ వీలుండేది.

చలి యెక్కువైనందున కొన్ని మృగాలు నశించి పోయాయి. కాని మన పూర్వీకు డట్లా నశించలేదు సరిగదా, అతనిలో యీ క్రొత్త వాతావరణానికి అనుగుణ్యంగా జీవించ డానికి కావలసినమార్పులు పుట్టుకువచ్చాయి.

ఐతే, ఇతర కోతిజాతు లేమయ్యాయో?

అరణ్యాలతోపాటు అవీ దక్షిణ భాగాలకు సాగి పోయాయి. కాని మన పూర్వీకునిలాగా పనిముట్ల నుపయో గించటం నేర్చుకోనందుచేత అవి చెట్లపై జీవితానికి మునుపటి కంటే యెక్కువగా అలవడిపోయాయి. కొమ్మకొమ్మకూ బహుచమత్కారంగా దుమికేవి. చేతులతోనూ, వేళ్ళతోనూ కొమ్మలనుపట్టుకు వ్రేలాడేవి; కాయలు కోసేవి. చేతులమీద ఊతగొని, చింపాంజీలాగా, అప్పుడప్పుడు నేలమీద నడవటం నేర్చుకొన్నాయి. ఇట్టి నడకలో చేతులు ఉపయోగం కావటంచేత, అవి మన పూర్వీకునిలాగా మానవరూపానికి మారే అవకాశాన్ని పూర్తిగా కోల్పోయాయి.

చెట్లమీద సునాయాసంగా జీవించటం నేర్చుకోలేని యితరజాతుల కోతులు కొన్ని, ఇంకోవిధంగాకూడా మారి పోయాయి. చిన్నజాతులన్నీ నశించగా, పెద్దవిమాత్రం మిగి లాయి. అంత పెద్దవీ, బరువైనవీ చెట్లపై జీవించడానికి వీలయ్యేది కాదు. అందుకని అవి నేలమీదికి దిగివచ్చాయి. వేరే దారి లేక గోరిల్లాఅనే కోతులు అడవుల్లో నేలమీదే నివసిస్తాయి.

శత్రువులనుండి రక్షించుకోడానికి రాళ్లూ, కఱ్ఱలూ పట్టుకోటం వానికి తెలియదు. బలమైన దవుడలూ, పెద్ద పొరల్లాంటిపళ్ళూ ఇవే వాని ఆయుధాలు, ఎవరితోనన్నా కలహం వస్తే.

ఇట్లా మన పూర్వీకుమూ, ఇతరజ్ఞాతుల కోతులూ వేర్వేరుమార్గాల ప్రయాణం సాగించాయి. మానవుడుగా మారే పురాతన కోతిజాతి జీవి నడవటమూ, చేతులతో పనులు చేయటమూ నేర్చుకొన్నది.

## కనుపించని లంకె

మనుష్యుడు ఒక్కసారిగా రెండు కాళ్ళమీదా నడవటం నేర్చుకోలేదు. మొదట్లో అతను నడుస్తూంటే బహు వికృతంగా, నవ్వు పుట్టిస్తూ ఉండేది.

ఆ పురాతన దినాల్లో కోతిమనుష్యుడు — పూర్తిగా యింకా మనుజుడుగా మారలేదుగా? — ఎట్లా ఉండేవాడో, చూడడానికి? అతడేయే పనులు చేసేవాడో?

చాలాకాలంక్రితం కోతిజాతి జీవులు మనిషిలాగా మారాయి కాబట్టి అప్పటి సగంకోతి, సగం మనుష్యుల శరీర భాగాలు మన కిప్పుడు దొరకటం చాలకష్టం. అట్టి యెముకలే గనుక దొరికితే, స్పష్టంగా మానవుడు కోతినుండే ఉత్పత్తి అయ్యాడని చూపించవచ్చు. కాని కోతికీ — మనిషికీ మధ్యగల లంకె, యీ "కోతి — మనిషి" — మనకెక్కడా కనుపించదు. భూమియొక్క లోపలి పొరలలోనూ, నదీ తీరపు మట్టిలోనూ ఎంత వెతకినా యీలంకె యెవరూ కనిపెట్టలేకపోయారు ఇంతవరకూ.

భూతత్త్వశాస్త్రజ్ఞులు యీ లంకెకోరకని భూమిని త్రవ్వి పరీక్షించుతారు. అట్లా త్రవ్వేముందు ఏ ప్రత్యేక స్థలంలో దీనికని వెదకాలో తెలిసియుండాలి. లేకపోతే ఇంత బ్రహ్మాండమైన భూమినంతా త్రవ్వటం ప్రారంభించాలి; గుండుసూదికని గడ్డిమేటంతా ఊడబెరికినట్లుంటుంది ఇట్లా త్రవ్వటం.

గత శతాబ్దపు చివరకాలంలో హెక్కేల్ అనే జర్మను శాస్త్రవేత్త ఒకడుండేవాడు. ఆయన ఈ లంకెకై దక్షిణ ఆసియాలో వెతుకుతే లాభం ఉంటుందేమోనని సూచించాడు. ఈ కనుపించని "కోతి-మనిషిని"; శాస్త్రజ్ఞులు "పితకాంత్రోపస్" అంటారు.

సండాదీవులనేచోట, ఒక ప్రత్యేకస్థలంలో బహుశ ఈ పితకాంత్రోపస్ యొక్క యెముకలు దొరకవచ్చని ఆయన చెప్పాడు.

అనేకమంది హెక్కేల్ మాటలువిని నవ్వారు; పరిహసించారు. ఆయన చెప్పినచోట వెతకటం వెఱ్ఱివెంగళాయతనమనుకొన్నారు. కాని, ఆమ్స్టర్డామ్ విశ్వవిద్యాలయంలో నుండే డాక్టర్ యూజిన్ డ్యూబాయ్ అనే గొప్ప జంతు శాస్త్రజ్ఞుడీ మాటలువి , ఎంతో సంతోషించాడు. హెక్కేల్ సూచించిన ప్రదేశం తప్పక వెతకాలనే ఆవేశం కలిగిందాడాక్టరుకు. తన ఉ ్యగానికి రాజీనామాయిచ్చి సండాలంకలకు డ్యూబాయ్ ేళ్ళడు.

ఆ విశ్వవిద్యాలయపు పెద్దలూ, ఉపాధ్యాయులూ డ్యూబాయ్‌కి పిచ్చి పట్టిందనుకొన్నారు. తమ తమ కళాశాలలకు వెళ్ళటమూ, ఆమ్స్టర్డామ్ వీధులలో గొడుగులు వేసు

కొని కళాశాలకు వస్తూ పోవటమూ తప్ప వారికి యితర పను-
లన్నీ వింతగా తోచాయి.

డ్యూబాయ్ ఉద్యోగం వదిలాడు. డచ్చిసైన్యంలో చేరాడు డాక్టరుగా. ఆ సైనికోద్యోగం దొరకబట్టి, డచ్చి సామ్రాజ్యానికి చెందిన సండాదీవులకు వెళ్ళే అవకాశం అతనికి చిక్కింది.

సుమత్రాలంకను చేరీ చేరటంతోనే, కొందరు పనివారిని చేర్చి, డ్యూబాయ్ పని ప్రారంభించాడు. వాళ్ళు త్రవ్విపోసిన మన్ను చిన్న కొండలుగా తయారయింది. మొదటి నెల గడి చింది; రెండోదీ, మూడోదీ దాటిపోయాయి. పితకాంత్రోపస్ యొక్క ఒక్క యెముకైనా వాళ్ళకి దొరికిందికాదు.

ఏదన్నా మనది ఒక వస్తువు పోతే, అదెట్లాగుంటుందో మనకు తెలుసు కాబట్టి, పోయినచోట వెతకటం సులభమైన పని. కాని, డ్యూబాయ్‌కి ఎచ్చట వెతకాలో సరిగా తెలీదు సరిగదా! తాను వెతికేవస్తు వేలాగుంటుందో, అదీ తెలియదు. ఐనా మొండిపట్టుదలతో త్రవ్వుతూ పోయాడు ఆ లంకలో. ఒకటీ, రెండూ మూడేండ్లు గతించాయి. ఏమీ ఫలితం లేక పోయింది, పాపం!

మనమైతే ఎన్నడో ఆ లంక వదలివచ్చేసేవాళ్ళం. డ్యూబాయ్‌కి అప్పుడప్పుడు చెప్పనల[illegible] నిస్పృహ కలిగి యుండవచ్చు. దారీ, తెన్నూ లేని ఆ సుమత్రా ద్వీపపు నదీతీరపు బురదనేలలమీద, బ్రహ్మాండమైన అరణ్యాల్లోనూ తిరిగేటప్పుడు అతనికి యింటిమీద బెంగపుట్టి ఉండవచ్చు. కాని డ్యూబాయ్ అంతటితో విసుగుచెందలేదు. సుమత్రాదీవిలో పితకాంత్రోపస్

చిహ్నములు కనుపించక పోవడంచేత సండాలంకలకు చెందిన యింకోదీవికి వెళ్ళాడు. ఆ లంక పేరు జావా.

ఆ జావాలంకలో తిరిగి త్రవ్వటం ప్రారంభించారు. కెండెంగ్ కొండలని ఉన్నాయి. అక్కడ వాని చెంతగా బెంగావన్ అనేనది ప్రవహిస్తోంది. ఆ నదీలోయలో త్రవ్వుచుండగా రెండు దంతాలూ, తొడయెముక యొకటీ, కపాలపు పైభాగమూ దొరికాయి! ఆ యెముకలన్నీ పితకాంత్రోపస్‌వే!!

ఆ యెముకల రూపాన్నీ, పరిమాణాలనూబట్టి పితకాంత్రోపస్ ఎట్లా ఉండేవాడో ఊహించటం కష్టమైన విషయం కాదు. అతని నుదురు ఎత్తుగా, వెడల్పుగా ఉండేదికాదు. సన్నగా, పైకి స్లోపుగా ఉండేది. కనుబొమ్మల యెముకలు బాగా యెత్తుగా నుండేవి. ఆ ముఖం చూడడానికి ఏదో పెద్ద రకపు కోతిముఖంలా ఉండేకాని, యెక్కడా మనిషి ఆకారం కనుపించిందికాదు. కపాలపుసైజూ, విశాలతనూబట్టి కోతికన్నా, పితకాంత్రోపస్ యెక్కువ తెలివిగలవాడని స్పష్టంగా తెలుస్తోంది.

తొడ ఎముకమీద కాలికండరాల గుర్తులు కనిపెట్టాడు డ్యూబాయ్. ఆ గుర్తులనుబట్టి, పూర్తిగా నాలుగుకాళ్ళ మృగంలాగా నడవటం మానకపోయినా, ఏదో ఒక విధంగా, నడక నేది నేర్చుకున్నట్లు గ్రహించాడు.

గూనినడుమూ, వంగినమోకాళ్లూ, పొడుగైన చేతులూ ఇరుప్రక్కలా వ్రేలాడుతూ పితకాంత్రోపస్ అడవుల్లో తిరిగేవాడు. ఆతని ఎత్తుకనిబొమ్మలక్రింది నేత్రాలు ఎప్పుడూ

ఏదన్నా తినేటందుకు దొరుకుతుందేమోనని నేలను పరీక్షిస్తూ ఉండేవి.

ఆ జీవి కోతికాదని స్పష్టంగా తెలిసినా, మరీ మనిషి ఆకారమూ దానికి లేదని విశదమవుతోంది. దానికి పితకాంత్రోపస్ అనే పేరు డ్యూబాయ్ పెట్టాడు.

ఇంతటితో ఆతనిపని పూర్తికాలేదు. ఎంతో కష్టపడి నేలను త్రవ్వి ఆ యెముకలను కనిపెట్టడం ఒక యెత్తున్నూ, ఏ విధమైన ఋజువు చూపించినా, మనిషికీ, కోతికీ యెట్టి సంబంధమూ లేదనే మూఢ విశ్వాసాన్ని తొలగించటం యింకో యెత్తూన్నూ అయింది అతనికి. బాగా చదువుకొన్న గొప్ప శాస్త్రజ్ఞులు డ్యూబాయ్ కనిపెట్టిన కపాలపు యెముక గిబ్బన్ కోతిదన్నారు. తొడయెముక యీ కాలపు మనిషిదన్నారు. ఇంతేకాక, ఆ యెముకలు డ్యూబాయ్ అనుకొన్నట్లు పురాతనపువి కావన్నారు. "ఈ మధ్య కాలంలో చనిపోయిన యెవరి యెముకలో అవి" పొమ్మన్నారు చదువుకొన్నవాళ్ళంతా.

కానీ, డ్యూబాయ్ కనిపెట్టిన ఆ యెముకల ప్రాముఖ్యతను గ్రహించినవాళ్ళు కొద్దిమందైనా లేకపోలేదు. లోకమంతా కాదంటూంటే పదిమంది మాత్రం ఔనంటే యేం లాభం? గిబ్బన్ కోతుల కనుబొమ్మలు తాను కనిపెట్టిన కపాలంలో మాదిరి అంతయెత్తుగా యెన్నటూ ఉండవని డ్యూబాయ్ వాదించాడు. కాని, అతనిమాటలన్నీ జనులు పెడచెవిని పెట్టటంచూచి పితకాంత్రోపస్ యొక్క పూర్తి అస్థిపంజరం సంపాదించాలని ఆతడు నిశ్చయించుకొన్నాడు.

తిరిగీ, బెంగావన్ నదితీరానా, దాని లోయల్లోనూ వెదకటం ప్రారంభమైంది. అట్లా ఐదుసంవత్సరాలు గడిచాయి. ఆ నదీతీరంలో వసించిన పురాతనమృగాల యెముకలు మూడువందల పెట్టెలనిండా ఐరోపాకు వెళ్ళాయి. ఆ యెముకలను శాస్త్రజ్ఞులు పరిశీలించి, ఏ జంతువు యెముకలా జంతువు ప్రకారం వేరుచేశారు. ఇంత పెద్ద యెముకల కుప్పలోను పితకాంత్రోపస్‌వి మూడు తొడయెముకలుమాత్రం దొరికాయి చివరకు.

ఇట్లా కొన్ని యేండ్లు గడిచిపోయాయి. పితకాంత్రోపస్ విషయం క్రొత్తగా ఏదీ తెలిసిందికాదు. ఉన్నట్లుండి యొక శాస్త్రజ్ఞుడు తిరిగి కొన్ని యెముకలు త్రవ్వి తీశాడు. వానిని చూస్తే పితకాంత్రోపస్‌కూ, మనిషికీ మధ్యస్థంగానుండే యింకో జీవి యెముకల మాదిరి అవి కనిపించాయి.

నలభై ఏండ్లక్రితం శాస్త్రజ్ఞ డాకడు చీనాలోని పీపింగ్ నగరంలో ఏదో మందుకావాలని ఒక అంగడికి వెళ్ళాడు. ఆ దుకాణంలో ఏవేవో రకరకాల వస్తువు లమ్మకానికున్నాయి. మనిషిఆకారంగల చెట్టు వేరొకటుండింది; అది సర్వరోగ నివారిణట ; రకరకాల జంతువుల యెముకలూ, దంతాలూ, తాయెత్తులూ, రక్షరేకులూ, యేవేవో ఆ దుకాణంలో అమ్మకానికి పెట్టారు.

ఆ దంతాలలో ఒక దంతం, మన శాస్త్రజ్ఞుని దృష్టి నాకర్షించింది. అది మనకాలపు మనిషిదీకాదు; జంతువులదీ కాదు. ఈ దంతాన్ని కొని, ఐరోపా వస్తు ప్రదర్శనాలయానికి పంపాడు. దానికి "చైనాపన్ను" అని పేరుపెట్టి భద్రపరిచారు.

ఇరవై యేండ్ల పిదప, పీకింగ్ పరిసరాల్లో ఒక గుహాలో అట్లాంటివే రెండుదంతాలు దొరికాయి. ఆ గుహాపేరు చౌ - కౌ - తీన్ ! ఇంకా కొంతకాలానికల్లా ఆ దంతాలకు చెందిన మనిషియొక్క యితర ఎముకలు కొన్ని దొరికాయి. మొత్తం మీద యూభై పళ్ళూ, మూడు కపాలాలూ, పదకొండు దవుడ యెముకలూ, తొడయెముకభాగం కొంతా, ఒక వెన్నుపూసా, కంటియెముకా, మణికట్టుపూస యొకటీ, పాదం యెముక ముక్క యొకటీ—ఇవన్నీ దొరికాయి ఆ గుహలో.

దీన్నిబట్టి ఆ గుహలో వసించిన మనిషికి మూడుతలలూ, ఒక్క కాలూ ఉండేవని అనుకోరాదు. ఆ గుహలో అట్లాంటి మనుష్యులు అనేకమంది నివసించి యుండేవారనీ కాలగతిని వారి యెముకల్లో చాలాభాగం మట్టిలో కలిసిపోయాయనీ అనుకోవాలి. ఒకవేళ యేవైనా మృగాలు ఆ ఎముకల నెత్తుకు పోయాయేమో ? మిగిలిన ఆ యెముకలనుండి ఆ గుహాయందు వసించిన వారెట్లుండేవారో గ్రహించవచ్చు. వారికి "సైనాం త్రోపస్" అని శాస్త్రజ్ఞులు పేరుపెట్టారు ("సైనా" అంటే చైనా).

ఈ సైనాంత్రోపస్ యెట్లుండేవాడు ? ఏ యే పనులు చేసేవాడు ?

మొట్టమొదట్లోనే ఇచ్చట ఒక్కవిషయం చెప్పాలి ; ఆతడే మంత మన్మధాకారుడు కాడు. ఒకసారిచూస్తే ఇంకా చూడాలని పించేది కాదు.

ముందుకు త్రోసుకవచ్చిన మూతీ, పొడుగ్గా, కోతి లాగా బొచ్చుచేతులూ భయంవేసేది అతన్నిచూస్తే. అసలు

జీవిని 'అతను' అనటం తప్పేమో! కోతిలాగానే ఉండేవాడు నిజానికి దూరాన్నుండి చూస్తే. కాని ఏ కోతీ చేయలేనిపని నడక అతనికి తెలుసు. అతని మెడనూ గూనిగాఉన్నా నిలబడి నడవడమూ చూస్తే ఆ జీవి మనిషే అని ఇంకో సందేహం కలుగుతుంది.

ఈ సైనాంత్రోపస్‌తో గుహలోకి వెళ్ళిచూద్దాము. అతడెట్లా జీవిస్తాడో తెలుసుకోడానికి వంకర కాళ్ళమీద ఇటూ అటూ ఊగిసలాడుతూ గుహను ప్రవేశిస్తాడు. ఉన్నట్లుండి క్రిందనున్న సుకామీద కూర్చుంటాడు. పెద్దరాయొకటి వాడి కగుపించింది. దాన్ని చేత్తో తీశాడు. జాగ్రత్తగా పరీక్షించి యింకోరాతితో దాన్ని కొట్టి, తనతో తీసుకు వెడతాడు గుహలోకి.

ఆతనివెంట పోగాపోగా, ఏదో దిబ్బమాదిరి, ఎదురుగా ఎత్తుగా భూమి కనిపిస్తుంది. ఆ దిబ్బకో ప్రక్క గుహద్వారం ఒకటుంది. దాని దగ్గర ఇతనిమాదిరివారే చాలామంది గుమి గూడివున్నారు. ఒడలంతా బొచ్చూ, బిరుసుగడ్డమూ, గలవా డొకడు, ఏదో ఒక రాతిపనిముట్టుతో చనిపోయిన జింక నొక దానిని ముక్కలుగా కోస్తున్నాడు. ఆడవాళ్ళు అతని ప్రక్కనే నిలబడి, గట్టిగా చేతులతో పీకి, ఆ మాంసమును చిన్న ముక్క లుగా చేస్తున్నారు. పసిపిల్లలు ఆతురతతో, "ఒక్కముక్క ఇయ్యావుటే అమ్మా" అన్నట్లు చేతులు జాపుతున్నారు. గుహలో వెలిగే పెద్దమంటయొక్క కాంతులలో వాళ్ళందరూ వికృతంగా కనిపిస్తున్నారు.

ఇదంతా చూడగా యీ సైనాంత్రోపస్ మృగంకాదు, మనిషేనని మనం నిశ్చయించుకుంటాము. రాతి పనిముట్లు చేయటమూ, మంట చేయటమూ యేకోతికీ చేతకావు.

అయితే, సైనాంత్రోపస్ రాతితో పనిముట్లు చేసేవాడనీ, మంట చేసేవాడనీ నీ కెట్లా తెలుసని, నీవు అడుగవచ్చు.

చౌ-కౌ-తీన్ గుహను జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ విషయం తెలిసింది. ఆ గుహను త్రవ్వగా యెముక లేకాక ఇంకా ఇతర వస్తువులు బయటపడ్డాయి. పెద్ద బూడిద కుప్పయొకటీ, దాని చెంత రాతిపనిముట్ల గుట్టయొకటీ కనుపించాయి. ఆ బూడిద కుప్ప ఇరవై మూడు అడుగుల ఎత్తుంది. రెండు వేలను పైబడి రాతిపనిముట్లు కనుపించాయి.

దీన్నిబట్టి సైనాంత్రోపస్ జనులు కొన్ని యేండ్లతరబడి ఆ గుహలో నివశించారని తెలుస్తోంది. వాళ్ళకి నిప్పు వెలిగించటం తెలియకపోవచ్చు. అడవిలో ఏదైనా ఒకచోట మంట సహజంగానే మండుతోంటే, ఒకటి రెండు మండే చితుకులు తమ గుహకు తీసుకుపోయేవారు కాబోలు. ఆ మంట ఆరిపోకుండా గుహలో దాన్ని పోషించేవారు. ఇట్లా ఎన్ని సంవత్సరాలో కాలిన కట్టెల బూడిద ఆ గుహలో పాతిక అడుగుల యెత్తుకు చిన్న దిబ్బలాగా యేర్పడిపోయింది.



# కాలిజాడలు

ఇంతవరకూ మానవుడు తనకందుబాటులో నుండే కాయలూ, దుంపలూ మాత్రం తిని జీవించేవాడు. కాని, రాతి పనిముట్లు కనిపెట్టడంచేత అట్టి ఆహారం దగ్గరగా లేకపోయినా, వేరే క్రొత్తచోట్లకు వెళ్ళి సంపాదించవలసినా, అతనికంత కష్టమనిపించలేదు. అడవులువదలి బయళ్ళలో యీఆహారానికని వెతికేవాడు; అవసరమైనపుడు ఇతర మృగాలనుండి వానిని బెదరించి, వాని ఆహారపదార్థాలను కూడా తీసుకోగలిగాడు.

## మానవుడు క్రొత్తదారి త్రొక్కుతాడు

ప్రతిజీవీ తన పరిసరాలకూ, దాని నాక్రమించియుండే సహజ పరిస్థితులకూ, కంటికి కనుపించని గొలుసులతో కట్టి వేయబడియుంటుందని మనకు తెలుసు. కాని, రానురాను మానవుడు ఆ కట్లను వదిలించుకోగలిగాడు. చెట్లలో వసించే వాడు నేలమీద తిరగటం నేర్చాడు. అంతకుపూర్వ మేజీవీ చేయని క్రొత్తపని – కాళ్ళమీద నిలబడి, చేతుల సహాయం లేకుండా నడవటం – ఆతను నేర్చాడు. అంతకుముందెన్నడూ అలవాటులేనివీ, ఆతడెన్నడూ తింటాడని అనుకోనివీ క్రొత్త

రకాల ఆహారపదార్థాలు తినటం మొదలు పెట్టాడు. ఇట్లా ప్రకృతి నిబంధనల నన్నిటినీ తిరస్కరించుటయేకాక, ఆహార లంకెలను కూడా విడగొట్టుకొన్నాడు. మనిషి తాను కొత్త ఆహారవస్తువులు తినుటయేకాక, అంతవరకూ తన జాతివారినే తరిమి తినే ఖడ్గపులినుండి కూడా తప్పించుకోగలిగాడు.

చెట్టుక్రింద ఒకకుక్క "భౌ భౌ" మని మొఱుగుతూ కనిపెట్టుకు కూర్చుంటే ఏ పిల్లీ, యెంత ధైర్యంగలదైనా దిగి రాలేదుగా? ఎన్నో విరోధిమృగాలు నెదుకుతూ తిరుగులాడే భూమిపైకి, చెట్లలోన తన నివాసం నుండి మనుజుడు దిగి రాగలిగాడంటే, ఆతనికెంత ధైర్యం కలిగిందో ఊహించుకో. ఇంత సాహసానికి కారణం యేమైయుంటుంది?

ఆహారసంపాదనకు రాళ్ళనూ, చిన్న కఱ్ఱలనూ, పెద్ద గదలనూ ఆతనుపయోగించాడుగా? ఆ పని కుపయోగించిన రాళ్ళే, ఆ గదలే మానవుని ఆత్మ రక్షణకూ ఉపయోగపడ్డాయి. శత్రువిజయానికి కావలసిన పరికరాలుగా వాని నుపయోగించ నేర్చాడు! కాబట్టి ధైర్యానికి. ఆతనికి కొరతయెందుకు?

ఎప్పుడూ పదిమందిచేరి తిరుగుతూ ఉండబట్టీ, ఈ ఆయుధాల మూలానా, ఎంతెంత అడవిజంతువులనైనా ఆ జనులు తరిమివేసేవారు. ఇంకా, అతనికి మంటచేయటం తెలుసుగా? దాన్ని ప్రయోగించీ జంతువులను హడల గొట్టేవాడు. ఈ విధంగా క్రొత్తదారులు త్రొక్కడానికీ, ఇతర జీవుల బంధించే శృంఖలాలనుండి విముక్తి చెందడానికీ క్రమేపీ మనుజుడు నేర్చుకొన్నాడు.

## కాలిజాడలు

చెట్లనుండి నేలకూ, అరణ్యంనుండి నదీలోయలకూ, ఇట్లా మానవుడు వ్యాపించటం ప్రారంభమైంది. అతడు నదీలోయలకు వెళ్ళాడని మనకెట్లా తెలుసు? ఆతని కాలిజాడలేవైనా అచ్చట ఉన్నాయా? ఉన్నాయనే బదులు చెప్పాలి.

ఐతే, యింతకాలంవరకూ ఆతని కాలిజాడలు, పాదగుర్తు లెట్లా నిలిచి ఉంటాయూ అనే సందేహం కలుగుతోంది. నీకు. ఔనా?

'కాలిజాడ' లంటే నిజంగా కాలిజాడలు లేవు. వానిని "అరచేతిగుర్తు" లనటం బాగుంటుంది. దీన్నిగురించి విశదంగా చెప్పాలి.

ఫ్రాన్సులో సోమ్ అనేనది ఉంది. సుమారు నూరేండ్ల క్రితం కూలీలు ఆ నదీ లోయలో పనిచేస్తూ త్రవ్వారు. ఎప్పుడో పూర్వపురోజుల్లో నదీజలం తీసుకువచ్చి దిగవిడచిన యిసుకా, ఒండ్రుమట్టీ, గులకరాళ్లూ, అన్నీ పెకలించారు.

ఈ సోమ్‌నది పుట్టిన క్రొత్తరోజుల్లో, నీరు బహు వేగంగా ప్రవహించేది. ఆ నీటిప్రవాహానికి పెద్దరాళ్ళు కొండలనుండి ఊడి దాంట్లో దొర్లుకుపోయేవి. రాయీ, రాయీ ఢీకొనీ, నీటి రాపిడికీ, గట్టుకు ఒరసుకుపోయీ, అవన్నీ పగిలి, చెదరి అరిగి, నున్నగా, గులకరాళ్ళుగా మారాయి. ఆ చిన్న రాళ్ళనూ, రాతి ముక్కలనూ లోయలో దిగజార్చి, క్రమంగా వానిని యిసుకతోనూ, ఒండ్రుమట్టితోనూ పూడ్చుతూ వచ్చాయి నదినీళ్ళు.

ఈ యిసుకలోనూ, మట్టిలోనూ త్రవ్వుతూంటే ఆ జనానికి కొన్ని విచిత్రమైన రాళ్ళు కనుపించాయి. అవేమీ అంత నున్నగా లేవు; రెండు ప్రక్కలా చెక్కబడినట్లు తోచింది వాని రూపంచూస్తే. ఐతే, వీని నెవరిట్లా చెక్కియుండాలి? ఇట్లా నది యెన్నటికీ అరగదీసి ఉండదని ఒప్పుకోవాలి. రాళ్ళను అరగదీసి నున్నగా చేస్తుందేగాని, ఈ మాదిరి రెండు ప్రక్కలా చెక్కినట్లు చేయలేదు నది.

ఈ చిత్రమైన రాళ్ళను ఆ ప్రాంతంలో వసించే ఒక శాస్త్రజ్ఞుడు తీసుకుపోయి దాచాడు. అతని పేరు బౌచర్ డి పర్తిస్. సోమ్‌నది లోయలోనూ, దానిగట్టు పొడుగునా దొరికిన అనేక పురాతన వస్తువుల నితడు తన యింట్లో దాచి వుంచేవాడు. పురాతనపు ఏనుగుల దంతాలూ, ఖడ్గమృగాల శృంగాలూ, గుహ యెలుగుబంట్ల శిరోభాగాలూ, ఇట్లా యెన్నో రకాలవస్తువులను సమకూర్చి, వానిని పరిశీలిస్తూ ఉండేవాడు. ఈ రోజుల్లో గొఱ్ఱెలూ, బాతులూ ఈ నదీ తీరానికి వచ్చేటట్లే, దాని నీరు త్రాగాలని పూర్వం ఖడ్గమృగాలవంటి పెద్దజీవులు వచ్చేవి.

ఇన్ని పురాతన జీవుల యెముకలూ దొరికాయేగాని, పురాతన మానవుని యెముక ఒక్కటైనా ఆతనికి కనుపించ లేదు. పాపం! చాలా వెతికాడాయన.

ఇట్లా ఉంటూండగా పై చెప్పిన విచిత్రమైన చెక్కడపు రాళ్ళు దొరికాయి. వెంటనే సరే, ఇవి పూర్వపు మనుష్యుల చేత చెక్కబడి, ఆ పనికీ యీ పనికీ ఉపయోగింపబడిన రాళ్ళని అతడు నిశ్చయించుకొన్నాడు. ఆ పురాతనకాలపు రాళ్ళు

అట్లాగే యెట్టిమార్పులూ చెందక ఆతనికి దొరికాయని అనుకో రాదు. వాటిలో యేదోకొంత మార్పు కలిగి యుండాలి కాలగతిని.

బౌచర్ డి పర్తిస్ తాను కనుగొన్న యీ రకరకాల జంతువుల యెముకలూ, రాళ్ళూ మొదలైనవన్నీ పరిశీలించి యొక గ్రంథం వ్రాశాడు. "సృష్టిని గురించి ప్రాణులపుట్టుకా; వాని అభివృద్ధి" అనే పేరు దానికి పెట్టాడు.

ఈ పుస్తకం వెలువడిందో లేదో, బ్రహ్మాండంగా గల్లంతు బయలు దేరింది. ఆరితేరిన శాస్త్రజ్ఞులంతా, నిన్నకాక మొన్న కండ్లుతెరచిన యీ బౌచర్‌కు శాస్త్రం అణుమాత్రమూ తెలియదు. అతని రాతిగొడ్డళ్ళు నిజంగా మట్టిలో దొరికినవికావు; అని పూర్వం డూబాయ్‌ని అల్లరిపెట్టినట్లే, ఇతన్నీ వేధించారు. క్రైస్తవ మత ప్రబోధన కాగ్రంథం విరుద్ధమనీ, దాన్ని నిషేధించాలనీ మొదలు పెట్టారు.

బౌచర్ తన పట్టుదల వదలకుండా పదిహేను సంవత్సరాలు తన గ్రంథాన్ని సమర్థించుకొంటూ పనిచేశాడు. పెద్దవాడయ్యాడు, జుట్టంతా నెరసిపోయింది. కాని అతని హృదయంలోని పట్టుదల కొంచమైనా చలించింది కాదు. మొదటి పుస్తకంతో ఊరుకోకుండా, అట్లాంటిదే రెండోదీ, మరల మూడోది యింకొకటీ అతను వ్రాశాడు.

ఇట్లా, నలుగురూ యేకమై అతని కెదురు తిరిగినా, నిర్భయంగా బౌచర్ తన యుద్దేశాలను వ్యాపింపచేయాలని శ్రమపడే రోజుల్లో యిద్దరు భూగోళ శాస్త్రజ్ఞులు సోమ్‌నదిదగ్గర త్రవ్వబడిన గుహాల పరీక్షించాలని వచ్చారు. వారి పేర్లు

లయెల్, ప్రెస్‌విచ్. గుహాలూ, సారంగాలూ పరీక్షించారు. బౌచర్ చేర్చి పెట్టిన వివిధ వస్తువులూ తనిఖీచేశారు. పూర్వం ఖడ్గమృగాలూ, ఏనుగులూ ఆనదీలోయలో విహరించే రోజుల్లో, మానవునిచే తయారుచేయబడిన రాతిపనిముట్లే, బౌచర్ కనుగొన్న రాళ్ళు అని నిర్ధారణచేశారు.

తరువాత, లయెల్, "మానవుని పురాతన గాథకు భూగోళశాస్త్ర సంబంధమైన నిదర్శనాలు" అనే గ్రంథం రచించాడు. దాంతో, బౌచర్ యొక్క శత్రువులందరూ కుక్కిన పేనుల్లాగా, గప్‌చిప్‌మని ఊరుకొన్నారు. అటువంటి పురాతన రాతిపనిముట్లు చాలాచోట్ల యిదివరకే దొరికాయనీ, బౌచర్ కొత్తగా యేదీ కనిపెట్టలేదనీ, వింతవాదం లేవదీసి, తమకు జరిగిన పరాభవాన్ని కప్పిపుచ్చాలని యత్నించారు.

"కొత్తగా యేదన్నా శాస్త్రవిషయం కనిపెట్టబడితే అది మొదట్లో మత విరుద్ధమనటమూ, తరువాత యిదేమీ కొత్తసంగతి కాదూ, దీన్ని గురించి యిదివరకే అందరకూ తెలుసు అనటమూ, యిటువంటివారి కలవాటేగా!" అని లయెల్ వారి నందరినీ పరిహసించాడు.

పర్తిస్ కనిపెట్టిన తరువాత, నదీ లోయల్లో రాళ్ళూ, మన్నూ త్రవ్వుతోంటే అటువంటివే, ఇంకా యెన్నో రాతిపని ముట్లు ఎందరో కనిపెట్టారు.

నవీన నాగరికుని ఆయుధాలైన, పారలూ, గునపాలూ నేలను త్రవ్వి, పూర్వీకుని ప్రథమ ఆయుధాలను బయటకు తీస్తాయి! కాలచక్రం ఎట్లా తిరుగుతుందో, తమాషా! చెక్క

బడిన రాతిగొడ్డళ్ళప్రక్క, ఆ ప్రదేశంలోనే చెక్కి వేయబడిన చిన్న రాతిముక్కలూ దొరికాయి గుంపులు గుంపులుగా.

ఈ రాతి ఆయుధాలే మానవుని అరచేతి గుర్తులని మొదట్లో వ్రాసింది. ఈ గుర్తులమూలానే మనుజుడు నదీ లోయలను సాగిపోయాడని తెలుస్తోంది. మృగాలన్నీ ఆహారానికీ తమ గూళ్ళు కట్టుకోనూ వస్తువుల నన్వేషిస్తే, మనుజుడు ఉలులూ, సుత్తులూ తయారుచేయడానికి యీ లోయల్లో వెతుకుతూ తిరుగాడేవాడు.

## జంతువులూ - వాని పనిముట్లూ

జంతువులలో అనేకరకాల పనులు చేయగలవి ఎన్నో ఉన్నాయి. తాపీపనీ, వడ్రంగమూ, దర్జీపనీ, బట్టనేతా, ఇట్లా యెన్నివిధాలపనులో చేయగల జంతువులున్నాయి. బీవరనే జంతువు తన పదునైన పండ్లతో ఎంతెంత వ్రానులనైనా చక్కగా కట్టెలు కొట్టేవాళ్ళమాదిరి అడుగున చుట్టూకొరికి పడవేస్తుంది. దానిని తరువాత తనకు కావలసిన సైజుకు ముక్కలుగా కొరికి దొర్లించుకుపోయి, నీటి ప్రవాహాల కడ్డంగా వంతెనలు కట్టుతుంది. నది నీరు అక్కడ నలుప్రక్కలా విస్తరించి చిన్న చెరువేర్పడుతుంది.

ఎఱ్ఱచీమలు సాధారణంగా మామిడితోపులలో ఉంటాయే అవెంతో విచిత్రంగా జీవిస్తాయి. వానిలో పరిచారికలూ, సైనికులూ వ్యవసాయదారులూ ఇట్లా ఎన్నిరకాలో ఉంటాయి ఒక్కొక్క కలుగులో.

ఇట్లాచెప్తే మనకొక ధర్మసందేహం బహుశ కలుగుతూంది. కొంతకాలానికి యీ బీవరులూ, చీమలూ బాగా

వృద్ధిచెంది మనుష్యులంత తెలివిగా మారిపోతాయేమో? ఎవరు చెప్పగలరు! కొన్ని లక్షలఏండ్ల పిదప వార్తాపత్రికలు చదివే చీమలూ, ఫ్యాక్టరీల అధికారులూ, విమానాల నడిపే చీమ నైమానికులూ, రేడియోపాటలూ, ఉపన్యాసాలూ మొదలైన పనులలో ఊపిరిసలుపని గాయిక చీమలూ, తయారుకారాదా?

లక్షలయేండ్లు కాదుగదా కోటానుకోట్ల యేండ్లు గడచినా యెన్నటికీ అట్లా జరుగదు. ఎందుకంటే చీమలకూ మానవులకూ ముఖ్యభేద మొకటుంది.

అదేమిటో తెలుసా!

చీమకన్నా మనిషి యెంతో పెద్దవాడా? ఉహూఁ, కాదు. ఐతే చీమకు ఆరుకాళ్ళూ, మనిషికి రెండు, ఇదా? అదీకాదు. ఐతే మరేమిటీ?

మానవుడు పనిచేసే విధానమే, యీ ముఖ్యభేదం. మనిషి యేపనిచేసినా, యేదోయొక పనిముట్టు నుపయోగిస్తాడు. పారో, గొడ్డలో, సుత్తో ఇటువంటివాసిని. కాని చీమలట్లా పనిముట్ల నెన్నడూ ఉపయోగించలేవు. దేన్నన్నా రెండు ముక్కలు చేయాలంటే దానికి త్రెరవంటి దవుడలతో కొరుకుతుంది. చిన్న కాలువలాగా త్రవ్వాలంటే, దానిపాదాల చివర గల పారలవంటి భాగాల నుపయోగిస్తుంది. దానిముందు రెండు పాదాల చివరలు పారల్లాగా ఉంటాయి. అదేమాదిరి వెనుక రెండుకాళ్ళూ ఉంటాయి. ముందువేళ్ళతో మన్ను త్రవ్వు తుంది. వెనుకకాళ్ళు దానిని ప్రక్కకు చిమ్మేస్తాయి. మధ్య

కాళ్ళమీద, చీమకారు కాళ్ళుంటాయిగా!—ఈ పనులుచేస్తూ ఊతగాని నిలబడుతుంది.

చీమలపనిముట్లన్నీ వాని శరీరపుటవయవాలే. మనకు మాదిరి ప్రత్యేక పనిముట్లు వానికిలేవు. కొన్ని చీమలగూళ్ళల్లో పెద్ద గుండ్రని జాడీలుంటాయి. మన ఊరగాయజాడీల్లాగా ఇవన్నీ గూటిపైకప్పు నంటిపెట్టుకొని క్రిక్కిరిసి ఉంటాయి. ఉన్నట్లుండి పనిచేసే చీమయొకటి ఈ జాడీల సమీపించి, తన మీసాలతో జాడీని నెమ్మదిగా తాకుతుంది.

జాడీ కదులుతుంది! జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఇది జాడీకాదని తెలుస్తుంది. గుండ్రనిజాడీలాగా కనుపించినది. ఒక చీమయొక్క పొట్ట అంతలావుగా అది ఊరియుంటుంది. ఆ పొట్టకొకచివర, ఇతర చీమలకు మాదిరేతలా, మరో చివర తోకా ఉన్నాయి. ఈ చీమలు గూటిపైకప్పును పట్టుకొని వేలాడుతూంటాయి. పనిచేసే చీమ ఈ జాడీ చీమను తాకగానే తననోరు తెరుస్తుంది. తీయని తేనెవంటి ద్రవం ఒక్కచుక్కను వెలిగ్రక్కుతుంది. పరిచారిక ఆ పానకంత్రాగి సేదతీర్చు కుంటుంది. తిరిగీ పనిలోనికి వెడుతుంది. యథాప్రకారం మన జాడీచీమ, ఇతర జాడీల్లాగా యింటికప్పు నంటిపెట్టుకొని తపస్సు ప్రారంభం చేస్తుంది.

ఇదీ చీమల జీవితవిధానం. అవి యేవిధమైనపని చేయ వలసినా తమ శరీరపు టవయవలా నాపని చేయడానికి తగినట్లు పెంచుకొంటాయి. వానికి పనిముట్లనేవి లేవు. తేనె సీసాలు కావాలంటే కొన్నిచీమలు ఆ సీసాల్లాగా మారిపోతాయి. వానిపని ఈ తీయని ద్రవం దాచి ఇతరచీమల కీయటమే.

బీవరూ యింతే. చెట్లుమ్రానుల నరికే గొడ్డలి దాని శరీరపు టవయవమేకాని ప్రత్యేక పనిముట్టేదీ లేదు. సృష్టి లోని ఈ జంతువులన్నీ పుట్టేటప్పుడే తమజీవితం సుఖంగా గడవడానికి కావలసిన రకరకాల పనిముట్లతోనూ పుట్టు తాయి. వాటిని తామే ఎన్నటికీ తయారుచేసుకోలేవు.

ఒక విధంగా నీకు యీ జంతువుల పద్ధతే బాగుందా అనిపించవచ్చు. ఎందుకంటే వాని పనిముట్లు యెప్పుడూ వాని దగ్గరే యుంటాయి. కాని పోవు.

బీవరుయొక్క పండ్లు బండబారాయనుకో. వానిని సాన బెట్టాలంటే యేషాపుకు తీసుకువెళుతుంది? చీమపాదాల చివరి పొరలు మొక్కపోతాయనుకో వానిని బాగుచేసే కమ్మరవా డెవడున్నాడు? మనుష్యుని పనిముట్లకు యిటువంటి యిబ్బం దులు ఉండవుగా! ఇట్టి ఆటంకాలున్నాయని గ్రహిస్తే మన మాదిరి కావలసిన ఆయుధాలు చేసుకోగలగటమే మంచిదని తెలుస్తుంది.

## చేయి బదులు పార

మనిషికీ, యితర జంతువులకు మాదిరి కావలసిన పని ముట్లుగా అతని శరీరపుటవయవాలే ఉపయోగపడితే యెట్లా ఉంటుంది. అతని జీవితం? అంటే కొయ్యవీ, ఇనుపవీ, ఉక్కువీ, యిప్పటిలాగా అతనికేవిధమైన పనిముట్లూ లేవనుకొందాము.

పాతవి పాడైతే మార్చుకోడానికి వీలుండదు. క్రొత్తవి కొనడానికి అమ్మేవాళ్ళుండరు. ఏదన్నా త్రవ్వడానికి అతని అరచేయి పారమాదిరి పెఱుగుతేనేగాని వీలుండదు.

తమాషాకి ఇట్లా పారచేతితో యెవడన్నా పుట్టాడను కొందాము. వాడు బహు చక్కగా, చమత్కారంగా త్రవ్వ గలడనడానికి ఎట్టి సందేహమూ ఉండక్కరలేదు. కాని యీ త్రవ్వటం మెట్లాగో వాడెవరికీ నేర్పలేడు. నీకు బహు స్పష్టంగా ఎంతదూరపు వస్తువులనైనా చూడగల నేత్రాలున్నాయనుకో. ఇది నాకు నేర్పటం నీకు యెన్నటికీ వీలుండదు.

వాడెక్కడికి వెళ్ళినా యీ పారచేయి వాడితోనే వెడుతుంది. ఇతర యేసనికీ ఆచేయి పనికిరాదు. వాడు చనిపోతే ఆచేయీ వానితో బూడిదవుతుంది.

ఇతని పారచేయిలాగా ఇతని పిల్ల లెవరన్నా అట్టి చేతితో పుట్టుతేనే తప్ప ఈ శక్తిని యితరులకీయడానికి వీలుండదు. ఇట్లా యేదన్నా ఒక అవయవం వంశపారంపర్యంగా నిలిచి ఉండాలంటే అది ఆ జీవుల కుపయుక్తమైందిగా ఉంటేనే గాని సాధ్యపడదు! ఉపయోగం లేని అవయవాలు, క్రమంగా నశించి రూపుమాసిపోతాయి. మనుష్యుడు కలుగుల్లో జీవించే ప్రాణిగావుంటే అతనికి పారచేయి యెంతో పనికి, వస్తుంది. అప్పుడు వంశక్రమంగా ప్రతిబిడ్డా అట్టిచేతితో పుట్టుతుంది. భూమిపైన మన మాదిరి వసించే జీవికి అటువంటి భూమిపైన, మన చేయి ఉంటే యేమీ లాభముండదు.

ఇన్ని రకాల విషయాలమీంద క్రొత్తమానిరి అవయవాలు తయారుకావటం ఆధారపడియుంటుంది. మనుజుడు పారచేతినీ పెంచుకోలేదు; పారలూ, కత్తులూ, గొడ్డళ్ళూ యింకా యెన్నెన్నోరకాల పనిముట్లూ అతను చేసుకొన్నాడు— తన చేతితో

తన పూర్వీకులనుండి వచ్చిన ఇరవై(వేళ్ళూ, ముప్ఫై రెండుపళ్ళకూ వేలకొలది పనిముట్లు అతను సహాయకరంగా నిర్మించుకొన్నాడు. అదీ మానవునకూ, జంతువులకూ గల ముఖ్యభేదం.

ఇందుమూలానే ఏ యితర మృగాలూ ఇతనిమాదిరి మారలేవు. ఎన్నటికీ యీ జీవితం ఒక పరుగుపందెమువంటిది. ఈ పందెంలో పాల్గొనని ప్రాణే లేదు. కాని అన్నిటికీ ముందు పరుగిడేది యెవరో తెలుసా?—మానవుడు.

మనిషీ - నడులూ

మొదట్లో మనిషిగా మారేటప్పుడు, మానవుడు తనకు కావలసిన రాతి పనిముట్లు తానే చేసుకోలేదు. నదీతీరాన అరిగి నున్నవై వేర్వేరు రూపాలుగా మారిన రాళ్ళను ఆతను వెదకి తెచ్చుకొనేవాడు. ఏవో కాయలూ, పూవులూ కోసి తెచ్చేటట్లు, ఈ రాళ్ళను ఏరి తెచ్చేవాడు. నది నీరు యిటూ, అటూ రాళ్ళను దొర్లించి, కొట్టి, అరగదీసి చిత్ర విచిత్ర రూపాలుగా చెక్కి యెన్నింటినో కుప్పతిప్పలుగా పడ వేసేది. వానిలో కొన్నే అతనికి వచ్చేవి పనిముట్లుగా.

క్రమంగా మానవుడు తానే అట్టి రాళ్ళను తయారు చేయటం మొదలుపెట్టాడు. లోకంలో సహజంగా దొరికే వస్తువులతో ప్రారంభించి, క్రమంగా తానే తనకు కావలసిన వస్తువుల తయారుచేసుకొన్నాడు. లోహాలు మొదట్లో ముద్ద లుగా అతనికి దొరికేవి. వానిని కరిగించటం నేర్చుకొని, తరువాత అనేకరకాల పనిముట్లు చేసుకొన్నాడు. ఇట్లా నూతన విధంగా పనిముట్లుచేయటం నేర్చుకొలదీ, సృష్టిమీద మానవునకు

ఒకవిధమైన అధికారం చేజిక్కింది. సృష్టిలోని యితరజీవుల్లాగా, సృష్టిమీదా, అందుండే శక్తులమీదా ఆధారపడే బదులు, మనిషి కొంచెం కొంచెం స్వేచ్ఛను సంపాదించుకో గలిగాడు.

ఏదన్నా ఒక రాయి తీసుకొని యింకోదానితో దానిని కొట్టేవాడు. క్రమంగా ముక్కలుగా ఊడిపోయి, మొదటిరాయి ఏదో ఒక గొడ్డలి మాదిరో, ఉలిమాదిరో తయారయ్యేది. చెక్కబడిన ముక్కలలో పొడవైన పదునైనవాటిని తీసుకొని దేన్నన్నా కోయడానికీ, పైపెచ్చు గీచివేయడానికీ, చిన్న రంధ్రాలు పొడవడానికీ ఉపయోగించేవాడు.

భూమినుండి త్రవ్వబడిన బహు పురాతన రాతిపనిముట్లు యెన్నో ఉన్నాయి మన వస్తుప్రదర్శనశాలల్లో. వీని రూపాల బట్టి వీనిని మనుష్యులు చేశారో, లేక నదీ నీరూ, ఎండా, వానా, ఇవన్నీ కలిసి అరగదీసి యిట్లా యీ రాళ్ళను తయారు చేశాయో చెప్పటం కష్టం.

వీని విషయం ఇట్లా వుండగా, నదుల ఒడ్డున త్రవ్వబడిన రాతి పనిముట్లు అనేకం నిస్సందేహంగా మనిషి చేసినవేనని విశదమవుతోంది. ఆ చోట్లల్లో పూర్వం యేదో రాతిపనిముట్ల ఫ్యాక్టరీ ఉండేదా అన్నట్లు ఎన్నెన్నో పనిముట్లు ఇసుక, బంక మన్నుల అడుగున కుప్ప తిప్పలుగా దొరికాయి.

ఇటువంటి పనిముట్లను చూస్తే ఏదో ఫలానాపనికి ఉపయోగపడాలనే ఉద్దేశంతో మనిషి వానిని చెక్కినట్లు విశదమవుతుంది. మొదట్లో సృష్టిలో దొరికే వస్తువులతో ప్రారంభించి, క్రమంగా తన మనసునందుండే ఉద్దేశం ప్రకారం వానిని మార్చుతూ, క్రొత్త పనిముట్లు నిర్మిస్తూ, మనిషి ముందుకు

తన జీవితయాత్ర సాగించాడు. అడుగడుగుకూ యితర జీవులకు లేని కొత్త స్వేచ్ఛను సృష్టించుకోగలిగాడు. క్రొత్తగా ఎవరన్నా మంచుమయమైన కొండశిఖరానికి యెక్కాలంటే, మంచు గడ్డల్లోతో మంచులో మెట్లు చెక్కాలి. ఒక్కొక్క మెట్టుగా చెక్కుతూ, పైపైకి యెక్కుతూ వెళ్ళాలి. అట్లాగే మానవుడు తన విజయసౌధానికి క్రమంగా మెట్లు చెక్కుకొంటూ, పైకి యెక్కుతూ వెళ్ళటం ప్రారంభించాడు.

## వీ రే శ లిం గం చ రి త్ర

అంటే ఇచ్చట వీరేశలింగంగారిని గురించి వ్రాస్తామని అనుకోవద్దు. ఈయన పేరు మనలో చాలమంది వినియున్నారు. ఈయన జీవితచరిత్ర అనగానే, ఆ పుస్తకంలో ఏయే విషయాలుంటాయో అందరకూ తెలుసు.

ఈయన ఫలానా ఊరులో, ఇన్నో సంవత్సరం, నెలా, తారీఖున ఇన్ని గంటలకు పుట్టాడని స్పష్టంగా అందులో వ్రాయబడి యుంటుంది.

మన గ్రంథం ఇప్పటికి 67 పుటలు అయింది. కానీ, ఇంతవరకూ మన పూర్వీకుడైన మనిషి ఎచ్చట పుట్టిందీ చెప్పబడలేదు. అంతవరకెందుకు? అసలు అతని పేరేమిటో కూడా మనం సరిగా చెప్పాము కాము. ఒకసారి "కోతిమనిష"నీ, ఇంకోసారి "సగంమనిషనీ," ఇంకా కొన్ని చోట్ల ఊరికే "మన పూర్వీకుడనీ" ఏవేవో పేర్లు పెట్టాము అతనికి.

ఈ అయోమయ వ్రాతకు తగిన కారణం లేకపోలేదు. అది కొంచెం విశదీకరించాలి.

పేరువిషయం : అతనికి ఏదోయొక ప్రత్యేక నామకరణం చేద్దామని యెంత యత్నించినా వీలుకాకుండాఉంది. ఎందుకంటే అతని కెన్నో పేర్లున్నాయి. ఫలానావారి జీవితచరిత్రఅంటే పుట్టింది మొదలు పెరిగి పెద్దవాడై, చివరకు చనిపోయేవరకూ అతని కా ఒక్క పేరే యుంటుంది. వీరేశలింగం అనే పేరు మధ్యలో వేమన అని మారదు.

కాని, మన పూర్వీకునివిషయం అట్లాకాదు. అతనిని గురించివ్రాసే యీ గ్రంథంలో ప్రకరణ, ప్రకరణానికీ అతనిపేరు మారుతుంది. ఎంత యత్నించినా అతనిపేరు ఇది అని చెప్ప డానికి శక్యంకాదు.

పోనీ, యీ గొడవలన్నీ లేకుండా మొదటినుండే "మనిషి" అని అందామంటే — ఈ కాలపు మానవునీ, పిత కాంత్రోపస్ వంటి సగముకోతీ — సగము మనిషివంటి జీవినీ, "మనిషి" అని అనటం, ఏమంత సబబుగా ఉంటుంది? నీవే చెప్పు.

సైనాంత్రోపస్ మానవుడు, మరీ అంతా కోతిమాదిరి లేకపోయినా, అతనినీ పూర్తిగా 'మనిషి' అనడానికి వీలులేదు.

"హైడల్ బర్గు మనిషి" అని యింకొకడుండేవాడు. హైడల్ బర్గు అనే ఊరులో అతని దవుడయెముక యొక్కటి మాత్రం మనకు దొరికింది. దీన్ని పరీక్షించి చూస్తే అతనిని మనిషి అనడానికి ఏవిధమైన సంకోచమూ అక్కర లేదనిపించు తుంది. ఆ దవుడలోని దంతాలు మనిషి దంతాలే. కోతుల కున్నట్లు, కోరల్లాగా అతని దంతాలు పెద్దవిగా పెరుగలేదు. కాని అతని నుదురు వెనుకకు స్లోపుగా కోతులకున్నట్లు తోసుకు

పోయింది. ఇందుచేత యీ హైడల్‌బర్గువానికీ పూర్తిగా మనిషి అనిపించుకోడానికి అర్హతవున్నట్లు చెప్పలేము.

పితకాంత్రోపస్, సైనాంత్రోపస్, హైడల్‌బర్గ మనిషి ఇప్పటికే మూడుపేర్లు!

ఇంతటితో యీ పేర్లు ఆగలేదు. హైడల్‌బర్గు తరువాత "ఎరింగ్సు ఘర్ఘమనిషీ", అతని కవతల "నియాండర్తల్ మనిషీ", తరువాత "క్రోమాగ్నన్ మనిషీ"!!

ఇట్లా పేర్లు మారుతుంటే, ఇదే ఆతని పేరని సూచించటం అంత తేలికైన పనికాదని ఒప్పుకోవాలి. ఔనా? సరే, పై నుడివిన హైడల్‌బర్గ మనిషినిగురించి ఆలోచించుదాము.

నదితీరాన ఏవైనా రాళ్ళు పనికివస్తాయేమోనని వెతికిందీ, రాయీ రాయీకొట్టి, నదిలోయలలో దొరికే రాతితో పనిముట్లు చేసినదీ, యీ హైడల్‌బర్గువాడే. అతనికీపేరు తప్ప వేరే పేరు పెట్టడానికి వీలుకాదు. అతడేసంవత్సరంలో పుట్టాడో చెప్పటం అసలే వీలుపడదు.

క్రమంగా, వందలకొలది ఏండ్లతరబడి మారుతూ, మారుతూ పితకాంత్రోపస్, సైనాంత్రోపస్, హైడల్‌బర్గు మనిషీ యిట్లా పుట్టుకు వచ్చారు. అందుకని ఫలానా సంవత్సరంలో ఈ రకం మానవుడు పుట్టాడని చెప్పలేము. పితకాంత్రోపస్ మనిషి సుమారు పదిలక్షలయేండ్ల క్రితంవాడని మనం ఊహించవచ్చు. అంటే మానవాకారపు జీవి పుట్టి యిప్పటికి దాదాపు పదిలక్షలయేండ్లయిందన్నమాట.

జన్మస్థలం: దీన్ని నిరూపించటం మరీ కష్టం. చింపాంజీ, గొరిల్లా, మనిషీ – వీటన్నిటికీ పూర్వముండే జీవిని డ్రైయో

పితకస్ అంటారు. ఈ పురాతన జీవి ఎచ్చటుండేదా అని వెదకటం ప్రారంభించారు శాస్త్రజ్ఞులు. మధ్య ఐరోపాలోనూ, దక్షిణాసియాలోనూ, ఉత్తరాఫ్రికాలోనూ ఆ జీవిజాడలు కనుపించాయి.

పితకాంత్రోపస్, సైనాంత్రోపస్ జీవుల యెముకలు ఆసియాలోనూ, హైడల్‌బర్గ మనిషి యెముకలు ఐరోపాలోనూ దొరికాయనే విషయం జ్ఞప్తియుంచుకోవాలి.

ఇంత గందరగోళంగా ఉన్నది విషయం. కాబట్టి మన పూర్వీకుడు ఫలానా ఊరులో పుట్టాడని వ్రాయటం వీలు కావటం లేదు. ఊరూకాదు, దేశమూకాదు సరికదా ఫలానా ఖండంలో పుట్టాడనైనా, నిర్ధారణ చేయడానికే వీలుకాకుండా ఉన్నది.

పురాతన రాతిపనిముట్లు కొన్ని కొన్ని చోట్ల దొరికాయని వ్రాశాముకాదూ? ఈ పనిముట్లు చేయగల జీవి కోతిస్థితినుండి విముక్తిచెంది, మానవరూపానికి మారాడని నిస్సందేహంగా చెప్పవచ్చు. అందుకని, భూలోకపటంలో ఈ పనిముట్లు యెచ్చటెచ్చట దొరికాయో, ఆ ప్రదేశాలన్నీ గుర్తించారు శాస్త్రజ్ఞులు. చాలా గుర్తులు ఐరోపాలో కనుపించాయి. కొన్ని ఆఫ్రికాలోనూ, ఆసియాలోనూ ఉన్నాయి.

దీన్నిబట్టి మన పూర్వీకుని జన్మస్థానం ఏదని చెప్పాలంటే పాతప్రపంచమేగాని, కొత్తదికాదు: పాతప్రపంచంలో ఒక చోటకాదు, అనేకచోట్లలో.

ఇంతకన్నా స్పష్టంగా చెప్పడానికి మనతరంకాదు.

## కాలాన్ని గణించటం

ఇనుమూ, బంగారమూ, నేలబొగ్గూ వంటి వస్తువులు మన కెట్లా దొరుకుతాయో చాలామందికి తెలుసు.

ఏపనన్నా ఒకపని చేయాలన్నా, ఒకచోటినుండి వేరొక చోటికు పోవాలన్నా కొంతకాలం పట్టుతుంది. ఈ కాలం అనేదాన్నికూడా మనుష్యుడు కనిపెట్టాడనీ, దాన్ని సంపాదించి, దాచుకొనేటందుకు నేర్చుకొన్నాడనీ అంటే తమాషాగా ఉంటుంది మొదట్లో. కాని జాగ్రత్తగా యీ విషయాన్ని గురించి ఆలోచిస్తే యీ 'కాలం' అనేది మనజీవితంలో ఎంత ముఖ్యమయిందో దాన్ని సేకరించగలగడంచేత మానవుని కెంత లాభకారియైందో అర్థమవుతుంది.

తనకు కావలసిన వస్తువులను మనుజుడు చేయటం ప్రారంభించాడు. వెంటనే అందుమూలాన 'పని' అనే యొక విషయం అతను కల్పించాడు. ఏపనన్నా చేయాలంటే కొంత కాలం పట్టుతుంది. ఒక రాతి పనిముట్టు చేయడానికి ముందు దానికి అనువైన రాతిని వెతకాలి. అంతేకాని కాలికి తగిలిన ప్రతి రాయీ పనికిరాదు.

పనిముట్టున కుపయోగపడే రాళ్ళు గట్టిగా, బలంగా ఉండాలి. ఇట్లా వెతకడానికి కాలం పట్టేది. సరియైన రాయి, అప్పటికీ దొరకకపోతే ఏదో యొక రాతితో సరిపెట్టుకోవలసి యుండేది.

సరియైన గట్టిరాయి దొరుకుతే, దానిని కావలసిన రూపంగా చెక్కేటందుకు మరొక రాయికావాలి. ఇంతేకాక,

పూర్వపు రోజుల్లో మనుజుడు అప్పుడప్పుడే తన చేతులతో పనులు చేయటం నేర్చుకొంటున్నాడు. అందుమూలాన ఇప్పటి లాగా నేర్పరితనంగా పనిముట్లు పట్టుకోటం, ఉపయోగించటం ఇంకా అలవడ లేదు. ఉక్కు గొడ్డలిని, యీ రోజుల్లో పూర్వం రాతిగొడ్డలిని తయారుచేసిన కాలంలోకన్న బహుత్వరలో చేయవచ్చు. ఎందుకని? చేతులు మానవుని స్వాధీన మయ్యాయి.

మరి యీ పనులన్నీ చేయడానికి మనిషికి కావలసిన కాలం ఎట్లా దొరికేది? పూర్వీకుల జీవితం ఏమాత్రమూ విశ్రాంతి అనేది లేకుండా ఉండేది. పగలంతా అడవుల్లో పొదల వెంబడి రకరకాల వస్తువులకని వెతుకుతూ మనిషి తిరిగేవాడు. తినే వస్తువు లేవైనా కనుపిస్తే వీలయినంత తాను తిని, మిగి లింది తన పిల్లల కిచ్చేవాడు. ఇట్లా ఆహారం వెదకటమూ, దానిని తినటమూ - ఈ పనులతోనే అతని రోజంతా గడచి పోయేది. ఏవేవో కాయలూ, పండ్లూ, దుంపలూ, పురుగులూ మాత్రం తినాలంటే విసుగూ విరామం లేకుండా యెప్పుడూ వెదుకుతూ ఉంటేనేగాని కడుపునిండడానికి తగినంత ఆహారం దొరకడం దుర్లభం. అందుకనే అతనికి విరామం అనేదే లేకుండా ఉండేది.

గొఱ్ఱెలూ, పశువులూ, అడవుల్లోని జింకలూ మందలు మందలుగా తిరుగుతూ ప్రొద్దస్తమానమూ ఇప్పటికీ ఈ విధం గానే జీవిస్తాయి. ఇట్లాగే మనిషీ జీవించవలసి యుండటంచేత, అతనికి విశ్రాంతి దొరికేదే కాదు ఏదన్నా యింకోపని చేద్దా మంటే.

కాని, ఎట్లాగో కష్టపడి కొంత విశ్రాంతి చూచుకొని, ఆహారం సేకరించడమే కాక ఇంకా యేదన్నా ఒకపనిని మనిషి అప్పుడప్పుడు చేసేవాడు. ఈ పని అనేది బహువిచిత్రమైంది. పనిచేయడానికి కాలం పట్టుతుంది—ఐతే, ఈ పని మనకు కావలసిన కాలాన్నికూడా ఈయగలదు. ఫలానా పనికి ఎనిమిది గంటలకాలం పట్టుతుందనుకో, దానిని మనం నాలుగంటల్లోనే పూర్తిచేయగలిగితే మనకు నాలుగు గంటలకాలం దొరికిందన్న మాట. ఏదన్నా ఒకపనిని, మనం తయారుచేసిన పనిముట్టు, మునుపటిదానిలో సగం కాలంలోనే పూర్తిచేయగలిగిందను కొందాము. అప్పుడేమవుతుంది? మునుపు యీ పనిని చేయ డానికి కావలసిన కాలంలో సగంకాలం మనకు ఇనాముగా చేజిక్కిందన్నమాట పనిముట్లను కనిపెట్టటం చేత.

మొదట్లో ఏదన్నా రాతిని తీసుకొని పనిముట్టుగా చేయాలంటే చాలాకాలం పట్టేది. కాని దానిని తయారు చేసిన తరువాత, చెట్ల ప్రమానులనుండి తినడానికి పనికి వచ్చే పురుగులను బహు సులభంగానూ, త్వరగానూ పెకలించటం సాధ్యపడింది. ఏదన్నా పదునైన రాతితో, చెట్టు కొమ్మలు చెక్కి పదునైన గునపంమాదిరి దాన్ని చేయడానికి చాలాకాలం పట్టేది. ఆ కొయ్యగునపం ఉపయోగించటంచేత సులభంగా, త్వరగా మట్టినుండి దుంపజాతుల త్రవ్వడానికి వీలయ్యేది. సన్నిటి బాణంలాగా కఱ్ఱను చెక్కబట్టి, పొదల్లో పరుగిడిపోయే జంతువును చంపడానికి మానవునికి సాధ్యమయింది.

ఇట్టి పనిముట్లు తయారుచేసుకోటంచేత ఆహార సంపాదనకు పూర్వమంతకాలం పట్టేదికాదు. ఈ క్రొత్త విశ్రాంతి సమయాన్ని, అతడు వేరేరకం పనిముట్లు చేయడాని కుపయోగించేవాడు. ఆ పనిముట్లు ఎక్కువయ్యేకొలదీ మనిషికి ఎక్కువ ఆహారం మాత్రమేకాక, కాలమూ దొరికేది.

ఒక్క అరగంటసేపు తన క్రొత్త ఆయుధాల చేబట్టుకొని వేటకు నెడితే రెండు, మూడు రోజులకు సరిపడ ఆహారం దొరికేది.

మొదట్లో మానవునకు పెద్ద మృగాల వేటాడటం తెలిసిందికాదు. అవీ, యివీ, ప్రకృతిలో దొరికేవస్తువులు అతను వెదకి తెచ్చుకొని జీవించేవాడు క్రొత్తలో.

## కావలసిన వస్తువులు వెదకితెచ్చుకోటం

అంటే మన కందరకూ సరదాగా వుంటుంది. పెద్ద తోటలోకి వెళ్ళి చెట్లక్రిందా, కొమ్మలకెగబ్రాకీ, లేక రాళ్ళతో కొట్టి పడవేసే రేగిపండ్లో అప్పుడే క్రొత్తగా వేసవికాలపు ప్రారంభంలో బయలుదేరే మామిడిపిందెలో తెచ్చుకోటంలో ఉండే తమాషా మనలో చాలామంది చిన్నప్పుడనుభవించే యుంటారు. సాయంత్రమపుడు చల్లగా తోటలోకిపోయి మల్లె అంట్లనుండి పూలజడకని ఇన్ని మల్లెపూవులు కోయటమంటే ఆడపిల్లల కమితానందం. డబ్బుయిచ్చి కొంటే అంత సరదా వుండదు.

కాని, ఇట్లా తెచ్చుకొనేవస్తువులు మన జీవితానికి, అన్నం నీళ్ళులాగా అంత ముఖ్యమయినవి కావుగనుక, అవి ఒకొ్కకసారి దొరకకపోయినా మరేమీ చిక్కులేదు. "తిరిగి

రేపు వెళ్ళవచ్చులే" అని ఇంటికి వచ్చేస్తాము. ఇట్లా అనుకొని జీవించడానికి మన పూర్వీకునకు వీలయ్యేది కాదు. ఎందుకంటే అతనికి కావలసిన ఆహారపదార్థాలన్నీ కాయలూ, పండ్లూ, దుంపలూ, పురుగులూ యిటువంటివి వెదకి, వెదకి సమకూర్చుకొంటేనేగాని, ఆతని కింకో పనిచేయడానికి అవకాశమే దొరికేది కాదు. అతని కడుపు నిండడానికి తగినన్ని వస్తువులు సమృద్ధిగా యెప్పుడూ దొరికేవి కావు. అందుకని వీలయినన్ని రకాల పదార్థాల నన్నిటితో కుక్షి నింపుకోటం నేర్చుకొన్నాడు.

చెట్లమీద వసించే కోతులూ, ఇతర మృగాలూ, పక్షులకన్నా ఎక్కువ స్వేచ్ఛ మనిషికి దొరికినప్పటికీ అత డెప్పుడూ అర్థాకలితోనే తిరుగులాడేవాడు. పాపం! ఎప్పుడూ ఒక డొక్క కాలుతూనే వుండేది.

ఇట్లా ఉండే ఆరోజుల్లో, గోరుచుట్టుమీద రోకటిపోటు లాగా పెద్ద ప్రళయం ఒకటి సంభవించింది.



# యుగాంతమూ - నూతనయుగ ప్రారంభమూ

రానున్న ప్రమాద సూచన :

ఇంతకు పూర్వం లోకంలో ఉన్నట్టుండి చలి యెక్కువయిందనీ, ఉత్తరధ్రువమునుండి మంచుగడ్డలు క్రిందకు వ్యాపించాయనీ చెప్పాము. అదేమాదిరి తిరిగీ ఏ కారణం చేతనో ఉత్తరధ్రువపు మంచుగడ్డ మైదానాలు క్రమంగా దక్షిణాదికి జరుగుతూరావటం ప్రారంభించాయి. చలి త్వరత్వరగా ముదరటం మొదలుపెట్టింది. మంచుగడ్డ ప్రవాహాలు కొండ అంచుల వెంబడి దిగజారుతూ, వాని శిఖరాలనూ, పార్శ్వములనూ విరగగోశాయి. కొండరాళ్లు బ్రహ్మాండమైనవి ఈ ప్రవాహంలో పడి దొర్లుతూ నలిగి ముక్కలు ముక్కలై కొండల దాటీ, లోయల జొరబడీ గర్జనధ్వనితో ప్రవహించే నీటిలో కొట్టుకుపోయాయి. ఈ నీరంతా పెద్ద నదీప్రవాహాలుగా మారి, క్రొత్త మార్గాల కోసుకొంటూ పల్లపు భూములకు దిగజారింది.

ఉత్తర ధృవంనుండి వచ్చే మంచుగడ్డ ప్రవాహాలతో కొండశిఖరాలనుండే మంచుగడ్డలువచ్చి, ఉపనదులమాదిరి కలుసుకొన్నాయి. ఈ గొప్ప ప్రవాహాలు పారినదేశం ఇప్పటికీ మనకు సులభంగా తెలుస్తుంది. ఫ్రాన్సూ, దాని పరిసరాల దేశాలలో యీ మంచుగడ్డ ప్రవాహాలు తెచ్చి దిగవిడిచిన కొండరాళ్ళు అనేకచోట్ల యిప్పటికీ కనుపిస్తాయి. జర్మనీలోని అడవుల్లో అచ్చటచ్చట పెద్ద శిలలూ, నాచూ పెఱిగి పచ్చగా అక్కడకూడ కనుపిస్తాయి. ఇవన్నీ పూర్వం మంచు ప్రవాహాలు తెచ్చి పడవేసినవే.

ఈ మాదిరే ఇంతకుపూర్వం ఉత్తర భాగపు మంచు గడ్డలు కొన్నిపర్యాయములు క్రిందకు వ్యాపించాయి. కాని ఎప్పుడూ ఈ సారి వచ్చినంత దక్షిణానికి రాలేదు. జర్మనీలో సగంభాగమూ, బ్రిటిషు ద్వీపాలు పూర్తిగా, ఉత్తర అమెరికాలో నయాగరా జలపాతంప్రాంతంవరకూ భూమి అంతా మంచుగడ్డలతో నిండిపోయింది.

మొదట్లో ఈ చలి సముద్రజీవులకు తగిలింది. తరువాతే క్రమక్రమంగా అది దక్షిణభాగాలకు వ్యాపించింది. సముద్ర తీరాల్లో ఇంకా వెచ్చగానే ఉంంది మొదట్లో. అడవుల్లో చక్కని పుష్పజాతులచెట్లు పెరుగుతూనే ఉన్నాయి. పెద్ద ఖడ్గ మృగాలూ, మాస్టోడన్‌లూ (పురాతన యేనుగులు) లోయలలో పెరిగే ఎత్తయిన పచ్చగడ్డి మైదానాలలో విహరించేవి. కాని క్రమక్రమంగా ఉత్తరపు చలి సముద్రంద్వారా క్రిందికి వ్యాపించులోంది.

ఇప్పటి వెచ్చని సముద్ర తీరాల ఒడ్డున, మట్టిలో పూడ్చుకుపోయి పురాతన ఆలుచిప్పల జాతులెన్నో ఉన్నాయి. ఇవన్నీ బహు చల్లని నీటిలో నివసించే జాతులే కాని వెచ్చని నీటిలో నివసించలేవు. దీన్నిబట్టి ఈ సముద్రాలు పూర్వం చాలా చల్లబడియుండాలని తెలుస్తోంది. తీరప్రదేశాలు చల్లబడ్డాయిగాని, ఇంకా అప్పటికి భూమధ్యభాగాలు వెచ్చగానుండి, అట్టి పరిస్థితులకు అనుకూలైన మృగాలతో నిండియుండేవి.

చెట్ల పోటాపోటీలు

ఉత్తరంనుండి చలివ్యాపించేకొలదీ, భూభాగాలలోకూడా మార్పులు పొడజూప ప్రారంభమయ్యాయి. గోపురాకారపు చెట్ల అరణ్యాలు దక్షిణానికి జరిగాయి. అంతకుపూర్వం అచ్చటుండే అరణ్యవృక్షాలకూ, ఈ గోపురాకారపు వృక్షాలకూ, ఆహారానికీ, జాగాకూ కలహం ప్రారంభమయింది.

ప్రకృతిలో వివిధజాతుల వృక్షాలకూ ఇటువంటి అంతః కలహం యెప్పుడూ జరుగుతూనే ఉంటుంది. వాటి కలహాలలో మధ్య మధ్య మనిషి ప్రవేశించి తన అవసరాన్నిబట్టి కొన్ని కొన్ని జాతుల నఱికివేస్తాడు. ఇందుమూలానకూడా మార్పులు కలుగుతాయి ఆ చెట్ల జీవితాల్లో.

ఉదాహరణగా ఒక్క విషయం ఆలోచించుదాము. గుడి గోపురాల్లాగా నిలబడి మన సర్వీచెట్ల ఆకులమాదిరి సూదుల్లాగా ఆకులుండే ఫర్ చెట్లు చల్లనిప్రదేశాల్లో ఉంటాయి. అవి ఎత్తుగా, గుబురుగా, అడవులుగా పెరుగుతాయి. వాటి అడుగున చాలాభాగం చీకటీ, నీడా ఉంటాయి. అచ్చటచ్చట

కొంచెం వెలుతురు పడుతుంది. ఈ నీడలో ఆస్పెన్ మొక్కలు పెరుగుతాయి. వానికి తగినంత వెలుతురు లేకపోవటంచేత పొట్టివిగా, అచ్చటచ్చట వెలుతురుపడేతావులు వెతకి, ఆ చోట్లలో ఈ ఆస్పెన్ చెట్లు పెరుగుతాయి. ఇదిట్లా జరుగుతూంటే, వంటచెఱకుకని మనుష్యులు ఫర్ వృక్షాలు నరుకుతారు. వెంటనే అంతవరకూ చాలీచాలని వెలుతురులో పెరిగే ఆస్పెన్ మొక్కలకు కావలసినంత వెలుతురు దొరుకుతుంది. 'మా ప్రభావం చూడ' మన్నట్లు ఆ ఆస్పెన్ మొక్కలు యెత్తెత్తుగా పెరుగుతాయి. అంతకుముందు అక్కడక్కడ మాత్రం పెరిగినవి ఇప్పుడు విచ్చలవిడిగా లేచి, నేలంతా నింపేస్తాయి. చూస్తూండగా బ్రహ్మాండమైన ఆస్పెన్ అడవి తయారవుతుంది.

ఈ అడవి అడుగున తిరిగే నీడా, అచ్చటచ్చట వెలుతురు మచ్చలూ, ఆస్పెన్ ఆకులు పెద్దవిగా పెరిగి, గుబురుగా చెట్లను నింపేస్తాయి. క్రిందినీడ యెక్కువైపోతుంది. ఈ నీడ యెక్కువయ్యే కొలదీ ఆస్పెన్ వృక్షాలు క్షీణముఖం పట్టుతాయి. వాని నీడే వాని విధ్వంసానికి కారణమవుతుంది. విచిత్రం! క్రమంగా ఆస్పెన్ వృక్షాలు పలచబడటం ప్రారంభమవుతుంది. క్రింద వెలుతురు యెక్కువగా పడుతుంది. పూర్వం పైన్ వృక్షాలు నరకటంలో వదలబడిన కొన్ని చిన్న పైన్ మొక్కలు అక్కడక్కడ, ఆస్పెన్ వృక్షాలనీడలో తగినంత వెలుతురు లేకపోయినా యెట్లాగో ప్రాణాలు నిలబెట్టుకొంటూ వచ్చాయి. ఇప్పు డవి విజృంభించి పెరగటం మొదలుపెట్టుతాయి. పైన్ మొక్కలకూ, ఆస్పెన్ చెట్లకూ కలహం, తిరిగీ తుదకు తిరిగీ

పైన్ అడవి పెరిగిపోతుంది. ఆస్పెన్ మొక్కలు ఆ వృక్ష ఛాయల్లో చిన్న చిన్నవిగా పెరుగుతూంటాయి.

ఈవిధంగా వృక్షజాతులలో నెలుతురుకూ, ఆహారానికీ, పెరిగే జాగాకూ యెప్పుడూ పోటీ జీవితం సాగుతూనే ఉంటుంది ప్రకృతిలో.

ఉత్తరపు చలి దక్షిణభాగాలను వ్యాపించేకొలదీ వెచ్చని భాగాలలో పెరిగే చెట్లజాతులు దానిని భరించలేక పోయాయి. ఆ వెచ్చని అడవులు క్రమంగా ఇంకా దక్షిణ భాగాలకు జరుగవలసి వచ్చింది. ఇట్లా జరిగేందుకు మరో కారణమూ ఉన్నది. ఉత్తరంనుండి చలికి అలవాటుపడిన గోపురాకారపు అడవులు, మంచుగడ్డలు వాటిని సమీపించటం చేత క్రిందికి దిగాయి. ఇందుమూలాన పూర్వపు వెచ్చని అడవులలో చెట్లకు స్థలం చాలింది కాదు. ఇట్లా రకరకాల అడవులూ తమతమ స్థానాలు వదలి ఏదో పెద్దసైన్యం వ్యాపించినట్లు క్రిందికి వ్యాపించటం మొదలు పెట్టాయి.

కొన్ని చెట్లు క్రిందకు జరుగుతూ పోయి, కొండ లోయల్లోనూ, లోతైన కొండచెరియల్లోనూ ఉత్తరపు చలినుండే, అడవులనుండే దాక్కొన్నాయి. కాని తిరిగీ కొద్దికాలంలో కొండశిఖరాలనుండి మంచుగడ్డ ప్రవాహాలు దిగజారి ఆ వృక్షాలను చంపివేశాయి, ఈ విధంగా అడవులలోనూ, చెట్లజాతుల్లోనూ మార్పులు ఏర్పడ్డాయి.

సరి, ఇక జంతువులేమైనాయో ఆలోచించి చూద్దాము. ఏదన్నా ఒక అడవిని నరికివేసినా, లేక అది కాలిపోయినా,

సాధారణంగా ఆ అడవికి అలవాటైన మృగాలన్నీ నశించి పోతాయి. లేదా, ఇంకొక అడవికి పలాయనమై పోతాయి.

ఫర్ అడవికి అలవాటుపడిన మృగాలూ, పక్షులూ దాంతోనే నశిస్తాయి. ఆ ప్రదేశంలో ఆస్పెన్ అడవి పెరిగితే ఆ మొక్కల కలవడిన క్రొత్తరకపు జంతుజాలం తయారవు తుంది. తిరిగీ ఫర్ అడవి అచ్చట పెరుగగానే ఫర్ అరణ్య జీవరాసికూడా దాంతోనే తయారవుతుంది. ఈ విధంగా అడ వులు మొత్తంగా అంటే వానిలో ఉండే మొక్కలూ, వానికి అలవాటుపడిన జంతువులూ అన్నీ ఒకేసారిగా మారుతాయి.

ఉత్తరపు చలి వ్యాపించేకొలదీ, వెచ్చని అడవుల కలవాటైన బొచ్చుపెరిగిన మామత్ నశించిపోయింది. అడవి యెద్దులూ, ఖడ్గమృగాలూ, మన పూర్వీకుని పురాతనపు శత్రువు ఖడ్గపులీ నశించాయి. కొన్ని కొన్ని మృగాలూ, పక్షులూ దక్షిణభాగాలకు వెళ్లాయి చలిని భరించ లేక.

ఒక రకమైన చెట్లు నశించాయంటే, వాని కొమ్మల్లోనూ, వాని నీడలోనూ యిండ్లు కట్టుకొని, నివసించే పక్షులూ, జంతువులూ నశించక తప్పదు. అవి నశించుటచేత వానిని తిని బ్రతికే యితర మృగాలూ నశించిపోతాయి. ఈ 'ఆహార లంకెలు' నిర్భేద్యమైనవి, క్రొత్తమార్గం త్రొక్కే శక్తి జీవికి లేకపోతే.

కాబట్టి చలి పెరుగుతూవచ్చే ఆ రోజుల్లో యే మృగ మన్నా తప్పించుకొని బ్రతకాలంటే, కొత్తరకం ఆహారం తినటం నేర్చుకోవాలి. దానిపళ్లూ, కాలిగోర్లూ, ఇంకోవిధంగా మారాలి. శరీరమంతా, చలిని భరించడానికి పనికివచ్చే పొడు

వైన బొచ్చు పెరగాలి. కాని, తలచుకొంటేనే వెంటనే జరిగే పనులుకావు యివన్నీ. ఎన్నోతరాలు గడిస్తేనేగాని ఇటువంటి మార్పులు వీలుకావు.

ఇట్లా చలికి తగినట్లుగా మారడానికే జంతువులు కష్టపడుతూంటే, ఉత్తరభాగాల నుండి చల్లని అరణ్యాల జంతువులు, క్రింది అడవులకు వ్యాపించాయి. ఒడలంతా బొచ్చుమొలిచిన ఖడ్గమృగాలూ, మాస్టోడనులూ, గుహా సింహాలూ, ఎలుగుబంటులూ క్రిందికివచ్చాయి. అప్పటి చలిని భరించడానికి అనువైన మెత్తని బొచ్చుతో ఆ సింహాలూ, ఖడ్గ మృగాలూ, ఎలుగుబంటులూ నిండియుండేవి. చలి మరీ ఎక్కువైతే గుహల్లో దాక్కొనేవి. ఆ అడవుల్లో వాటికి కావలసినంత ఆహారమూ దొరికేది.

ఈ మృగాలముందు, పూర్వం వెచ్చని అడవులకు అల వడిన మృగాలు, నిలబడలేకపోయాయి. ఎన్నో నశించాయి; కొన్నే తప్పించుకొని బ్రతుకగలిగాయి.

మరి, మనిషి యేమైనాడు ?

ఆతనూ తప్పించుకొని బ్రతికాడు. లేకపోతే నే నీ పుస్తకం వ్రాయుటమూ, నీవు చదువటమూ వీలయ్యేవే కావుగా ?

ఉత్తరపు చలి వ్యాపించేకొలదీ, మనిషి జీవితం బహు కష్టమయింది. గజగజ వణుకుతూ, పళ్ళు పటపట కొట్టు కొంటూ, నలుగురూ చేరి గుంపులు, గుంపులుగా వెచ్చగా నుండాలని యత్నిస్తూ ఎన్నో దినాలు గడిపారు. పాపం!

ఈ చలికితోడు ఆకలీ, శత్రుమృగాలూ వారికింకా బాధలు కల్పించాయి. వెచ్చని భాగాలలోనుండే జనం, వాళ్ళ దేశాలు కొంత చల్లబడినప్పటికీ, ఎట్టి ప్రమాదమూ లేకుండా బ్రతుకగలిగారు. కాని, ఉత్తర భాగాలవారి సంగతి అటు వంటిదికాదు. చలి ఎక్కువ అవుతోంటే వెచ్చగా వుండేందుకు ఏవేవో అగచాట్లు పడ్డారే కాని, ఒక యుగాంతం సమీపిస్తోం దని వాళ్ళు గ్రహించుకోలేకపోయారు.

## యుగాంతము

రాబోయేవిషయాలు తెలుసుకోవాలనే ఆశ చాలా మందికి ఉంటుంది. జ్యోతిష్కులూ, సాముద్రిక శాస్త్రజ్ఞులూ, ఏమైనా ఐదు ప్రశ్నలకు రూపాయి అనేవారూ ఎందరో ఉన్నారు. ప్రతిదేశంలోనూ గ్రహఫలాలు ప్రకటించే పత్రిక లెన్నో ఉన్నాయి. ప్రతివాడికీ ముందేమి రానున్నదో తెలుసు కోవాలనే ఆశ యెక్కువగా ఉండబట్టే లోకంలో రకరకాల జ్యోతిష్కులు యెప్పుడూ ఉంటారు.

అకస్మాత్తుగా పెద్ద నక్షత్రం జారినా, తోకచుక్క కను పించినా భయపడి ఏదోవిపత్తు రానున్నదని నమ్ముతాము. గొప్ప అంటువ్యాధులూ, యుద్ధాలూ సంభవించినరోజుల్లో "ఇంకేముంది, దీనితో లోకప్రళయమే" అనుకొంటాము. తోక చుక్కలూ, జారుడు నక్షత్రాలూ, అంటువ్యాధుల నిజతత్త్వం తెలియనపుడు అటువంటి భయాలు మరీ యెక్కువగా వుండేవి ప్రజల్లో. అవెట్లా వస్తాయో తెలిసిన తరువాత అవంటే భయం నశించింది. వ్యాధులనూ, కరువులనూ, నీటి వరదలనూ నిరో ధించడానికి జనం నేర్చుకొన్నారు.

"దీనితో, ఆఖరుగా, ఇంకేమున్నది లోకం?" అని సాధారణ ప్రజలూ, జ్యోతిష్కులే కాక, శాస్త్రజ్ఞులు కూడా సూచించే అలవాటుంది. రాను రాను లోకంలో వేడి క్షీణించు తోంది. ఇట్లా తగ్గుతూపోగా చివరకు ప్రాణులు వసించడానికి తగినంత వేడియుండదు. అప్పుడు కేవలం శీతలంచేత లోకాంతం సంభవమవుతుందని శాస్త్రజ్ఞులంటారు. వేడి యిప్పుడు తగ్గు తూన్న రేటునుబట్టి ఇన్ని సంవత్సరాల్లోగా, ప్రాణులు వసించ డానికి సరిపోనంత చల్లబడుతుందని అంచనావేశారు. లోకంలో ఉండే అరణ్యాలు నరికివేయబడుతున్నాయి. భూగర్భంలో ఉండే నేలబొగ్గు అంతా త్రవ్వి తీస్తున్నారు. ఉండే పెట్రోలియం నూనె కొన్ని వందల సంవత్సరాలకే సరిపోతుంది. తుదకు ఏ విధమైన వంటచెరుకూ దొరకదు. కాబట్టి ఫ్యాక్టరీలన్నీ నిలిచిపోతాయి; రైళ్ళు ఆగుతాయి; ఇండ్లదీపాలూ, వీథిదీపాలూ అటుపై వెలుగవు. చలికీ, ఆకలికీ జనం చనిపోతారు. తప్పిం చుకు బ్రతికినవారు తిరిగీ అనాగరికులై అడవిమృగాల మాదిరి మారిపోతారు. అని శాస్త్రజ్ఞులంటారు.

ఇట్లా అంతా జరుగుతుందని కొందరు శాస్త్రజ్ఞుల ఉద్దేశం. దీన్ని చదువుతూంటేనే భయంవేస్తోంది; కాదూ? నిజానికి ఇంతవరకూ మనుజు డుపయోగించినంతకన్నా తక్కువ గానే లోకంలో వంటచెరుకు మిగిలి ఉన్నది. ఐనా పైన సూచించినట్లు లోకం నశించదని మనం చెప్పవచ్చు.

మిగిలిన ఈ పెట్రోలియం, నేలబొగ్గూ మొదలైనవి ఆఖరయ్యేలోగా సూర్యరశ్మిని జనులుపయోగించటం కనుపెడు తారు. సూర్యుని వేడి రైళ్ళను నడుపుతుంది; ఇండ్లూ, వీధు

ళ్లోని దీపాలను వెలిగించుతుంది; ఫ్యాక్టరీలను ఆడిస్తుంది; మనకు వంట తయారుచేస్తుంది. అప్పుడే సూర్యకాంతినుండి విద్యుచ్ఛక్తిని తయారుచేసే కొన్ని నూతన కర్మాగారాలు నియమింపబడ్డాయి.

ఈ సమాధానానికి ఇంకో అడ్డుచెప్పే శాస్త్రవేత్తలున్నారు. యేమనంటే; సూర్యుని వేడి క్రమేపీ తగ్గుతోంది; మునుపటికన్న యిప్పుడెంతో తగ్గింది. కొన్ని కొన్ని నక్షత్రాలు సూర్యుని తరువాత యేర్పడ్డవి. అతనికన్న చాలా వేడిగా ఉన్నాయి. ఇప్పటి రేటులో సూర్యుని వేడి తగ్గుతూ పోతే, కొన్ని లక్షలయేండ్లు గడిచేటప్పటికి ఆ వేడి మనభూమిలో జీవకోటి వసించడానికి తగినంతగా సరిపోదు. ఇప్పుడు గొప్ప వేడిఅరణ్యాలూ, యెడారులూ ఉండే ప్రదేశాలలో మంచు యెలుగుబంటులు విహరిస్తాయి. అప్పుడు మనిషిగతి యేంకావాలి?

ఒకవేళ యింకో మంచుయుగం మునుపటిమాదిరే వస్తుందేమో! మన పూర్వీకులే యెట్లాగో పూర్వపు మంచుయుగాలబారినుండి తప్పించుకు బ్రతుకగలిగితే, ఈ కాలపు మనుజులు తప్పించుకోలేకపోతారా? రాను రాను శాస్త్ర సంబంధమైన పరిశోధన లెన్నో చేస్తూ, జీవితవిధానాన్ని పూర్తిగా మార్చుతూన్న మనుజుడు మంచుయుగాలు వచ్చినా అంతరించిపోడనే చెప్పాలి.

ఈ సందర్భంలో ఇంకోవిషయంకూడా జ్ఞప్తికుంచుకోవాలి. ప్రతిపరమాణువులోనూ (Atom) దాని ద్వివిధమైన విద్యుచ్ఛక్తి కేంద్రాలనూ బంధించే అణుశక్తి (Atomic Energy) ఉన్నది.

ఈ శక్తిని విడగొట్టుటకూ, స్వాధీనం చేసుకొనేటందుకూ శాస్త్రజ్ఞులు యత్నిస్తున్నారు. ఈ అణుశక్తి బ్రహ్మాండమైనది; అంతు లేనిది. దాన్ని విడమర్చటం మానవుడు త్వరలో కనిపెట్టుతాడు. అప్పుడు సూర్యుడు చల్లారినా, యీ లోకానికి కావలసిన శక్తి నంతా మానవులు పదార్థపు టణుహృదయంనుండి పెకలించి యుపయోగిస్తారు.

కాబట్టి యిట్లా విచిత్రమైన ఉద్దేశాలు శాస్త్రీయమైనవికూడా, మన భావిజీవితాన్ని గుఱించి యెన్నో వున్నాయి. ఏదో ఆలోచనలపై ఆలోచనలుగా భవిష్యత్తును గుఱించిన ఈ విషయాలు చర్చించటం తటస్థించింది. సరే; ఇంతటితో అదంతా కట్టిపెట్టి పూర్వం యేం జరిగిందో ఆలోచిద్దాము.

## కొత్తయుగ ప్రారంభము

మానవుడు అతని అరణ్యానికి బంధించిన గొలుసులను తెంపివేసు కొన్నాడు. లేకపోతే అతనూ యితరమృగాల మాదిరి నశించిపోయేవాడే. లోకంలో చలి పెఱిగేకొలదీ అతని కలవాటైన పూర్వపు ఆహారపదార్థాలు అరుదైపోయాయి. కొత్తరకాలు తినటం మనిషి నేర్చుకోబట్టి తప్పించుకు బ్రతికాడు.

చలి యెక్కువయింది; సూర్యుడెక్కడకో ఈలోకాన్ని వదలి వెళ్ళిపోయాడా అనిపించింది. త్వరత్వరగా మనిషి యీ చలిని భరించడానికి యేర్పాటులు చేసుకోవలసిన అవసరం యేర్పడింది. ఖడ్గపులివంటి మృగాలకు శరీరంమీద దట్టంగా ఉన్నిని పెంచుకొంటేనేగాని వానికి బ్రతుకు తెరువు లేకపోయింది.

కాని అంత త్వరలో శరీరతత్త్వం మారటం దుర్లభం. అందుకనే ఖడ్గపులులు రూపుమాసిపోయాయి.

కాని మానవుడు ఇంతకు పూర్వమే లోకపరిస్థితులకు అనువైనట్లు మారటం నేర్చుకొన్నాడు. మెత్తసబొచ్చును అతను శరీరంపై పెంచుకోలేకపోయినా బ్రతికాడు. ఎందుకో తెలుసా? ఎలుగుబంటుల చంపి, వాని చర్మాన్ని కప్పుకొని చలి నుండి తప్పించుకో గలిగాడు.

ఖడ్గపులికి నిప్పు చేయటం తెలియదు. మానవుడు ఆపనిని అప్పటికప్పుడే నేర్చుకొన్నాడు. ఈ విధంగా మనిషి తన్ను తాను మార్చుకొంటూ తన పరిస్థితుల స్వాధీనం చేసుకొని వానిని మార్చుతూ ఆ చలికాలాన్ని ఆ మంచుయుగాన్ని అతిక్రమించి బ్రతుక నేర్చాడు.

## ప్రకృతి గ్రంథము

మనభూమి లోపలకు త్రవ్వుతూపోతే అనేక పొరలు పొరలుగా ఉంటుందని అందరికీ తెలుసు. పైన సాధారణమన్ను, లోపల ఇసుకా, బంకమన్నూ, రాయీ, చిప్పలమయమైన పొరలూ యీ విధంగా ఎన్నో రకాలుగా పేర్చి యున్నది.

ఈ భూమి ఒక పెద్ద గ్రంథంవంటిది. పై జెప్పిన పొరలన్నీ, అన్నన్ని పుటలమాదిరిగా ఉన్నాయి. అన్ని పుటలకూ పై పుటమీద మనం వసిస్తున్నాము. ఈ గ్రంథపు అడుగుపుటలు కొన్ని సముద్రపు టడుగునా, ప్రస్తుతం మనముండే ఖండాల పునాదుల్లోనూ పూడ్చబడి ఉన్నాయి.

కొన్ని పుటలు వేడికి కాలి మాడిపోయి, వంకరలు తిరిగాయి. అగ్నిపర్వతాలు పగిలి వానినుండి కాలే లావా ప్రవాహాలు యెట్లావచ్చిందీ, కొత్తపర్వతశ్రేణు లెట్లా యేర్పడ్డదీ, యీ పుటలు తెలుపుతాయి. ఇంకా కొన్ని పుటలు నూతన ఖండాలు యేర్పడటమూ, పూర్వఖండాలు సముద్ర నీటి యడుగున మునిగిపోవటమూ అనే విషయాలు సూచిస్తాయి.

కొన్ని పుటలు తెల్లగా సముద్ర ఆలుచిప్పలమాదిరి ఉంటే, కొన్ని నల్లగా రాక్షసిబొగ్గులా వుంటాయి. ఇవి నిజానికి నేలబొగ్గు పొరలే. అందుకనే నల్లగా ఉంటాయి. ఈ బొగ్గు యూవత్తూ పూర్వపు టరణ్యాలనుంచి యెట్లాపుట్టిందీ మనం గ్రహించవచ్చు. ఈ బొగ్గుమీద పూర్వకాలపు వృక్ష భాగాలూ, జంతువుల శరీరభాగాలూ, అక్కడక్కడ అచ్చు గ్రుద్దినట్లు కనిపిస్తాయి.

ఈ పుటలన్నిటినీ పరిశీలించి యీ ప్రకృతి గ్రంథాన్ని ఇతర మామూలు పుస్తకాలు చదివినట్లే చదువవచ్చు. ఈ గ్రంథపు ఆఖరుపుటల్లో అంటే పైపైగా ఉండేవానిలోనే మానవుని చిహ్నాలు మన కగుపించుతున్నాయి.

మొదట్లో మామత్, ఖడ్గమృగాలవంటి పెద్దమృగాలతో పాటు మానవుని పాదచిహ్నాలు అచ్చటచ్చట మన కగుపించుతాయి. కాని రానురాను అతని ప్రాముఖ్యత యెక్కువవుతుంది. ఈ గ్రంథమును మనిషి మార్చడానికీ, తానే లిఖించడానికీ మొదలు పెడుతాడు.

మనిషి యీ ప్రకృతి గ్రంథాన్ని తానే లిఖించటం నేర్చాడంటే కొంచెం వింతగా ఉండవచ్చు. దీన్ని విశదీకరిస్తాము సరిగా అర్థం కావడానికి.

మంచుయుగంలో యేర్పడిన మట్టిపొరలు త్రవ్వుతూంటే కొన్ని నదులతీరంలో సాధారణమట్టి యిసుకలమధ్య నల్లని చారలు కనుపించాయి. ఇవి కాలిన బొగ్గుచారలు; నేలబొగ్గు కాదది. ఈ బొగ్గుచార బహుశ యేదన్నా అరణ్యం కాలిపోబట్టి యేర్పడిఉండవచ్చు. కాని ఇట్లా అనుకోడానికి యీ చారను చూస్తే వీలవటంలేదు. అడవికాలిన బొగ్గు ఐతే ఇట్లా ఒకేచోట చారమాదిరిగా ఎందుకుంటుంది? విశాలంగా వ్యాపించి చాలాభాగం నల్లని బొగ్గు కనుపించాలిగా? కాబట్టి ఏదో పెద్ద చలిమంటమాదిరి కట్టెలుపేర్చి కాల్చబడివుండాలి. ఈ ప్రదేశంలో చలిమంటలనూ, అగ్నిగుండాలనూ మనిషే గాని, ఇతర మృగాలేవీ నిర్మించలేవుగా!

ఇంతేకాదు. ఈనల్లని ప్రదేశంచుట్టూ రాతిపనిముట్లూ, జంతువుల యెముకలూ ఎన్నో ఉన్నాయి. దీన్నిబట్టి ఇచ్చట పూర్వీకులు పెద్ద అగ్నిగుండాలను పేర్చియున్నారని స్పష్టమవుతోంది.

నిప్పూ, జంతువేటా – యీ రెండింటి సహాయంచేతా మనిషి మంచుయుగాన్ని జయించగలిగాడు.

ఈ విధంగా మానవుడు ప్రకృతిగ్రంథపు పుటలను తానే లిఖించటం నేర్చుకొన్నాడు. ఆతని జీవితచిహ్నాలూ, అతను జీవించినవైఖరినీ తెలిపే గుర్తులు యీ కొత్త పుటల్లో కనుపిస్తాయి.

## మనిషి అరణ్యంనుంచి బయటపడుతాడు

మనిషికి చల్లని అడవుల్లో ఆరోజుల్లో ఆహారందొరకటం దుర్లభమైంది. అందుకని దానిని వెదకడానికి ఇతర ప్రదేశాలకు వెళ్ళవలసివచ్చింది. వేడి అరణ్యాలలోని మనుష్యులు క్రమ క్రమంగా మాంసాహారం తినటం ప్రారంభించారు. ఏదన్నా జంతువు నొకదానిని వేటాడి చంపుతే, తిరిగీ కొన్నిరోజుల దాకా దాన్నే భుజించేవాళ్ళు. అందుకని ప్రతి రోజూ ఆహారా న్వేషణ అవసర ముండేదికాదు. ఆ పనులూ, యీ పనులూ చేయడానికి అతనికి అవకాశం ఉండేదికూడా, ఇందుచేత.

తన పనిముట్లను అభివృద్ధి చేసుకొనటంచేత మనిషికి జంతువేట సులభసాధ్యమవటం ప్రారంభమైంది. దక్షిణపు వెచ్చనిభాగాల్లోనే యిట్లా వేటాడటం జనులు నేర్చుకొంటే, ఇక ఉత్తరాన్నుండే చలి అరణ్యాలవారిసంగతి చెప్పనే అక్కర లేదు. వారికి వేటాడి జంతువుల చంపటం ప్రాణావసరమైంది. లేకుంటే ఆహార మేదీ దొరికేదేకాదు. మంచూ, విపరీతమైన చలీ, మంచుతుపానులూ వీనిమూలాన జంతువుల వేటాడటం చాలా కష్టమయ్యేది. చాలారోజులదాకా మాంసము సరి పోయే పెద్ద మృగాలను చంపటం అతను నేర్చుకోవలసి వచ్చింది.

అడవిలో అటువంటి పెద్దమృగాలు కొన్నియుండేవి. రెయిన్‌డీరులు మంచులేనిచోట మొలిచే నాచుమొక్కల తిని తిరుగుతూండేవి. అడవిపందులు నేలంతా త్రవ్వి చిందరవందర చేసేవి. వీనికంటె పెద్ద మృగాలు అడవివెలుపలుండే పొద లలో ఎక్కువగా వుండేవి. అడవి దున్నల గుంపులు రంకెలు

వేస్తూ, భూమి కదిలిపోయేట్లు పరుగెత్తేవి మైదానాల్లో. ఏనో కదలే బ్రహ్మాండమైన పర్వతాల్లాగా, ఒడలంతా బొచ్చు పెరిగిన మాస్టోడన్‌లు సోమరితనంగా విహరించేవి.

ఇవన్నీ మానవుని అడవినుండి బయటకు లాగాయి. వానిని వేటాడుతూ పోయిపోయి తన్నంతవరకూ పెంచిన అరణ్యప్రదేశాలకు స్వస్తి చెప్పాడతడు. వేటాడుతూ వెళ్ళిన మానవ పాదచిహ్నాలూ, అతను వదలించిన మంటలగుర్తులూ, తాత్కాలికంగా నిర్మించుకొన్న గూడెములూ, బయళ్ళలోనూ, లోయల్లోనూ మన కగుపిస్తాయి. పూర్వపుజీవితం – అడవుల్లో అదీ యిదీ కోసుకొనీ, త్రవ్వి, తిని గడిపిన బ్రతుకు – పూర్తిగా మారిపోయింది. మనిషి వేటగాడుగా మారాడు.

వేటాడుతూ వెళ్ళి అచ్చటచ్చట అప్పటికప్పుడు గూడెములు నిర్మించుకొనేవారు జనులు. ఆ ప్రదేశాలిప్పటికీ మన కగుపిస్తాయి. ఆతను చంపి తినిన జంతువుల యెముకలనుబట్టి ఏయే మృగాల నతడు వేటాడేవాడో తెలుస్తుంది. ఆ ప్రదేశాలలో గుఱ్ఱాల ప్రక్క-యెముకలూ, కొమ్ములు తిరిగిన పశువుల కపాలములూ, అడవిపందుల వాడికోరలూ కుప్పతిప్పలుగా పడివున్నాయి. వారెంతోకాలం యీ గూడాల్లో వసించి యుండాలి.

పై నుడివిన యెముకలతోపాటు, మామత్ యేనుగుల పెద్ద తలలూ పొడూగ్గా వంపుతిరిగిన దంతాలూ, పెద్ద స్తంభాలవంటి కాళ్లూ, తిరుగలిరాళ్ళమాదిరి పళ్ళూకూడా ఉన్నాయి. ఇట్టి పెద్ద మృగాలను చంపగలిగిన ఆ పురాతనమనిషి చాలా బలశాలిగానూ, ధైర్యవంతుడుగానూ వుండియుండాలి. మామత్

ఏనుగు కళేబరాన్ని ముక్కలుగా కోసి, వానిని ఇంటికి తీసుకు వచ్చాడంటేనే ఆతని బలం ఎంత గొప్పదో గ్రహించవచ్చు. ఒక్కొక్క కాలు టన్నుకుపైగా బరువుండేది; తల సాధారణ మనిషంత ఉండేది.

ఈ రోజుల్లో వేటగాండ్రకు యెన్నెన్నోరకాల ఆయుధా లుంటాయి. కాని, మన పూర్వీకులు అంతంత పెద్ద మామత్ లను తమ రాతికత్తులతోనూ, రాతి యీటెలతోనే సంహ రించగలిగారు.

క్రమంగా తన రాతిపనిముట్లను పదునైనవిగా చేయటం ఆతను నేర్చాడు. రాతికత్తులను బండబారినప్పుడల్లా సానబెట్టే వాడు. ఏదన్నా పనిముట్టుకని రాతిని చెక్కేటప్పుడు ఊడివచ్చే చిన్నముక్కలను వృధాచేయకుండా ఇతరపనిముట్లుగా మార్చి యుపయోగించేవాడు.

ఆ పూర్వపు రోజుల్లో ఇటువంటి రాతిపనిముట్లతోనే మామత్ వంటి పెద్ద మృగాలను మనుష్యులు చంపేవారు. నలుగురూ కలిసి వేటాడేవారు; పెద్ద మంటలు చేసేవారు; ఇండ్లు కట్టేవారు. ఈ విధంగా ఒక్కడూ చేయలేని పనులను నలుగురూ చేరి చేయటం నేర్చుకొన్నారు. వాళ్ళుపయోగించిన పనిముట్లు చాలా అల్పమైనవయినప్పటికీ నలుగురూ కలియటం చేత ఎంతెంత పనులైనా చేయగలిగేవారు.

ఇట్లా నలుగురూ కలిసి నివసించే అవసరం వారికి కలుగ బట్టే మానవునిలో మానుషత్వం క్రమంగా పెరుగటం ప్రారంభమైంది. ఒక్క యీటె బదులు, ఏ యాభై అరవై యీటెలతోనో పెద్ద జంతువులను వేటాడేవారు. ఏపని చేయా

లన్నా అనేకమంది చేరేవాళ్లు కాబట్టి దానిని సాధించడానికి కొన్ని వందల చేతులూ, కాళ్లూ, తలలూగల మహా శక్తి వంతుడై నొక వ్యక్తి ఉంటే ఆత డెంత సులభంగా చేయ గలడో, అంత సులభంగానూ పని అయిపోయేది. సంఘజీవిగా మారటంచేత వ్యక్తియొక్క ప్రత్యేకశక్తి ఎన్నో వందలరెట్లు బలపడ్డది.

మామత్‌లు అవలీలగా మనిషిని తొండంతో ఎత్తి విసరివేసేటంత పెద్దవి. వాని కాళ్ళక్రింద పడితే చీమనలిగినట్లు నలిగేవాడతడు. నలుగురూ చేరబట్టి అంత పెద్ద మృగాన్ని స్వాధీనం చేసికోగలిగారు. అది అంత పెద్దదిగా ఉండటమే ఒక విధంగా దానికి భంగపాటైంది.

అందరూ చేరి మామత్ ఉండేచోట నిప్పు అంటించేవారు. ఆ కాంతికి దాని కండ్లు మిరుమిట్లు య్యేవి; దాని శరీరపు పొడ వైన ఉన్ని నిప్పు అంటుకొని కాలేది. భయపడి అది యిటూ అటూ పరుగెత్తజూచేది. కాని, నిప్పు దానికొకప్రక్క తప్ప అన్నిప్రక్కలా కనుపించేది. ఆ దారినే పరుగెత్తిపోయి, పోయి పెద్ద ఊబిగుంటలో దిగబడేది. సరిగ్గా ఇట్లా ఊబిలో దిగబడా లనే జనం యేర్పాటుగా అన్నిప్రక్కలనుండీ మంటలతో దాన్ని తరిమేవారు.

పెద్ద అరుపులు అరుస్తూ ఆ మామత్ మొదటొ కాలు, తరువాత యింకో కాలూ, యిట్లా ఎత్తి తప్పించుకోవాలని యత్నించేది. యత్నించేకొద్దీ ఇంకా దిగబడేది. చివరకు జన మంతా దాన్ని చుట్టవేసేవారు.

దాన్ని వేటాడటం ఒక యెత్తూ, బురదనుండి బయటకు లాగటం యింకో యెత్తుగా ఉండేది. వాళ్ళ గ్రామాలు ఎత్తుగా నదీతీరాల నుండేవి. తరుచుగా, వరదనీళ్ళు వచ్చినా ఆట్టే ప్రమాదం ఏమీ ఉండేదికాదు. ఆ నీళ్ళు త్రాగి, దాని ఒడ్డునుండే రాళ్ళతో కావలసిన పనిముట్లు చేసేవారు.

పదునైన రాతికత్తులతో మామత్ శరీరాన్ని ముక్కలుగా కోసేవారు. అలవాటుపడ్డ ముసలివాళ్ళు ఎక్కడ గాటు పెడితే సులభంగా తలా, వేళ్లూ ఊడివస్తాయో యువకులకు నేర్పేవారు. లావుపాటి దాని చర్మాన్ని కోసీ, సాగే కండరాలను కత్తిరించీ, నరాల పట్లను సడలించీ, దాన్ని ముక్కలుగా కోసి తమ ఏటిఒడ్డు గ్రామానికి తీసుకుపోయేవారు. ఒక్క కాలును లాగాలంటే కొన్ని డజనులమంది గట్టిగా అరుస్తూ, గల్లంతుగా దాన్ని ఈడ్చుకుపోయేవారు. బ్రహ్మాండమైన దాని శిరస్సును ఇట్లా అరుస్తూ లాక్కుపోతూంటే, పెద్ద కొండచిలువ లాగా దానితొండం నేలమీద యీడుస్తూ వచ్చేది.

తమ గ్రామాన్ని చేరేటప్పటికి పూర్తిగా అలసిపోయి, చమటతో ఒడలంతా తడిసిపోయేది. ఐతేనేం? అంత పెద్ద జంతువు దొరికిందంటే, ఎన్నోరోజులుదాకా తిరిగీ ఆహారంకని వెతకటం అనవసరం; ఆ రోజు వాళ్ళకి మాంచి పర్వదినం లాగా ఉండేది.

## విజయం

మనిషి ఆ రోజుల్లో ఉండే మృగాల్లోకెల్లా పెద్దదాన్ని జయించాడు. ఇంతవరకూ యితర మృగాలచే చంపబడే మనిషి తానే వానిని చంపేశక్తి సంపాదించాడు. ఇతరమృగాలకు

ఆహారమయ్యేవాడు. తానే వానిని తన కాహారంగా ఉపయో గించ నేర్చాడు.

కావలసినంత ఆహారం దొరకటంమూలాన త్వర త్వరగా జనసంఖ్య ఎక్కువ అవటం ప్రారంభమైంది. కొన్ని వందలయేండ్లు గడిచేటప్పటికి జనులు భూమిపై చాలాచోట్ల అల్లుకుపోయారు.

ఈవిధంగా ఏవిధమైన హద్దూ పద్దూ లేకుండా పెరుగటం ఒక్క మనిషి కే వీలవుతుంది, కాని యితర మృగాలకు కాదు. కుందేలువంటి జంతువేదన్నా మితిమీరి యిట్లా పెరగాలంటే వాటికన్నిటికీ తగినంత ఆహారం దొరకటం కష్టం. అవి పచ్చి గరికనూ, ఆకూ అలమునూమాత్రం తింటాయి. మనిషి అట్లాగాక రకరకాల ఆహారం తినటం నేర్చాడు. రెండో ఆటంక మేమిటంటే : కుందేళ్ళు ఎక్కువయ్యేకొలదీ, వాని శత్రు మృగాలు నక్కలూ, తోడేళ్ళూ బాగా పెరుగుతాయి. మనిషి తన శత్రుమృగాలను ధిక్కరించి జీవించటం నేర్చుకోబట్టి అతని కటువంటిబాధ లేక పోయింది.

సృష్టిలో యే జంతువుల సంఖ్యైనా యెంతవరకు పెరి గేదీ అవి తినే ఆహారంమీదా, వానినే ఆహారంగా భుజించే యితర మృగాల సంఖ్యమీదా ఆధారమయి వుంటుంది. మితి మీరి పెరుగటం అసంభవం. ఆస్ట్రేలియాలో మొదట్లో కుందేళ్ళుండేవి కావు. ఐరోపానుండి కొన్నింటిని తెచ్చారు. త్వరలో అవి కోటానకోట్లుగా పెరిగాయి. వ్యవసాయకులకు వానివల్ల కలిగిన నష్టమూ, ఏంచేయాలో తెలీక మనసుకు ఎక్కిన పిచ్చీ యింతింతనరాదు.

చివరకు, ఏదీలోచక ప్రత్యేకరకమైన ఒక నక్కలజాతిని ఐరోపానుండి, ఆస్ట్రేలియాకు రప్పించారు. అవి ఎక్కడపడితే అక్కడే కనుపించే కుందేళ్ళను తిని, బాగా వృద్ధి అయ్యాయి. కుందేళ్ళ జనాభా తగ్గింది దాంతో.

మనుజుడు రకరకాల పనిముట్లు చేయటం నేర్చాడు. అనేక క్రొత్త విధాలైన ఆహారం తినటం అవలంబించాడు. కాబట్టే సృష్టిలో సహజంగా ఉండే నియమాలను అతిక్రమించి జీవించడానికి సదుపాయం కలిగింది అతనికి. ఇతర జంతువులేవీ పెరుగజాలనంత యెక్కువగా అతనిసంఖ్య పెరిగింది. పూర్వం ఒకళ్ళిద్దరు వసించడానికే ఆహారం సరిపోని ప్రదేశాల్లో చాలా మంది జీవించడానికి వీలయింది.

పూర్వం యెంతో కష్టపడి ఆకూ, అలమూ, పండ్లూ, దుంపలూ వెతికి తినేవాడు. జంతువుల వేటాడి వాటిమాంసం తినటం నేర్చుకోటంచేత అతనికి శాఖాహారం మునుపటంత అవసరమైందికాదు. ప్రతిరోజూ, అతను చంపే పెద్ద మృగాలు— మామత్ ఖడ్గమృగం, అడవిదున్నలూ, గుఱ్ఱాలూ మొదలైనవి - ఎంతో గడ్డిని తినేవి. ఆ గడ్డియొక్క సత్తువంతా బాగా బలిసిన జంతుకండరాల్లోనూ, క్రొవ్వులోనూ దాచబడేది. మాంసాహారం అలవాటుచేసుకోటంచేత ఎన్నో కొన్ని టన్నుల గడ్డివగైరా శాకాల సత్తువంతా బహుతేలికగా మనుజునికి దొరికేది.

మంచు తుపానులప్పుడూ, నేలంతా చలికి మంచు గడ్డలు పేరుకుపోయే రోజుల్లోనూ వారికి బయట ఆహారం

దొరకటం చాలా దుర్లభమయ్యేది. అటువంటప్పుడు దాచి పెట్టిన మాంసాన్ని తినేవాడు.

ఆహారం రాబోయే కరువురోజులకని దాచుకోటం అల వాటు కాగానే, ఎక్కడపడితే అక్కడకు దేశదిమ్మరిగా తిరుగ డానికి వీలుండేదికాదు. శాకాహారపు రోజుల్లో అట్లాగాక అదెక్కడదొరికితే అక్కడికంతా వెళ్ళేవారు ప్రజ. మాంసత్ తలనో, స్తంభాలలాంటి దాని కాళ్ళనో యిష్టంవచ్చినట్లు ప్రతి చోటకూ తీసుకువెళ్ళడానికి కష్టంకాదా, మరి?

ఇంకోకారణంచేతకూడా మనుజులు దేశదిమ్మరి జీవితం మార్చుకోవలసి వచ్చింది. పూర్వమైతే ఏ చెట్ల కొమ్మలైనా సరే అతనికి నివాసయోగ్యంగా వుండేవి. నేలమీద తిరుగాడే శత్రుమృగాలనుండి తప్పించుకోటమే అప్పటి ముఖ్య సమస్య. కాని, చలి యెక్కువగా పెరిగేకొలదీ వారికి దాని బాధనుండీ తప్పించుకోవలసిన అవసరం కలిగింది. చలి దొరరాస నివా సాలు నికరంగా కొన్ని తావుల్లో కట్టుకోవలసివచ్చింది. ఇట్లా ఇల్లు కట్టుకోటంచేత, మనిషి తన కాళ్ళూ కట్టేసుకొన్నాడు.

## మానవ సృష్టి

దైవసృష్టి అంటాము. లోకమంతా సాధారణంగా, సహజమైన లోకపరిస్థితులను క్రమంగా మార్చటమూ, నూతన ప్రపంచాన్ని తానే సృష్టించుకోటమూ ప్రారంభించాడు మనిషి.

ఏ కొండగుహో, ఏటవంపుగా ముందుకువంగిన యేకొండపార్శ్వమో అతని గృహముగా నుండేది, చెట్ల

కొమ్మలూ, తోళ్ళతో పందిరి వేసి తానే ప్రత్యేక ఆకాశాన్ని యేర్పర్చుకొన్నాడు. ఎండ వానలూ, మంచూ యీ కొత్త ఆకాశాన్నుండి వచ్చేవి కావు. ఈ తన చిన్న నూతన జగత్తులో రాత్రులందు వెలుగుకూ, చలికాలంలో వెచ్చదనానికీ ఒక చిన్న సూర్యుని అధిష్ఠింపజేశాడు.

పురాతన గుహల గోడలలో పందిరి అడ్డకట్టలు దూర్చ బడిన రంధ్రాలు మన కగుపిస్తాయి. గుహామధ్యనుండే అగ్ని గుండము చుట్టూ యేర్పరచిన రాళ్ళు నల్లగా కాలినవి, మనం చూడవచ్చు. ఈ అగ్నియే ఆతని సూర్యుడూ, దీపమూనూ.

రాతి కత్తులూ, పదునైన రాతి యీటెలముక్కలూ, కీళ్ళూడిన జంతుయెముకలూ, బొగ్గూ, బూడిదా — యివన్నీ మన్నుతో కలిసి యీ పురాతన గుహల్లో కనుపిస్తాయి. సృష్టిలో ఇవన్నీ సహజంగా ఎప్పుడూ ఇట్లా కలిసి ఒకేచోట దొరకవు. ఇవన్నీ మానవ కరచిహ్నములని నిస్సందేహంగా చెప్ప డానికి వీలవుతోంది.

ఈ గుహలు ఇప్పటికీ అట్లాగే మొదట్లోలాగా నిలిచి యున్నా యనుకోరాదు. అవన్నీ పూర్తిగా శిథిలమైపోయాయి. కాని పైన నుడివిన వస్తువులు ఆయాచోట్ల దొరకటంమూలాన అచ్చట గుహలుండేవని విశదమవుతుంది. మునుపుడుండే గుహ గోడల దాటి యింకా ముందుకుపోతే, అదే ప్రదేశంలో మన కెట్టి మానవజీవితచిహ్నాలుగానీ కనిపించవు. బూడిదా, బొగ్గూ, ఎముకలూ, రాతిపనిముట్లూ యివేవీ ఉండవు.

ఈ విధంగా మానవుడు తానే యొక నూతన ప్రపంచాన్ని సృష్టించుకొన్నాడు. దీనికీ, సహజ ప్రకృతికీ క్రమంగా కనుపడని గోడలు అడ్డంగా పెరగటం ప్రారంభించాయి. తా నేర్పఱ్చుకొన్న యీ వాతావరణంలో నిలబడి, వెలుపల ప్రపంచమంతా చలికి వణకి మరణిస్తోంటే, దానినుండి తప్పించుకోగలిగాడు; బ్రతుకగలిగాడు.

★

# వెయ్యేండ్ల బడి

రాతి పనిముట్లు జనులుచేసి జీవించే పూర్వకాలానికి 'రాతియుగం' అని అంటాము. ఈ పురాతన పనిముట్లు చాలా దొరికాయి; వానిని వస్తుప్రదర్శనశాలల్లో ఉంచారు. వానిలో పొడుగ్గా, సన్నగా, మంచి పదునురాయి ఒకటి, ఇంకొకటి పెద్ద ముక్కోణాకారంగా ఉండేరాయి ఒకటీను మనం చూడ వచ్చు. రెండో ముక్కోణపురాయి అంచులుకూడా ఎంతో పదునుగా వుంటాయి. ఇంతపెద్ద బరువైన పనిముట్టు నెందు కుపయోగించేవారో! మొత్తంమీద రెండింటినీ ఏవైనా వస్తువుల నరికేటందుకూ, కోయడానికీ ఉపయోగించేవారనడానికి ఏమాత్రమూ సంశయంలేదు. ఇంత బరువైన ముక్కోణ రాతి కత్తితో దేన్ని కోసేవారో! ఆ కోయబడేది వస్తువో, మృగమో! ఎంత పెద్దదిగా ఉండేదో!

ఈ విషయాలు తెలుసుకోవాలంటే కేవలం కూర్చొని ఊహించే బదులు, ఆ పురాతన రాతియుగానికి ప్రయాణం కట్టటం మంచిది. సాధారణంగా నవలల్లోనైతే, "6 వ శతాబ్దంలో ఒకరోజు సాయంత్రం సింధునదీ తీరాన" అనో, "గోపాల

కృష్ణుడు యమునాతీర ప్రదేశాల్లో విహరించే రోజుల్లో”నో అని వ్రాసి, ఒక్క చిటికలో ఎంతెంత పురాతనపు కాలానికైనా మానసికంగా మనం ప్రయాణం చేయవచ్చు. అప్పటి పరిస్థితుల ప్రసక్తి వచ్చినట్లు గ్రంథకర్తలు వర్ణిస్తారుకూడా.

ఇదేవిధంగా అంత తేలికగానూ, పురాతన రాతియుగానికి ప్రయాణం చేయటం వీలుకాదు. ఐనా, కొంత ప్రయాసపడి ఈ ప్రయాణం సాగిద్దాం. మొట్ట మొదట్లో అంత దీర్ఘ ప్రయాణానికి కావలసిన వస్తుసామాగ్రిని చేకూర్చుకోవాలి.

మడత డేరా ఒకటి కావాలి. క్రింద పరచేటందుకు గట్టి కాన్వాసుబట్టా, మడతపెట్టడానికి వీలయే డేరాకఱ్ఱలూ, త్రాళ్లూ, కొయ్యగూటాలూ, సుత్తీ యివన్నీ జాగ్రత్తగా వీలైనంత కొద్ది స్థలంలో యిమిడ్చి మూటకట్టుకోవాలి. ఎండ తగలకుండా కార్కు దొరటోపీ ఒకటీ, గొడ్డలీ, నీళ్ళుకాచే కెటిల్, స్పిరిట్‌తో వెలిగే స్టవు ఒకటీ, గిన్నె, చెంచా, దిక్సూచి యంత్రం, భూలోకపటమూ నీ పెట్టెలో పెట్టుకొని, తుపాకీ యొకటి పట్టుకుపోవాలి. రాతియుగానికి వెడితే వేటాడే అవకాశాలెన్నో తప్పకుండా కలుగుతాయి. తరువాత దగ్గరగా నుండే సముద్రరేవుకు వెళ్ళి స్టీమరు టిక్కెట్టు కొనాలి.

“రాతియుగానికి టిక్కెట్టు, బాబూ” అంటే నలుగురూ నవ్వుతారు. ఎవడో రైలుస్టేషనుకు వెళ్ళి, “అయ్యా! మావూరుకో టిక్కెట్టు యివ్వమ”న్నాడట! కాబట్టి రాతియుగానికి వెళ్ళిరావడానికి తిరుగు టిక్కెట్టు కావాలని అడగరాదు. మెల్బోర్న్ నగరానికి టిక్కెట్టు కావాలని అడిగి కొనుక్కోవాలి. మెల్బోర్న్, ఆస్ట్రేలియాలో ఉన్నది.

రెండు మూడు వారాల్లో స్టీమరు నిన్ను ఆస్ట్రేలియాలో దింపుతుంది. ఈ ఖండంలో యిప్పటికీ రాతియుగపు మనుష్యులు నివసిస్తున్నారు. పురాతన రాతియుగానికి వెళ్ళటం వీలు కాక పోయినా, రాతియుగ ప్రజల మాదిరి యిప్పటికీ నివసించే ఆస్ట్రేలియా జాతుల చూడడానికి వెళ్ళి సంగతులన్నీ గ్రహించడానికి యత్నించాలి నీవు.

ఎక్కడచూచినా ఎండిపోయిన బయళ్ళూ, ఎడారీ కనుపిస్తాయి. మధ్యమధ్య దారి కడ్డంగావుండే ముండ్లపొదలూ, రక్కిసలూ దాటి ఆస్ట్రేలియను వేటకాండ్ర ప్రదేశాన్ని చేరుతావు. నదీతీరాన బెరడుదీసిన చెట్లనీడలో వారి గుడిసెలుంటాయి. చెట్లకొమ్మలూ, తోళ్ళతోనూ వాని నిర్మించారు.

నలుదెసలా పిల్లలు గల్లంతుగా ఆడుకొంటున్నారు. స్త్రీలూ, పురుషులూ నేలమీద చతికిలబడి ఏవేవో పనులు చేస్తున్నారు. పొడుగు గడ్డమూ, చెదరి చిక్కుబడిన తల వెంట్రుకలూ గల ముసలివాడొకడు, ప్రొద్దున్నే చంపిన కంగారూ తోలును ఒలుస్తున్నాడు. వాడిచేతిలో ముక్కోణాకారపు రాతి కత్తియున్నది. ఇది అచ్చంగా పూర్వం రాతియుగపు ప్రజ లుపయోగించిన కత్తిలాగానే ఉన్నది. అతనిప్రక్క నొక స్త్రీ పొడూగ్గా పదునైన సన్నని రాతికత్తితో ఏదో అంగీకని తోలును కోస్తోంది. సరిగ్గా యిట్టివే పొడవైన రాతికత్తు లెన్నో యిరోపాలో పురాతన రాతియుగపు ప్రజలవస్తువులలో మన కగుపిస్తున్నాయి.

బలమైన ముక్కోణపు రాతికత్తి పురుషుల ఆయుధం. దానితో జంతువుల చంపి, దాని చర్మం ఒలిచి, మాంసమును

ముక్కలుగా కోస్తారు. సన్నని రాతికత్తి, కేవలం ఆడవాళ్ళు యింట్లో వుపయోగించే పనిముట్టు, దుస్తులకు తోళ్ళనుకోసీ, సన్నగా వారులు చీల్చి తోలును పదునుచేసి నునుపుగా చేసీ స్త్రీలు రకరకాలుగా దాన్ని ఉపయోగిస్తారు.

ఈ విధంగా ఒకపనిముట్టు ఒకపనికీ, ఇంకొకటి వేరేపనికీ ఏర్పడటం చూస్తే పురుషులు ఒకవిధమైన పనులుచేస్తే, స్త్రీలు ఇంకోవిధమైన పనులు చేసేవారని గ్రహించవచ్చు. ఏ విధమైన నాగరికతా లేక కేవలం వేటకాండ్రలాగా జీవించే ఆ పురాతనపు రోజుల్లోనే సంఘానికి కావలసిన పనులు ప్రజల్లో తగినట్లు ఒక్కొక్కరికీ విభజింపబడేవని ఇందుమూలాన మనకు విశదమవుతోంది.

పురుషులు జంతువుల వెంబడించి వేటాడి, దిమ్మరే సమయంలో స్త్రీలు ఊరికే కూర్చొనేవారుకారు. వారి నివాసానికి యోగ్యమైన గుడిసెలు నిర్మించేవారు. భూమినుండి దుంపజాతులు త్రవ్వి తీసేవారు. భోజనపదార్థాలూ, దుస్తులూ మొదలైనవాటి విషయం ముందుగానే జాగ్రత్తపడి దాచేవారు.

పురుషులూ, స్త్రీలూ వేర్వేరు పనులు పంచుకొని చేసినట్లే పడుచువారి పనులనీ, ముసలివారు చేయవలసిన పనులనీకూడా విభజించుకొన్నారు ఆ రోజుల్లో.

## వెయ్యేండ్ల బడి

ఏ పనన్నా చేయగలగాలంటే మొదట్లో దాన్ని నేర్చుకోవాలి, అలవాటు చేసుకోవాలి. అభ్యసించందే, అలవాటు చేసుకోకుండానే జ్ఞానం ఏదో కొండమీదనుంచి దిగివస్తుందనుకో

కూడదు. సాధారణంగా ప్రతి క్రొత్త విషయమూ తెలిసిన ఇతరులనుండి నేర్చుకోవాలి మనమూ చేయగలగాలంటే.

ఒక వడ్రంగి ఉన్నాడనుకో, అతనికి కావలసిన రంపమూ, ఉలీ, సుత్తీ, బరమూ అన్నీ అతనే కనిపెట్టాలనుకో. ఇంతేకాక వానినెట్లా ఉపయోగించాలో కూడా వాడే ఊహించి తెలుసుకోవాలని అనుకొందాము. లోకపరిస్థితులు ఇలాగుంటే నిజానికి వడ్రంగిజాతి పూర్తిగా నశిస్తుంది త్వరిలో.

ఇదేమాదిరి మనం భూగోళశాస్త్రం నేర్చుకోడానికి ప్రతి యొక్కడూ భూమంతా చుట్టూ ప్రయాణంచేసీ, కొలంబస్ మాదిరి తిరిగీ అమెరికాను కనుక్కొనీ, ఆఫ్రికాఖండపు దుర్గమారణ్యాల్లో ప్రయాణం సాగించీ, ఎవరెస్టు శిఖరంపై కెగబ్రాకీ, లోకంలోనుండే జలసంధులూ, అగ్రాలూ ప్రత్యక్షంగా తిలకించీ, ప్రతీదీ లెక్కబెట్టి చూడాలంటే, మనం వెయ్యేండ్లు బ్రతికినా భూగోళశాస్త్రం నేర్చుకోలేము.

రోజులు గడిచేకొలదీ, నూతన విషయాలు కనిపెట్టబడుతున్నాయి. క్రొత్తశక్తులు స్వాధీనమవుతున్నాయి. ఎన్నెన్నో కనీ, వినీ యెరుగని అంశాలు మనకు విదితమవుతున్నాయి. ఇట్లా ఒక్కొక తరం గడిచిపోయేకొలదీ జనులు నేర్చుకోవలసిన విషయాలెన్నో పెరిగిపోతున్నాయి.

సుమారు రెండువందల సంవత్సరాల క్రితం పదహారో యేటికల్లా మనుష్యులు, ప్రొఫెసర్లు – పండితులు అనుకోవచ్చు– అయ్యేవారు పాశ్చాత్య దేశాల్లో. ఈ రోజుల్లో అట్లాంటి పప్పేదీ ఉడకదు.

సుమారు పదేళ్ళు కష్టపడి చదివితేకాని హైస్కూలు చదువు పూర్తికావటంలేదు. ఈ రోజుల్లో రానురాను క్రొత్త శాస్త్ర పరిశోధనలు పెరిగేకొలదీ జనం యింకా యెక్కువ యేండ్లు చదువవలసివస్తుంది. పూర్వం పదహారేండ్లకంతా జనులు ప్రొఫెసర్లు అయ్యేవారు! ఇప్పుడో! తలక్రిందుగా తపస్సు చేసినా అటువంటి దేదీ వీలుకాదు.

పూర్వం భౌతికశాస్త్రం అని ఒకే ఒక శాస్త్రం చదివే వారు జనం. ఇప్పుడైతే భూగోళ భౌతికశాస్త్రమూ, నక్షత్ర భౌతికశాస్త్రమూ అని ఉన్నాయి. అదేమాదిరి రసాయన శాస్త్రం ఒక్కటే ప్రజలు మునుపు నేర్చేవారు. ఇప్పుడు భూగోళ రసాయనశాస్త్రమూ, జీవరసాయన శాస్త్రమూ, వ్యవసాయ రసాయనశాస్త్రమూ అని ఉన్నాయి. ఈ రోజుల్లో శాస్త్ర సంబంధమైన క్రొంగ్రొత్త విషయాలు బహు త్వరగా పెరిగిపోతున్నాయి.

రాతియుగంలో శాస్త్రపరిశోధనలనీ, చదువులనీ ఉండేవి కావు. మానవుడు కేవలం అనేక అనుభవాలు సేకరించుకొనే వాడు. ఈ రోజుల్లోమాదిరి మానవజీవితమూ, విజ్ఞానమూ శాఖోపశాఖలుగా పెరిగిపోలేదు. ఐనా కొద్దో, గొప్పో ప్రతి వాడూ ఆ కాలంలోనూ నేర్చుకోవలసియుండేది.

జంతువుల కాలిజాడలబట్టి వానిని వెంబడించటమూ, చర్మం ఒలవటమూ, నివాసయోగ్యమైన కుటీరాలు నిర్మించు కోవటమూ, రాతికత్తులూ, సూదులూ చేయటమూ – ఇట్టి పనులన్నీ చేసే నేర్పరితనం ప్రతివాడికీ తప్పక కావలసివచ్చేది. కాని, యెవ్వడూ పుట్టుకతోటే యిట్టి చాకచక్యాలతోనూ,

శక్తులతోనూ పుట్టడు. ప్రతీదీ నేర్చుకోవాలి. అభ్యసించాలి. అభ్యాసంమీదే పనివాడితనం సాధ్యపడుతుంది.

జంతువులకూ, మనిషికీ ఉండే ముఖ్యభేదమే యిది. మృగాలు పుట్టేటప్పుడే వాని జీవితానికి అవసరమయ్యే సమస్త అవయవాలతోనూ, అలవాట్లతోనూ పుట్టుతాయి. తమ తల్లిదండ్రులనుండి వారసత్వంగా వచ్చే శరీరాకారమూ, రంగుల మాదిరే, వివిధ పనులు చేయడానికి తగిన అంగాలూ, వాని నుపయోగించగల నేర్పూ, జంతువుల పిల్లలకు వారసత్వంగా వస్తాయి. అడవిపంది దుంపల పెకలించటం నేర్చుకో అక్కర లేదు. అట్లా పెకలించడానికి అనువైన ముట్టెతోనే అది పుట్టు తుంది. పందికొక్కుకూ, బీవరుకూ వస్తువుల కొరికి, నుసి చేయటం నేర్చుకోఅక్కర్ల లేదు. వాని దంతాలు అటువంటి పను లకు తగినట్లు పుట్టుకతోనే యేర్పాటయియుంటాయి. జంతు వులు వివిధ విద్యలు నేర్చుకోడానికి బడులూ లేవు; వేర్వేరు పనులు చేయడానికి కావలసిన పనిముట్లు అమ్మబడే దుకా ణాలూ లేవు. సృష్టిలో మనిషి సంగతి యిట్లాకాదు. మన తల్లిదండ్రులనుండి పనిముట్ల నుపయోగించే నేర్పరితనం మనకు వారసత్వంగా రాదు. తన పనిముట్లు తానే చేసుకోవాలి. ఉపాధ్యాయులనుండీ, ఇతర పెద్దవారినుండీ ఇటువంటి విషయా లన్నీ నేర్చుకోవాలి.

సాధారణంగా చాలామంది బడిపిల్లలకు లెక్కలన్నా వ్యాకరణమన్నా తగనిభయం. జంతువులమాదిరి వారూ వివిధ పనులు చేయగల శక్తులతో పుట్టుతే ఎంతో బాగుంటుందనీ, లెక్కలూ మొదలైనవి నేర్చుకోవలసినఅవసరం ఉండదనీ మనం

అనుకోవచ్చు. కానీ యిదంత శ్రేయస్కరంకాదు. బడులు లేకపోతే ప్రజ కొత్త విషయాలు నేర్చుకోరు. జ్ఞానమూ, నేర్పరితనమూ నిర్జీవమై, స్థంభించిపోతాయి. వానికి పురోభివృద్ధి అనేది లేశమైనా ఉండదు. జంతువులలో మాదిరే పుట్టిన అల వాట్లతో పెరిగి నశించటం మాత్రమే మనకూ చేతవుతుంది.

మన అదృష్టమనుకోవాలి. మనకిట్లా సమస్తవిషయాలూ పుట్టుకతోనే అలవడకపోవటం, ప్రతీదీ చదవాలి, అభ్యసించాలి. ఒకొక్క తరం గడిచేకొలదీ మానవ విజ్ఞానం పెరుగుతూ ఉంటుంది. ఇందుమూలానే క్రమక్రమంగా అజ్ఞానాంధకారం పటాపంచలవుతుంది. విజ్ఞానకాంతులు విస్తరిస్తాయి.

ప్రతి బాలుడూ, బాలికా బడికివెళ్ళి నేర్చుకొనేటట్టే, మానవజాతి యావత్తూ క్రొత్త విషయాలను ఎప్పుడూ నేర్చుకొంటోంది. ఇంతవరకూ గడచిన వెయ్యేళ్ళ బడియొక్క ఫలితంగా మానవుడు శాస్త్రజ్ఞానాన్నీ, కళలనూ వివిధ పనిముట్లు నిర్మించి యుపయోగించే కౌశలాన్నీ అభ్యసించగలిగాడు. ఈ విద్యయొక్క ఫలితమే మన ఈ ప్రస్తుత నాగరికత.

ఈ వేయియేండ్ల బడిలో మానవుడు రాతియుగ కాలంలో ప్రవేశించాడు. అలవాటుపడిన ముసలివాళ్లూ, పెద్దలూ, చిన్నవారికి జంతువేటా వాని పాదగుర్తుల తెలుసు కోటమూ నేర్పారు. నిశ్శబ్దంగా జంతువులకు తెలియకుండా జరిగి, ప్రాకి వాని సమీపించే చాకచక్యమూ, పద్ధతీ ప్రతి యువకుడూ తన సంఘు పెద్దలనుండి నేర్చుకొనేవాడు.

ఈ రోజుల్లోకూడా జంతువేటకు చాలా నేర్పరితనం కావాలి. ఐతే పూర్వంమాదిరి ప్రతి వేటకాడూ తనకు కావల

సిన ఆయుధాలన్నీ తానే చేసుకో అక్కర లేదు. రాతియుగంలో ప్రజ తమకు కావలసిన రాతికత్తులూ, గదలూ, యీటెలూ, అన్నీ వాళ్ళే చేసుకొనేవారు. అందుకనే చిన్నవాళ్ళకు నేర్ప డానికి పెద్దవారి కెన్నో విషయాలుండేవి.

స్త్రీలవిషయమూ అంతే, గృహకృత్యాలు నిర్వహించు కోటమేకాక కట్టెలు నఱుకుటా రకరకాల గృహోపయోగకర మైన సామానులు తయారుచేయుటా బట్టలు కట్టటమూ అనే పనులెన్నో వారికి ముఖ్యంగా తెలిసియుండేవి.

ప్రతి ముఠాలోనూ, తమ తమ ప్రత్యేక జీవితాల్లో నేర్చిన నూతన విషయాలనూ, అలవర్చుకొనిన నేర్పిరితనమూ యువకులకూ, యువతులకూ నేర్పించే పెద్దవాళ్ళు, స్త్రీ పురుషు లుండేవారు. కాబట్టి అట్లా నేర్పడానికి వారికేదో యొకవిధ మైన భాష ఉండియుండాలని మనం ఊహించవచ్చు. ఇదిట్లా చేయి, అదట్లాచేయి అని చేసి చూపించటమూ, చెప్పటమూ జరిగేవి. దీనికంతా భాష లేకపోతే యెట్లా?

జంతువులు, తమపిల్లలకు వాసిగోళ్ళ నేవిధంగా ఉపయో గించాలో, పండ్లతో ఎట్లాకొఱకాలో నేర్పించవు. కాబట్టే వానికి మాట్లాడే అవసరం ఉండదు. తన పనిని తాను చేసు డానికీ, అతను నేర్చినవిషయాలు చిన్నవారికి నేర్పడానికీ, మనిషికి భాష – అంటే మాట్లాడటం అవసరమైంది. మాన వుడు మాట్లాడటం నేర్చాడు.

రాతియుగపు జనులు ఎట్లా మాట్లాడేవారో!

## పూర్వకాలానికి ద్వితీయ ప్రయాణం

మళ్ళీ యింకోసారి పురాతన రోజులకు ప్రయాణం చేసి వద్దాం. ఈసారి మునుపటంత యెక్కువ సామగ్రి తీసుకుపో నక్కరలేదు. ఓడలెక్కి యెచ్చటికీ పోవలసిన అవసరమూ లేదు. ఉన్నచోటే కూర్చుండి యీ ప్రయాణం సాగించగలము.

ఈ రోజుల్లో రేడియో అంటే తెలియనివాళ్ళు లేరు. దాన్ని త్రిప్పితే న్యూయార్కునుండి పారిస్; పారిస్‌నుండి, మాస్కో; మాస్కో నుండి బొంబాయికీ ఒక్క నిమిషంలో వెళ్ళవచ్చు. "టెలివిజన్" యంత్రం మనదగ్గరుంటే ఆ దూర ప్రదేశాల్లో జరిగేవి వినటమే కాక పర్వతాల కవతల ప్రక్క, సముద్రాల దూరపుతీరాల్లో జనులే యే పనులుచేస్తున్నారో చక్కగా బహు స్పష్టంగా చూడగలం.

ఇట్టి సదుపాయాలన్నీ ఉన్నాకూడా, ఎన్నో సంవత్సరాల క్రితం జీవించిన మనుష్యుల మాటలు వినాలంటే మనకు వీలవుతుందా? ఈ యంత్రాల మూలాన దూరాన్ని జయించినట్లే, కాలమును కూడా అతిక్రమించడానికి ఉపాయమేదన్నా ఉన్నదా అని ఆలోచిస్తే అట్టిదేదీ వీలుపడదని తెలుస్తుంది.

మాట్లాడే చలనచిత్రాలు—టాకీలు—ఉపకరిస్తాయా అని ఆలోచిద్దాం. ఈ టాకీలు తెరమీద ప్రస్తుతకాలంలో జరిగే విషయాలేకాక, పూర్వపు విషయాలెన్నో చూపిస్తాయి. అయినప్పటికీ 1927 సంవత్సరానికి పూర్వం చలనచిత్రాలూ, ఇంకా కనిపెట్టబడలేదు. టాకీలకు పూర్వం జరిగిన విషయాలు చూపే చలనచిత్రాలూ, మూకీలు, అవి జనులేయే విషయాలు

మాట్లాడాకో మనకు చెప్పలేవు. కాబట్టి యీ టాకీలూ మూకీలుకూడా యెందుకు లాభించవు మన కార్యసాధనకు.

సరి ఇక గ్రామఫోనుసంగతి చూద్దాం. మాటలూ, పాటలూ బహు చక్కగా దీంట్లో అచ్చు గుద్దబడుతాయి. మనిషిని చూడడానికి వీలుకాకున్నా వానిభాష ఎంతో చక్కగా వినబడుతుందిగా? ఐనా 1877 సంవత్సరానికి పూర్వం గ్రామ ఫోనులనే యంత్రాలులేవు అప్పటికింకా అవి కనిపెట్టబడలేదు.

గ్రామఫోనులకు ముందు జనులెట్లా మాట్లాడేవారో మనం వినటం దుర్లభం. వారి భాషను తెలుసుకోవాలంటే గ్రంథాలూ, పుస్తకాలూ ఆధారం చేసుకోవాలి. ఫోటో గ్రాఫులూ, వ్రాతగ్రంథాలూ చూస్తే, పూర్వపు జనుల భావాలూ, ఆలోచనలూ కొంతవరకూ తెలుస్తాయి.

సాధారణంగా మన అందరి యిండ్లలో మన పూర్వీకుల ఫొటోలెన్నో ఉంటాయి. గోడపొడూగునా ఉండే పటాలనుండి మన తాత ముత్తాతలూ, ముత్తవ్వలూ మనలని చూస్తూ ఉంటారు. వాళ్ళ విచిత్ర దుస్తులూ, వారు ఉపయోగించిన సామాగ్రీ కొద్దో గొప్పోవారి పురాతన జీవితాలని మనకు తెలుపుతాయి.

అదిగో! కెమెరావంక భయంగా తన చక్కని స్వచ్ఛటి నేత్రాలు తెరిచిచూస్తూ నవనవలాడే బాల్యసౌందర్యంతో బంగారు గజ్జల మొలత్రాడూ, మెడలో పులిగోళ్ళూ వేసు కొన్న ఆ పసిపాప మన తాతగారట! ఇంకా కొంచెందూరంగా కుడిప్రక్కనుండే యింకో పటంచూడు. అందులోని మనిషికి పాతికేళ్ళుంటాయి. తెల్లని మల్లు తలపాగా, కోవిగా పైకిత్రిప్పిన

మీసాలూ, మెడనుండి క్రిందిదాకా గుండీలున్న ఆల్పాకా నల్లకోటూ, కుడిచేతి ఐదు వేళ్ళకూ రవ్వల ఉంగరాలూ, వెండి పన్ను తొడిగిన చేతికర్రా! ఎవరో తెలుసా? క్రొత్త పెండ్లి కొడుకు మన తాతగారే! ఆయన ప్రక్కగా పది పండ్రెం డేళ్ళుకూడా నిండని బాలిక బనారసుచీరా, మొగిలిపూవుల వాలుజడా, నుదుట పెండ్లిబొట్టూ, జూకాలూ, అడ్డబాసా, కాసులపేరూ, గజ్జల వడ్డాణం పెట్టుకొని నిలుచున్నది చూడు. లేడిపిల్లలాగా భయపడుతూ, తన భర్త కూర్చున్న కుర్చీమీద తాకీ తాకనట్లు తన చేయి ఆనించి ఆయనకు వీలైనంత దూరంగా ఒదిగి, ఒదిగి నిలుచున్నది పాపం!

ఇదిగో యింకోపటం. దీన్ని చూద్దాం. ఇదంతా యేదో అట్టహాసంగా ఉంది. కళ్యాణమండపంలాగా దండలూ, తోరణాలూ, కాశ్మీరశాలువలు కప్పుకొని, కుండలాలు ధరించిన బ్రాహ్మలూ, కలకలలాడే నవ్వుముఖాలతో మంచి చీరలూ, నగలూ పెట్టుకొన్న స్త్రీలూ, అరటిపండ్లు ఒలిచితింటూ నవ్వే బాల బాలికలూ, ఎంతో మంగళకరంగా, శోభాయమానంగా ఉన్నదీదృశ్యం. అందరిమధ్యా ఒక ముసలితాతగారూ తలంతా నెరసిపోయి మడతపెట్టిన మొగిలిరేకుతో అలంకరించిన చెంప కొప్పుతో నవ్వుతూ మన అవ్వా కూర్చున్నారు. ఇది మన తాతగారి షష్టిపూర్తి ఫోటోగ్రాపు!

ఈ విధంగా మానవజీవితం కండ్లకుగట్టినట్లు ఫోటోల మూలాన మనకు విశదమవుతుంది!

మన తాత ముత్తాతలకాలందాటి యింకా నాలుగైదు తరాలు వెనుకకు వెడితే అప్పటి ఫోటోలు మరీ విచిత్రంగా

ఉంటాయి. ఏవో చెక్కడపు విగ్రహాల్లాగా ముఖంలో యేవిధమైన కళా, భావస్ఫురణా లేకుండా వుంటాయి. ఎవరిదన్నా ఫోటోతీయాలంటే, ఆ వ్యక్తిని కదలకుండా నిట్రంగా విగ్రహంలాగా ఎత్తుపాటికుర్చీలో ఎంతోసేపు కూర్చోబెట్టేవారు. నేలకు కాళ్ళానకా ప్రస్ఫుటంగా కనుపించాలని ప్రతివేలూ, అరచేతులవి, తెరచిపెట్టి కాళ్ళమీద పరచీ వింతగా జాలిగొల్పుతూ కనుపిస్తారు. ఈ రోజుల్లోనైతే ఎంతత్వరగా చలించేవస్తువునైనా చిటికలో ఫోటోతీయగలము. పందెపు గుఱ్ఱాల పరుగులూ, సముద్రజలంలో కోసుకుపోయే ఓడలగమనమూ తుపాకిగుండ్ల వాయువేగ ప్రయాణమూ, యిట్టివన్నీ ఫోటోలు తీస్తారు యీరోజుల్లో.

1838—యీ సంవత్సరానికి పూర్వం ఫోటోగ్రాఫులే లేవు. అంతకు పూర్వపు విషయాలు తెలుసుకోడానికి తదితర అంశాలమీద ఆధారపడాలి. పుస్తక భాండాగారాల్లోనూ; పురాతన చిత్రకారుల చిత్రాల్లోనూ, ప్రాచీనగ్రంథాల్లోనూ అట్టి విషయాలకు వెదకులాడాలి.

ఈ విధంగా వందలకొలదీ ఏండ్లు గడచిపోతాయి. 1456 సంవత్సరానికిముందు అచ్చుపుస్తకాలనేవి లేవు. జనులు తమ ఈక కలాలతోనూ, గంటా లుపయోగించీ కాగితాలమీదా, తాటాకులమీదా వ్రాసేవారు. క్రమంగా వీటిని పరిశీలించి గతించిన రోజుల విచిత్రవిషయాలు అవగాహన చేసుకోవాలి. ఇట్టి లిఖితగ్రంథాలకు పూర్వం దేవాలయాల గోడలమీదా, స్థూపాలప్రాకారాలపొడుగునా చెక్కిన అక్షరాలూ, బొమ్మలూ మన కాధారమౌతాయి.

ఇట్లా క్రమంగా జరిగిపోయిన తరాల విషయాలు గ్రహిస్తూ, వెనుకకు పోగా పోగా చిట్టచివరకు వ్రాతఅనేది పూర్తిగా అదృశ్యమవుతుంది. పురాతన జనుల కంఠస్వరం క్షీణించి, హీనమై తుదకు పూర్తిగా వినుపడకుండా పోతుంది!

ఐతే, ఆ కాలానికి ముందు సంగతేమిటో?

అది తెలుసుకోవాలంటే పురాతన గుహాల నేలను త్రవ్వాలి; పూర్వీకుల పనిముట్లు పరీక్షించాలి. శిథిలభవనాలూ, దేవాలయాలూ రాళ్లూ రప్పలూ గమనించాలి; ఎప్పుడో ఆరిపోయిన అగ్నిగుండాల బూడిద ప్రోవులలో వెతుకులాడాలి. వీటి మూలాన పూర్వకాలపు మనుష్యులెట్లా జీవించారో కొంత వరకైనా గ్రహించ వీలవుతుంది.

వారెట్టిభాష మాట్లాడేవారో పై పరిశీలన మూలంగా యేదన్నా గ్రహించడానికి వీలవుతుందేమో ఆలోచించుదాము.

మా ట లు లే ని భా ష!!

పురాతన గుహల్లోనూ, మనుజుడు జంతు వేటకాడుగా వుండే రోజుల్లో అతను వసించిన కొండచరియల ప్రాంతాల్లోనూ ఆతని జీవితసంబంధమైన కొన్ని విషయాలు తెలిపే ఆనవాళ్ళగుపిస్తాయి. పితకాంత్రోపస్ మనిషినుంచి కొన్ని వేల ఏండ్లు అప్పటికే గడచిపోయాయి. ఆ రోజుల్లో వసించిన మానవు డెట్టివాడో ఆలోచించి చూడాలి.

మొదట్లోనే ఇద్దంతా యెవర్ని గురించి వ్రాస్తున్నామో, ఆతనికి ఫలానాపేరని చెప్పటం వీలుకాదని విశదపర్చాము. ప్రకరణ, ప్రకరణానికీ ఆతని పేరు మారుతూ ఉంటుంది. మనము

ఇప్పుడు చర్చించేకాలపు మానవునకు శాస్త్రజ్ఞులు "నియాండర్తల్ మనుజుడ"ని పేరు పెట్టారు. బొచ్చుయేనుగులు వసించే రోజుల్లో జీవించిన మానవులయొక్క కపాలములు "నియాండర్తల్" లోయలో మన కగుపించాయి. ఇందుకనే యీ పేరు పెట్టారు, శాస్త్రకారులతనికి. ఆతనికి పూర్వపు మనుజులతో పోలిస్తే నియాండర్తల్ మనిషి వెన్నెముక నిటారుముగా మారి నట్లూ, చేతులు పూర్వంకన్న స్వాధీనంగా వంగేటట్లూ, ముఖంలో మానవాకారం పొడసూపేటట్లూ గోచరమవుతుంది.

ఏదన్నా నవల చదివితే దానిలోవచ్చే ముఖ్యపాత్ర యైన వ్యక్తినిగురించి యెన్నెన్నో వర్ణన లుంటాయి. శరీరం నిమ్నసందు ఛాయా, కోలముఖం, పొడవైన నాసికా, ఆకర్ణాంతములైన విశాల నేత్రద్వయం, పట్టుదలను చూపే బలమైన క్రింది దవుడా, ఆజానబాహువులూ – ఈ రీతిగా వర్ణించేస్తాడు గ్రంథకర్త.

ఈ గ్రంథంలో మనసంగతి ఇట్లాకాదు. అట్టి వర్ణన లన్నింటికన్నా ముఖ్యమైన దొక్కవిషయం మనకుకావాలి. ఆతని నేత్రాలనుండి వెలువడే కరుణారస దృక్కులకన్నా, వీణతంతులు మీటినట్లుండు కంఠస్వరముకన్నా, ఆ వ్యక్తి యొక్క మెదడెంతపెద్దదో తెలుసుకోటం మన కెక్కువ అవసరం.

పితకాంత్రోపసు మానవుని కపాలముకన్న, నియాండర్తలుని కపాలము పెద్దదనేది నిర్వివాదాంశం. శాస్త్రజ్ఞులు జాగ్రతగా ఆ యా కపాలముల కొలిచి దీన్ని నిర్ణయించారు.

నియాండ ర్తల్ మానవుని కాలానికి ముందు జరిగిన వేలకొలది యేండ్ల శిక్షణా, దీన్ని బట్టి ఊరికే పోలేదని తెలుస్తోంది. మనిషంతా, అందులోనూ ముఖ్యంగా ఆతని తలా, చేతులూ మార్పు చెందాయి. ఆలోచనలకు తలా, కార్యసాధనకు చేతులూ జోడించుకొంటూ ముందంజ వేశాయి యీ మార్పులో.

రాతి గొడ్డలితో ఏ రూపమూ లేని రాళ్ళను చెక్కేటప్పుడు తనకు తెలియకుండానే తాను మారటం మొదలు పెట్టాడు మనిషి. అతని చేతి వ్రేళ్ళు పూర్వంకన్న ఎక్కువ స్వాధీనమయ్యాయి. స్వతంత్రంగా పట్టుకోటం అలవర్చుకో గలిగాయి. వివిధపనులూ చేసేకొలదీ మెదడుకూడా వృద్ధికా జొచ్చింది.

నియాండ ర్తల్ మనుజుని చూసీ చూడటంతోనే అతను కోతికాదని తోచుతుంది. కొన్ని విషయాల్లో మర్కటచిహ్నాలు పూర్తిగా నశించకపోయినప్పటికీ వెనుకకు తోసుకుపోయే నుదురూ, గుబురైన కనుబొమలూ, ఎత్తుగా వెలుపలకు కనిపిస్తూ పెరిగినపండ్లూ వానరసంపర్కాన్ని చెప్పక చెబుతూంటాయి. మన మన్నట్లు నుదురనేదే అతనికి లేదు. గడ్డపు యెముక అంటే ఆతనికి లేదనే చెప్పాలి. మన మెదడులోనుండే కొన్ని భాగాలు అతని మెదడులో ఇంకా పొడచూపలేదు. క్రిందిదవుడ ఎముక పెరుగక, గడ్డమనేదే లేనందుచేత, మాట్లాడటం ఆతనికి సాధ్యపడేదికాదు.

ఈ రోజుల్లోకూడా అప్పుడప్పుడు యిట్లా నుదురూ, గడ్డమూ లేక, సొరకాయతలలున్న మనుజులచ్చటచ్చట పుట్టు

తారు. వాళ్ళని నీవు చూచే యుండవచ్చు. వారికి మన మాదిరి ఆలోచించటమూ, మాట్లాడటమూ వీలుకావు.

కాని, నలుగురూ కలిసి జీవించటంచేతా, వివిధమైన పనులు చేయటంమూలానా, నియాండర్తల్ వ్యక్తికి మాట్లాడే అవసరం తప్పిందికాదు. తన నుదురూ, గడ్డము యెముకా పెరిగేదాకా అతను మాట్లాడక కూర్చునియుంటే, జీవితరథం ముందుకు సాగేదెట్లా? ఎన్ని వేల యేండ్లకోగాని అట్టి మార్పులు శారీరకంగా కలుగలేవాయె మరి.

మాట్లాడలేకపోయినా తన తలలోని ఆలోచనలను యితరులకు విశదపర్చడానికి అతను నేర్చాడు. మాట్లాడే ఒక్క అంగం నాలుక బదులు, తన యుద్దేశాలను యావత్తు శరీరంతోనూ ఇతరులకు తెలిపేవాడు. ముఖకండరాలూ, భుజాలూ, కాళ్ళూ, మరీ ముఖ్యంగా చేతులూ ఆతని భావాలను యితరులకు వ్యక్తపరిచేవి.

ఇట్లా అంటే, "ఇదేమిటి, అర్థంలేని వ్రాత!"అని నీకను పిస్తుంది కాదూ? కాని నిజానికి దీనిలో అర్థం లేకపోలేదు. చూడు! నీ వెప్పుడైనా కుక్కను పెంచితే అది తన భావాల నెట్లా తెలుపుతుందో గ్రహించియుంటావు. నీతో యేదన్నా చెప్పాలనుకొంటే తన కండ్లు వప్పగించి నీవంక చూస్తుంది. దాని తడిముక్కు నీ కాళ్ళకు పూస్తుంది. నీ ఒడిలో తన ముందు కాళ్ళెత్తిపెట్టి తోకాడిస్తూ, శరీరమంతా ఆత్రతతో కదుల్చుతూ తమాషాగా అరుస్తుంది. నోటిమాటలు దానికి రావుకాబట్టే తన యావత్తు శరీరంతోనూ తన ఉద్దేశాన్ని నీకు తెలుపుతుంది.

ముక్కు మొనమంచి, తోక చివరనరకూ అది నీతో భాషిస్తుంది కాదూ?

ఇదేమాదిరిగా తన ఉద్దేశాలను మన పూర్వీకుడూ యితరులకు తెలిపేవాడు. మాటలు నేర్చిన నాలుకబదులు, భావముల స్ఫురింప జేసే చేతి త్రిప్పుడులూ, ముఖమండలి మార్పులూ ఆతడుపయోగించేవాడు. మనదేశపు భరత నాట్యంలో కూచిపూడివారి భాగవత ప్రదర్శనాల్లోనూ ఒకొక్క ముద్రను చేతితో పట్టి ఎంతెంత గంభీర భావాలనూ చటుక్కున ప్రజకు స్ఫురింపజేస్తారో నీకు తెలుసుననుకొంటాను.

పురాతనమనిషి ఏదన్నా "నఱుకు"అనేబదులు చేతులతో నఱికేటట్లు నటించి చూపేవాడు. అరచేతులెత్తి ముందుకుజాపి "ఇమ్ము" అని అడిగేవాడు. ఇట్టి-పనులు చేసేటప్పుడు, యింకా మాటల నేర్వని ఆతని కంఠ కండరాలూ, నాలుకా ఆయా పరిస్థితుల కనుగుణ్యమైన శబ్దం చేసేవి. కోపంతో గర్జించేవాడు. బాధతో మూలిగేవాడు. పెద్ద కేకవేసి ఎవరినన్నా పిలిచేవాడు తన మాటలులేని భాష గమనించమని.

ఇదంతా మనకెట్లా తెలుసునా అనే సందేహం నీకు కలుగవచ్చు. ప్రతి రాతిపనిముట్టూ, ఆయుధమూ అతని చేతుల నైపుణ్యాన్ని వ్యక్తీకరిస్తాయేగాని, మాటలులేని భాషను మనకు తెలుపవుగా? దీని కొక్కటే సమాధానమున్నది. మన మంతా యీ పూర్వీకుని సంతతివారమే కాబట్టి వానినుండి మనకు కొన్నికొన్ని అలవాట్లూ, చేష్టలూ సాంప్రదాయకంగా వచ్చాయి. వీనిమూలంగానే పైనుడివిన విషయాలు మనకు గ్రాహ్యమవుతాయి.

## మూ గ భా ష

మూగవాళ్ళు మాట్లాడలేరు. ఐనా వారి మనసులో వుండే ఉద్దేశాలనూ, భావాలనూ చేతులూ, కాళ్లూ, ముఖ మందలి మార్పుల సహాయంచేతా ఇతరులకు తెలియబరచ గలరు. గుఱ్ఱాన్ని తోలేట్లు చేతులతో కళ్ళెం పట్టుకొని నటించి జట్కాబండీ అని తెలియబరుస్తారు. కాళ్ళతో సైకిలు త్రొక్కినట్లు నటించి, చేతులతో హాండిలు పట్టుకొన్నట్లు విశదీకరిస్తారు. తల్లి బిడ్డను పాలిస్తూ లాలించేట్లు చూపి పసిపాప విషయమని చెప్పగలరు.

ఇట్లాగే భరతనాట్యంలో ప్రేమా, కోపమూ, విరాగమూ, ఈర్ష్యా, కలహమూ మొదలైనవానిని భావగర్భితమైన ముద్రలద్వారా ఒక్క నిమిషంలో తెలుపగలరు. కూచిపూడి భాగవతుల దశావతార ప్రదర్శనమూ, నర్తకుల గాలిపటం యెగురవేయటమూ, పాములాడి దృశ్యమూ, వేటకాని బాణం తగిలి తపించి తల్లడిల్లే లేడిబాధా, యివన్నీ యెట్టి భాషా లేకుండానే మనకు తేటతెల్లమవుతాయి.

కాబట్టి భాషకు మాటలే అవసరమనుకోటం మన ప్రస్తుతపు టలవాటుపై ఆధారపడి ఉన్నదని గ్రహించాలి.

కొన్నేండ్ల క్రితం "నెజ్ పర్సెస్" జాతికి చెందిన ఒక అమెరికా ఎఱ్ఱ యిండియను ఐరోపాకు వచ్చాడు. సాధారణంగా పుస్తకాల్లోనూ, సినీమాల్లోనూ చూచే ఎఱ్ఱయిండియనుల మాదిరి అతను లేడు. నెత్తిన పక్షి యీకల తురాయి టోపీ, మోకాళ్ళవరకూ చర్మపు మేజోళ్లూ అతను ధరించలేదు.

ఐరోపియనులమాదిరే దుస్తులు ధరించాడు. అతనికి ఆంగ్లమే కాక, వారి ఎఱ్ఱ ఇండియను భాషకూడా వచ్చు మాట్లాడడానికి.

ఈ రెండుభాషలే కాక అతనికి ఇంకొక మూడోభాష కూడా తెలుసు. అనాదినుంచీ వారి తెగవారు మాట్లాడే యొక ప్రత్యేకభాషే యీ మూడోభాష. ఇదెంతో పురాతనమైన భాష. దాన్ని నేర్చుకోను బ్రహ్మాండమైన వ్యాకరణసూత్రాలు అనవసరం. విభక్తులూ, సర్వనామాలూ, వగైరా లక్కర లేదు. ఈ భాష నేర్చుకోవాలంటే ఇక దాని ఉచ్చారణో అది బహు సులభం; ఎందుకంటే ఆ భాషను ఉచ్చరించటమే అనవసరం. అది మాట్లాడే భాష కాదు; "అభినయభాష" అని దాన్ని అనాలి.

ఆ భాషయొక్క నిఘంటువు వ్రాయాలంటే ఎట్లుం డేదీ మచ్చుకు యిచ్చట కొద్దిగా సూచిస్తాము.

విల్లు :—యెడమచేయి ముందుకు జాపి కుడిచేత్తో బలంగా వింటిత్రాటిని లాగినట్లు.

విగ్‌వామ్ :—(ఎఱ్ఱ ఇండియనులడేరా) రెండుచేతుల వ్రేళ్ళనూ జాపి మొనలజేర్చి కుడియెడమలకు స్తూపుగా నుంచుట.

తెల్లవాడు :—కుడి అరచేతిని ముఖముముందు అడ్డముగా దొరటోపీ అంచుమాదిరి పెట్టుట.

తోడేలు :—రెండు వ్రేళ్ళను తిన్నగా యెదురుగా, తోడేలు చెవులమాదిరి జాచుట.

కుందేలు :—పైమాదిరి వ్రేళ్లుజాపి, రెండవ పిడికిటిని వంపుగా వ్రేళ్ళవెనుక కుందేలు వీపుమాది రుంచుట.

చేప :—అరచేతిని జాపి బోర్లించి వ్రేళ్ళను కుడి యెడమలకు చేపతోకమాదిరి కొట్టుతూ ముందుకు జరుపుట.

కప్ప :—చేతివ్రేళ్ళను మడిచి, బల్లపై బోర్లించి కప్ప గంతులమాదరి చేతిని ఎగురవేస్తూ ముందుకు జరుపుట.

మేఘాలు :—రెండు పిడికిళ్ళను ఎత్తుగా తలపైనుంచుట.

వాన :—పిడికిళ్ళనువిప్పి ఒక్కసారి చేతుల నెత్తిమీదకు దింపుట.

నక్షత్రము :—రెండువ్రేళ్ళను ఎత్తుగా నెత్తిపైనుంచి చేర్చుతూ, తెరచుతూ, చేయ్యుట, నక్షత్రం మిణుక్ మిణుక్ మని మెఱిసినట్లు.

ఇదీ యీ విచిత్రభాష! ప్రతిదీ గుఱుతు బొమ్మ; ప్రతి బొమ్మనూ చేతులతో గాలిలో చిత్రించాలి. ఈ భాషలో పూర్వపు ఎఱ్ఱ ఇండియనులు సరీగా యీ భాషనే ఇట్లాగే, ఉపయోగించకపోయినా, చాలవరకు రెంటికీ సామ్యమున్నదనే చెప్పాలి. ఇప్పటికీ మనలో ఇంటువంటి అభినయపదాలు యెన్నో వాడుకలో ఉన్నాయి. ఉదాహరణంగా :

మోటారుకారు :—చేతులను గుండ్రంగా చక్రాల మాదిరి తిప్పటం. కారునునడిపే చక్రమును త్రిప్పుతున్నట్లు అభినయించటం.

రైలుబండి :—చక్రాలు తిరిగేటట్లు చేతులు త్రిప్పుతూ, వానిని ముందు వెనుకలకు జరపటమూ, ఇంజనుపొగ వచ్చేటట్లు నోటితో "ఛక్, ఛక్" అనటమూ.

"ఔను" అనాలంటే సాధారణంగా తలను పైకీ క్రిందకూ ఊగిస్తాము. "అక్కడ" అనాలంటే వ్రేలితో దూరంగా

చూపిస్తాము. ఈ వ్రేలుకు "చూపుడువ్రేల"నే ప్రత్యేకనామం కూడా వాడుకలో వున్నది.

ఇతరులను చూడగానే "నమస్తే" అని నోటితో అన కుండా దణ్ణం పెట్టుతాము. కోపంవస్తే ఒక వ్రేలు పైకెత్తి ఆడిస్తూ, ముఖంలో రౌద్రం చూపిస్తాము. ప్రేమాతిశయాన్ని చూపడానికి ఎదుటి మనిషియొక్క చెంపలను మన చేతులతో తాకి, మన చెంపల కద్దుకొంటాము. ముద్దు పెట్టుకొంటాము. ఈ విధంగా మాటలులేని భాషను ప్రతిదినమూ మనం వాడు తూనే యున్నాము.

ఓడలలోనివారు ఏదన్నా విషయాలు తీరంమీదవారికో, ఇంకో ఓడలోని జనులకో తెలుపాలంటే జండాల నాడించి చెబుతారు. సముద్రజలపు హోరూ, ప్రేలే ఫిరంగుల శబ్ద ములూ చెవుల గింగురుమనిపిస్తున్నా, మన పెదవులైనా కదల్పక ఎంత దూరపు జనులతోనైనా సంభాషించడానికి యీ అభి నయభాషయొక్క ప్రయోజనం అతీతమైంది.

బడిలో పంతులు పాఠం చెప్పేటప్పుడు ఏదన్నా ప్రశ్న అడగాలంటే, నీ చేయి యెత్తుతావు. దాన్నిచూచి ఆయన నిన్ను "ఏమిట"ని ప్రశ్నిస్తాడు. దీనిబదులు సందేహం కలిగిన ప్రతివాడూ ఉపాధ్యాయుని పిలవాలంటే యెంత గల్లంతు అవుతుందో ? ఈ విధంగా అభినయభాష యిప్పటికే, మాట్లాడే శక్తి మనుష్యులు సంపాదించినా, కొద్దో, గొప్పో నిలిచి యుంది మనలో.

తుర్కీ, ఆర్మీనియా దేశాల్లో స్త్రీలు మాట్లాడరాదనే ఆచారం యుండేది. అందుకని సంజ్ఞలద్వారానే వారు సంభా

పించేవారు. మొన్న మొన్నటిదాకా సిరియాలోకూడా యిట్టి సంజ్ఞలభాషే వాడుకలో నుండేది.

పర్షియాదేశపు రాజు, 'షా' తో మాట్లాడడానికి అతని బానిసవారు సంజ్ఞలే వాడేవారు. నోటిమాట నిషేధము తమపై అధికారులతో. ఇట్టి వాడుకలుండే దేశాలు కొన్ని యిప్పటికీ యున్నాయి.

మెదడూ - ఆలోచనా

అరణ్యంలోని ప్రతిమృగమూ బహు జాగ్రత్తగా రకరకాల శబ్దాలనూ, వాసనలనూ గమనిస్తూ వుంటుంది. పొదల్లో గలగలా చెట్ల మ్రానులపై రాపిడిశబ్దమూ యివి వినబడగానే త్వరగా పారిపోయి దాక్కొంటాయి.

ఉరుములశబ్దం, మెరుపులూ, చెట్లమ్రానుల ఆకులుగలగలా శబ్దించటమూ; ప్రతిజీవి ఎగిరీ, పరుగెత్తీ తనగూటిలోనూ, గుహాలోనూ దాక్కొంటుంది.

కుక్కగొడుగులూ, కుళ్ళే ఆకూ, అలాంటివాసనలతో యేదో యొక క్రొత్తవాసన వెంటనే తన ముక్కులో పసిపడుతూ, చెత్తను పెకలించి అడుగునయున్న పురుగునో, యెలుకనో భక్షించేయత్నం చేస్తుంది నేలపై తిరుగాడే జీవి.

మృగాల మాదిరే మానవుడూ ప్రతిశబ్దాన్నీ, ఆకుల గలగలనూ, నీటిపాయదల ధ్వనినీ, నడిచిపోయిన జంతువుల కాలిజాడలనూ, వాని వాసనలనూ జాగ్రత్తగా గమనించేవాడు. ఇవేకాక తనమాదిరే సంచరించే యితర మనుష్యుల ఆనవాళ్ళనూ, వారి సంజ్ఞలనూ అతను తెలుసుకోటం అలవచ్చుకొన్నాడు.

అడవిలో వేటకై బయలుదేరిన జనులలో మొదటి వాడొక లేడిని చూస్తాడు. తన చేతులతో వెనుక వచ్చేవారికి సంజ్ఞచేస్తాడు. వెంటనే వారంతా ఎక్కడికక్కడ లేడి కనుబడినదా అన్నట్లు తమ బాణాల నెక్కుపెట్టి పరుగిడివస్తారు. కాలిజాడలు కనిపెట్టి పొదల్లో కొరకబడిన ఆకు అలాల చూచీ, దూరాన గడ్డి గుబుర్లలోని శబ్దాలను వినీ తన సహచరులకు సంజ్ఞచేసి హెచ్చరించటం అలవాటు చేసుకొన్నాడు మనిషి.

దూరాన నిలువబడిన మనిషి చేసే సంజ్ఞలనూ, శబ్దాలనూ వెనుకనున్న వారు చూచేవారు, వినేవారు. కండ్ల నుండీ, చెవులనుండీ ఈ విషయాలు వారి మెదడుకు వెళ్ళేవి. ఆ మెదడు వానిని విప్పి చెప్పేది; వ్యాఖ్యానం చేసేది. వెంటనే విల్లంబుల సిద్ధంచేయటమూ, పొంచుండి, పొంచుండి నిశ్శబ్దంగా ముందుకు సాగటమూ అనే పనులు జరిగేవి.

ఈవిధంగా రకరకాల సంజ్ఞలు అనుక్షణమూ మెదడుకు వెడుతూయుండేవి. వీటి నన్నిటినీ రకంవారీగా ఏర్పరచడానికీ, వాని అర్థం గ్రహించడానికీ మెదడుకు చాలా పని యేర్పడేది. ఇందుమూలాన మానవుని మెదడు త్వరత్వరగా పెరిగి పెద్దదయింది. జంతువుల మెదడులోవలే కాక, దానిలో అనేక అల్లికలుగా, గజిబిజిగా నరాలు అల్లుకొనిపోయాయి. ప్రతి యొక్కభాగమూ, యింకో భాగంతో అన్యోన్యసంబంధం యేర్పర్చుకోగలిగింది మెదడులో.

ఇందుమూలంగానే 'పితకాంత్రోపస్' మానవుని మెదడు కన్న 'నియాండర్తలు'ని మెదడు పెద్దదిగా మారింది. మెదడు పెరిగేకొలదీ ఆలోచనాశక్తి అతిశయించింది.

“సూర్యుడు” అనే సంజ్ఞను మానవుడు చూడగానే అప్పుడు అర్ధరాత్రియైనా, సూర్యుడే కండ్లకు కనుపించక పోయినా, అతని మెదడు సూర్యుని ప్రతిమను అతనికి ప్రత్యక్షంగా కనుపింపజేయగలిగింది. “ఈటెను తీసుకొనిరా” అనే సంజ్ఞ చూడగానే, అతనిదగ్గర అప్పుడు యీటె లేకున్నా, ఆలోచనలు పరుగిడి వెంటనే అతడు ఈటెను పట్టుకువచ్చే వాడు.

ఒకరితో నొకరు చేరి వివిధ పనులు చేయటంవలన మనుజులకు మాటలాడే అభ్యాసం యేర్పడింది. ఇట్లా మాట్లాడే కొలదీ వారి మెదడు ఆలోచించటం నేర్చుకొన్నది.

ఈ ఆలోచనా శక్తిని తానే క్రమంగా వృద్ధిచేసుకొన్నాడేగాని, జంతువులకు లేని యీ నూతనశక్తిని మానవునకు యే దేవుడో ప్రసాదించాడనుకోరాదు.

సంజ్ఞల బదులు మాటలు

తక్కువ అనుభవాలూ, కొద్ది పనిముట్లూ ఉండే రోజుల్లో ఏవో కొన్ని సంజ్ఞలుమాత్రం ఒకరితో నొకరు సంభాషించడానికి సరిపోయేవి. వారుచేసే పనుల రకాలు వృద్ధి అయ్యేకొలదీ సంజ్ఞలు కూడా పెరిగాయి. పూర్వమంత సులభంగా వానితో సంప్రతించడం వీలయిందికాదు.

క్రమంగా పటాల భాషను జనులు కనిపెట్టారు. అంటే గాలిలో చేతులతో జంతువుల బొమ్మలూ, చెట్లూ, ఆయుధాల బొమ్మలూ వ్రాయటం నేర్చారు. ముండ్లపందినిగురించి మనము ఏదన్నా చెప్పాలనుకో, మనం దానిపటం వ్రాస్తాము.

చేష్టలూ, సంజ్ఞలద్వారా అదెట్లా తన చెవులను నిక్కబొడిచేదీ ముట్టెతో మన్ను పెకలించి,ముందరికాళ్ళతో ప్రక్కలకు తోసి వేసేదీ, సూదుల్లాగా తన ముండ్ల నేవిధంగా విప్పేదీ, సమస్తమూ వర్ణిస్తాము. దీనిబదులు ఏదన్నా సాధారణమాట, నేను నీళ్ళు త్రాగుచున్నాను అనేది అంటే, ఆ నీటిని సీసానుండా, టంబ్లరు నుండా, లేక చేతులుపట్టా త్రాగేదని మనం చెప్పలేము.

పూర్వీకులు నీళ్ళు త్రాగటాన్ని చెప్పాలంటే చేతులు దోసెడుగాపట్టి అందుండే నీటిని ఆతురతతో త్రాగేటట్లు నటించేవారు. ఈ విధంగా అభినయభాషను వారుపయోగించినా, అందులో కొన్ని కొన్ని కష్టాలు వారికి గోచరమయియుండవచ్చు. "కుడి కన్ను" లేక "ఎడమ కన్ను" అనేవి సంజ్ఞద్వారా తెలుపవచ్చేగాని, ఊరికే "కన్ను" అనేది వ్యక్తపర్చటం కష్టం.

ఇంకో కష్టమేమిటంటే, రాత్రులం దీసంజ్ఞలభాష యెందుకూ పనికివచ్చేదికాదు. చీకట్లో ఎంతబలంగా మన చేతులాడించినా, ఎట్టి సంజ్ఞలు చేసినా ఎదుటివారు చూడలేరుగా! ఇదే మాదిరి పగటివేళ చుట్టూ చెట్లు, చేమ లడ్డంగా వుండే ప్రదేశాల్లోకూడా యీ అభినయభాష నిరుపయోగమయ్యేది. అంతా యెడారిగా, బయలుగా వుంటే ఇచ్చటి సంజ్ఞలు దూరాన్నుండే అచ్చటివారు చూడగలరు; చెట్లమయంగా ప్రదేశం ఉంటే ఈ భాషవలన లాభం ఉండేదికాదు.

ఇందుమూలాన సంజ్ఞలబదులు శబ్దం ఉపయోగానికి వచ్చింది. రకరకాల శబ్దాలుచేసి తన ఆలోచనల నితరులకు తెలుపవలసిన ఆవశ్యకత యేర్పడ్డది.

మొదట్లో మానవుని గొంతు కండరాలూ, నాలుకా అంతగా ఆతనికి స్వాధీనంగా వుండేవికావు. జంతువుల్లాగా యేదో అరవటమో, మూల్గటమో, గర్జించటమోమాత్రం అతనికి తెలుసు. నెమ్మదిమీదనే తన నాలుకను స్వాధీనపరచుకొని, నోటిలో త్రిప్పి శబ్దోచ్చారణ అతడు కనుగొన్నాడు. మనకు గోచరం కాకపోయినా, మన నాలుక మాట్లాడేటప్పుడు ఎన్నెన్నో వంకరలు తిరుగుతుంది, సాగుతుంది, ముడతబడుతుంది. ఇట్టి శక్తి ఒక్కసారిగా మానవునకు కలిగిందనుకోరాదు.

మొదట్లో ఆతని మాటలన్నీ సంజ్ఞాపదాల మాదిరే యుండేవి. ప్రతివస్తువునూ, దాని ప్రతిగుణాన్నీ విపులంగా చెప్పే మాటలే మొదట యేర్పడ్డాయి.

"ఈవె" జాతి జనుల భాషలో "నడక" అనే పదం యెన్నడూ విడిగా వాడరు. ఆ నడకను వర్ణించే పదా లేవో కొన్ని ఎప్పుడూ దానితో చేర్చబడుతాయి. ఉదాహరణంగా: "జొడ్జిడ్జి" అంటే గట్టిగా దబాయించి నడచుట; "జొబొకొబొకొ" అంటే స్థూలకాయుడిలాగా బరువుగా పాదాలూని నడచుట; "జొబూలబూల" తల వంచుకొని, గుద్దబడ్డ చేసబడినట్లు నడచుట; "జొపియాపియా" తడబడుతూ నడచుట; "జొగోవు గోవు" తల వంచుకొని దిగాలుబడి నడచుట; ఈ విధంగా నడకయొక్క వివిధ రకాలనూ వర్ణించేమాటలున్నాయి. సంజ్ఞలచేత చూపించే ప్రతివిషయానికీ మాటలు యేర్పరచబడ్డాయి.

కొందరు సంజ్ఞలతోనూ, మరికొందరు మాటలతోనూ భాషించటం నేర్చుకోగలిగారు. క్రమంగా మాటలభాష అభినయభాషయొక్క అగత్యాన్ని తొలిగించివేసింది.

## ఇంతవరకూ గ్రహించింది

ఇంతవరకు మనం గ్రహించింది యేదో ఒక్కసారి పునర్విమర్శన చేసి చూద్దాము.

ఏదైనా ఒక నదియొక్క రహస్యాన్ని కనుక్కోవాలంటే, దాని తీరానే పైకి ప్రయాణం చేస్తాము. పోనుపోను అది సన్నగిలుతుంది. ఏదో కొండలలో చిన్న సెలయేరుగానో, కొండ వాగుగానో మారి, ఇంకా సన్నగిలి దాని జన్మస్థానం మన కగుపిస్తుంది.

మానవజీవితం యొక బ్రహ్మాండమైన నదీప్రవాహం వంటిది. ఈ నదియొక్క ప్రారంభదశను వెదకుతూ పోయిపోయి మానవసంఘము లెట్లేర్పడ్డదీ, భాషలు ఏవిధంగా ప్రారంభమైనదీ, ఆలోచనాశక్తి యే అనుభవాలచేత సృష్టితమైనదీ గ్రహించగలిగాము.

నది ముందుకు సాగుతుంది. ఎన్నో ఉపనదులనీరు దాని లోనికి జారి అది లోతవుతుంది. గర్జనధ్వనితో ప్రవహిస్తుంది. అట్లే మానవజీవితం కాలగతిని తరతరాల అనుభవాల గ్రహించి గంభీరంగా, లోతుగా మన కగుపిస్తోంది యిప్పుడు.

ఎన్నో తెగలు పుట్టాయి; పైకొచ్చాయి; నశించిపోయాయి. వారి భవనాలూ, కట్టడాలూ, నగరాలూ శిథిలమైపోయాయి. మట్టిలో మట్టిగా, నామరూపాలైనా లేకుండా ఎన్నెన్ని తరాలో

నశించిపోయాయి. కాలగతిని నశించిపోని దేదీ యీ ప్రపంచకంలో లేదనే గట్టినమ్మకం ఇందుమూలాన మనసు కలుగుతుంది.

కాని, మానవ అనుభవమూ, ఈ అనుభవంవలన మానవులు సంపాదించిన జ్ఞానమూ, శక్తీ, కాలగతిని క్షీణించే బదులు బలపడుతాయి. ఈ అనుభవ ఫలితమును నశింపజేసే దేదీ లోకంలో లేదు. మన భాషల్లో, కళలలో, ఆలోచనలలో, శాస్త్రపరిశోధనలలో ఈ అనుభవఫలితము గట్టిగా నాటుకొనియున్నది.

ఉపనది తన నీళ్ళను తెచ్చి పెద్ద నదిలో నింపుతుంది. ఉపనదిలో నీరు అయిపోతోందని మన మనుకోవచ్చు. ఒక్కొక్క సమయం ఆ ఉపనది పూర్తిగా యెండిపోవచ్చు. తన్ను మాలిన ధర్మంచేసి ఆత్మహత్య గావించుకొన్నదని ఉపనదిని మనం నిందించవచ్చు. కానీ, పెద్దనదియొక్క జలంలో యీ ఉపనది ప్రవహిస్తోంది. తా నెన్నడూ చూడలేనను కొన్న నూతనప్రదేశాలలో అది పారుతోంది; సాగిపోతోంది. పెద్దనదిలో సమస్త ఉపనదులూ ఐక్యమయి జీవిస్తాయి. నశించిన తెగలూ, జాతుల జీవితానుభవాలు, మన యీ కాలపు ప్రజల అనుభవాలలో, జీవయాత్రలో ఐక్యమయి సజీవంగా వున్నాయని గ్రహించాలి. ఇంకా యెట్టెట్టి నూతన తీరాల చిందులు త్రొక్కుతూ యీ నది సాగిపోనున్నదో యెవరు చెప్పగలరు?

ఈ నదియొక్క జన్మస్థానాన్ని చేరాము. పనిచేయటమూ, మాట్లాడటమూ, ఆలోచించటమూ అనే శక్తులుగల మానవుడు సృష్టిలో యెట్లేర్పడ్డాడో గ్రహించుకోగలిగాము.

"కృషిఫలితంగానే మానవుడు లోకంలో వుద్భవించాడని" యొక మహానుభావుడన్నది అక్షరాలా నిజమని ఒప్పుకోక తప్పదు.



# 2

# మన కథానాయకుని యౌవన దశ

ఈ పుస్తకం మొదటిభాగంలో మన కథానాయకుడైన మానవుడు యెచ్చట ఏ కాలంలో పుట్టాడో అనేవిషయం ఆలోచించాము. మనందరి బిడ్డల్లాగానే శైశవదశలో అతడెట్లా చతుష్పాదుడై సంచరించాడో, క్రమంగా కాళ్ళు స్వాధీనం చేసుకొని నిలబడటమూ, నాలుగైదు తప్పటడుగులు వేయటమూ, మధ్యమధ్య చేతులాన్చి తిరుగటమూ యెట్లభ్యసించాడో కనుగొన్నాము. మొదట్లో అతనికి మాటలేవీ వచ్చాయికావు. వివిధభావాలనూ ఏవేవో పసిబిడ్డభాషలో వెలిబుచ్చాడు. కాళ్ళు బాగా స్వాధీనమయి, చేతులు నడిచే పనినుండి విముక్తి చెందగానే, వానితో యేవేవో సంజ్ఞలు చేయటమూ, చుట్టుప్రక్కలందుండే రాళ్ళూ, రప్పలూ, కొమ్మలూ పట్టుకొని యీపనీ, ఆపనీ చేయటమూ నేర్చాడు. కౌమారదశ వచ్చేటప్పటికి తన చేతులతో రకరకాల పనిముట్లు చేయటమూ, వేర్వేరుపనులు చేయటమూ నేర్చాడు. ఈ దశ

లోనే ఆతడు తన నాలుకను స్వాధీనపర్చుకొని, శబ్దోచ్చారణ కూడా ప్రారంభించాడు. ఇదంతా వెనుకటిభాగంలో చెప్ప బడింది. క్రమంగా మన కథానాయకుడు యౌవనదశను ప్రారం భించాడు. ఈ రెండోభాగంలో ఈ నవయువకుని జీవిత మెట్లా వికసించిందో, ఏయే నూతనశక్తుల నతడు స్వాధీనపర్చు కొన్నాడో, ఏయే పనులందు తన కాలం గడిపాడో అనే విష యాలను తెలుసుకోడానికి యత్నిస్తాము.



# మునుపటి యిల్లు మార్చి

ఎవరన్నా యింకో కొత్తయింటికి వెళ్ళారనుకో, ఆ పాతగృహానికి పోయి చూస్తే చాలా తమాషాగా వుంటుంది అంతా. పాతఇల్లు వదలి వెళ్ళేటప్పుడు దాన్ని ఊడ్చి, శుభ్రంచేసి వప్పగించకూడదని మనలో ఒక ఆచారం వున్నది. అందుకని ఆ ఇంటినిండా ఎక్కడచూచినా చింపి పారవేసిన కాగితపు ముక్కలుంటాయి. పాత చీపుళ్లూ, చేటలూ, పగిలిపోయిన పింగాణిగిన్నెలూ, చిమ్నీ పగిలి పాడైపోయిన చిన్నలాంతరూ, ఊడ్చి, ఊడ్చి అరిగిపోయిన పొట్టి పాత చీపురూ, యిట్లాంటి వెన్నో పడిఉంటాయి. కేవలం ఈ సామానులను చూచి, పూర్వం ఆ యింటివారెట్టి జీవితం గడిపేవారో స్పష్టంగా గ్రహించటం అంత సులభంకాదు, మనకు.

పురాతన మానవుని జీవితవిషయాలని గురించి కనుక్కోడానికి యత్నించే శాస్త్రకారుల సమస్యకూడా పైన చెప్పిన మన సమస్యవంటిదే. ఇంతేకాదు. ఈ శాస్త్రజ్ఞులు పాడు పడిన పురాతన కొంపలను చూడబోయేటప్పటికి, ఎన్నో కొన్ని వందలయేండ్లు గడచియుంటాయి. వానిలో మనుష్యులు నివ

సించి, నిజానికి యిల్లనేదే కనుపించదు. పడిపోయిన కొన్ని గోడలూ, మరికొన్ని యిండ్ల పునాదులూ, పూర్వీకు లుపయోగించిన సామానుల ముక్కలూ వగైరా మాత్రం కనుపిస్తాయి. ఈ స్వల్ప ఆధారాలనుండి లెక్కలేనన్ని ప్రశ్నలకు నీవూ, నేనూ అడిగేవానికి, వారు సమాధానం చెప్పాలి. శాస్త్రకారుల పని అల్లాటప్పావ్యవహార మనుకోకు!

మన దేశంలో అనేకచోట్ల పురాతన శిథిలభవనాలూ, మసీదులూ, దేవాలయాలూ, కోటలూ, గోపురాలూ యెన్నో ఉన్నాయి. విఱిగిపడిపోయే ప్రతిరాయీ, ద్వారమూ, విచ్చల విడిగా మొక్కలు పెఱిగీ, తీగలల్లుకొనీ, రాయి విసరివేస్తే యెంతోసేపటికిగాని నీటిని తాకిన శబ్దమే వినబడని పాత బావులూ; ఇటుకోళ్ళ శబ్దంతో చీకట్లు క్రమ్ముకొని భయం గొలిపే పూర్వీకుల శయ్యాగృహాలూ, యిటువంటివన్నీ గడచిపోయిన తరాల ప్రజలగుఱించి యెన్నెన్నో విచిత్రవిషయాలు మనకు తెలుపుతాయి.

ఇటువంటి పాతనివాసాలకన్నా, యింకా యెంతో పురాతనమైన నివాసాలుకూడా ఉన్నాయి. సాధారణ గోడల్లాగా కొండలు త్వరలో శిథిలంకావు. ఈ కొండగుహల్లో పూర్వం రకరకాల జీవులు తమ నివాసా లేర్పర్చుకొన్నాయి. పదిహేను వేల సంవత్సరాలకు ముందు మనుజులు వసించిన పాతగుహలు యిప్పటికీ ఉన్నాయి. ఇటువంటి వానిలో యెందరెందరో జాతుల జనులు మారుతూ నివసించారు. మొట్టమొదట్లో భూమి యడుగునుండే ఊటనీరు నివాసం యేర్పరుచుకొంది. ఆ నీరు తన

వెంబడి యీ గుహల్లోకి యిసుకా, బంకమన్నూ, ఎఱ్ఱమట్టినీ తీసుకువచ్చింది.

క్రమంగా నీరు యీ గుహను వదలివేసింది. తరువాత ఆగుహలో జనులు తమ నివాసా లేర్పర్చుకొన్నారు. ఏదో తమకు చేతనయినట్లు జనులు చెక్కి పదునుచేసిన చెకుముకి రాళ్ళతునక లీమట్టిలో కనుపిస్తాయి. వీనినిబట్టే అచ్చట ప్రజ నివసించారని మనకు తెలుస్తుంది. ఆ జనులు జంతు కళేబరాలను కోసేవారు. ఎముకల కతుకుకొన్న మాంసకండరాల నూడ బెరికేవారు. ఎముకల చీల్చి లోపలి మూలగను తినేవారు. ఈ పనులన్నిటికీ తమ చెకుముకి పనిముట్ల నుపయోగించేవారు. వాళ్ళు గొప్ప జంతువేటకాండ్రని యిందుమూలాన తెలుస్తుంది.

చాలా యేండ్లు గడిచాయి. ఎందుకనో జనులు యీ గుహను వదిలిపెట్టేశారు. కొత్తవారెవరో నివాసం యేర్పరుచుకొన్నారు. గుహ గోడలు నున్నగా సాఫీగా రుద్దబడినట్లు కనుపిస్తాయి. ఎలుగుబంట్లు తమ బొచ్చు శరీరాలను యీ గుహ గోడలకు రాచి రాచి నున్నగా అరగదీశాయి. అట్టి పెద్ద యెలుగుగొడ్ల కపాలపు యెముక లిచ్చటున్నాయి. వెడల్పైన నుదుగూ, సన్నని పొడుగుముట్టే; వాని యెముకలను చూస్తేనే భయంవేస్తుంది.

ఈ పొరకు పైనుండే మట్టిభాగాన్ని పరీక్షిస్తే తొలిటిగీ మానవ నివాసచిహ్నా లగుపిస్తాయి. గొప్ప అగ్నిగుండాల బూడిదా, బొగ్గూ, కీళ్ళూడిన జంతువులయెముకలూ, రాతి, యెముకల పనిముట్లూ ఉంటాయి. ఈ వస్తువులను జాగ్రత్తగా

పరిశీలించి అప్పటికి ప్రజ యెట్టి జీవితాలు గడిపారో కనుక్కో వచ్చు.

ఇక్కడ చూడగానే అన్నీ యేవేవో విఱిగిన రాతిముక్కలూ, ఎముకలూ అని మన కనిపిస్తుంది. కొంచెం నిదానించి చూస్తే భావికాలపు సుత్తీ, సమ్మెటా, కత్తీ, అంపమూ, సూదీ మన కిందులో కనుపిస్తాయి. వానిలో ఒక పనిముట్టు కొక అంచు పదునుగా కత్తిలాగున్నది; ఇంకోదాని మొన వాడిగా సూదిలాగున్నది. మఱి ఇంకొకదాని అంచున రంపపు పళ్ళలా గున్నాయి.

ఈ ఆయుధాలన్నిటిలో పురాతనమైనది పెద్ద రాతిసుత్తి. దీనితో రాళ్ళు పగులగొట్టేవారు. విరిగి చెదరిన ముక్కలతో వేర్వేరు పనిముట్లు చేసేవారు.

ఈ పాతసుత్తికి దగ్గరలోనే మట్టిలో పూడ్చుకుపోయిన పురాతన సుత్తి మన కగుపిస్తుంది. దానిని గట్టి యెముకతో చేశారు. సుత్తిదెబ్బలూ, దానిపై పగుల గొట్టిన రాళ్ళగీతలూ దీనిపై నున్నాయి. అదెంత గట్టి యెముకో! ఎంత పెద్ద మృగానిదో!!

వీరికి కొన్ని వేల యేండ్లక్రితం ఇదేగుహలో వసించిన మానవులకన్న వీ రెన్నివిధాలో ముందంజవేశారని తెలుస్తుంది. ఈ పనిముట్లనుబట్టి పూర్వీకులు నేర్వని వెన్నెన్నో కొత్తపనులు వీరికి తెలుసు.

పూర్వం, అన్నిరకాల పనులకూ వాడియైన రాతిపని ముట్టునొక్కదానినే వినియోగిస్తే, ఈప్రజలు కోసేందు కొకటీ, చీల్చడాని కింకొకటీ, దంచడానికి మరొకటీ ఇట్లా పనిముట్లు

చేశారు. పొడుగ్గా, చెప్పులుకుట్టే సూదిమాదిరి ఆయుధంతో జంతువుల తోళ్ళను బట్టలుగా కుట్టుకొనేవారు. పళ్ళున్న ఇంకో ఆయుధంతో మాంసమును కోసి తోళ్ళను పదును చేసేవారు. వాడి మొనగలరాయి, వారి యీటె మొనగా నుండేది.

చలిబాధ పెరిగేకొలదీ ఈ ప్రజ లెన్నెన్నో విధాల దానినుండి తప్పించుకోడానికి యత్నించారు. ఎలుగుగొడ్ల తోళ్ళతో బట్టలు కుట్టుకొన్నారు. చలికాలంలో తినడానికి మాంసమును దాచిపెట్టుకొన్నారు. నివాసానికి వెచ్చని ఇండ్లు నిర్మించుకొన్నారు. ఇన్నిరకాల పనులకూ ఒకేపనిముట్టు వారికి సరిపోయిందికాదు. ఎన్నెన్ని రకాలో తయారుచేసుకొన్నారు. వారి నివాసాల్లో యీకాలపు పనిముట్ల శైశవదశనుచూపే వెన్నో వున్నాయి. కాలగతిని వానిలో అనేకం నశించినా, గట్టి రాతివీ, యెముకవీమాత్రం మిగిలి ఉన్నాయి.

చర్మమూ, కొయ్యా పురుగులుపట్టి మట్టిలో మట్టిగా కలిసిపోయాయి. తోలువస్తువులు వారు కట్టుకొన్నవి కనుపించక పోయినా వానిని కుట్టినసూది కనుపిస్తోంది. ఈటె పిడికఱ్ఱ చదలు బట్టిపోయిందేకాని, దాని రాతిమొన మట్టిపాలు కాలేదు.

శాస్త్రజ్ఞులు భూమిని త్రవ్వి ఇటువంటి విషయాలెన్నో పరిశీలించి వాని సందేశాలను మనవంటి సామాన్య ప్రజలకు తెలుపుతారు. భూమిని పైనుండి లోతుకు త్రవ్వుతూ పోవాలిగా? కాబట్టి లోతుగా పోయేకొలదీ మనకగుపించే యొక్కొక్క పొరా, యీ ప్రకృతి గ్రంథంలో యొక పుటవంటిది. క్రింది పొరలు పురాతనపువి. ఈ ప్రకృతి గ్రంథాన్ని మొదటినుండీ చదివే బదులు, శాస్త్రజ్ఞులు, ఆఖరుపుట ఈ కాలపుదాని

నుండే ప్రారంభించి వెనుకకు చదువుతూపోతారు? మన మందరమూ చదివే విధానానికి విరుద్ధంగా మహమ్మదీయ గ్రంథాలు లిఖిస్తారు. మన ఆఖరుపుట, వారి మొదటిది. ప్రకృతి పుస్తకం చదివేవిధంకూడా అటువంటిదే.

సరే, మనం పరీక్ష చేస్తున్న గుహలో పైనుడివిన మనుజుల కాలం తరువాత యేమి జరిగిందో చూద్దాము.

అందుండే మట్టిపొరల చూస్తే, జను లనేకపర్యాయము లాగుహను త్యజించి వెళ్ళారనీ, తిరిగి ఎన్నోసార్లు వచ్చారనీ తెలుస్తుంది. మనుష్యులు లేని కాలంలో ఎలుగుబంట్లూ, హైనాలూ (తోడేలువంటి జీవి) దానిలో వసించాయి. గుహ పైకప్పునుండి రాళ్ళూ, మన్నూ నేలపైబడి క్రింది భాగాలను పూడ్చేవి. అందుచేత ఎవరైనా క్రొత్తప్రజగానీ, జంతువులుకానీ దానిలో నివసించడానికివస్తే అంతకు పూర్వపు నివాసుల చిహ్నాలేవీ వారి కగుపించేవేకావు. ఏవేవో రాళ్లూ, రప్పలూ, మన్నూ నేలపై పరచియుండేవి.

క్రమంగా కాలం జరిగిపోయింది. శతాబ్దాలూ, వేల కొలది ఏండ్లూ గడచిపోయాయి. ప్రకృతిలో స్వాభావసిద్ధంగా దొరికే నివాసాలను, అంటే గుహలను మనుష్యులు వదలి పెట్టారు. ఆరుబయట తామే నూతనంగా తమ ఇండ్లను కట్టు కోటం ప్రారంభించారు.

పచ్చని కొండల పార్శ్వాల్లో తమ మందల మేపే గొల్ల కాపరులూ, దారితప్పి కొండమయప్రదేశాల్లో చిక్కుబడినవారూ మాత్రం ఏవో కొద్దిరోజులు యీ గుహల నుపయోగించేవారు.

ఇట్లా చూస్తూపోగా ఆఖరుకు ఈ గుహాయొక్క చివరి ప్రకరణానికి మనం వస్తాము. తిరిగీ జనులు యీ గుహాకు వస్తారు. కాని వీ రిందులో నివసించడానికి రాలేదు. పూర్వీకు లెట్లీగుహాలో వసించారో పరిశీలించడానికి వచ్చారు. వీరే మన శాస్త్రకారులు!

ఈ విధంగా ప్రకృతి గ్రంథాన్ని ఆఖరునుండి చదివి, శాస్త్రజ్ఞు లీ గుహాయొక్క విచిత్రగాధనంతా మనకు తెలుపుతారు. మానవుడు, తన్నెవరో తఱుముచున్నట్లు ముందుకు సాగిపోతూనేయున్నాడు. పురాతనమైన ఒకటి రెండు పనిముట్లు పెఱిగిపోయి, రకరకాలు తయారవుతాయి. రాతి పనిముట్ల బదులు యెముకవీ, కొమ్మువీ కనుపిస్తాయి. తోళ్ళనూ, ఎముకలనూ, కొయ్యనూ వివిధరకాల సామాగ్రులకుపయోగిస్తాడు. పుట్టుకతో వచ్చిన తన చేతి పదివ్రేళ్ళతోనూ, పది వందలరకాల పదును పనిముట్లను చేసుకోగలిగాడు మనుజుడు.

## చే తి పొ డ వు

చేతిపొడవునుబట్టి పనియొక్క అందుబాటుంటుంది. పాపాయి పొట్టిచేతులు చెంతనున్న గిలక్కాయనే అందుకొంటే, పెద్ద వారి పొడుగు చేతులు ఎత్తుగానున్న మామిడికాయలను కోస్తాయి.

మొదట్లో పురాతన మానవుడు ఏదన్నా యెలుగుబంటిని చూస్తే భయపడి పరుగెత్తిపోయేవాడు. దానితో పోట్లాడి యెట్టిప్రయోజనం లేదని వాడికి తెలుసు. చిన్న చిన్న మృగాలను తన అందుబాటులో నుండేవానినే పట్టి చంపేవాడు.

క్రమంగా, రాతి యీటెను తయారుచేసుకోగలిగా డతడు. పొడవైన కఱ్ఱకొసకు పదునైన రాతి మొనను బిగించి కట్టటంతోనే, ఆతనిచేయి అకస్మాత్తుగా పొడుగ్గా పెరిగి పోయింది! ఇదివరకు ఎలుగును చూడగానే భయపడి పరుగెత్తి పోయే అతని కాళ్ళు బలంగా నేలను తన్ని, దబాయించి నిలబడ నేర్చాయి.

తన వెనుక కాళ్ళపై నిలబడి ఆతనిపై దుముకడానికి యత్నించే భయంకర భల్లూకాని కత డెదురయ్యేవాడు. యీటె పుచ్చుకొని తన పొడుగుపాటి యీటె మొనను దాని గుండెభాగంలో గుచ్చేవాడు. ఎలుగుయొక్క పొట్టి కాళ్ళతని అందుకోలేకపోయేవి. బాధతో, కోపంతో, ఆవేశంతో అరుస్తూ ఆతనిపై దుమికడానికి ముందుకు రావాలేది. బలంగా ముందు కురికేది. ఫలితం? ఈటె మొన మరీలోతుగా దానిలో గుచ్చుకొనేది. అటువంటప్పుడాతని యీటెకఱ్ఱ విరిగితే పాపం! ఏమయ్యేదో? ఒక్కపెట్టున పిచ్చికోపంతో వానిపై బడి తన వాడి గోళ్ళతో రక్కి, పదును కోరలతో కరచి చిత్రవధచేసేది వానిని.

కాని, అట్టి ప్రమాదం తరచుగా సంభవించేదికాదు. పెద్ద మృగాల వేటకు పదిమందీ చేరి వెళ్ళేవారు. తనమీద పడుతుంది మృగం అని భయం వేయగానే పెద్ద కేకలు పెట్టేవాడు. అవి విని నలుగురూ వచ్చి అమాంతంగా ఎలుగుపైబడి తమ రాతి కత్తులతో దాని కడతేర్చేవారు.

ఈటెను కనిపెట్టటంతోనే ఇంతకుపూర్వం మాత్ర డెన్నడూ తనకు శక్యమవుతుందని అనుకోని రకరకాల జంతుజాలమూ

అతనివశమైంది. ఇప్పటికీ పురాతన గుహాల్లో జనులు తమ తిను బండారముల దాచిన గదు లగుపిస్తాయి. వాటి నేలంతా రాళ్ళు పరచి యుంటుంది. ఎలుగుల యెముకలు కుప్పతిప్పలుగా ఆ గదుల్లో మన కగుపిస్తాయి. అంత యెక్కువగా ఎలుగుబంటి మాంసాన్ని దాచేవారంటే, వారెంత గొప్ప వేటగాండ్రో నీవే ఊహించుకో.

ఎలుగుబంటివంటి బాగా పసుగిడ లేని మృగాలకు అతని యీటె ఉపయోగపడినట్లు, చురుకైన యితర మృగాల కది లాభించిందికాదు. మైదానాల్లో తిరిగేటపుడు అడవిదున్నలూ, గుఱ్ఱాలూ మందమందలుగా వారు చూచేవారు. నెమ్మదిగా పొంచుండి, అట్టిమందను సమీపించేలోగా ఏమాత్రం చప్పుడైనా అవన్నీ వాయువేగంతో పారిపోయేవి.

క్రమేపీ తను వేటాడి చంపిన జంతువుల యెముకలనుండి వాడిగా సూది మొనగల చిన్న ముక్కల చెక్కటం నేర్చాడు. వానిని పొట్టికఱ్ఱలకు బిగించాడు. పసుగిడే మందమీద నలుగురూ చేరి యీ ఆయుధాలను విసరేవారు. అదే మొదటిబాణం; చిన్నప్పటినుండీ యీ బాణాల విసరటం అభ్యసించినా ఎంత గొప్పగా బాణవర్షం కురిపించినా, పలాయిత మృగాలకు ఏపది పండ్రెండో మాత్రం తగిలేవి.

ఇట్లా వేలకొలది సంవత్సరాలు గడచేటప్పటికి అడవి దున్నలూ, అశ్వాలూ అరుదైపోయాయి. వారింకొక కొత్త రకం ఆయుధాన్ని కనిపెడితేనేగాని మిగిలినవానిని చంపడానికి వీలు లేకపోయింది.

లేతకఱ్ఱను కోసి, వంచి దాని రెండుకొనలకూ బలంగా లాగి త్రాడు కట్టటం నేర్చాడు. ఇదే ప్రథమవిల్లు. వింటి త్రాటిని లాగి, బాణం ఎక్కుపట్టి వదిలేవాడు. లాగేటప్పు డాతని భుజబలమంతా వింటిత్రాటికెక్కి బాణం వాయువేగంతో యెగిరి జంతువుల తాకేది. ఇట్లా క్రమంగా మానవుని చేయి పొడుగు పొడుగ్గా పెరిగిపోయింది. ఈ నూతన ఆయుధాల వలన యెంతదూరపు మృగాలైనా అతని కందుబాటులో నుండేవి.

మొదట్లో చిన్నవిల్లులు చేశారు. తరువాత పెద్దవి మనిషంత యెత్తుండేవి చేసారు. మామత్‌నో, రెయిన్‌డీరునో తన చిన్న బాణంతో చంపేవాడు. వాని యెముకలనుండే బలమైన చక్కని బాణాలుచేసి, తిరిగీ ఆ మృగాలనే చంపేవాడు. ఇట్టి పనులను మానవుడు తప్ప ఏ ఇతర జీవి చేయలేకపోయింది.

ఎంతెంత దూరపు మృగాలనైనా, ఒకటికాదు, రెండు కాదు, వందలకొలదిగానుండే మందలనైనా, వెన్నంటి తరిమి చంపగలిగిన ఈ పొడుగుచేయిని నిర్మించుకొన్న మానవుడు గ్రంథం మొదట్లో చెప్పినట్లు మన కథల్లో వినే బ్రహ్మాండ రాక్షసులకంటె యెంతో ధీశాలి అనకతప్పదు. మహత్తర కార్యాలు చేయగల శక్తు లాతనిలో క్రమేపీ వృద్ధిచెందుతున్నా యనడానికి ఇదొక గొప్ప నిదర్శనం.

## సజీవమైన జలపాతం

ఫ్రాన్సుదేశంలో "సాల్యూట్రి" అనే ఒకచోట పెద్ద నిట్రమైన కొండ అంచొకటున్నది. ఈ కొండ అడుగునున్న

## సజీవమైన జలపాతం!



భయంతో దారీతెన్నూ తెలియక, తోకలు పైకెత్తి నోట నురుగులు గ్రక్కుతూ
ఆ గుర్రాలన్నీ ఏదో నదీ ప్రవాహంలాగా పరుగెత్తాయి.

లోయలో శాస్త్రజ్ఞు లనేక జంతువుల యెముకలు కనిపెట్టారు. మామత్ యెముకల తునకలూ, పురాతన పశుజాతుల శల్యాలూ, గుహ యెలుగుబంట్ల కపాలాలూ ఎన్నో ఉన్నాయి.

ఈ యెముకల్లో చాలాభాగం గుఱ్ఱాల యెముకలే ఉన్నాయి. మఱి కొన్ని తావుల్లో చాలా అడుగుల యెత్తుగా యీ గుఱ్ఱపు టెముకలు పేర్చిఉన్నాయి. ఇన్ని ఎముక లుండబట్టి కొన్నిలక్షల గుఱ్ఱా లిచ్చట మరణించియుండాలని శాస్త్రజ్ఞు లంటారు.

ఇన్ని గుఱ్ఱా లెచ్చటనుండి వచ్చాయో? ఈ ప్రత్యేక ప్రదేశంలో అవన్నీ యెందుకు మరణించాయో?

ఆ ఎముకల్లో చాలావరకు కీళ్ళు తొలగినవీ, విరిగినవీ, నల్లగా కాలినవీ ఉన్నాయి. ఎవరో ఈ ఎముకల నిచ్చట చేర్చేముందు, ఆ అశ్వాలను భక్షించడానికని కాల్చియుండా లని తెలుస్తుంది. ఇది గుఱ్ఱాల స్మశానం కాదనీ, ఏ జాతిప్రజలో వంటలుచేసి పారవేసిన బూడిద పోగుల ప్రదేశమనీ, శాస్త్రజ్ఞులు కనిపెట్టారు.

ఇంత పెద్ద పంటపెంటబూడిదగుట్ట తయారయిందంటే ఎందరో ప్రజలు ఎన్నితరాలుగానో ఇచ్చట వసించారన్నమాట.

ఈ ప్రత్యేక స్థలంలోనే వారేల వసించాలి? అశ్వవేటకు పదన్నా మైదానపు ప్రదేశంలో వారెందుకు నివసించలేదు?

దీనికి కారణం బహుశ యిదై యుంటుంది! మైదాన భూమిలో పెద్ద గుఱ్ఱాలమంద అగుపించేది. వేటకాండ్రు నెమ్మదిగా శబ్దంచేయకుండా పొదలలో నక్కీ, ఎత్తు గడ్డి వెనుకగా

జరుగుతూవచ్చి వానిని సమీపించేవారు. ప్రతివాని చేతిలో చాలా బాణా లుండేవి. ముందుండేవారు ఏ ప్రక్కగా గుట్టా లున్నాయో, ఎన్నో, ఎటు మార్గంగా అవి నెడుతున్నాయో వెనుక వారికి సంజ్ఞ చేసేవారు.

వారంతా చప్పుడుచేయకుండా వానిచుట్టూ ఆక్రమించు కొనేవారు. నెమ్మదిగా వానిని సమీపించేవారు. మొదట్లో విశాలమైన ఆ బయలుమీద అచ్చటచ్చట ఏవో చిన్న చుక్క ల్లాగా కనుపించిన గుట్టాలు వారి కిప్పుడు స్పష్టంగా కనుపిస్తాయి. వాని పొడుగు తలలూ, వంపు మెడలూ, జూలూ, సన్నని కాళ్ళూ, పొడవైన ఉన్ని కప్పబడిన శరీరాలూ వారి కిప్పుడు స్పష్టంగా తెలుస్తాయి.

ఉన్నట్లుండి అవి బెదురుతాయి; తలలెత్తి ముక్కు రంధ్రాల చలింపజేసి, పసిపట్టుతాయి. వాని వొంపుమెడలు అనేకవిధమైన సొంపుగా వంగుతాయి. పరుగిడ జూస్తాయి. కాని పాపం! అప్పటికే ఆలస్యమయింది వానికి రానున్న ప్రమాద సూచన. ఇంకా కొంచెము ముందుగా తెలిసినా బాగుండేది రెక్కలులేని వాడిముక్కుల విచిత్ర పక్షుల్లాగా, అంతులేని బాణాలు వాని ఒడలంతా పొడిచివేస్తాయి.

ప్రక్కలూ, మెడలూ; వీపూ, అంతటా బాణాలే! ఎటుపారిపోవాలి! ఏం చేయాలి? మూడుప్రక్కలా శత్రువు లగుపించుతారు. నిర్మానుష్యమైన ఆ మైదానంనిండా, భూమి యీనినట్లు మనుష్యులు కనిపిస్తారు. ఇంకేమున్నది? ఒక్కటే ఒక ప్రక్క వానికి పారిపోవడానికి దారికనుపిస్తుంది. భయపడీ, సకిలిస్తూ అవన్నీ ఒక్కపెట్టున ఆ ప్రక్కగా పరుగిడుతాయి.

సరిగా యీ గుఱ్ఱాలన్నీ అటే పరుగెత్తాలని, వేటగాండ్రు ముందే యేర్పాటుచేశారు. ఆ దారి తిన్నగా కొండఅంచుకు వెడుతుంది.

భయంతో దారీతెన్నూ తెలీక, తోకలు పైకెత్తి, నోట నురుగుల గక్కుతూ ఆ గుర్రాలన్నీ ఏదో పెద్ద నదీ ప్రవాహంలాగా పరుగెత్తుతాయి. ఎత్తైత్తుగా పైకెక్కే ఆ కొండ మార్గాన పరుగిడగా అకస్మాత్తుగా పెద్ద అఖాతం కనుపించింది. ముందున్న గుర్రాలు భయపడి, తమ వెనుక కాళ్ళపై లేచి నిలబడ్డాయి. గుండె దిగులుతో సకిలించాయి. కాని వెనుకనుండి పరుగిడివచ్చే గుఱ్ఱాలు వాటిని క్రిందకు త్రోసివేసాయి. ఆ గుఱ్ఱాల గుంపంతా ఏదో బ్రహ్మాండమైన జలపాతంమాదిరి కొండ అంచులనుండి క్రిందకు దిగజారింది. క్రింది అఖాతమంతా వాని శరీరాలతో, రక్తప్రవాహాలతో నిండిపోయింది.

వేట యింతటితో ముగిసింది. క్రిందనున్నవారు మంటలు వెలిగించారు. ముసలిస్త్రీలు వాని కళేబరాలను ముక్కలుగా కోసారు. నలుగురికీ పంచిపెట్టారు. బాగా ధైర్యంగా వేటాడిన వారికి పెద్దభాగాలిచ్చారు.

## కొత్త మనుష్యులు

గడియారపు ముళ్ళు—అందులోనూ గంటలచూపే చిన్నముల్లు—కదులుచున్నట్లే మనకు కనుపించవు. కాని ఒకటి రెండు గంటల తరువాత చూస్తే చిన్నముల్లు జరిగినట్లు తెలుసుకొంటాము.

మానవ జీవిత విషయమూ ఇంతే. మనలోనూ, మన పరిసరాల్లోనూ కలిగే మార్పులు మనకు తెలియనే తెలియవు.

జీవితగడియారపు గంటలముల్లు కదలనట్లే ఉంటుంది. కాని కొన్ని సంవత్సరాలు గడిచేటప్పటికి అది కదిలి జరిగినట్లు మనం గ్రహిస్తాము. దానితో మనముకూడా జరిగాము; ప్రతీదీ మన చుట్టుప్రక్కలలో మారిపోయింది.

ఇట్టి మార్పులు యీ కాలపు మనుజులం మనకే తెలియటం ఇంతకష్టమైతే మన పూర్వీకు లిట్టి మార్పులను తెలుసుకోలేకపోయేవారంటే అంతగా ఆశ్చర్యపడనక్కర లేదు. మనకంటే తారీఖులుజూపే డైరీలూ, ఫొటోగ్రాఫులూ, వార్తాపత్రికలూ, పుస్తకాలూ ఉన్నాయి. ఇవన్నీ పాతవిషయాలకూ క్రొత్తవానికీగల తారతమ్యాన్ని విశదీకరిస్తాయి. చక్కగా మన పూర్వీకుల విషయం అట్లా కాదు. జరిగిపోయినవానిని జరిగే వానితో పోల్చిచూడడానికీ వారికట్టి సదుపాయాలూ లేవు. మానవజీవితం స్థిరంగా కదలకుండా నిలబడినట్లు వారనుకొనేవారు. పాతస్థితితో పోల్చితేనేగాని ఏదన్నా మార్పుకలిగిందో లేదో చెప్పలేము. గడియారంమీద అంకెలనేవి లేకపోతే దానిముల్లు కదిలాయో లేదో యెట్లా చెప్పటం?

పూర్వీకులు వారేపనిచేసినా సరిగ్గా వాళ్ళ పెద్దవారు నేర్పినట్లే దాన్ని చేసేవారు. పనిముట్లు చేసేవాడు తానెట్లు నేర్చాడో ఆమాదిరే వానిని చేసేవాడు. ఇండ్లు కట్టేటప్పుడు స్త్రీలు తమ వంటపొయ్యిలను పూర్వీకులు చెప్పినట్లే నిర్మించేవారు. వేటాడే ప్రతి యువకుడూ పెద్దలు నేర్పిన పద్ధతినే అనుకరించేవాడు.

ఐనప్పటికీ తమకు తెలియకుండానే పనిముట్లు చేయటంలో ఇండ్లు కట్టటంలోనూ, వేటలోనూ కొన్ని మార్పులు

కలుగుతూనేయుండేవి. ప్రతి కొత్తపనిముట్టూ సరీగ్గా పురాతన పనిముట్లుమాదిరే యుండేది. కొత్త యీటెకు పాతదానికీ భేదమేలేదు. కొత్తబాణానికీ పాతదానికీ వ్యత్యాస ముండేది కాదు. ఇవిట్లా వున్నాకూడా మార్పనేది యెన్నడో ప్రారంభ మైనదని ఒప్పుకోవాలి. ఈటెకూ, బాణానికీ యెంతభేద మున్నదో ముందే చెప్పాము. బాణమనేది కాలగతినీ ప్రజల అవసరాన్నిబట్టీ యీటెనుండీ పుట్టిన ఆయుధము. తమకు తెలియకుండానే జనులు వేరురకపు ఆయుధాలు సృజించారు. ఈటె—చేతిబాణాలూ—వింటిబాణాలు, యీ తీరుగా మార్పూ, వృద్ధీ యెప్పుడూ జరుగుతూనే యుండేవి.

తాముపయోగించే ఆయుధాలతోపాటు మనుజులూ మారిపోయారు. ముందుచెప్పిన గుహాలో అడుగుపొరలలో నుండే మనుష్యశల్యాలను, మంచుయుగ సమయంలో వసించిన మనుజుల పైపొరలలోని ఎముకలతో పోల్చితే యెన్నో భేదాలు కనిపించుతాయి. ఆ గుహాలను జొచ్చిన నియాం డర్తలు మనుజుని ఎముకలు కోతులజాతినుండి అతడు పెఱిగి నట్లు స్పష్టంగా చూపట్టుతాయి. అతను పెద్ద గూనుతో వికృ తంగా తన పాదాగు చేతులూగించుతూ నడిచేవాడు. నుదురూ, గడ్డపు యెముకా యింకా సరిగా యేర్పడలేదు. పై పొరలలో కనుపించే "క్రోమాగ్నన్" మనిషి యెముకలు దాదాపు మన శల్యాలమాదిరే ఉన్నాయి.

నిజానికి యీ యెముకలెంత భేదంగా ఉన్నాయంటే శాస్త్రజ్ఞులు యీ రెండు జాతులకూ యెట్టి సంబంధమూ లేదని అనుకొన్నారు. క్రోమాగ్నన్ మనిషి యెచ్చటినుండో వచ్చి,

పూర్వపు నియాండర్తలు వ్యక్తులను తరిమి ఆ గుహ నాక్ర మించాడని అనుకొన్నారు. కాని ఇది నిజంకాదు. నియాండర్తలు మనుజులే కాలగతినిమారి క్రోమాగ్నన్ జాతిగా తయారయ్యారని గ్రహించాలి.

## మానవ నివాసములూ వాని యభివృద్ధీ

మనుజుడు మారేకొలదీ అతని నివాసాలూ మారాయి. మొదట్లో వారు వసించిన గుహలు ప్రకృతిసిద్ధమైన గృహాలని చెప్పాలి. వాని నెవరూ నిర్మించలేదు. ఎచ్చటైనా గుహలగుపిస్తే, వానియందు నివాసాలేర్పాటు చేసుకొన్నారు.

స్వాభావసిద్ధంగా సృష్టియందేర్పడే గుహాలన్నీ, మానవ నివాసానికి తగియుండవు. మనకొరకని ప్రకృతి వానిని తయారు చేయదుగా ? కొన్నిటి కప్పు మరీ యెత్తుగానూ, కొన్నింటి గోడలూ, పై కప్పూ ఎప్పుడు కూలిపోతాయో అనేటట్లూ, మరి కొన్నింటి ద్వారాలు చాలా యిరుకుగానూ నేలమట్టానికి ఆనుకొనీ యుండేవి. అట్టి గుహలు మన పూర్వీకులకు పనికి రాకపోయాయి.

ఏదన్నా గుహ నొక దానిని వారు ప్రవేశించగానే, యెన్నెన్ని విధాలో దానిని బాగుచేయవలసి యుండేది. నేలను సమమట్టంగా చెక్కీ, రాతి పనిముట్లతో గోడలరాచి, చదును చేసీ, చెట్లకొమ్మల గుబురుగాకట్టి నేలను ఊడ్చి, శుభ్రపరచీ, దాన్ని నివాసయోగ్యంగా చేసేవారు.

గుహద్వారానికి కొంతదూరంలో గుహలో ఒక కాలువ త్రవ్వేవారు. దానిని రాళ్ళతో పరచి, పొయ్యిని కట్టేవారు.

స్త్రీలు చిన్నగుంటలు త్రవ్వి, వెచ్చనిపొయ్యి బూడిదను వానిలో నింపేవారు. తమ శిశువు నా శయ్యలపై మెత్తగా, వెచ్చగా పరుండబెట్టేవారు.

కొంచెం లోపల దూరంగా ఎలుగుబంటుల మాంసమును దాచేగదులను యేర్పర్చేవారు. ఇట్లు ఎన్నోవిధాల సరిచేసి ఆ గుహలను వాసయోగ్యంగా మార్చేవారు.

క్రమంగా యీ గుహల్లో కొత్తతరహా మార్పులు తల లెత్తాయి. ఏ కొండ అంచైనా, ముందుకు వంపుగా వ్రాలి యుంటే, క్రిందనుండి దానికి నిలువుగా గోడలు కట్టి గుహాల నిర్మించేవారు. నలుప్రక్కలా గోడల్లాగా కొండరాళ్ళుంటే వానిపై నొకకప్పు యేర్పరచేవారు.

ఫ్రాన్సులో యిటువంటి దొక గుహ యిప్పటికీయున్నది. దాన్ని వారు "దయ్యపుగుహ" అంటారు. అటువంటి గుహలో ఏదో పెనుభూతం తప్ప మనుజులుండి యుండరని ప్రజలవూహ. నిజానికది మనపూర్వీకుల నివాసమేనని మనకిప్పుడు తెలిసింది.

పూర్వం ఈ గుహయున్నచోట కొండ ముందుకు వంగి యుండేది. పైనుండి పడినరాళ్ళు రెండుప్రక్కలా గోడల్లాగా నిలిచిపోయాయి. జనులువచ్చి పెద్ద రాతిబండలపేర్చి మూడో గోడనూ, చెట్లకొమ్మలదడికట్టి, దానిపై జంతువులతోళ్ళు పరచి నాలుగోగోడనూ నిర్మించారు.

గుహలోపల లోతుగా మట్టినిత్రవ్వారు. ఈ గోతిలో వారు నివసించి యుండాలి. దాని అడుగున చెకుముకి రాతి ముక్కలూ, ఎముకలూ, కొమ్ములతో చేసిన పనిముట్లూ ఉన్నాయి. చుట్టూగోడలు నిర్మించటంచేత అదొక ఇల్లువంటిది

మున్నప్పటికీ, గోయి త్రవ్వి దాంట్లో నివసించటం చూస్తే, అది గుహామాదిరే వున్నదనాలి. "సగముయిల్లూ - సగముగుహా" అంటే సరిపోతుందిగా ?

రెండుగోడలు నిర్మించిన మనిషికి నాల్గుగోడలూ కట్టటం అంత కష్టమైన పనికాదుగా ? ఈ సగముగుహా - సగము యిల్లూ తరువాత మనుజులు ఆనుబయటే, కొండవంపు లవసరం లేకుండానే ఇండ్లు కట్టటం నేర్చారు. ఏలాగంటే భూమిలో, పెద్ద గోయిత్రవ్వి దాని అంచులు విరిగిపడకుండా రాళ్ళతోనూ మూమత్ యెముకలతోనూ గోడల బలపర్చేవారు. పైనుండి వానా, మంచూ కురవకుండా గుండ్రని కప్పు నిర్మించారు. కొమ్మలూ ఆకులూ తెచ్చి గుండ్రంగా అల్లి వానిమీద మన్ను పూశారు.

దూరంనుండి యేదో మట్టిదిబ్బలాగా కనుపించేది ఆయిల్లు. లోపలి పొగబయటకు పోవుటకు కప్పులో నొక రంధ్ర ముండేది. ఆ సందునుండే జనులు లోపలకు పోయేవారు అదే ఆ యింటిద్వారం.

మూమత్ యెముకలను లోపల గోడల అంచుల్లో పెట్టి వానిపై కూర్చునేవారు. అవే వారిబల్లలూ, కుర్చీలూ అడుగు నేలను గట్టిగా దిమ్మిసచేసి అలికి దానిపై పరుండేవారు. అదే వారిమంచాలూ, పరుపులూ అనాలి. కొయ్య తలగడలు పెట్టు కొనేవారు.

ఇంటి మధ్యనున్న అగ్నిగుండపు చెంతరాతి బండలతో నిర్మించిన బల్లలున్నాయి. రకరకాల పనిముట్లనూ ఈ బల్లలపై చెక్కేవారు. పనిముట్లూ వివిధరకాల సామాగ్రీ ఇటువంటి

యొకబల్లపై కనుపించాయి. గుండ్రంగా నున్నగా తయారుచేసి రంధ్రం పొడిచిన కొన్ని యెముకపూసలున్నాయి. వీనిలో కొన్ని సగమే తయారయి యున్నాయి. పొడుగు యెముకలో పూసల కోయడానికని గాళ్ళు కోయబడివున్నాయి. కాని వానిని పూర్తిగా పూసలుగా కోయకుండానే వదిలిపెట్టాడు ఏమనిషో. ఏదో గొప్పప్రమాదం అకస్మాత్తుగా వారికి సంభవించింది కాబోలు? లేకపోతే అట్లా సగంచేసిన పనిని అట్లే వదలి యెందుకు వెడుతారు? నగిషీ చెక్కిన యెముక బాణపు తలలూ రంధ్రం పొడిచిన ఎముక సూదులూ, రకరకాల పనుల కుపయోగించే, చెకుముకి పనిముట్లూ ఎక్కడవక్కడే వదలి వెళ్ళిపోయాడు. ఎంత గొప్ప విపత్తు కలుగకపోతే ఆవిధంగా వదలి వెళ్ళాడో! ఆలోచించు.

వాడు చేసిన పనిముట్లనుచూస్తే ఎంతో ప్రయాసపడి వానిని చేశాడని తెలుస్తుంది. ఉదాహరణకు ఆ చిన్న యెముక సూదిని గురించి ఆలోచించు. ఒక గుహలో యిట్టి యెముక సూదులు చేయడానికి కావలసిన సామాగ్రి అంతా కనుపించింది. కోయబడని యెముకలూ, సగము తయారైన సూదులు యెన్నో ఉన్నాయి. ఆ సామాగ్రీ పరికరాలతో కావాలంటే రేపు తిరిగి యెముక సూదులు చేయటం ప్రారంభింపవచ్చు. కాని అట్టి సూదులనుపయోగించగల వారికాలంలో ఎవ్వరూ ఉండరుగా?

ఆ యెముక సూదుల నెట్లా చేసేవారంటే; కోసే యంత్రంతో కుందేలు యెముకనుండీ, గుండ్రని సన్నటి ముక్క ఒకటి కోసేవాడు. రంపపు మాదిరి అంచుగల రాతిపనిముట్టుతో

ఆ ఎముకకు ఒక చివర వాడిగా, సూదిమొనలాగా అరగదీసే వారు. రెండో కొసలో పదునైన రాతిపనిముట్టుతో రంధ్రం పొడిచేవారు. తరువాత సూదిని, నున్నని రాతిపై రుద్ది సాపు చేసేవారు.

ఇన్ని రకాల ఆయుధాల నుపయోగించాలి ఒక్క సూదిని చేయాలంటే. ఇట్లా చేయగలవారు కొద్దిమందే ఉండే వారు. కాబట్టి ఆ సూదులను బహు జాగ్రత్తగా దాచుకొనే వారు.

పురాతన వేటగాండ్ర గుహలోకి వెళ్ళి వారెట్లా జీవించే వారో పరిశీలించి చూద్దాము.

అవిగో, దూరాన మైదానంలో గుండ్రని దిబ్బలనేకం కనుపిస్తున్నాయి. వాటినుండి పొగ పైకి ప్రాకుతోంది. ఒక గుడిసెను సమీపించి, కండ్లు మండిపోతున్నా, ఊపిరాడక పోయినా ఓర్చుకొని, పొగ రంధ్రంనుండి లోనికి మనము దిగుదాము.

ఆ గుహలోని మనుష్యులు మనలని చూచి భయపడు తారుగా? ఇతరులకు కనుపించకుండా ఉండగలందుకు ఒక పసరు మనకాళ్ళకు పూసుకొన్నామనుకో! ఆ గుడిసెలో అంతా చీకటీ, పొగానూ, చాలా గందరగోళంగా ఉన్నది లోపల. సుమారు పదిమంది పెద్దలూ, ఇంకా ఎక్కువ మంది పసిపిల్లలూ ఉన్నారు.

పొగకూ, చీకటికీ, కండ్లు అలవాటయిన తరువాత అందున్న జనుల ముఖాలు స్పష్టంగా కనుపిస్తాయి. కోతిరూప మేమాత్రమూ వీరిలో కనుపించదు. పొడూగ్గా, బలంగా, వెడల్పుగానున్న నుదురూ, కొంచెం ఒకదాని కొకటి దగ్గరగా

నున్న కంఠాల్లూ, వీసు కోతులమాదిరే లేరు. వారి నలుపు దేహం పైన ఎఱ్ఱరంగుతో విచిత్రపు చారలూ చుక్కలూ అలంకరించు కొన్నారు.

స్త్రీలు నేలపై చతికిలబడి తోలుదుస్తులు కట్టుతున్నారు. పిల్లలు ఏ గుఱ్ఱపు కాలియెముకో, ఏ దుప్పికొమ్మో పట్టుకొని దొర్లుతూ కేరింతలు కొడుతున్నారు. అవే వారి ఆటవస్తువులూ బొమ్మలూను.

అగ్నిగుండం చేరువగా రాతిబండల బల్లదగ్గర పనివా డొకడు కూర్చున్నాడు. కొయ్యపిడికి యెముకబాణపు మొన నొకదాన్ని బిగిస్తున్నాడు. వాని ప్రక్క నింకొకడు కొంచెం వెడల్పుగా చదునైన యెముకమీద యేదో బొమ్మను గీస్తు న్నాడు. అదేమిటో దగ్గరగా పోయి చూద్దామా?

అటూ యిటూ నాలుగైదు గీతలుకొట్టాడు ఆ యెముక మీద. గుఱ్ఱమొకటి మేస్తున్నట్లు బొమ్మ తయారయింది. చూస్తూండగా! బహు చమత్కారంగా దాని వంపు మెడనూ సన్నని కాళ్ళనూ పొడూగు ముట్టెనూ చిత్రించాడు; అచ్చంగా వాడొక గుఱ్ఱాన్ని ఎదురుగాచూస్తూ చిత్రించాడా అన్నంత చక్కగా ఉన్నదా బొమ్మ.

ఇంతలోనే వాడూరుకోడు. నాలుగైదు గీతలు దాని శరీరానికడ్డంగా, ఐమూలగా గీస్తాడు. అంత చక్కని బొమ్మనూ యీ పిచ్చి గీతలతో పాడుచేస్తున్నాడెందుకో?

ఇంకా రెండు గీతలు గీశాడు. అదొక గుడిసెమాదిరి తయారయింది. అటువంటివే మరి నాలుగు గుడిసెల

నా యశ్వము ప్రక్క చిత్రించాడు. పూర్వీకుల గుహాలలో యిట్టి చిత్తరవులు చెక్కిన యెముక లెన్నో మన కగుపిస్తాయి. దీనికేదైనా అంతరార్థమున్నదేమో!

ఇక్కడ యీ మామత్ బొమ్మమీద రెండు గుడెసెలూ, ఆ అడవిదున్న చిత్రంమీద మూడూ లిఖించబడ్డాయి! ఇంకొక ఎముక దీన్ని చూడు. దీన్పై నొక పెద్దదృశ్యం కనుపిస్తోంది. ఆ చిత్రంలో సగం తినబడిన అడవి దున్న శరీరమున్నది. దాని తలా, వెన్నెముకా కాళ్లూమాత్రం మిగిలిఉన్నాయి. దాని తల ముందరకాళ్ళమధ్య అమర్చబడియున్నది. ఇటూ, అటూ రెండు వరుసలుగా జనులు నిలబడి యుంటారు.

ఇట్టివనేక చిత్రాలు - జంతువులూ, జనులూ, పాకలూ గలవి - యెముకలమీదా, రాతిబండలమీదా, కొండ అంచులపైనా మనకగుపిస్తాయి. ఇట్టి పటాలు గుహాల గోడల మీద చాలాఉంటాయి.

కాని, మనమీ గుడిసెను ప్రవేశించేటప్పుడిట్టి చిత్రాలేవీ గోడలమీద మన కగుపించలేదు. ఇంతవరకూ మనం తిరిగి చూచిందంతా ఆ గుహాయొక్క ముందుభాగమే. ఇచ్చటే జనులు భుజించటమూ, వేర్వేరు పనులు చేయటమూ జరుగుతాయి.

సరే. యీ ముందుభాగాన్ని వదలి గుహాలోపల భాగాలకు పోదాము. దాని కొండరాళ్ళ చెరియల్లోనూ వంకరవంకరలుగా పోయేదారి పొడూగునాగల గోడలమీదా మనదృష్టి నిలిపి పరీక్షించి చూద్దాము.

## భూగర్భ చిత్రాలయం

భూగర్భ చిత్రాలయం లోపలిభాగాల్లో చీకటెక్కువ. మనతో లాంతరొకటి తీసుకుపోదాం. వెళ్ళేదారి సరిగా జ్ఞప్తి కుంచుకోవాలి. వీలైతే యేమైనా ఆనవాళ్ళు గుర్తించు కొంటూ పోతేమంచిది. పెద్ద వ్యూహంవంటి యీ గుహాలో దారితప్పి పోవటం బహు తేలికైన పని. జాగ్రత్త! హుషార్ !!

పోయేదారి పోగా, పోగా యిరుకవుతుంది. రాతి బండల సందునుండి ఊటనీరు బొట్లు బొట్లుగా మనపై పడు తుంది. లాంతరెత్తి పట్టుకొని దానిగోడలను పరీక్షిద్దాము. భూగర్భ జలప్రవాహాలు రకరకాల ఉప్పుస్ఫటికాలతో ఈ ప్రదే శమంతా అలంకరించాయి. మానవహస్త చిహ్నాలేవీ యిచ్చట మనకు గోచరం కావటంలేదు.

సరే! కాలుసాగనిద్దాము:—ఉన్నట్లుండి యెవరో "ఇదిగో! ఇక్కడచూడండి! అని కేకవేస్తారు మనలో. అక్కడకు వెళ్ళిచూస్తే గోడమీద అడవిదున్న చిత్రమొకటి చెక్కబడి యున్నది. నలుపూ, ఎరుపు రంగులతో దాన్ని చిత్రించారు. ఆ దున్న ఒడలంతా బాణాలు గ్రుచ్చుకొన్నాయి; అది నేల కొరిగింది.

యెన్నివేల యేండ్ల క్రితం యే చిత్రకారుడు దీన్ని లిఖించాడో! ఇప్పటికీ బహు చక్కగా కనుపిస్తోంది యీ బొమ్మ. ఇంకా కొంత దూరంలో ఇంకొక బొమ్మ కనుపిస్తుంది. ఇది మనిషో, లేక మృగమో మనకు తెలియకుండా ఉన్నది. ఈ చిత్రంలోని జీవికి మనుష్యులకున్నట్లు గడ్డము మొలిచింది. కాని తలమీద రెండు పొడవైన కొమ్ములున్నాయి. వీపుమీద

మెత్తు గూనొకటీ, గుబురుతోకా వున్నాయి ఈ విచిత్ర జీవికి. దాని కాళ్ళూ, చేతులూ, మనిషివి. చేతుల్లో నొక విల్లున్నది. యేమిటో యీ మృగం ?

జాగ్రత్తగా చూద్దాం...ఓహో! తెలిసిపోయిందిలే. దీని గుట్టంతా! అడవిదున్న చర్మం కప్పుకొన్న నొక మనుష్యుని పటం యిది!...దీని వెనుక ఇట్టివే ఇంకా చాలా చిత్రా లున్నాయి గోడమీద.

ఈ చిత్రాలయమంతా చీకటిమయం. ఈ కాలపు యే చిత్రకారుడూ ఇట్టి చీకటి గుహల్లో వాడెత్తుధనం పోసినా పని చేయడు. వారి పటాలను నలుగురూ చూచేటట్లు పెద్ద పుర మందిరాల్లోనూ, భవనాల్లోనూ తగిలిస్తామేగాని ఇట్టి చీకటి గుహల్లో తగిలించము మనము. ఎవరికీ కనుపించకుండా పురా తన చిత్రకారు లెందుకీ చీకటిగుహల్లో తమ చిత్రాల లిఖిం చారో ? ఇతరులు చూడాలంటే ఇటువంటిచోట వానిని చెక్క టంలో అర్థమేదీ కనుపించదు.

జంతు చర్మం ధరించి నృత్యంచేస్తున్న యీ విచిత్ర మానవుల చిత్రాలు యెందుకీ గుహాంతరాల్లో చిత్రించ బడ్డాయో తెలుసుకోవాలి మనం.

దీ ని భా వ మే మి తి రు మ లే శ

"అనేకమంది గుమిగూడి వేటకు వెడుతారు. ప్రతి వాని నెత్తినా అడవిదున్న తలో లేక అదే మాదిరి చేసిన టోపియో ఉంటుంది. ప్రతివాని చేతిలోనూ విల్లూ, బాణాలూ గానీ యీటెగానీ ఉంటాయి. మొదట్లో వీరందరూ

# ఆదిమకాలంలోని చిత్రకళ



ఓహో! తెలిసిపోయిందిలే, దీని గుట్టంతా! అడవిమున్న చర్మం కప్పుకొన్న యొక మనుష్యుని పటం ఇది!

గుండ్రంగా నిలబడి అడవిదున్న వేటను చూపే నృత్యం చేస్తారు. నృత్యంలో అలసిపోయినవాడు క్రిందపడిపోతు న్నట్లు నటిస్తాడు. బండబారిన మొనగల బాణమును వానిపై అప్పుడొకడు విసురుతాడు. కాళ్ళుపట్టి గుంపునుండి వెలుపలకు ఆ క్రిందపడ్డవానిని లాగి, కొయ్యకత్తులు వానిపై ఝుళిపించు తారు. తరువాత నెమ్మదిగా వాడు లేచి వెళ్ళుతాడు. అప్పుడు మరొక అడవిదున్న వేషధారి, వారందరిమధ్యా నిలుస్తాడు. తిరిగీ నృత్యమారంభమవుతుంది. ఇట్టి నృత్య మొకానొకపుడు ఒక్క నిముసమైనా విరామంలేకుండా, రెండుమూడు వారాల వరకూ జరుగుతుంది."

పై బొమ్మల అర్థమిది. కాని దీన్నంతా యెవరు చూచారు? ఎప్పుడు? యెక్కడ?

ఉత్తర అమెరికాలోని యెఱ్ఱఇండియనుల దేశాని కొకాయన దేశాటనంగా వెళ్ళాడు. అతని డైరీలో పైనుదహ రించిన వర్ణన వ్రాసియున్నది. మన పూర్వీకుల కాలంనుండీ యీ నృత్యం తరతరాలుగా ఒకరినుండి యింకొకరికి నేర్పబడి యీ కాలపు యెఱ్ఱయిండియనులచే అభ్యసింపబడుతోంది. ఇట్టి విచిత్ర నృత్యాన్నెందుకు వీరు కొన్ని వారాల తరబడిగా చేస్తారో మనం తెలుసుకోవాలి. దానికైనా యేదొక అర్థముండి తీరాలిగా?

మనలో నృత్యమనేది విలాసార్థంగానో లేక ఒక ప్రత్యేక లలితకళగానో అభ్యసింపబడుతుంది. కాని యెఱ్ఱఇండియనులు విలాసార్థం రెండు మూడు వారాలవరకూ నృత్యంచేస్తారనటం

సమంజసంకాదు. వారి విష్ణూరనాట్యం ఏదో యొక గట్టి మతా చారంలాగా ఉన్నదనిపిస్తుంది.

వారిలో మాంత్రికుడని ఒకడుంటాడు. వాడు పొడుగు పాటి చుట్టత్రాగే గొట్టంవంటిదొకటి తన నోటియందుంచు కొని పొగను అటూ, ఇటూ ఊదుతాడు. నటకులు ఆ పొగ బారే దిక్కుగా నటిస్తూ పోతారు. పొగ యెటుపోతుందో ఆ మార్గంగా వారు పట్టబోయే దున్న పోయిందని దాని అర్థం. ఈ విధంగా నలుదిక్కులా వారంతా నటిస్తూ తిరుగాడుతారు. ఆ పొగనూదేది సాధారణ మనిషి కాదు; మాంత్రికుడు. అంటే వానిలో గొప్ప మంత్రశక్తి యున్నదని జనులు నమ్ముతారు. అడవి దున్న యున్న దిశను వాడు చూపించగలడని వారి యుద్దేశం. మాంత్రికుడు సూచించిన దిశలో దాగుకొన్న అడవి దున్నను తమ నృత్యబలంచేత బయటకు లాగవచ్చని వారి నమ్మకం. కాబట్టి యీ నృత్యమంతా యొకవిధమైన మతా చారమని విశదమవుతోంది.

మన చీకటి గుహలో అట్టి మాంత్రికుడెవడో యీ నృత్య చిత్రాలను లిఖించాడు. వానిని సరదాగా యేమీ తోచక చిత్రించియుండలేదు. అట్టి బొమ్మలు గీయటంచేతా ఆ చిత్తరువుల్లో నాతడు బంధించిన మంత్రప్రభావం మూలానా తన జాతి జనులకు పుష్కలంగా వేటమృగాలు దొరుకగలవని చిత్రకారుడు నమ్మాడు. ఇదంతా మనకు వెఱ్ఱి వ్యవహారమని పిస్తుంది, కాదూ?

మనం యేదన్నా ఇల్లుకట్టుకొనేముందు తాపీపనివాళ్ళు లాగా, వడ్రంగులమాదిరీ నృత్యం చేసినట్లుంటుంది. ఇదంతా

ఏబడిపంతులన్నా రూళ్ళకఱ్ఱను చేతబట్టుకొని బాలుర యెదుట వారికి బాగా పాఠాలు నేర్పేశక్తి రావాలని నృత్యం చేసాడనుకో. వెంటనే అతన్ని పిచ్చి ఆస్పత్రికి పంపేస్తాము; కాదూ? మనకు యీ కాలంలో పిచ్చివని తోచే విషయాలు మన పూర్వీకులకు చాలా ముఖ్యమయినవిగా తోచేవి.

సరే. గుహలోకనుపించిన ఇంకొక చిత్రపుటర్థమేదో మనం తెలుసుకోడానికి యత్నించుదాము. చుట్టూజనమూ మధ్యలో కాళ్లూ, తలా, తప్ప మిగిలినదంతా తినివేయబడిన అడవిదున్న దృశ్యమొకటి మనం చూచాము. దీని అర్థం తెలుసుకోడానికి ఉత్తర అమెరికాను బనులు, రష్యాదేశపు ఉత్తర భాగాలకు ప్రయాణం కట్టాలి.

సైబీరియాలోనుండే జనులు ఏదన్నా యెలుగుబంటిని చంపగానే దాన్ని ఇంటికి తెచ్చేవారు. ఏదన్నా ఒక యెత్తు ప్రదేశంలో దాన్ని పరుండబెట్టేవారు. దాని తలను ముందు రెండు కాళ్ళమధ్యా ఆనించేవారు. రొట్టెతోనో, లేక బర్చిచెట్టు బెరడుతోనో జింకలూ, లేళ్ళూ బొమ్మలచేసి దాని ముందుంచి నైవేద్యం పెట్టేవారు. బర్చిబెరడుతో చేసిన చిన్న గిన్నెలను దాని ముట్టెపైనుంచి కండ్లమీద డబ్బులు పెట్టేవారు. తరువాత ఒక్కొక్కడుగా వెళ్ళి దాని మూతిని ముద్దుపెట్టుకొనేవారు. ఇట్టి ఆచారం నిన్న మొన్నటిదాకా సైబీరియాలో నుండేదని అచ్చటి ప్రజలు చెప్తారు.

అనేక రాత్రులు, ప్రతిరోజూ కోసేయగా మిగిలిన ఆ యెలుగుబంటి శరీరానికి నమస్కరించి, ఎలుగుబంటి నడిచేటట్లు నడుస్తూ, ఆడుతూ నృత్యంచేస్తారు. పాటలూ, నృత్యమూ

పూర్తికాగానే ఆ యెలుగుబంటి మాంసమును వండి అందరూ విందారగిస్తారు. ముందరకాళ్ళూ, తలా మాత్రం అలాగే వుంచేస్తారు.

దీన్నిబట్టి మనకు గుహలో యెముకపై చిత్రించిన అడవి దున్న చిత్రపు అంతరార్థం తెలుస్తోంది. ఆ చిత్రము "అడవి దున్న పండుగ"ను చూపిస్తోంది. జనులంతా అడవిదున్న నృత్యం చేసి పాటలుపాడి తన శరీరమును తమకు ఆహారంగా ఇచ్చినందుకు ఆ మృగానికి తమ కృతజ్ఞతను వెలిబుచ్చుతారు. పుష్కలంగా దున్నమాంసమును తమకు ఎప్పుడూ ఇప్పించాలని దానికి పూజలుచేసి ప్రార్థిస్తారు.

ఎర్రయిండియనుల దేశానికిపోతే ఇట్టి ఆచారమే వాళ్ళల్లోనూ కనుపిస్తుంది. వారు చంపిన జింకశవాన్ని తెచ్చి తలను ముందరికాళ్ళ మధ్యనుంచి తూర్పుముఖంగా దాన్ని పడుకోబెడతారు. దాని నోటి ఎదుట ఒకగిన్నె నిండా రకరకాల తినుబండారాలు పెట్టి ఒక్కరొకరే వెళ్ళి తలనుంచి తోకవరకూ నెమ్మదిగా దానిశరీరం నిమురుతారు. "అన్నా సుఖనిద్ర నొందు" మని దాన్ని దువ్వేటప్పుడు దీవిస్తారు. చివరకు వారి మాంత్రికుడు జింకను చూచి ఇట్లా అంటాడు. నీ కొమ్ములను మాకిచ్చావు; ఇవిగో మా కృతజ్ఞతా సూచక వందనాలు!" దీన్నిబట్టి ఎముకపై చెక్కబడిన చిత్రాల భావమేదో విశదమవుతోంది.



# మన పూర్వీకులతో ఇష్టాగోష్ఠి

మన చిన్నతనంలో మనమంతా విచిత్రమైన కట్టు కథలు చదివాము. దయ్యాలూ, భూతాల గురించిన విషయా లెన్నో విన్నాము. గొప్ప మాంత్రికుల ఇంద్రజాల, మహేంద్ర జాల శక్తుల గురించి యేవేవో కబుర్లు చాలా వినియుంటాము. మనుజులు మృగాలుగానూ, మృగాలు మనుష్యులుగానూ చిటికలో మారేవారని యెన్ని కథలో ప్రతిదేశంలోనూ చెప్పు కొంటారు.

ఇవన్నీ నిజమేనని మనం గట్టిగా నమ్మితే, ఈ లోకంలో మన కగుపించని ఇతర జీవాలు ప్రతి పొదలోనూ, రాతిలోనూ, మేఘంలోనూ, కొండ గుహల్లోనూ ఉన్నాయనుకోవాలి. అట్టి జీవుల కోపాగ్నిని రగుల్చకుండా, బహు ఉషార్‌గానుంటేనేగాని మన కెప్పు డేఆపదకలుగుతుందోననే భయం మనలని బాధి స్తుంది. వానినుండే విచిత్రశక్తులమూలాన యేనిముషాని కేది జరిగేదీ చెప్పటం మన శక్యంకాదు. ఆ కనుబడే కప్ప అక స్మాత్తుగా చక్కని రాజకన్యకగా మారుతుంది. ఠీవిగా నడిచే ఆ యౌవ్వనుడు, సుందరాకారుడున్నట్లుండి భయంకర సర్పంగా

మారిపోవచ్చు. చనిపోయినవాళ్ళు బ్రతుకుతారు, నరికి వేయ బడిన తలలు మాట్లాడుతాయి. నీటిలో మునిగి చనిపోయిన వారు నావికులను సముద్రపుటడుగుకు లాగి ముంచివేస్తారు. ఇట్టి దురూహ్యమైనవీ, భయానకమైన విషయాలూ లోక మంతటా సర్వసాధారణంగా జరుగుతాయని మన్నం ఒప్పు కోవాలి. మనం అనుకొనేట్లు భూతప్రేతాలుంటే "భూత గృహం" వంటి కథలు చదివేటంతవరకే యిట్టి ఆలోచనలు మనకుంటాయికాని, పుస్తకంమూసి, బయటకురాగానే, మన సాధారణ ప్రజా, ప్రపంచమూ తయారవుతాయి. ఈ ప్రపం చంలో దయ్యాలూ, భూతాలూ, మాంత్రికులూ లేరు. కట్టుకథ ల్లోని సంగతులన్నీ నిజమైతే, మనబుద్ధికీ, ఆలోచనకీ, స్వస్తి చెప్పి యెప్పుడేపిడుగు నెత్తిన పడుతుందోననే భయంతో ఘటం దా టెయ్యాలి.

మన పూర్వీకులకు ఈ యావత్ప్రపంచమూ అచ్చంగా మన కట్టుకథల్లో నున్నట్లే కనుపడేది. ప్రతివిషయమూ ఏవేవో అగోచరశక్తుల మీదా, వ్యక్తులమీదా ఆధారపడినట్లూ, వారి కసంతృప్తి కలిగిస్తే మనకు కీడూ, సంతోషపెడితే మేలూ కలుగుతాయని వారనుకొనేవారు. దారిలో కాలికి రాయి తగిలి పడితే, మన అజాగ్రత్తను మనమే నిందించుకొంటాము. మన పూర్వీకు లిట్లాగాక, ఏదో యొక దయ్యమో, భూతమో ఆ రాతిని తన దారికడ్డంగా పెట్టిందనుకొనేవారు. కత్తిపోటు తగిలి యెవరన్నా చనిపోతే పాపం! కత్తిదెబ్బతో మరణించాడని మన మంటాము. మన పూర్వీకు లిట్లాగాక, ఎవరో చేతబడి చేసి, కత్తిని మంత్రించబట్టి వాడు చనిపోయా డనేవారు.

మనలోనూ, యిప్పటికీ, ఇట్టి నమ్మకాలు కలవా ళ్లెందరో ఉన్నారు. దృష్టితగిలిందనీ, అమావాస్యనాడే పనీ ప్రారంభించరాదనీ, పిల్లి యెదురువస్తే చెడుపనీ, ఇంకా యిట్టి వెన్నో భయాలు కలవెందరికో. ఈ రోజుల్లోనూ యిట్టి సంకోచాలుండటం గర్హింపదగిన విషయం.

కాని, మన పూర్వీకుల విషయమట్లా కాదు. వారి పరిసరాల్లో జరిగే సమస్త విషయాలనూ వారు గ్రహించుకో వాలని యత్నించేవారు. వానిని గ్రహించడానికి తగిన జ్ఞానమూ, అనుభవమూ, పరిశోధనా యేవీ లేకపోవటంచేత దయ్యాలనీ, భూతాలనీ, మంత్రమనీ, తంత్రమనీ, యేవేవో సమాధానాలు చెప్పుకొనేవారు మనసుకు.

నాగరికత జెందామనుకొనే మనలోనూ యిట్టి భావా లను వదలలేని వారెందరో యిప్పటికీ ఉన్నారు. నీకు తెలిసే యుంటుందీసంగతి.

## అనుమానం, పెనుభూతం

న్యూగినియాలో "మొటు - మొటు" లనబడే ఒక అడవిజాతివారున్నారు. ఒకసారి వారి నొక అంటువ్యాధేదో చుట్టేసింది. ఎందరో నల్లుల్లాగా మాడి చనిపోవటం మొదలు పెట్టారు. ప్రతియింటా ఏడ్పులూ, మూలుగులూ పెచ్చిగి పోయాయి. వారంతా భయపడి, అంత భీకరవ్యాధి యెట్లా వచ్చిందా అని ఆలోచించారు.

చివరకు, తమయూరికొక ఆంగ్లేయ క్రైస్తవ మిషనరీ - తమ ప్రబోధకుడూ - అతని భార్యా బిడ్డలూ వచ్చి నివాస

మేర్పర్చుకొన్నప్పటినుండీ ఆవ్యాధి మొదలిడిందని తెలుసుకొన్నారు.

ఇంకేముంది! ఆ జబ్బుకు వారే కారకులనుకొన్నారు. ఈటెలూ, విల్లంబులూ, బూమరాంగ్‌లూ – ఇనొక ప్రత్యేకపు టాయుధం – పట్టుకొని ఆ మిషనరీయింటికి పోయారు.

ఇంతమందీ రావటంచూచి, మిషనరీ భయపడ్డాడు. కత్తివేసినా రక్తం కారదా అన్నట్లు ఆతని తెలుపు ముఖం మరీ వెలవెలబోయింది. ఎట్లాగో ప్రాణాలు బిగబట్టుకొని "సోదరులారా! సోదరీమణులారా..." అన్నాడు.

వారి గగ్గోలులో, ఆర్భాటంలో అతని మాటలే వినుపించాయికావు. ఎలుగెత్తి, గొప్ప ఉపన్యాసధోరణిలో, మన మిషనరీ ప్రారంభించాడు. నిరర్గళంగా అతడేదో గంభీరోపన్యాసమిచ్చాడు. అంత గొప్పగా యేనాడూ తన జీవితంలో మాట్లాడియెఱుగడు. చర్చిలో భక్తుల ప్రాణరక్షణ కుపన్యసించేవాడు. ఇప్పుడు తన ప్రాణాలే కాపాడుకోవలసి రావటంచేత యెంతో విజృంభించాడు ఉపన్యాసంలో. చివరకెట్లాగో కొంత నెమ్మదించారా ప్రజ.

సరిగా అదేసమయానికొక నల్లమేక, మిషనరీది ఆయింటి తోటచుట్టూనున్న దడిదగ్గరకువచ్చి నిలబడింది. అంతమంది ఉండటంచూచి అది బెదరి గుడ్లు మిటకరిస్తూ నిలిచింది. వారిలో నొకడు దాన్ని చూచాడు; ఇతరులకు సంజ్ఞచేశాడు.

మిషనరీ తన ఉపన్యాసంలో నిమగ్నుడై పోయాడు. వారంతా ఆమేకనుచూస్తూ కూర్చొన్నారు. అతని మాటలు వినకుండా ఉన్నట్లుండి వారిలో నొకడు, "మేకను చంపండి,

ఈ రోగానికి కారణమదే" అని అరిచాడు. ఒక్కపెట్టున జనమంతా లేచారు. దడివిరిగింది. మిషనరీ తోటలోని పూల మొక్కలన్నీ వారి కాళ్ళక్రింద నలిగిపోయాయి. పరుగిడే మేక వెంటబడ్డారు అంతా. నిర్ఘాంతపోయి, మిషనరీ చూస్తూ నిలబడ్డాడు. మేకను యీటెలతో పొడిచి, చంపి, గండం తప్పిందని సంతోషిస్తూ ఇండ్లకు వెళ్ళారు వారంతా.

కొద్దిరోజులు గడిచాయి. వ్యాధి అణుమాత్రమూ తగ్గుముఖం పట్టిందికాదు. తిరిగీ జనమంతా మిషనరీయింటికి వచ్చారు. అతనివే మఱి రెండుమేకలుంటే, వానిని తమ కర్పించమని అరిచారు. ఈ పర్యాయం, మిషనరీవారికి లొంగలేదు, ఇవ్వాళ మేకలూ, రేపు అతని గోవూ, తరువాత...?

ఆ మేకల దెట్టి దోషమూలేదని మిషనరీ ప్రమాణం చేసాడు. కాని, వారికది గిట్టిందికాదు. మేకలుకాకుంటే, వేరే ఎవరైనా ఈ వ్యాధిని తెచ్చి ఉండాలిగా? అదీ వారి ఆలోచన.

అతని ఇంటిచుట్టూ వారు తిరుగుతూ, అరుస్తూండగా లోపలగదిలో నొక పటం కనుపించింది. అది విక్టోరియారాణీది. అందమైన దుస్తులూ తలమీద చిన్న కిరీటం ఇటువంటి ఫోటోలెన్నో ప్రతియింటా దుకాణంలోనూ ఇంగ్లండునందుండేవి. ఈనాటి కాపటం చెడ్డదయింది.

జనమంతా ఆ పటాన్ని చూచారు. దానిమూలానే తమకంత గొప్ప వ్యాధి కలుగుతోందని అనుకొన్నారు. ఈటెలెత్తి అరుస్తూ ఆగదిని జొచ్చారు...

తరువాత యేమైందో మనకవసరంలేదు. బహుశః పటం తరువాత ఆ మిషనరీ కాలిజోళ్ళూ, తరువాత టీకప్పులూ లేక

పోతే ఆయనభార్య తలటోపీ-యీమాదిరి ఏదైనా వారి అను మానాని కాస్పదమై యుండవచ్చు. అదిగో! ఎత్తుగా గోడ మీాద "టక్ టక్" మంటూ మెరిసే చేయి సిటూ అటూ, ఊగి స్తోంది ఆ గడియారం. అదే వారి కిన్నికష్టాలూ తెచ్చిందేమో ఎవరు కాదన గలరు.

ఇది, కథకాదు; వాస్తవంగా జరిగినవిషయం. తమకర్థ ముకాని విషయాలను గ్రహించుకోడానికి పూర్వీకులు యత్నించి ఏదీతెలియక మంత్రమో తంత్రమోనని చెప్పుకొని మనసు స్థిమితపరచుకొనేవారు.

అనుభవంమీాద ఈ సృష్టిలో ప్రతిదీ కారణయుతంగా నుంటుందని గ్రహించగలిగాము మనము. పూర్వీకులకీ కారణా లేవో తెలియక దయ్యమనీ, భూతమనీ పేర్లు పెట్టేవారు.

ఆఫ్రికా ఖండంలో విశేషంగా ప్రయాణంచేసిన ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు, "లెవీ - బ్రూల్" ఏం వ్రాశాడంటే: "లోఆంగో-దేశంలో సముద్రతీరానుండే జనమంతా కొత్తరకంగా తెర చాప లెగురుచున్న పడవవచ్చినా, సాధారణంగా ఉండే పొగ గొట్టాలకన్న యెక్కువగొట్టాలున్న ఆవిరియోడ వచ్చినా, భయపడుతారు. విచిత్రమై ఇదివరకెన్నడూ చూడనిమాదిరి టోపీ, వానపడినా తడవని రెయిన్‌కోటూ, ఇట్టివేవిచూచినా, వారికి చెప్పరానంత అనుమానం పుట్టుతుంది."

కొత్తగా యేదగుపించినా అందులో ఏదో మంత్రమో తంత్రమో, ఉన్నదనే వారిఊహ. ఎట్టి అపాయాలూ రాకుండా ప్రతివాడూ రక్షరేకులూ తాయిత్తులూ కట్టుకొంటారు ఆ దేశ ప్రజ. మొసలిపండ్ల దండలూ, ఏనుగుతోక వెంట్రుకల గాజులూ

ఇటువంటివన్నీ వారు ధరిస్తారు. అవి వారిని కాపాడుతాయని నమ్మకం.

ఈ "లొఆంగో" జాతివారికి లోకవిషయాలు ఎంత తెలుసో అంతకన్నా తక్కువే మన పూర్వీకునికి తెలుసు. మంత్రాలూ, గారడీ, తంత్రాలూ అంటే వారి కపరిమితమైన నమ్మకముండేది. నేలనుండి త్రవ్వి తీయబడిన తాయత్తులూ, గుహ గోడలమీది చిత్రాలే దీనికి నిదర్శనం.

## పూర్వీకులు తమకగుపించే సృష్టిని గురించి

పూర్వీకులు తమకగుపించే సృష్టిని గురించి ఎట్టెట్టి ఉద్దేశాలు కలిగియుండేవారో తెలుసుకొందాము. ఈసృష్టియొక్క నియమాలూ, అవి వర్తించే తీరూ తెలియకపోతే మన బ్రతుకు చాలా కష్టమవుతుంది. ప్రతినిమిషమూ మనకగుబడని శక్తు లేవో మన యావజ్జీవితాన్నీ తమ ఇచ్ఛవచ్చినట్లు మార్చు తాయనీ, వాని చేతుల్లో మనం కేవలం కీలుబొమ్మల్లాగా నున్నామనీ మనకనిపిస్తుంది. చనిపోయినమృగాలూ, మనుష్యుల ఆత్మలు మన వెన్నంటి తిరుగుతాయనీ, ఏ సమయాని కేవిధంగా అవి మనకు యే చెఱుపో చేస్తాయోనని భయంతో, దిగాలబడి కూర్చుని రోజులు గడపవలసివస్తుంది మనం. మనచే హింసించ బడ్డవారూ, చంపబడిన మృగాలూ, ద్రోహం చేయబడిన వ్యక్తులూ, చనిపోయి తమ కసిని మనపై తీర్చుకొంటారు. అట్టి అపాయం సంభవించకుండా వానికి పూజలూ పునస్కారాలూ చేయాలి ప్రార్థనలతోపాటు.

సృష్టియొక్క నీతినియమాలు తెలియకపోవటం చాలా గొప్ప అవిద్య అనాలి. అవిద్యా, అజ్ఞానమూ - వీనినుండే

భీతి జనిస్తుంది. మన పూర్వీకున కీ లోకాన్ని గురించిన విషయా లెన్నో తెలియనందున ఎల్లప్పుడూ భయంతో, దానికి దాసానుదాసుడై వర్తించేవాడు. లోక నియమాలు గ్రహిస్తే దాన్ని తనవశబర్చుకొని, దాని కధికారిగా మారేవాడే.

పెద్ద మామత్ లనూ, ఇతర మృగాలనూ జయించాడే గాని, ఆతని కింకా సృష్టియందలి శక్తులెన్నో భయం గొలుపుతూనే యుండేవి. ఉరుములూ, మెరుపులు, వరదలూ, భూకంపాలు, అధికవృష్టి, అనావృష్టి - యిట్టివన్నీ ఆతని కేమాత్రం అర్థమయ్యేవికావు. అందుకనే వానిని తన స్వాధీనం చేసుకోడానికి యత్నించాలనే అతనికి తోచిందికాదు.

వేటకు వెళ్ళి రిక్తహస్తాలతో వస్తే, కొన్ని వారాల వరకూ ఆకలిబాధకు అలమటించాలి. పెద్ద మంచు తుపానులు వచ్చి వారందరి నివాసాలనూ తెల్లని మంచుదూది యడుగున పూడ్చేయవచ్చు. ఇట్టి కష్టాలెన్నో ఆతని కుండేవి యెప్పుడూ.

కాని క్రమంగా మనుజుడు పైనుడివిన కష్టాలను అతిక్రమించనేర్చాడు. సృష్టిలోని శక్తులను గ్రహించి, వానిని తన వశపర్చుకోటం తెలుసుకొన్నాడు.

ఇట్టి మార్పుకు ప్రధమకారణం, నలుగురూ కలిసి జీవించటమే. అందరూచేరి దుర్లభమనుకున్న వేట మృగాలను పట్టి చంపేవారు. వరద నీళ్ళనుండి రక్షించుకొనే యత్నాలు చేసేవారు. మంచు అడుగున పూడిన తమ నివాసాలను తిరిగీ బయటకు లాగేవారు. ఇట్లా పదిమందీ కలిసి జీవించటంలో నూతన అనుభవాలూ, ఆ అనుభవాల మూలంగా కొత్త తెలివితేటలూ, జ్ఞానమూ వారి వశమయ్యాయి.

సాంఘిక జీవితమనీ, దాని తత్త్వమిది అని వారికి తెలియకుండానే పదిమందీ కలిసి జీవించటంలో ఉండే లాభాల వల్ల అట్లా జీవించటం అలవాటైపోయింది. ఒక ముఠాలో వారంతా అన్యోన్యంగా ఉండటం నేర్చారు. తామంతా ఒక్కటే ననే భావం వారికి కల్గింది. ఒక్కొక్కగుంపులోనూ పిల్లలు తమ తల్లులతో నుండేవారు. తిరిగీ వారి బిడ్డలూ ఆ తెగలోనే పెద్దవారితో కలిసి జీవించేవారు. అన్నదమ్ములనీ, అత్తమామ లనీ, అమ్మా, అమ్మమ్మా అనే సంబంధాలేర్పడి, వారి నొకరి నొకరితో బంధించివేసాయి. తెగలేర్పడడాని కిదే కారణం.

ప్రతి తెగలోనివారూ తామంతా ఎవడో ఒక ప్రత్యేక వ్యక్తినుండి జన్మించామనీ, వానిసంతతివారమనీ అనుకొన్నారు. పెద్దవాళ్ళు వేటాడటమూ, పనిముట్లు చేయటమూ తమ బిడ్డ లకు నేర్పేవారు. బిడ్డలు నివసించడానికి గృహాలూ, కడుపు నిండా తిండీ, కట్టుకొనేబట్టా వారికి పెద్దలు పెట్టిన భిక్ష అనే భావం క్రమంగా పెరిగి బలపడ్డది జనుల్లో.

వేటాడటంలోనూ, తమ వృత్తులు నెరవేర్చటంలోనూ పెద్దవాళ్ళు నేర్పిన పద్ధతులనే అవలంబించేవారు. పెద్దలమాట జవదాటనివాడు బాగుపడుతాడు. గతించిన పెద్దల ఆత్మలు తమ బిడ్డల నెప్పుడూ కనిపెట్టి కాపాడుతాయి. వారు తమకు కనుపించకపోయినా, తాముచేసే ప్రతిపనినీ చనిపోయిన పెద్దలు చూడగలరనీ, తమ ప్రతి ఆలోచనా వారికి తెలుస్తుందనీ, వారు నమ్మారు. చనిపోయిన తమ పెద్దలు చెడ్డవారిని శిక్షించి, మంచివారిని కాపాడుతారని జనులనుకొన్నారు.

దీన్నిబట్టి, నలుగురితో కలసి పనిచేయుటమూ, నలుగురి మేలూ కోరటమంటే, తమ పెద్దలు శాసించిన విధంగా జీవించటమేనని వారికి తోచింది. సంఘ పితరుల శాసనాలను పూర్తిగా అవలంబించటం ప్రతివానికీ పరిపాటైపోయింది.

ఇంతేకాదు; ఇంకా కొన్ని విచిత్రపుటుద్దేశాలు వారికుండేవి. ఏదైనా మృగాన్ని వేటాడి చంపినపుడు తాము దాన్ని చంపామని వారనుకొనేవారు కారు. ఆ మృగమే తమ యెడల దయదలచి, తన్ను తానే తమ కర్పించుకొన్నదనీ, తన శరీరాన్ని వారికి తానే ఆహారంగా వప్పగించుకొందనీ వారనుకొనేవారు. ఇప్పటికీ మనలో ఇట్టి ఉద్దేశాలు పూర్తిగా నశించలేదనడానికి ఒక నిదర్శనం వుంది. ఆవు మనకు పాలు "ఇస్తుంది" అంటాము. నిజానికి అది మనకీయటంలేదు; దాన్నడుగకుండానే మనం పాలు పితుకుకొంటున్నాము.

పూర్వీకులకు అడవిదున్నలూ, మామత్‌లూ, ఎలుగుబంటులూ తమ కెంతో ఉపకారంచేసే గొప్పదాతలనే ఉద్దేశముండేది. ఎఱ్ఱ ఇండియనులు అది ఇష్టపడనిదే ఏ మృగమును గానీ తాము సంహరించలేమనుకొంటారు ఇప్పటికీ. అడవిదున్నను వేటాడి ఇంటికి తెచ్చారంటే, అది కావాలని ఆత్మసమర్పణ చేసుకొన్నది; వారిచేతుల్లో తాను మరణించడానికది అంగీకరించిందన్నమాట.

ఆ అడవిదున్న ఆత్మసమర్పణ చేసుకొని, తమ తెగను కాపాడే ఉత్తమజీవి. కాబట్టి, ప్రతి తెగనూ, వారి పితృలతో బాటు ఏదో యొక ప్రత్యేక మృగముకూడా సదా కాపాడుతూ ఉంటుందని వారూహించారు. ఇందుకనే కొందరు తమ జాతు

లకు విచిత్రమైన పేర్లు పెట్టుకొనేవారు. "మేమంతా అడవి దున్న బిడ్డలమ"ని సగర్వంగా చెప్పుకొనేవారు. పురాతన గుహాలో ఒక యెముకపై అడవిదున్నా, మూడు గుడిసెలూ చెక్కబడిన చిత్రం కనుపించిందని చెప్పాము. దాని అర్థమేమిటో మన కిప్పుడు తెలుస్తోంది. "అడవిదున్న బిడ్డల గ్రామము" నా చిత్రకారుడు లిఖించాడు యెముకమీద.

తమకూ అడవిమృగాలకూ తీరని సంబంధమేదో యొకటున్నదని వారనుకొన్నారు. ఆ రోజుల్లో సంబంధమంటే, ఏకోదరత్వమనే ఉద్దేశమేకాని వేరే వారికేదీ తెలిసేదికాదు. కాబట్టే వారంతా ఏదో యొక మృగపు బిడ్డల మనుకొన్నారు. ఏ మృగాన్నైనా చంపినపుడు, "అన్నా! మమ్ము క్షమించ" మని ప్రార్థించి, దాని చర్మం ధరించి, ఆ మృగం మాదిరి నృత్యం చేసేవారు.

"నేను" అనేపదం అప్పటి జనులకు తెలియనే తెలియదు. ప్రతియొక్కడూ తానొక సంఘపు భాగమనీ, దాని శ్రేయస్సుకే జీవించవలసిన వాడేననీ అనుకొనేవాడు. మానవున కప్పటికింకా ప్రత్యేకవ్యక్తిత్వమంటే యేదీ తెలిసిందికాదు. ప్రతి తెగకూ దాన్ని రక్షించే మృగమని యేదో యొకటుండేది. దాన్నిబట్టే వారి తెగలపేర్లుండేవి; "అడవిదున్న జాతి", "ఎలుగుబంటివారు," "జింక తెగవారు" ఇట్లాంటివి. వారి ఆచార వ్యవహారాలన్నీ తమ ప్రత్యేక మృగపిత శాసనాలపై ఆధారపడి యున్నాయనుకొన్నారు. వాని నుల్లంఘించ వీలవుతుందని వారు కలలోకూడా అనుకొనేవారు కారు.

## పూర్వీకులతో యిష్టాగోష్ఠి

మన పూర్వీకుని గుహలోకి వెళ్ళి, సావకాశంగా అతనితో అగ్నిగుండం ప్రక్క కూర్చొని, మంచీ చెడ్డా మాట్లాడి వాని ఉద్దేశాలూ, ఆచారాలూ, అనుమానాలూ మొదలైనవన్నీ ఎట్లుంటాయో గ్రహించడానికి యత్నించుదాం. అతని గుహలోని తాయత్తులూ, రక్షరేకులూ, చిత్రాలూ చూస్తే ఘనకెట్టి ఉద్దేశా లేర్పడ్డాయో మనమే వానికి చెప్పుదాం. దీనంతకూ వాడేమి బదులు చెప్తాడో వింటే బాగుంటుంది కాదూ?

మన అభిప్రాయమైతే బహు బాగుంది కాని, అది నెరవేరడానికి గొప్ప ఆటంకాలున్నాయి. ఏనాడో అతని గుహలోని అగ్నిగుండం ఆరిపోయింది. ఆ బూడిదంతా గాలికి చెల్లాచెదరైంది. ఆ నిప్పుచెంత వెచ్చగా కూర్చుని రాతివీ, ఎముకలవీ, కొమ్ములవీ పనిముట్లుచేసిన వ్యక్తుల యెముకలు హరించిపోయాయి. ఆ మట్టిలో మన అదృష్టం బాగుంటే పురాతన కపాలమేదైనా కనుపిస్తే కనుపించవచ్చు. ఐనా, ఈ కపాలం మనతో మాట్లాడడానికి వీలుండదుగా?

గుహలు త్రవ్వేటపుడు శిథిలమైన పనిముట్లూ, వాని భాగాలూ దొరికాయి. వాని నాధారంచేసుకొని మానవుడెట్లు వాని నుపయోగించాడో కనుక్కోగలిగాము. ఇదేమాదిరి పురాతన మానవు డుపయోగించినభాషా, దాని భాగాలు కూడా గుహల్లో వెతికితే దొరుకుతాయా?

అట్టి ఆధారాలకు గుహల త్రవ్వి లాభంలేదు. మన మిప్పు డుపయోగించే భాషను పరిశీలించాలి. నిఘంటువులోని

ప్రతి యొక్క పదానికీ ఎంతో పూర్వగాధ ఉంది. ముఖ్యంగా యీ భాషాపదాలద్వారానే గతించిన ఎన్ని తరాలో మనలో యింకా సజీవంగా నున్నాయనవచ్చు.

భాషను పరిశీలించటం చాలా సులభమని నీవనుకో వచ్చు. కుర్చీని బల్లదగ్గరకులాగి కూర్చుండి నిఘంటువు పుటలను తిరుగవేస్తే కార్యమవుతుందని నీవనుకోరాదు. ఇందులో నుండే చిక్కులు అనేకం.

పురాతన పదాల నన్వేషిస్తూ భాషాపరిశోధకులు భూమంతా తిరుగుతారు. ఎత్తు కొండలెక్కి సముద్రాలు దాటి ఏదో పర్వతరాజాల కావల ప్రక్కనుండే గ్రామాలకుపోయి వెతకాలి. అట్టి మారుమూల ప్రదేశాల్లో యిప్పటికీ పురాతన భాష కొద్దో గొప్పో ఉపయోగంలో నుంటోంది.

ఈ అన్వేషణలో దక్షిణపు ఎడారులనుండి ఉత్తరధ్రువ ప్రాంతపు మంచు బయళ్ళవరకూ పరిశోధకులు సంచరిస్తారు. దూరపు టుత్తరభాగాల భాషలో మనిషి తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని తెలుసుకోని రోజుల్లో వాడబడిన పదాలు యిప్పటికీ ఉన్నాయి. వారి భాషలో "నేను" "నాది" అనే పదాలే లేవు. ఇట్టి పరిశోధనలు చేయడాని కెంతో పరిశ్రమా తరిఫీదూ కావాలి. పురాతన వస్తువులైతే ప్రదర్శనశాలల్లో దాచి ఉంచవచ్చే కాని సజీవమైన యెప్పటికప్పుడు మారేభాష నట్లా ఊరగాయవేసి దాచడానికి శక్యంకాదు. పూర్వపు పదాలెన్నో రూపాంతరాలు పొందాయి. ప్రస్తుత కాలపు యే పదానికన్నా పురాతన మాతృకమాట యేదో కనుక్కోటం బహుకష్టమైన

పని. ఉత్పత్యర్థం అయినదాన్ని బట్టి వెతకులాడితేనే కాని మన కార్యం సిద్ధించదు. ఇన్ని చిక్కులున్నాయి.

కొన్ని సందర్భాల్లో పురాతన పదాలే విషయాన్ని తెలిపేవో దానికేట్టి సంబంధమూ లేని విషయాలకు వాటినుండి వచ్చిన పదాలు ఉపయోగం చేస్తున్నాము. ఏదైనా క్రొత్త దొకటి కనిపెడితే రూఢ్యర్థాన్ని బట్టి తగిన పేరు మనం యీ రోజుల్లో దానికి నియామకం చేస్తాము.

ఆంగ్లభాషలో కలానికి "క్విల్" - అంటే యీక అని సర్వసాధారణంగా వాడుతారు. ఫౌంటెన్ పేనాలున్న యీ రోజుల్లోనూ యిది వాడబడుతోంది. కారణం? పూర్వం మన వాళ్ళమాదిరే వారూ యీక కలాలుపయోగించారు.

ఆ దేమాదిరి వ్రాతప్రతికి ఆంగ్లంలో "మానుస్క్రిప్టు" అంటారు. కాని యీ రోజుల్లోని మానుస్క్రిప్టులన్నీ యంత్రం అచ్చొత్తుతుంది. యెవరూ వ్రాయరు; విధానం మారిందేకాని పదం మారలా. క్రొత్తగా ముద్రణాయంత్రాలు కనిపెట్టినపుడు వానిని "వ్రాతయంత్రాల"న్నారు. అలవాటును బట్టి "తనఖా పత్రం" అంటాము. పూర్వం పత్రాలపైన వ్రాసే అలవాటు నిది చూపుతుంది. ఇవి మన వాడుకభాషలోనుండే పదాలు కాబట్టి త్వరగా వీని పూర్వవృత్తాంతం మనకు విశదమవుతోంది. ఇంకా పురాతనపదాలను వెతుకుతూ వెళ్ళేకొలదీ మనపని యెంతో కష్టమవుతుంది.

మార్ అనే శాస్త్రకారుడు యీ భాషల విషయం ఎంతో గొప్ప పరిశోధనలు చేశాడు. పురాతన పదాలనుండి వచ్చిన యీ కాలపు మాటలను మనం పూర్తిగా వేరే

అర్థంలో తరుచు వాడుతామని నిరూపించాడు. అనేక భాషల్లో "గుఱ్ఱము" అనే మాటకు "రెయిన్ డీర్" అనీ, "కుక్క" అనీ భావం ఉన్నది. పూర్వం గుఱ్ఱాలనెక్కి స్వారిచేయడానికిముందు జనులు యీ రెయిన్‌డీర్ లనూ, కుక్కలనే ఉపయోగించారు. కొన్ని భాషల్లో "గోధుమ"కు "కాయ" అనే అర్థముంది. గోధుమలు పండించేముందు కాయలనే తినేవారు.

కొన్ని భాషల్లో "సింహమును" "పెద్దకుక్క" అంటారు. "నక్క"ను "చిన్నకుక్క" అంటారు. 'కుక్క' అనేపదం 'సింహాని'కీ 'నక్క'కూ పూర్వమే పుట్టింది.

### పు రా త న ప ద శి థి లా లు

పురాతన పదశిథిల భవనాలూ కోటలూ పరీక్షించి వాని పూర్వపు చరిత్రను కనుగొనేటట్లే పురాతన భాషల పరీక్షించీ, వాని శిథిలపదాలను శోధించీ శాస్త్రజ్ఞులు భూలోకపు ప్రాచీనభాషలనుగురించి యెన్నోవిషయాలు తెలుసుకొన్నారు. మెశ్చనినార్ అనే శాస్త్రకారుడు తన పుస్తకం ఒకదానిలో ఈ భాషా శిథిలాలగురించి వ్రాసాడు.

యుకాగీర్ జాతి ప్రజలభాషలో ఒకమాటను తెలుగులో చెప్పాలంటే "మనిషి - రెయిన్‌డీర్ - చంపు" అని వ్రాయాలి. ఇంత పొడుగుపదాన్ని ఉచ్చరించటం కష్టమేకాక, దీని సరియైన అర్థమేదో మనకు స్ఫురించదు. ఎవరు ఎవరిని చంపారో తెలియదు. మనిషి రెయిన్‌డీర్‌ను చంపాడా ? లేక రెయిన్‌డీర్ మనిషినా ? రెయిన్‌డీరూ మనిషీ కలిసి ఇంకొక మూడవ వ్యక్తినా ? వేరే మూడవవాడొకడు మనిషినీ, రెయిన్‌డీర్‌నూ చంపాడా ? అంతా అగమ్యగోచరంగా ఉంది.

యుగాకీర్ మనుజుల కిది స్పష్టంగా అర్థమవుతుంది మనిషి, రెయిన్‌డీర్‌ను చంపాడని. ఇట్టి వింతపదం యేర్పడడానికి కారణం యిది. ఆ కాలంలో మనిషి తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని గుర్తించుకోలేదు. "నేను" అనేభావం వానికింకా స్ఫురించిందికాదు. తానొక పనిచేస్తాడనీ, వేటాడి పోషించుండి జంతువుల చంపుతాడనేభావం వానిలో జనించిందికాదు. రెయిన్‌డీర్‌ను తానుగానీ తన జాతిగానీ చంపరనీ యేదోయొక విచిత్ర శక్తి దానిని చంపుతుందనీ అనుకొన్నాడు. ప్రకృతియొక్క ఆ భయంకర శక్తుల ముందాతడేపనీ చేయలేని బలహీనుడుగానూ అశక్తుడుగానూ తన్ను తాను భావించుకొన్నాడు.

పైన నుడివిన విచిత్రశక్తుల దయవల్ల యివ్వాళ "మనిషి-రెయిన్‌డీర్ - చంపు" అనేపని సఫలం కావచ్చు. రేపు ఆ శక్తులను గ్రహించకపోతే వారివేట విఫలమవుతుంది; వట్టిచేతులతో యింటికివస్తారు. అట్లా వారిమనసు పనిచేసేది

"మనిషి - రెయిన్‌డీర్ -చంపు" అనేమాటలో ఆ పనిని ఒకవ్యక్తి చేస్తాడనే భావం యేదీ కనుపించదు. అట్టి వ్యక్తి తానుగానీ లేక రెయిన్‌డీర్ గానీ యెన్నడూ కానేరదు. వ్యక్తిత్వమనేది వారికింకా అర్థంకాలేదు. తనకన్నా, రెయిన్‌డీరుకన్నా అధికులైన పితృదేవత లెవరో రెయిన్‌డీర్ నాతని కర్పిస్తారు.

క్రమంగా పురాతన భాషలనుండి మన యీ కాలాన్ని సమీపించి వాడుకలోనుండే భాషల చూచినప్పటికి ఏవో యితర శక్తుల చేతుల్లో తానొక కీలుబొమ్మగా మానవుడున్నాడనే ఉద్దేశం ప్రజల్లో నుండేదనడానికి యెన్నో నిదర్శనాలున్నాయి.

ఉదాహరణంగా "చకోట" జాతివారి భాషలో యీ మాటున్నది. "మనిషివలన మాంసం యిస్తుంది కుక్క." ఇదెంత అగమ్యగోచరమో ఆలోచించుచూ, పైదానినే మన వాడుక భాషలో వ్రాయాలంటే "మనిషి తన కుక్కకు మాంసము యిచ్చెను" అనాలి.

పురాతన జనుల భాషనుబట్టి ఎవరు మనిషిద్వారా కుక్కకు మాంసం యిప్పించుతారో తెలియదు. ఏదో యొక గొప్పశక్తి మానవుని ఉపయోగించుకొని కుక్కకు అతనిద్వారా మాంసం యిప్పించుతుందని వారి అభిప్రాయము.

డెకోటా ఎజ్జియిండియనులు "నేను కట్టుచున్నాను" అనే బదులు "నాలీలనకుట్టు" అంటారు. సూదితో కుట్టుట అన్నట్లుగా మనిషివలన కుట్టుపని జరుగుతోంది అని అంటారు. తాను కుట్టుచున్నాననే భావం వారికి ఉండేదికాదు.

ఫ్రెంచి భాషలో "చలిగా ఉన్నది" అనడానికి వా రుప యోగించేపదం "చలిబెట్టిస్తున్నాడు" అన్నట్లుంటుంది. అంటే తనకు చలిగా నున్నదనేబదులు తాననే వ్యక్తిత్వం తెలియ నట్లూ, చలిని యెవరో కలుగజేస్తున్నట్లూ అర్థమవుతుంది. ఏదైనా పోయిన వస్తువు మనకు దొరికితే "వస్తువు కనుగొన బడెను" అంటాము. ఏదో విచిత్రమైన శక్తుల సహాయంచేత అది కనుగొనబడిందా ? ఇదేమాదిరి నీరెక్కువగా వచ్చినపుడు "నది దాటనీయదం"టాము. దుర్గమారణ్యం "చొరనీయద"నీ అంటాము.

ఈ విధంగా పరిశీలించి కనిపెట్టబడిన పదశిథిలాలు పూర్వీకుల ఆలోచనలూ, ఉద్దేశాలూ యెట్లుండేవో మనకు

తెలుప గలుగుచున్నాయి. తాను కేవలం అశక్తుడు; లోక వ్యవహారాలను నిర్వహించి నడిపే అదృశ్య శక్తులున్నాయి; వాని చేతుల్లో వొక కీలుబొమ్మవంటివాడు తాను: ఇవీ మన పూర్వీకుల ఉద్దేశాలు.

కాలం గడచిపోయింది. మనుజునిలో బలమూ, శక్తీ అతిశయించాయి. లోకమూ, దాని వ్యవహారాల్లో తన ఉనికి నాతను గ్రహించుకొన్నాడు. "నేను" అనే పదం మానవ భాషలో ప్రాడచూపింది. అనేకపనులు చేస్తూ, కష్టా లనుభవిస్తూ లోకమూ, అందలి వివిధ పదార్థాలనూ గ్రహించి స్వాధీన పరచుకోగల మానవ వ్యక్తిత్వం తల యెత్తింది.

"అది మానవు నుపయోగించి రెయిన్‌డీర్‌ను చంపెను" అనే వాక్యానికి బదులు "మనుజుడు రెయిన్‌డీర్‌ను చంపెన"నే వాక్యం అవతరించింది. కాని యిప్పటికీ మనంవాడే కొన్ని పదాలు మానవుని నిస్సహాయత్వాన్ని చాటుతాయి. "అదృష్ట దురదృష్టాలు","కర్మ", "నొసటివ్రాత"-యిటువంటివన్నీ మనం సాధారణంగా ఉపయోగిస్తాము. పూర్వీకుల అగోచర అతీత శక్తులకే ఇట్టి పదాలు మనమూ ఉపయోగిస్తున్నాము.

ఈ కాలపు వ్యక్తి అట్టి శక్తులంటే నమ్మినా, లేకున్నా తాను చేసే వివిధ కార్యాలకూ స్వశక్తి నుపయోగించి, వాని బాగోగులు తనపై ఆధారపడియున్నట్లు వర్తిస్తున్నాడు. పంటలు పండేదీ, లేనిదీ తనయొక్క ముందు జాగ్రత్తపైనా, తా నుప యోగించే యంత్రాలూ, యెరువులపైనా ఆధారపడియుంటుం దని గ్రహించాడు. నూతన శాస్త్రపరిశోధనల ఫలితంగా లోక

వ్యవహారాల్లో తనబుద్ధి నుపయోగించీ, తగిన కట్టుదిట్టాలు చేసుకొనీ భవిష్యత్తును తన స్వాధీనం చేసుకోగలుగుతున్నాడు. క్రమ క్రమంగా, మానవుడు లోకాన్ని ఒకరోజుకన్న మరొకరోజు యెక్కువగా తన స్వాధీనం చేసుకొంటున్నాడు.

అవిద్య భయానికి హేతువు. విద్యా, జ్ఞానమూ ఇవే మానవునికి నిజమైన బలపరాక్రమాల నిచ్చేవి.

లోక వ్యవహారము లేయే కట్టుబాట్లపై నాధారపడు తాయో తెలియనప్పుడు మానవుడు దానికి బానిస అయి, యెప్పుడూ భయపీడితుడై జీవించాడు.

లోక తత్త్వాన్నీ, తన తత్త్వాన్నీ గ్రహించుకోటంచేత తన భవిష్యత్తు తనపైనే ఆధారపడియున్నదనే భావం కలిగింది ఆతనిలో. దాని కనుగుణ్యంగా జీవించ యత్నిస్తున్నాడు, యీ కాలపు మనిషి.



# గొప్ప చిగురింతకాలము

మన హిందూదేశం, భూలోకపు వేడిమండలంలో వుంది. ఇందుమూలాన దేశమంతటా సంవత్సరం పొడుగునా వేడిగానే యుంటుంది. చలికాలం, వేసవి, చిగురింతకాలం అని ఋతువు లున్నప్పటికీ, వాని భేదం విస్పష్టంగా కనుపించదు. నీల గిరులూ, కాశ్మీరువంటి మెత్తుప్రదేశాల్లో చలికాలంయొక్క బలం తక్కిన ప్రదేశాల్లోకన్న ఎక్కువగా వుంటుంది. చలికాల మప్పుడు మెత్తని దూదిపింజల్లాగా మంచు కురిసి నేలనూ, చెట్లనూ కప్పుతుంది.

మంచుయెడారులు మాయమగుట

బ్రిటనూ, ఐరోపాఖండమూ, సైబీరియాలవంటి చలి మండల ప్రదేశాల్లో చలికాలం విజృంభిస్తుంది. దూది మంచుతో నేలా, చెట్లూ, కొండలూ కప్పబడుతాయి. రైలు ఇంజనులు "మంచునాగలి" నుపయోగించి పట్టాలపై పేరు కొన్న మంచులో దారిచేసుకు వెడతాయి.

చలికాలం ఆఖరై వేసవి వచ్చేముందు సూర్యుని తీక్ష్ణం క్రమ క్రమంగా నేలపై ప్రాకుతుంది. మంచుకరుగుతుంది. అడ

వుల్లో, పొలాల్లో గ్రామబాటలవెంబడీ, రోడ్డు పార్శ్వపు సిమెంటు కాలువల్లోనూ జలజల ధ్వనితో నీరు ప్రవహింప మొదలుపెట్టుతుంది. మట్టితో కలిసి బురదగా మారినా ఇంకా పైపైన పేరియున్న మంచు అడుగునుండి, బడినుండి ఇండ్లకు పరుగిడే పిల్లలమాదిరి, గంతులేస్తూ చిందులుత్రొక్కుతూ గల్లంతుగా కలకలానవ్వుతూ నీరు ప్రవహిస్తుంది.

ఎండవేడిని భరించలేక సూర్యరశ్మిపడే కొండపార్శ్వాల నుండి దిగజారి మంచు చిన్నగుంటల్లో, కొండచెరియల్లో, చెట్లనీడల్లోనూ దాక్కొంటుంది. ఎంతదాగినా మేనెల ప్రారంభంతో దానికి తలదాచుకోను తావే యుండదు. ఆసమయానికి ప్రకృతిరూపమంతా పూర్తిగా మారిపోతుంది. పూర్వం తెల్ల మంచుబురఖాలు ధరించిన కొండ పార్శ్వాలన్నీ, లేత పసరికతో పసందుగా ఉంటాయి. మోడులై నిలబడిన వృక్ష శాఖలు లే చిగుళ్ళ తొడుగుతో లేత యెండలో శోభాయమానంగా వుంటాయి.

ప్రతిసంవత్సరమూ, చలికాల మంతరించి, వసంతాగమ సమయాన యిట్టి దృశ్యం కనుపిస్తుంది. పూర్వం భూమంతా చల్లబడి ఉత్తరాన్నుండి దాదాపు ఐరోపాఖండ దక్షిణభాగం వరకూ మంచుగడ్డలు పేరుకుపోయాయని చెప్పాము. జ్ఞప్తి కున్నదా ? ఆ గొప్పమంచు కరిగినపు డెట్టిమార్పులు భూమిపై జరిగాయో ఆలోచించుదాము.

చిన్న కాలువలూ, సెలయేరుల బదులు బ్రహ్మాండమైన నదీప్రవాహాలు బయలుదేరాయి. అప్పుడు పుట్టిన నదులే యిప్పుడూ చాలావరకు లోకంలో ప్రవహిస్తున్నాయి. దారి

పొడుగునా, సముద్రుని చేరేవరకూ అసంఖ్యాకంగా ఉప నదులూ, సెలయేటిలూ, కొండవాగులూ వానితో కలుసు కొన్నాయి.

లోకమంతా ఒక్కసారి హేమంత నిద్రనుండి మేల్కొం చింది; బ్రహ్మాండమైన చిగురింత కాలం ప్రారంభమైంది. ఆకూ, అలమూ లేని ఉత్తర మంచులోయలన్నీ దుర్గమారణ్యాలతో నిండిపోయాయి.

ఒక్కసారిగా ఏదో ఎలెక్ట్రిక్ స్విచ్ నొక్కితే దీపాలు వెలిగేటట్లు, వసంత మవతరించిందనుకోరాదు. అంతవరకూ నిరంకుశ ప్రభుత్వమున కలవడిన చలిదేవుడు లోకాన్ని వదలి పోవడానికి యిష్టంలేనట్లు, నెమ్మదిగా తన పదవిని త్యజించు కొన్నాడు. పూర్తిగా పదచ్యుతి నొందేటప్పటికి కొన్ని వందల యేండ్లు గడిచాయి.

కొంతవరకూ కటిగి, దిగజారి, ఉన్నట్లుండి తిరిగి ముందుకు వ్యాపించేవి మంచుగడ్డలు. నేలయడుగు నీరంతా గడ్డ కట్టుకుపోయి మంచుయెడారులు – టండ్రా అంటారు వీనిని- యేర్పడ్డాయి. ఆ ఎడారులపై రెయిన్ డీరులు కనుపించాయి.

లోయల్లోని గడ్డినంతా తటిమి నాచు మొక్కలూ, అట్టివే యితర జాతులూ పెటిగాయి. అడవిదున్నలూ, గుఱ్ఱాలూ ఆహారం వెతుకుతూ దక్షిణముఖంగా పోయాయి. ఈ విధంగా శీతోష్ణాలు ఒండొంటితో ఎన్నేండ్లో పోరుసలిపాయి. తుదకు వేడే జయించింది.

పెద్దనదులు గర్జనధ్వనులతో ప్రవహింప మొదలు పెట్టాయి. భూమియొక్క ఉత్తరధృవానికి క్రమేపీ మంచుగడ్డలు

కరుగుతూ పలాయనమైనాయి. టండ్రామైదానాల దక్షిణ సరిహద్దులు నెమ్మదిగా ఇష్టంలేనట్లు ఉత్తరానికి మారటం మొదలుపెట్టాయి. నాచుమొక్కలూ, గిడసబారిన పొట్టి చెట్లూమాత్రం పెరిగిన ప్రదేశాల్లో గోపురాకారపు పైన్ వృక్షాలు పెరిగి, వాని చిటారు కొమ్మలు మేఘాలతో దాగుడు మూతలాడుకోటం మొదలుపెట్టాయి.

క్రమంగా వెచ్చవెచ్చగా భూమి మారుతూవచ్చింది. పైన్ వృక్షాలకు తగినంత చలిలేనప్పుడు వెడల్పాటాకుల ఓక్ వృక్షాలు పెరిగి, అదే ప్రదేశాల నావరించాయి. ఇట్టి పెద్ద పత్రాల వృక్షాలకూ, పొదజాతి మొక్కలకూ, కుక్కగొడుగులూ, పొదలలో నగుబడే అనేకరకాల పండ్లకూ అలవాటుపడిన జంతుజాలంకూడా, ఆ యా వృక్షజాతులతో క్రమంగా భూభాగపు ఉత్తరదిశకు వ్యాపించింది. అడవిపందీ, పెద్ద జింకా, అరణ్య వృషభమూ, పలవలుచీలిన కొమ్ముల జింకలూ, లేళ్ళూ యీ ప్రదేశాలలో కనుపించాయి. అడవి తేనెను వెతుకుతూ ఎలుగుబంట్లు చెట్లకొమ్మల కెగబ్రాకాయి. క్రింద రాలిన ఆకులపై నిశ్శబ్దంగా నడచి పొంచుండి, తోడేళ్ళు యెన్నో కుందేళ్ళబట్టి భక్షించాయి. బీవరులు అడవిప్రవాహాల కొలికికి నీటిప్రవాహాల నరికట్టి, తమ గృహాల నిర్మించుకొన్నాయి. అడవంతా వివిధ విహంగజాతులగానంతో మారుమ్రోగింది. అరణ్య తటాకాలమీద అడివిబాతులూ, హంసలూ తెగ యీదాయి పసందుగా.

పై నుడివిన మార్పులన్నీ జఱిగేరోజుల్లో, మానవుడు తమాషాగా వానిని చూస్తూ నిలబడిపోయాడనుకోకూడదు. ఏదో పెద్దనాటకం చూస్తున్నట్లు ఆతని కగుపడే సృష్టియావత్తూ కనుపించింది. ప్రతి అంకమూ, యీ జగన్నాటకంలో కొన్ని వేల యేండ్లు నడచింది; నాటకం వేయబడిన స్టేజి కొన్ని లక్షల చదరపుమైళ్ళు వ్యాపించింది. కాని, తనకు తెలియకుండానే మనుజుడా గొప్ప నాటకంలో పాల్గొన్నాడు. ప్రేక్షకుడుగా తటస్థంగా అతడొక్కనాడైనా ఉండవీలయిందికాదు.

తెర మారినప్పుడల్లా మనుజుడూ తన వేషాన్ని మార్చుకొన్నాడు. పెఱిగేరోజుల్లో చలి టండ్రాయొక్క దక్షిణభాగాలకు వ్యాపించింది. తనతోపాటు నాచుమొక్కలనూ, రెయిన్‌డీరులనూ, ఆ టండ్రా మైదానం దక్షిణానికి యీడ్చుకుపోయింది.

ఆ మైదానంలో పెఱిగే నాచుమొక్కల భక్షిస్తూ రెయిన్‌డీరులు తిరిగాయి. మనుజుడు వేటాడుతూ, వానివెంట బడ్డాడు. టండ్రాగా మారకముందు ఆ మైదానాల్లోని మనుష్యులు గుఱ్ఱాలనూ, అడివిదున్నలనూ వేటాడితే, యిప్పుడు రెయిన్‌డీరును వేటాడవలసివచ్చింది. "సీతాపతీ, నీవేగతీ" అన్నట్లు, ఆతనికి పాపం! రెయిన్‌డీరే గతియైంది. మామత్‌లన్నీ అంతకు పూర్వమే నశించిపోయాయి. వేలకొలదిగా వానిని వేటాడి, సంహరించి, తమ నివాసాల చుట్టూ మెత్తుగుట్టలుగా వాని యెముకలు పేర్చారు. ఇక గుఱ్ఱాల సంగతా? వాని నెట్లా చంపేవారో మొదటిభాగంలో తెల్పాముగా! ఏవో ఒకటే, అరా

తప్పించుకు మిగిలినవి మంచి గడ్డి పెరుగుచున్న దక్షిణ భాగాలకు వెళ్ళిపోయాయి.

వేరే గత్యంతరం లేక, మనుజులు రెయిన్‌డీరును తిన్నారు. దాని చర్మంతో బట్టలు కుట్టుకొన్నారు. దాని కొమ్ములతో యీటెలూ మొదలైన పరికరాలు చేసుకొన్నారు. రెయిన్‌డీరు జీవితానికీ, అలవాట్లకూ అనుగుణ్యంగా తన జీవితాన్ని, మనుజుడు మార్చుకోవలసిన అవసరం కలిగింది.

రెయిన్‌డీరులు తిరిగేచోట్లకంతా వాళ్ళూ వెళ్ళారు. స్త్రీలు త్వరత్వరగా ఎక్కడ అవసరమైతే అక్కడంతా నివాసాలు యిట్టే నిర్మించేవారు. వారి గుడిసెలను తోళ్ళతో కప్పేవారు. దేశద్రిమ్మరి జీవితం వారికి తప్పించి కాదు. దోమలు కుట్టి తరుముతోంటే రెయిన్‌డీరులు ఇక్కడా అక్కడా అనకుండా, యిష్టం వచ్చినట్లు మందలు మందలుగా దూరప్రదేశాలకు సాగిపోయేవి. జనులు తమ పాకల నూడదీసి, కట్టగట్టి నెత్తిన బెట్టుకొని బయలుదేరేవారు. బరువుల మోస్తూ, టండ్రా చలికి బాధపడుతూ, ఎంతెంతదూరమో స్త్రీలు నడిచేవారు. పురుషులు దర్జాగా యీటెల పట్టుకొని, కులాసాగా వెళ్ళేవారు. ఇంటి విషయాలలో వారెట్టిజోక్యం కలుగజేసుకొనేవారు కారు.

క్రమంగా వసంతకాల ప్రభావంచేత, టండ్రా మైదానాలు ఉత్తరానికి జటిగిపోవటం మొదలుపెట్టాయి. వానితో రెయిన్‌డీరులూ వెళ్ళాయి. అంతకుపూర్వం టండ్రాలున్న ప్రదేశంలో దట్టమైన దుర్గమారణ్యాలు పెరిగాయి.

ఇట్టి మార్పులు జరిగేటప్పుడు కొందరు జనులు రెయిన్‌డీరుల వెంబడే ఉత్తరధృవప్రాంతాలకు వెళ్లిపోయారు. ముప్పై

యైదువేల సంవత్సరాలుగా రెయిన్‌డీరులకూ, టండ్రాలకూ అలవాటుపడిన మనుజునికి, వానితో ఉత్తరోత్తరంగా జరుగుతూ వెళ్ళటమే బహు మంచిదనిపించింది. తా నలవడిన జీవితాన్ని వదలటం కష్టమనిపించింది.

అట్లా అలవాటైన మార్గాన్ని అనుసరించటంచేత అచ్చటకు వెళ్లిన మానవు లెన్నో విషయాల్లో ముందంజవేసే అవకాశాలను కోల్పోయారు. దక్షిణభాగాలన్నీ వెచ్చగా మారుతోంటే, వారు తమ యావజ్జీవితమూ, స్థిరంగా మంచుయుగంలోనే గడుపవలసివచ్చింది. గ్రీనులాండులోనుండే యెస్కిమో జాతివా రిప్పటికీ మంచు యడారులలో నుంటున్నారు. యేదో యింత తిండికి, బట్టకి చెప్పరాని కష్టాలుపడుతారు.

టండ్రాలతో ఉత్తరభాగాలకు పోక, ఆ ప్రదేశాలలోనే నిలువబడిన మనుష్యుల జీవితమంతా వేరే విధంగా తయారయింది. ఎటుజూచినా, యేదో గారడీవాని మంత్రశక్తితో పెరిగిపోతున్నట్లు లేచే అరణ్యాల్లో నివసించటం కష్టమనిపించింది. ప్రథమంలో అయినా జన్మంతా మంచులో ఖైదీలుగా నుండటం వారికి తప్పింది ఉత్తరానికి రెయిన్‌డీరులతో వెళ్ళక అక్కడే ఆగిపోవటంవల్ల.

## అరణ్యాలూ - మనిషీ

ఆ రోజుల్లో పెరిగిన అరణ్యాలకీ, యీకాలపు టడవులకూ యెన్నో భేదాలున్నాయి. దట్టంగా పెరిగి, చీమయినా చొరడానికి వీలుగాకుండా ఉండేవి. నదీతీరాలూ, సరస్సుల ఒడ్డూ, సముద్రాల నీటి హద్దులవరకూ అవి పెరిగిపోయాయి.

ఇట్టి అరణ్యాల్లో వసించడానికి మనుజుని కెంతో కష్టమని పించింది. గజిబిజిగా అల్లుకొని, దొరికిన స్థలమునంతా ఆక్ర మించుకొన్న ఆ అరణ్యావృక్షాలమధ్య అతనికి నిలువనీడే లేక పోయింది. వానిని నరికివేయటమో, కాల్చటమో చేస్తేనేగాని అతనికి పాదం మోపేటంత స్థలమైనా దొరికేదిగాదు.

టండ్రాలలో, మైదానాలలోనూ కావలసినంత ఖాళీ స్థలముండేది. అతని నివాసానికి అడవుల్లో అట్టి స్థలాన్ని చెట్లను పారదోలి, తాను సృష్టించుకొంటేనేగాని అతనికిఉనికి ఏర్పడింది కాదు. అరణ్యం అతని కొక గొప్ప శత్రువుగా పరిణమించింది. తన యావచ్ఛక్తులూ వినియోగించి దాన్ని జయించవలసిన అగత్యం కలిగింది.

చెట్లు నఱకడానికి తన పెద్ద ముక్కోణపు రాతికత్తిని బలమైన పిడికి బిగించాడు. ఆ గొడ్డలితో వానిని పడగొట్టాడు. అంతకుముందు యెండవేళల పసందుగా వినబడే వడ్రంగిపిట్ట ముక్కుదెబ్బల శబ్దాని కలవాటుపడిన అరణ్య మృగజాతులు మానవుని గండ్రగొడ్డలి వ్రేటులకు ఝుడిసిపోయాయి. బ్రహ్మాండ వృక్షరాజాలు ఆ గొడ్డలి తాపులకు భీతిల్లాయి. వాని గాయాల నుండి ఏకధారగా జీవరసం కారింది. పెద్ద ఫెట్టున, ఫెళఫెళ ధ్వనితో దభేలుమని నేలకూలాయి.

ఈ విధంగా ప్రతిరోజూ, విసుగూ విరామం లేకుండా జనులు అరణ్యాల నరికారు. తమ నివాసమునకు కావలసిన ఖాళీస్థలం సేకరించుకొన్నారు. చెట్లు నరికి మిగిలిన మోళ్ళనూ పొదలనూ కాల్చారు. కొమ్మలన్నిటినీ కొట్టి, ఒక చివర పదునుగా మ్రానును చెక్కారు. కొయ్యనుత్తితో బలమైన

దెబ్బలుకొట్టి దాన్ని భూమిలో పాతారు. దానిప్రక్క నింకొకటీ, తరువాత మరొకటీ, యిట్లా యెన్నో ప్రానులు పాతారు. చెట్లకొమ్మలతో అల్లి వత్తుగా వానికి దడులల్లారు. అదే మానవుని ప్రథమ నివాసం. ఆ అరణ్యంలో చూడ్డాని కవి, చెట్ల మధ్య చెట్లలాగ కనుపించినవి ఇతర ప్రానులన్నీ అవకతవ కగా యెక్కడబడితే అక్కడే పెరిగేవి. ఇతని నివాసపు ప్రానులుమాత్రం ఏదో ఒక యేర్పాటుగా నిలబడి మానవ స్పర్శను దెలిపేవి.

ఇంటికే ఇంత తిప్పలుపడితే, ఆహారాని కతను పడిన అగచాట్లకు మితేలేదు. పాపం! బయళ్ళలో, గడ్డిమైదానాల ల్లోనూ మందలు మందలుగా తిరిగే మృగాల వేటాడేవాడు. ఎంతదూరాన్నుండీ అవి వానికి సులభంగా అగుపడేవి, అందు బాటులో నుండేవి.

ఆ అరణ్యంలోనుండే మృగాల సంగ తట్లాకాదు. లెక్క లేనన్ని జీవులుండేవేకాని,ఆతని కంటి కొక్కటీ కనుపడేదికాదు. ఆ అరణ్యపు ప్రతి అంతస్తూ సజీవంగా నుండేది. వాని కూత లతో, అరుపులతో, పాటలతో అరణ్యమంతా నిండిపోయేదే కాని కంటి కగుపించేవికావు.

కాళ్ళచెంత అలజడి, గాలిలో యేదో రెక్కలచప్పుడు, చెట్ల ఆకులను యేజీవో కదిలించిన గలగల... చెట్లమధ్యనుండే ఆ వెలుగు నీడల్లో, రకరకాల వాసనల్లో, శబ్దాల్లో ఏదైనదీ, ఎక్కడున్నదీ యెట్లా కనుక్కోటం? ప్రతిజీవికీ తగిన రక్షక వర్ణముండేది. పచ్చని పత్రాల్లో క్రింద రాలిన యెండుటాకుల్లో

# వేటాడి జీవించే కాలం



శరవేగం అతని కాధారమైంది, వాయువేగంతో పరుగిడే
జంతువుల జయించటానికి.

గోధుమరంగు వృక్షమ్రానుల్లోనూ రంగులో రంగు కలిసిపోయి అవి తప్పించుకుపోయేవి కంటికైనా కనుపించకుండా.

అదృష్టంచేత యేదన్నా జీవి కనుపించిందనుకో, మొదటి దెబ్బతో ప్రథమబాణంతో దాన్ని కొడితేనేగాని యెట్టి లాభమూ ఉండేదికాదు. ఆ గురి తప్పిందా, అంతే; ఏపొదలోకో, ఏ మ్రాను పైకో, ఏ బొరియలోకో అంతర్థానమయ్యేది. అందుకనే యీటెను త్యజించి, విల్లంబులను మానవుడు తయారు చేసుకొన్నాడు. శరవేగం అతని కాధారమైంది. వాయువేగంతో పరుగిడే జంతువుల జయించడానికి వాని బాణాలెన్నో అడవి పందులకూ, బాతులకూ గ్రుచ్చుకొని అతని కడుపు నిండేది.

## మనుజుని ఆప్తమిత్రుడు

ప్రతి వేటకానికీ గొప్ప ప్రాణస్నేహితు డొకడున్నాడు. నాల్గు కాళ్ళూ, మెత్తని చెవులూ, నల్లని చెమర్చేముక్కూ, తన యజమాని వేటలో యితను చేసే సహాయం యింతింతని చెప్పలేము. భోజనసమయానికి ఎంతో ఆప్యాయంగా అతని చెంత కూర్చొని, తదేకదృష్టితో యజమాని ముఖంవంక "నా భాగమో, మరి ?" అన్నట్లు చూస్తుంది యీ విశ్వాసమైన కుక్క.

ఇప్పటికి వేలకొలది సంవత్సరాలుగా కుక్క తన యజమానునకు అద్వితీయమైన సేవజేసింది. అతని మెప్పు వడసింది. బాణాలను సృజించిన ఆ పురాతనపు రోజుల్లోనే మనుజుడు కుక్కను మచ్చికచేసుకొన్నాడు.

పురాతన మనుజుల నివాసస్థలాల్లో వారు తమ వేట కుక్కలకు కట్టిన యిండ్లగుపిస్తాయి. వారి అగ్ని గుండాల

బూడిద ప్రోవులలో దొరికే జంతువు యెముకల మీద కుక్క కాట్లు బహు స్పష్టంగా కనుపిస్తాయి. ఆరోజుల్లోకూడ, తన యజమాని చెంత మచ్చికగా కూర్చొని, తన భాగపు టాహారాన్ని భుజించి, తృప్తిచెందేదని మన కిది విశదపరుస్తుంది.

మచ్చిక చేసుకొన్న కుక్కకు జంతువుల పసిబట్టి వెంబడించటం అతను నేర్పాడు. వాని కాలిజాడల గుర్తించి. వాని కడకు కుక్క తన యజమానుని పిలుచుకుపోగలిగేది. అతడు మచ్చికజేసిన కుక్క తనకన్న ముందుగా జంతువు లెచ్చటుండేదీ పసిబట్టీ తనచెవుల నిగిడ్చి వినీ కనుగోగలదని మానవుడు తెలుసుకొన్నాడు అనుభవంమీాద.

నేలపైబడ్డ ఆకులలో ఒక విచిత్రవాసన! ఈ దారి వెంబడి యేది వెళ్ళింది? ఒకటి రెండు పర్యాయములు తల వాల్చి, ముక్కానించి వాసన జూచేది కుక్క. కేవలం తన ముక్కు నాధారం చేసుకొని గబగబా పరుగిడేది. దానివెంట వెళ్ళటమే మనుజుడు చేయవలసిన పనంతా. దాని సహాయం చేత మానవున కితర మృగాలపైనుండే శక్తీ, అధికారం యెన్నిరెట్లో పెఱిగాయి. వాసనల సరిగా గుర్తించలేని ఆతని ముక్కు, కుక్కను పెంచి ఆ కొరత తీర్చుకొంది. తనకాళ్ళ బలమునూ, చకచకనూకూడా కుక్క తన యజమానికే వినియోగించింది. గుఱ్ఱాల స్వాధీనంచేసుకోడానికి ముందు మనుజులు చక్రాలులేని తమ బళ్ళకు కుక్కల కట్టేవారు.

సైబీరియాలోని "క్రస్నోయాస్క"నే ప్రదేశంలో పురాతన నివాసాల పరీక్షించారు. కొన్ని కుక్కల అస్థిపంజరాలు వానికి తొడిగిన జీనుతోసహా అచ్చట కనుపించాయి. వేటాడే

ప్రదేశాలకు బండిలో యీడ్చుకుపోయీ, వేటలో ఆతనికి కుడి భుజమై యుండీ, కుక్క తన దొర కెంత ప్రాణమిత్రుడుగా నుండేదో నీవే ఊహించుకో.

కుక్కల విశ్వాసం జగద్విదితమైన విషయం. కొండల్లో దారితప్పిన ప్రయాణీకుల రక్షించీ, యుద్ధంలో గాయపడిన తన యజమానుని మోసుకుపోయీ, ఇంటి కాపుదలే కాక, గ్రామ పొలిమేరలనూ తనరాజ్యానికి అన్యరాజ్యానికి మధ్యనుండు యెల్ల భూములనూ కావలి కాచీ కుక్కలు మన కృతజ్ఞతను సంపాదించుకొంటాయి. ఇంట్లో, వేటలో, యుద్ధంలో, శాస్త్ర పరిశోధనాలయాలలోనూ కుక్కలు మనకు చేసేసహాయం ఇంతింతనరాదు.

## మనుజుడూ — నదీ

అరణ్యాల్లో కొందరు నివాసాలేర్పరుచుకొంటే మరి కొందరు నదులూ, సరస్సుల తీరాలకు సాగిపోయారు. అడవికీ నీటికీ మధ్యనుండే కొద్ది నేలమీద తమ పాకల నిర్మించు కొన్నారు.

అడవిలోకన్న నీటిమీద నిరాటంకంగా తిరుగడానికి యెక్కువ వీలుండేదేకాని, బ్రతుకుతెరువు కష్టమైపోయింది. కొత్తగా నీరు వచ్చినప్పుడల్లా నదులు గట్టుల కెగబ్రాకేవి. వరద నీరు నేలనంతా ముంచి, అరణ్యాపాదాన్ని తాకేది. నదీజలంలో కొట్టుకువచ్చే మంచుగడ్డలూ, మ్రానులతోపాటు వారి పాకలూ కొట్టుకుపోయేవి. అట్టి సమయాల్లో చెట్లెక్కి, జనులు ప్రాణాలు కాపాడుకొనేవారు. నీరు తీసిన తరువాత నదిఒడ్డునుచేరి తిరిగీ తమ పాకల కట్టుకొనేవారు.

వారికి మొదట్లో వరదవచ్చినప్పుడల్లా యేదీ తోచేది కాదు. క్రమంగా ఎప్పుడెప్పుడు వరదలు వస్తాయో, ఎంత కాలం ఉంటాయో, వారు గ్రహించుకొన్నారు. పెద్ద ప్రమానులు నరికి నదిఒడ్డున యెత్తుగా పేర్చేవారు. ఆకట్టను వెడల్పుగానూ, ఎత్తుగానూ నిర్మించేవారు. దానిమీద తమ పాకల నిర్మించు కొన్నారు. నీటిభయం దానితో వారికి తొలగిపోయింది. ఎంత గొప్ప వరదలు వచ్చినా వారి ప్రమానుకట్టల పునాది యొక్క అడుగుభాగాన్ని మాత్రం కొద్దిగా ముంచగలిగేవి అంతే.

సమయోచితంగా అట్టి నూతన యేర్పాటును గావించు కోటంచేత, తన పరిస్థితుల నతిక్రమించి జీవించేశక్తి మానవునిలో బలపడజొచ్చింది. ప్రస్తుతకాలపు ఆనకట్టలకూ ఎంతెంత జలా శయాలైనా బంధించివేసే గోడలకూ పునాది ఎన్నడో మన పూర్వీకులే నిర్మించారని ఒప్పుకోవాలి. ఎడతెరపిలేకుండా మనుజునికీ, నదికీ పోరు జరిగేది. ఎవరెవరిని జయిస్తారోననిఅన్ని కష్టాలున్నప్పటికీ మనుజుడు నదీతీరవాసాన్నే అపేక్షించాడు. కారణం? జలాశయాలనిండా జలచరాలెన్నో ఉంటాయి. వానిలోనికెల్లా చేపలు ముఖ్యంగా మనుజుని ఆకర్షించాయి. అంతకుముందు జంతువులవేటాడే మనుజుడు నదీతీరానికి తన ఉనికిని మార్చుకోటంచేత యావజ్జీవితాన్ని మార్చుకోవలసి వచ్చింది. జాలరి జీవితమునకు కావలసిన పనిముట్లాతడు సృష్టిం చుకోవలసివచ్చింది.

ఉన్నట్లుండి వేటకాడు జాలరిగా ఒక్కరోజులో మారలేదు. మొదట్లో యితర మృగాలను వేటాడినట్లే, చేపలనూ

వేటాడేవాడు. ఈటెమాదిరుండే ఒక ఆయుధాన్ని చేబట్టి నడుము లోతుకు నీటిలో నడిచివెళ్ళేవాడు. కొండరాళ్ళ మధ్య దాక్కొన్న చేపలను గురిచూచి ఆ ఈటెతో పొడిచి చంపే వాడు. క్రమంగా పక్షులను వలవేసి పట్టినట్లు, చేపలనూ వలతో పట్టడం నేర్చుకొన్నాడు. పూర్వీకు లుపయోగించిన యీటెలతోబాటు, చేపలపట్టే వలలూ, వానికి కట్టిన బరువు రాళ్ళూ, యెముక గాలపు కొక్కాలూ యెన్నో శాస్త్రజ్ఞులు కనిపెట్టారు.

## ఓడల పుట్టు పూర్వోత్తరాలు

సుమారు ఏడువేల సంవత్సరాలక్రితం రష్యాలోని "లడోగా" సరస్సుదగ్గర కొందరు పనివారు కాలువనొకటి త్రవ్వుచున్నారు. త్రవ్వగా త్రవ్వగా ఒక మనుష్యకపాలమూ, కొన్ని పనిముట్లూ కనుపించాయి. ఇది వెంటనే శాస్త్రజ్ఞులకు తెలిసింది. అంతవరకూ అచ్చట "పీట్" తప్ప [నాచు మొక్కలు ముద్దగా అదుముడుచెంది బొగ్గుగా మారుతాయి. దీనిని పీట్ అంటారు; పొయ్యిల్లో నుపయోగిస్తారు. సాధారణ నేలబొగ్గుమాదిరే] మరేదీ దొరకదనుకొనేవారు. అచ్చట త్రవ్వటం ప్రారంభిస్తే, యేదో వస్తుప్రదర్శనాలయంలోనుండి తీస్తున్నారాఅన్నట్లు రకరకాల వస్తువులు దొరికాయి. రాతి గొడ్డలీ, రాతికత్తీ, చేపగేలపు కొక్కెమూ, బాణపు వాడిశిరో భాగమూ, రంపంపండ్లున్న హార్పూన్ (చక్రంవంటి ఆయుధం, తిమింగిలాలనూ, పెద్దరకం చేపలనూ పట్టేటందుకు), ఎముక, ఎముకతో చెక్కిన తిమింగలపు ఒక చిన్న విగ్రహమూ, ఒక రక్షరేకూ ఇన్ని కనుపించాయి!

అవన్నీ పెకలించిన తరువాత చిన్నదోనె ఒకటి వారికి దొరికింది. మట్టిలో పూడుకుపోయినా అదేమాత్రం చెడిపోలా. నీటిపై కెక్కించి చక్కగా తెడ్డువేస్తూ నడపడానికి సిద్ధంగా ఉన్నదది. ఈ కాలపు దోనెలూ, పడవల్లాగా అది లేదు. ఒక పెద్ద మ్రానునుండి దాన్ని చెక్కారు. ఏకాండంగా పురాతన కొయ్యగొడ్డలి దెబ్బలు స్పష్టంగా దానిపై కనుపిస్తున్నాయి. ముడులూ, కొమ్మలూ పెరిగిన తావులు చెక్కటం వారికెంతో కష్టమైయుండాలి. అందుకనే కాబోలు రాతిగొడ్డలి నొక ప్రక్కనుపెట్టి, అగ్ని నాహ్వానించారు తమ కార్యసిద్ధికి.

దోనంతా కాలినబొగ్గుమసితో నల్లగావుంది. ఈరోజుల్లో పెద్ద ఓడను కట్టటం, పూర్వం వాడు ఒక్క దోనెను నిర్మించడానికన్నా యెంతో సులభమనిపిస్తుంది. ఏ రాతిగొడ్డలైతే దాన్ని చెక్కిందో అదే ఆ దోనెచెంత పీట్ యడుగున దొరికింది. దాని మొన వాడిగా, నున్నగా అరిగియుండటమే కాక ఆ ప్రక్కనే సానరాయికూడా కనుపించింది. కాబట్టి రాతి పనిముట్లకు కావలసినప్పుడల్లా పదునుబెట్టటంకూడా వారప్పటికే నేర్చారని దీనివల్ల విశదమవుతోంది. దోనె తయారుకాగానే నీటిపై తేల్చేవాడు. తమ హార్పూనులూ, కొక్కాలూ, వలలూ తీసుకొని చేపలనుబట్టడానికి బయలుదేరేవారు.

ఆ లడోగా సరస్సు చాలాపెద్దది. దానినిండా అసంఖ్యాకమైన చేపలుండేవి. కాని మొదట్లో వాడు దాని తీరాన్నే తిరిగేవాడు. ఒకసారి ప్రశాంతంగా, ఇంకోసారి కలవరంగా, మఱొక పర్యాయము పెద్ద అలలులేచీ, గర్జిస్తూ భయంకరంగానూ ఉండే ఆ సరస్సుతత్త్వం వారికింకా అర్థమయిందికాదు.

ఎంత పెద్ద తుపాను వచ్చినా ఆ ఏకాండ్రమాను దోనె మునిగేదేకాదు. ఇటూ, అటూ దొర్లుతూ, ఊగుతూ అలలపైకెక్కేది, క్రిందకు దిగేది. ఇదంతా చూచి భయపడీ ఎన్నో అవస్థలుపడీ, గట్టును చేరేవారు. ఎంత దృఢంగా, నిర్భయంగా నికరంగా ఉన్నదానేల అని వారికనిపించేది పసిబిడ్డ తన తల్లి వక్షానికి హత్తుకుపోయేమాదిరి. ఆప్యాయంగా తాము పుట్టి పెరిగే ఆ నేలను, భూమాతను కౌగలించుకొన్నారు తిరిగి రావటంతోటే.

దారీతెన్నూలేని ఆ విశాల నీటిపై ఆకాశం దాన్ని తాకేటంత దూరంవరకూ వెళ్ళేబదులు ఒడ్డుకే చేపలు వచ్చుటకు వేచియుండేవారు. మొదట్లో కాలగతిని క్రమంగా ఒక్కొ అడుగు ముందుకుపెట్టుతూ జలాశయాలన్నిటినీ మానవుడు జయించివేశాడు. మొదట్లో తాముండే భూభాగానికి నీటిఒడ్డు నిర్భేద్యమైన కోట గోడమాదిరుండేది. దాన్ని దాటాలంటే భయము. క్రమంగా తన దోనెలలోనూ, పడవలలోనూ ప్రయాణాలు సాగించాడు. మనిషి కొంతదూరం వెళ్ళి, దిగులుగా తీరంవంక చూచి తిరిగీ త్వరలో వచ్చేవాడు. రాను రాను దూరదూరంగా తీరాన్ని వదలి వెళ్ళాడు. రోజులతరబడి నీటిపై నుండటం నేర్చాడు. సముద్రాల కావలప్రక్క తన వంటివారే ప్రజలున్నారని కనుగొన్నాడు. ఈ లోకపు దేశాలలో తన దొకచిన్న దేశమనీ, తానూ యితరు లెందరిమాదిరో ఒక సాధారణమైనవాడినేననీ గ్రహించగలిగాడు.

## ప్రథమ వృత్తిపనివారు

లోకంలో యెంతరెందరో, ఎన్నెన్ని రకాలవారో వృత్తి పనివాళ్ళున్నారు. గొడ్డలీ, చిత్రికగుల్లా, సుత్తీ, ఉలీ పట్టే ప్రతివాడూ, రసాయనిక యంత్రశాలల్లో చేరేవ్యక్తీ, లోహపు సామానులు చేసేవాడూ అందరూ గొప్పపనివారుగా కావాలని ఆశిస్తారు. దానికి తగిన తరిఫీదు పొందుతారు. విమానాలూ, ఓడలూ, మన గృహాలూ వీరి శక్తినైపుణ్యాలపై ఆధారపడి యున్నాయి. వీరందరికీ వివిధరకాల వస్తువులను తమ పనిముట్ల నుపయోగించి చేయటంలోవుండే కష్టసుఖాలు తెలుసు. వస్తువు తయారు కాగానే కలిగే ఆనందమూ, అదంటే అభిమానమూ అనుభవించినవానికే తెలుస్తుంది.

ఈ కొయ్యముక్కను నీవు చేతబట్టావనుకో. పట్టీపట్టడం తోనే అ దేరూపం ధరించాలో నీ మనసుకంతా తెలుస్తుంది. ఇక్కడో కొంచెం బంపంకోతా, అక్కడ కొంత ఉలితో చెక్క టమూ, ఈనాలుగుమూలలా బర్మాతో రంధ్రాలు కోయటమూ ఈ విధంగా బహుసులభంగా చూస్తూఉండగా పని పూర్తవుతుం దనిపిస్తుంది. కాని కార్యాని కుపక్రమించితేనేగాని అందులో వుండే సాధకబాధకాలు తెలియవు. ఆ కొయ్య తన యావ చ్ఛక్తినీ వినియోగించి నీ పనిముట్ల కెదురుతిరుగుతుంది.

కత్తితో చెక్కాలని యత్నిస్తావు: అది వీలుపడదు. గొడ్డలితోనో, బాడిశతోనో ప్రయత్నిస్తావు. ఉహూం! ఏం లాభంలేదు. అనేక వాడిచిన్నకత్తులు బారుగా యేర్పడిన రంపపుటంచు దానిని అవలీలగా కోసి తుదకు రెండు తునకలు

చేస్తుంది. ఇట్లా ఒక పనిముట్టు తరువాత, మఱొకటిగా నుపయోగించాలి నీ కార్యం సిద్ధించాలంటే.

ఇదంతా "నేనేగదా చేశా" ననుకొంటావు నీవు సగర్వంగా. కొంచెం ఆగి, ఆమాట యెంతవరకు నిజమైందో ఆలోచించు. ఏండ్ల తరబడిగా రకరకాల పనిముట్లను సృజించి, వాని నుపయోగించటంలో కనిపించిన తప్పులను సవరించీ, దిద్దీ, క్రమేపీ మార్చి సరిచేసిన అసంఖ్యాకులైన యెందరు పనివాండ్రో నీ విజయానికి చేయూత నిచ్చారు. వారి కృషి మూలానే నేడు అంపప్రకోత నీకు సాధ్యమయింది, చూచావా?

ఈ గ్రంథంలో పైన డివిన ప్రథమ వృత్తి పనివారిని గుఱించి చెప్పాము. వారే కత్తులనూ, గొడ్డళ్ళనూ, సుత్తులనూ మొదట్లో సృజించారు. నీమాదిరే వారూ కష్టపడి తమ పనుల నిర్వర్తించుకొన్నారు; సంతోషపడ్డారు.

ఆ మొదటి పనివారు వడ్రంగులూ, తాపీపనివారూ, కాల్వల త్రవ్వినవారూ వారంతా అడవిమృగాల తోళ్ళనే బట్టలుగా కట్టుకొన్నారు. ఏదైనా ఒక చిన్న దోనెను చేయడానికి యెన్నో నెలలు పట్టేది వారికి. ఈ రోజుల్లో మనం శిలావిగ్రహాన్ని చెక్కటంకన్నా, మట్టికుండను వారు చేయటం యెక్కువ కష్టమయ్యేది. అయినా అట్టి అనామక, అల్ప, వృత్తి పనివారి మూలానే యీ కాలపు వివిధ వృత్తులవారూ తమ పనులను చేయగలుగుతున్నారు. లోకాన్ని అనుక్షణం మార్చుతున్నారు.

ఉదాహరణకు పురాతన కుమ్మరివానినిగుఱించి యోచించుదాము. అతనిచుట్టూ రేగడిమట్టి సమృద్ధిగా యుండేదే కాని, అతను చేయనూహించినట్టి వస్తువేదీ నమో

నాకు ఉండేదేకాదు. బంకమట్టినీ, అగ్నినీ తను స్వాధీనపర్చు కోటంచేత తాననుకొన్న కుండలూ వగైరా చేసుకోగలిగాడు. అంతకుపూర్వమే నిప్పు నెన్ని పనులకో వారుపయోగించారు. వెచ్చదనానికీ, అడవి జంతువులను భయపెట్టి తరిమివేయనూ, అరణ్యవృక్షాల కాల్చి కాళీజాగాలు యేర్పర్చుకోడానికీ, దోనెల నిర్మించనూ నిప్పు వారికెంతో సహాయంచేసింది. క్రమంగా రెండు కొయ్యల రుద్ది, రాపిడిచేసి కావలసినపుడు నిప్పు తెప్పించటం జనులు నేర్చారు.

ఆ నిప్పుతో కుమ్మరిపనివాడు, ఒక పదార్థాన్ని వేరొకటిగా మార్చటం కనిపెట్టాడు. మెత్తని బంకమన్నును గట్టి కుండలుగా మార్చటానికి, ఆహారం వండుకోనూ, ఖనిజపదార్థాలు కరిగించనూ దాని నుపయోగించ నేర్చాడు. ఈరోజుల్లో ప్రతి కర్మాగారంలోనూ నిప్పు యెప్పుడూ రాజుతూనే యుంటుంది. దీని తీక్షణశక్తిమూలాన ఒకవస్తు వింకొకటిగా మారుతోంది. ఇనుమును దాని ఖనిజంనుండీ, ఇసుకనుండి గాజునూ, కొయ్యనుండి కాగితాన్ని అగ్నిసహాయంచేతే చేయగలుగుచున్నాము. మన పూర్వీకు లెప్పుడో ఈ నిప్పును కనిపెట్టి మనకు ప్రసాదించారనే విషయం జ్ఞప్తికుంచుకోవాలి.

## వ్య వ సా య సూ చ న లు

పూర్వీకులు నివసించిన ప్రదేశాల్లో త్రవ్వగా ఒకచోట చాలా కుండలు కనుపించాయి! వానిమీద యిటూ, అటూ ఐమూలలగా గీతలున్నాయి. ఈ గీతలనుండి పూర్వంవా రెట్లా కుండలు తయారుచేసేవారో తెలుస్తుంది. పెద్ద తట్టనొకదాని తీసుకొని, మెత్తని బంకమన్నును దానిలోపల వత్తుగా పూసే

వారు. మంచి మంటచేసి బుట్టను దానిపై నుంచగా అదంతా కాలిపోయేది. బుట్ట ఆకారంగా మన్నుకాలి కుండ తయా రయ్యేది. ఆ కుండలమీది గీతలు, బుట్టయొక్క పేళ్ళ అల్లికను సూచిస్తాయి.

కొంతకాలానికి, తరువాత బుట్టల నుపయోగించ కుండానే కుండల కాల్చిచేసేవారు. తడిమట్టిమీద ఐమూల గీతలు గీచి మరీ కాల్చేవారు. అట్లా గీతలు గీయకపోతే అది పనికిరాదనుకొన్నారు. సరీగా వారి పూర్వీకుల కుండలమీది రే ఉంటేనేగాని తమ అన్నం వానిలో ఉడకదనేభావం వారికి కలిగింది. ప్రతివస్తువుకూ ఏదో అగోచరమైనశక్తి ఒకటి దానిలోనే యిమిడి ఉంటుందనుకొన్నారు. ఆ విధంగా గీతలు గీయకపోతే కుండయొక్క శక్తి పోతుంది. ఐమూలగా అల్లిక గీతలు గీయకపోతే వారికి నష్టం కలుగుతుంది. కరువూ, ఆకలీ వారిని పీడిస్తాయి. గీస్తే ఆ కుండ అక్షయంగా వారి కన్నం పెట్టు తుంది.

అప్పుడప్పుడు దృష్టి తగులకుండా ఒక కుక్కబొమ్మను కుండలమీద గీచేవారు. అది కుండనూ, దానిలో ఉడికే వస్తువులనూ భద్రంగా కాపాడుతుందట. అల్లిక గీతలున్న కుండ లనేక చోట్ల కనుపించాయి. ఫ్రాన్సులో కంపెగ్నే అనేచోట దొరికిన ఒక కుండమీద, అట్టి గీతలతోపాటు, ఓటుధాన్యపు ఒక గింజరూపం అచ్చుగుద్ది కనిపించింది. ఈ ఒక్కధాన్యపు గింజనుండీ యెన్నెన్నో విషయాలు మనకు విశదమవుతాయి. మనుజుల జీవితవిధానం యెట్లామారిందో

తెలుపడానికి కుండమీదనున్న గింజగుర్తు గొప్ప నిదర్శనమై పోయింది.

ధాన్యమున్నచోట వ్యవసాయం ఉండాలిగా? జాగ్రత్తగా అదే ప్రదేశంలో వెతికి, నేలను త్రవ్వే కొయ్యా ఆయుధాలూ, మట్టిగడ్డల చితుకగొట్టే పనిముట్లూ వెతలించారు. శాస్త్రజ్ఞులూ, వేటకాండ్రూ, జాలరులూ క్రమంగా వ్యవసాయకులుగా మారారు. మొగవారు వేటకూ, చేపలుపట్టడానికీ వెళ్ళినపుడు స్త్రీలూ, పిల్లలూ తమ నివాసాలచుట్టూ రకరకాల పదార్థాలకని వెతుకుతూపోయేవారు.

కుండలూ, బుట్టలూ తీసుకొని తినడాని కుపయోగపడే వస్తువుల తెచ్చుకొనేవారు. సముద్రంఒడ్డున ఆలుచిప్పజాతులూ, అడవుల్లో పండ్లూ, పప్పులూ, కుక్కగొడుగులూ, పైక్‌చెట్ల గింజలూ తెచ్చేవారు. ఆ గింజలను మెత్తని పిండిగా రుబ్బి రొట్టెలు చేసుకొనేవారు.

అరణ్యంలో తిరిగేటపుడు తేనెపట్టులు దొరికితే బహు సంతోషపడేవారు. కొండమీద నిలుచుండి అడవితేనెను తీసుకొనే యొక స్త్రీ బొమ్మ పురాతనపుది ఒకటి కనుపించింది. చెట్టుపైకెక్కి ఒక చేత్తో తేనెపట్టును పట్టుకొని, రెండవచేతిలోనున్న జాడీలోనికి తేనెను పిండుతోంది. ఆమెచుట్టూ తేనెటీగలు ముసురుకొన్నాయి. కాని, ఆ స్త్రీ తనపనేదో తాను చేస్తూనే వున్నది. ఈ విధంగా స్త్రీలూ, పిల్లలూ ఒక్కొక్కసారీ యింటికి వచ్చేటప్పుడు కావలసినంత తేనెనూ, అడవిపండ్లనూ, బేరికాయలనూ, ఆపిలుపండ్లనూ తెచ్చుకొనేవారు. చుట్టూ తినాలని ఆశతో గుమిగూడే పిల్లల పారద్రోలి, తల్లి ఆ వస్తువు

లన్నిటినీ కుండలూ, జాడీలూ, తొట్లెలూ మొదలైనవాటిలో దాచేసేది. కలిమిలేములు కావడికుండలని వా రనుభవంమీద తెలుసుకొన్నారు. రేపటిదినం వేటనుండి మొగవాళ్ళు వట్టి చేతులతో వస్తే, తమగతి యేంకావాలి. యెప్పటివస్తువు లప్పుడు తినివేస్తే?

మంచుయుగపు చలి అంతరించింది. గొప్ప వసంతోదయ శోభ లోకమంతటా వెలిగిపోతోంది. పొదలూ, అడవులూ, జలాశయాలూ రకరకాల ఆహారపదార్థాలతో నిండి మానవు నాహ్వానించాయి. తిరిగీ జనులు అవీ, యివీ సేకరించుకోటం ప్రారంభించారు. పండ్లూ, కాయలతోబాటు స్త్రీలు రకరకాల ధాన్యపుగింజలనూ తెచ్చారు — అడవి ఓట్సూ, అడవి గోధుమలూ వీనిని కుండల్లోనూ, జాడీల్లోనూ పోసి దాచేటపుడు కొన్నిగింజలు క్రిందపడ్డాయి. అవి కొంతకాలానికి మొలిచాయి. ఈవిధంగా గింజలు తమ్ముతామే నాటుకొన్నాయి. ప్రథమంలో ఈ దృశ్యంచూచి జనులు కావాలని తామే గింజల నాటటం ప్రారంభించారు. గింజను కనుపించకుండా పూడ్చిపెట్టితే, కొన్ని రోజులకు మొక్కలురావటం, అవిపెరిగి పంటపండటం వారి కమితానందం కలిగించింది. గింజలయొక్క ఈ విచిత్ర శక్తి వారిలో గింజలయెడల ఒకవిధమైన పూజాభావాన్ని రేకెత్తించింది. ఆకురాలుకాలానికి ధాన్యం బాగాపండి తయారయ్యేది. భూమిలో పూడ్చబడిన ఒక్కొకగింజా మొలకెత్తి, పసందుగా పచ్చగా నిలబడి, పెరిగి పెద్దదై, వేయిమడుంగు లెక్కువగా వారికి సుభిక్షం పెట్టేది. ఎట్టి అద్వితీయ కారుణ్యమో ధాన్యదేవతది? ధాన్యపుకంకి నొకదాన్ని నేలలో నిలబెట్టి

నలుగురూ చుట్టూచేరి నృత్యంచేసేవారు. పాటలు పాడేవారు. ఇది కేవలం కృతజ్ఞతనూ, ఆనందాన్నీ సూచించే నాట్యమే కాదు. స్త్రీలు ఆ పాటల్లో ముందుకుండా తమకట్టి పంటలు సమృద్ధిగా పండించి కాపాడమని ధాన్యదేవతను వేడుకొనే వారు. ఆ నృత్యగానాలు ఒక విధమైన మతాచారంగా మారి పోయాయి.

సంక్రాంతి సమయంలో పంట కోతలన్నీ కోసి పండ్లూ, ధాన్యకంకులూ, చెఱకుగడలూ, బూడిదగుమ్మడీ, తీయగుమ్మడి కాయలూ, రేగుపండ్లూ మొదలైనవన్నీ అలంకరించి పూజించే అలవాటు మన కిప్పటికీ ఉన్నది. క్రొత్తపంట కోయగానే యిన్ని గింజలదంపి అక్కడే పొలంలో అన్నంవండి దేవునికి నైవేద్యం పెడుతారు; నలుగురూ తింటారు. భోగిపండుగ సమయాన క్రొత్తబియ్యం, బెల్లమూ, పాలూపోసి తీయని పొంగలి వుడికించి నైవేద్యం పెట్టి నలుగురమూ తింటాము యిప్పటికీ.

పురాతనపు టాచారాలు

పురాతనాచారాలు ఎన్నో యిప్పటికీ పైన సూచించి నట్లు మనలో నిలిచియున్నాయి. వాని నిజమైన అర్థం మనకు తెలియదు. పూర్వీకులు వాని నాచరించేటప్పుడుండే భావాలు మనలో ఇప్పుడు లేవు. ఏదో అలవాటుగా వాని నాచరిస్తాము అంతే.

ఈ శతాబ్ద ప్రారంభకాలంలోకూడా కొన్ని దేశాల్లో పంటకోతల పండుగను యీ విధంగా చేసేవారు. పొలంనుండి ఆఖరు ధాన్యకంకిని తెచ్చి దానికి చేతిరుమాలు చుట్టి, చిన్న పరికిణీ తొడిగేవారు. దానిచుట్టూ చప్పట్లుకొడుతూ గట్టిగా

అరుస్తూ పాడేవారు. ఆపాట పొరుగూళ్ళకు వినబడేది రాత్రిళ్లు నిశ్శబ్దంగా వుండేటప్పుడు.

క్రైస్తవులు క్రిస్టమస్ సమయంలో, క్రిస్టమసు చెట్టును అలంకరించి పండుగచేస్తారు. పూర్వం ఫర్ వృక్షాలచుట్టూ పాడుతూ, తిరుగుతూ జనులు ప్రార్థించేవారు. మంచుగడ్డలు కరిగి, తిరిగీ చిగురింతకాలం రావాలనీ, తమ పంటలన్నీ బాగా పండాలనీ ఆ పాటల కర్థం. ఈ రోజుల్లో క్రిస్టమసు చెట్టును, ఏదో ఆచారంగా సరదాగా అలంకరిస్తారేకాని, పూర్వీకుల ఉద్దేశాలు యిప్పటివారికీ ఉన్నాయనికాదు. కొన్ని దేశాల పిల్లలాడుకొనేటప్పుడు:

వానా, వానా, వెళ్ళిపో

తిరిగీ, రా, రేపో, మాపో

అంటూ పాడుతారు. ఇదంతా సరదాగా పాడేపాట. ఈ పిల్లలకు పూర్వీకులవిషయం అట్లాకాదు. తమ నృత్యగీతాల ప్రభావంచేత మేఘాలు కావలసినపుడల్లా వర్షించేటట్లు చేసుకో వచ్చని వారనుకొన్నారు.

ఇటలీ, ఫ్రాన్సు దేశాల్లో "కార్నివల్ దహనం" అనే ఒక పండుగ యిప్పటికీ జరుపుతారు జనులంతా గుమిగూడి. "కార్నివల్" బొమ్మనూరేగిస్తారు. నేలలో సమాధిని త్రవ్వే వాళ్ళు. నిశ్శబ్దంగా చేతిలో నొక బూరా పట్టుకొని ఆ విగ్ర హాన్ని మోసుకు వెడుతారు. వారి జేబుల్లో బ్రాందిసీసా లుంటాయి. ఊరేగింపు ఆగినప్పుడల్లా విగ్రహాన్ని మోసే వారు బ్రాందిని సేవిస్తూ, తందనాలాడుతారు.

ఊరేగింపు ముందర కార్నివల్ యొక్క భార్యవేషం వేసుకొన్న స్త్రీయొక్కతె ఉంటుంది. ఆమె ఏడుస్తూ, పెద్ద పెట్టున రోదనచేస్తూ దుఃఖిస్తున్నట్లు నటిస్తుంది. జనులందరూ ఆమెను చూచి నవ్వుతూ, గల్లంతుగా వెంబడిస్తారు. ఊరేగింపు చివరకు ఊరిమధ్యనుండే కాళీజాగాను చేరుతుంది. కార్నివల్ బొమ్మను, అక్కడ మండే అగ్నిగుండంలో పడేస్తారు. మద్దెలలూ, తాళాలూ, మేళాలూ ఒక్కపెట్టున మ్రోగిస్తారు. వేషాలు వేసుకొన్న జనంతో బ్యాండు వాయిద్యాలూ, నృత్యంచేసే యువతీయువకులతో వీథులన్నీ కోలాహలంగా వుంటాయి.

"కార్నివల్" యెవరని ఆతనిభార్య నడిగితే, "ఏమో! ఎవరికి తెలుసు!" అంటుంది. విగ్రహాన్ని మోసేవారు, "ఏదో, పురాతనపుటాచారం, యిది" అంటారు. కార్నివల్ అంటే యెవరో వాళ్ళకు తెలియదు. ఈ విచిత్రపండుగ యెన్నో వేల యేండ్ల క్రితం ప్రారంభంకాబట్టి, దాని నిజమైన ఉద్దేశమేమిటో యెవరికీ తెలియదు; "కార్నివల్" మృత్యుదేవత. చలికాలంలో తెల్లగా చల్లని మంచురూపంతో భూమినంతా కప్పుతా డతడు. ఆ చలికాలానికి అంతున్నదో లేదో! తిరిగీ చిగురింతకాలం వస్తుందో లేదో! ఎవరికి తెలుసు? అప్పటి కింకా జనులకు ఋతువులూ, ఋతుక్రమ మార్పులూ సరిగా అర్థంకాలేదు. కాబట్టి కార్నివల్ దహనం యొక మతాచారం, వారికి. చలి దేవతను దహనంచేసి, వసంతాన్ని ఆహ్వానిస్తారు. పొలాలూ, పొదలూ, అరణ్యాలూ తిరిగీ పచ్చబడి పుష్కలంగా పంటలు పండుతాయి ఆ పండగచేస్తే. ఇదీ యీ కార్నివల్ దహనపు నిజమైన అర్థం.

ఇట్టి వెన్నో పురాతనపు టాచారాలు మనలో, చాలా మార్పులు చెంది యిప్పటికీ నిలిచియున్నాయి.

## అ క్ష య పా త్ర

స్త్రీలు నేలదున్ని, గింజలు నాటుతూ యుండేటపుడు, మొగవారు వేటలో నిమగ్నులయ్యేవారు. సాయంత్రం యింటికి వచ్చేసరికి పిల్లలంతా గల్లంతుగా వారిదగ్గరకు పరుగిడిపోయే వారు. ఏ యే మృగాలు పట్టారో చూడాలనే ఆశతో నెత్తురు కారుతూ, పొడుగు కోరపండ్లికిలించే అడవిపంది తలనూ, కొమ్ములు మొలిచి చనిపోయినా తన రాజఠీవిని పోగొట్టుకొనని జింక శిరస్సునూ చూచి ఉప్పొంగిపోయేవారు. ఇట్లా చనిపోయిన జంతువులకంటే ఆ జంతువుల పిల్లలంటే పసివారికి యెంతో సరదాగా వుండేది. ఒక్కొకపుడు తన పెద్ద నల్లని కళ్ళతో దిగులుగా చూస్తూ, తప్పటడుగులు వేస్తూన్న ఆవుదూడలనూ, ముద్దొచ్చే లేడిపిల్లలనూ వారు తీసుకువచ్చేవారు.

ఇట్టి జంతువులను వారు వెంటనే చంపేవారుకారు. చుట్టూ దడికట్టి దానిలో వానినుంచి సాకేవారు. ఆ దూడలూ జంతువుల పిల్లలూ రాత్రివేళ తమ యిండ్లచుట్టూ అరుస్తూంటే వారి కొక విధమైన ధైర్యంగా వుండేది. ఒకవేళ యెట్టి వేట మృగాలూ దొరకని దుర్దినాలు వచ్చినా వారి కీ జంతువు లుండ బట్టి మరేమీ ఫరవాలేదనే ధైర్యంపుట్టింది. కావలసినంత మాంసం, వారి యింటిచెంత ఎప్పుడుకావాలంటే అప్పుడే సిద్ధంగా ఉండేది. ఇంకో విచిత్రమేమిటంటే రోజులు గడిచే కొలదీ ఆ మాంసం బలపడుతోంది. బరువెక్కుతోంది.

మొదట్లో మాంసానికీ, చర్మానికనే జంతువులను జనులు పెంచేవారు. పశువులనూ యితర వేటమృగాలమాదిరే భావించి చంపేవారేకాని, వానిని చంపకుండా ఉంచితే కలిగే లాభాలు మొదట్లో వారు గ్రహించారుకాదు. చంపితే యే ఆవునైనా ఒక్కసారే తినవచ్చు; దానినే పెంచితే ఎన్నేండ్లో పాలిస్తుంది. మాంససంగతీ అంతే. ఆ ఒక్కదాన్నీ బ్రతికిస్తే యెన్నిదూడలనో యీనుతుందిగా? అంటే, అంతకంత మాంసం పెరుగుతుందన్నమాట.

గొర్రెసంగతీ అంతే. దాన్ని బహుచులాగ్గా చంపి దాని చర్మం తీసుకోవచ్చు. ఒక్క చర్మంతో మనమేమీ అంతగా వస్తువులు తయారుచేయలేము. దాని చర్మాన్ని గొర్రెకే వదలిపెట్టి, ఉన్నినిమాత్రం కత్తిరించుకొంటే ఎంతో లాభం. ఉన్నిని కత్తిరిస్తే తిరిగీ మొలుస్తుంది. ఇట్లా యెన్నిసార్లో కత్తిరించి, లెక్కలేనన్ని అంగీలూ మొదలైన దుస్తులు చేసుకోవచ్చు. కాబట్టి తాముపట్టిన మృగాలను చంపివేయకుండా పెంచబట్టి వారికెంతో లాభముండేది. కాని యీ విషయాన్ని వారు మొదట్లో తెలుసుకోలేకపోయారు. వేటకాడు మందకాపరిగా మారడానికెన్నో తరాలు గడిస్తేగాని వీలయిందికాదు.

వ్యవసాయమూ, మందకాపరులజీవితమూ యీ రెండూ జనులలో గొప్పమార్పులు తెచ్చాయి. భూమిలో నాటిన యొక్కొక గింజా కొన్నివేల గింజల నిచ్చేది. తాము మచ్చిక చేసి పెంచిన మృగాలు లెక్కలేకుండా పిల్లల నీని పెరిగిపోయేవి. ఇందుమూలాన మునుపటంత ఎక్కువగా సృష్టిమీద ఆధారపడవలసినస్థితి మారింది. మనిషికి స్వేచ్ఛ ఎక్కువైంది.

పూర్వం వేటకు వెడితే యేదైనా మృగం దొరుకుతుందో, లేదో అని భయపడేవాడు. తన భోజనానికి తగినంత అడవి ధాన్యం దొరుకుతుందో, లేదోనని దిగులొందేవాడు. సృష్టి యొక్క అదృశ్య విచిత్రశక్తులాతని అనుగ్రహిస్తేనేగాని విస్తరి లోని కన్నముండదని అనుకొనేవాడు. ఇప్పుడట్టి పరిస్థితులన్నీ మారాయి.

ఇండ్లచుట్టూ అక్కడక్కడ చిన్న పొలాల్లో ధాన్యం పెరుగుతోంది; మందలువారి ఇండ్లపార్శ్వపు బయళ్ళపై తిరుగాడుతూ గడ్డి మేస్తున్నాయి. గుండెమీద చేయివేసుకొని హాయిగా నిద్రపోయేవాడు మనుజుడు. అంతవరకూ గొప్ప శత్రువుల్లాగా గోచరించిన భూమీ, మృగాలూ ఇప్పుడాతనికి సుభిక్షంపెట్టే అక్షయపాత్రగా మారిపోయాయి.

పొలాలకు కావలసిన భూమిని అరణ్యవృక్షాల నరికి యేర్పరుచుకోవాలి. నేలను త్రవ్వి, చాళ్ళుచేసీ గింజలునాటాలి. ఇవన్నీ ఆతని కెంతోపనిని కల్పించాయి. కష్టపడి పనిచేసి, చెమటఓడ్చి అతను స్వేచ్ఛను సంపాదించుకొన్నాడు. ఈ నూతన వ్యవసాయజీవితానికి మితిలేని ఆటంకాలుండేవి. ఎక్కువ యెండలుకాస్తే మొక్కలు మాడేవి; పశువులుమేసే పచ్చికబయళ్ళు మాడిపోయేవి. ఎక్కువగా వర్షం వచ్చినప్పుడల్లా నాటిన గింజలన్నీ కొట్టుకుపోయేవి. వీని నన్నిటినీ అతడు జయించడానికి యత్నించాడు.

పూర్వం తమకు తగినంత మాంసము నీయమని, అడవి దున్నలనూ, ఎలుగుబంట్లనూ వేటకాండ్రు ప్రార్థించి, పూజించేవారు. అదేమాదిరి ప్రథమ వ్యవసాయకులూ భూమ్యాకాశా

లనూ, సూర్యునీ, వర్షమునూ తమ్మాశీర్వదించమని ప్రార్థించారు. అవన్నీ యేవో దేవతలనీ, వాని అనుగ్రహంమీదే రాత్రింబవళ్ళూ, ఎండవానలూ మొదలైన వాధారపడియుంటాయనీ అనుకొన్నారు. "పృథివ్యాప స్తేజో వాయురాకాశాత్" అనే మన దేశపు వాడుకా, వాయుదేవుడు, వరుణుడు, సూర్యభగవానుడు, అగ్ని దేవుడు మొదలయిన పదాలన్నీ జనుల కట్టియుద్దేశా లుండేవనడానికి గొప్ప దృష్టాంతాలు.

మానవ వ్యక్తి అప్పటికప్పుడే బాగా పెరిగాడు. బలం వచ్చింది. తన శక్తిసామార్థ్యాలు యింకా యెంతగొప్పవో అతను గ్రహించుకోలేకపోయాడు. ఏవేవో శక్తుల పూజించి, తృప్తిపరిస్తేనేగాని, తన జీవితం గడవదనేభావం ఆతని నింకా వదిలిందికాదు. స్వశక్తిపై ఆతనికింకా గట్టినమ్మకం చిక్కింది కాదు.



# మూడువేల సంవత్సరాల కనంతరం

ఈ మానవ చరిత్ర వెనుక నుడివిన పరిస్థితులను మూడు వేల యేండ్లు గడచిన తరువాత యెట్లా ఉండేదో పరిశీలించుదాము. అంటే యిప్పటికి నలుబది శతాబ్దాలక్రితం మానవుడెట్లు జీవించేవాడో కనుగొనాలన్నమాట. నలభై శతాబ్దాలంటే యెంతో నీకు తెలియకపోవచ్చు. ఎంతెంత గొప్ప రాజ్యాలో, యెన్నో గడచిపోయినాకూడ నలభై శతాబ్దాలు జరిగిపోవు. కాని మానవుని విజయగాథను తెలిపే యీ గ్రంథములో నలభై శతాబ్దాలంతయెక్కువకాలం కానేరదు. మానవుడవతరించి సుమారొక లక్షయేండ్లకాలం గడచింది. ఈ లక్షయేండ్లలో నలభై శతాబ్దాలు అంటే నాలుగువేల యేండ్లొక బ్రహ్మాండమైన కాలం యెట్లా అవుతుంది? పై నుడివిన మూడువేలయేండ్ల కాలంలో భూమి ఎన్ని పర్యాయాలో సూర్యునిచుట్టి వచ్చింది? దానిలో చాలా మార్పు లగుపించాయి.

దూరంగా నిలబడి యీ భూమిని చూస్తున్నామనుకో. మనకగుపించేదాన్ని వర్ణించుదాము: చూచీ చూడటంతోనే

భూమిమీద అక్కడక్కడ, పూర్వంకన్న ఎక్కువగా ఖాళీ స్థలాలు కనుపిస్తాయి. పూర్వం మంచుగడ్డ టోపీల పర్వత శిఖరాలుతప్ప మిగిలిన భూమంతా పచ్చని అరణ్యాలతో నిండి యుండేది. ఇప్పుడో? అరణ్యాలు పలుచబడ్డాయి. ఖాళీజాగాలు ఏదో జడల దయ్యపుజుట్టులో వ్రేళ్ళుదూర్చినట్లు అరణ్యప్రదేశాలలో కనుపిస్తున్నాయి. దట్టమైన పొదలమధ్య అచ్చటచ్చట మంచి ఎండపడే పొలాలున్నాయి. నదీతీరాలూ, సరస్సు గట్టులూ మునుపటికన్నా విశాలంగావుండి, నీటివరకూ పెరిగిన పూర్వపు టడవులూ దూరంగా జరిగిపోయాయి. తీరమంతా రెల్లుగడ్డీ, పొదలూ.

దూరాన, ఆ నది వంపుదగ్గరున్న కొండమీద కనుపించే దదేమిటో? ఏదో పసుపుపచ్చని చేతిరుమాలు ఆ కొండ పార్శ్వంమీద పరచినట్లుంది. ఆ పచ్చని దూరపు పొలంలో, వంగి పనిచేసే స్త్రీ లగుపించుతున్నారు. ధాన్యపు కంకులను చకచకా తమ కొడవళ్ళతో కోస్తున్నారు. ఇంతకుపూర్వమే సుత్తిని జనులు తయారుచేశారని చెప్పాము. ఈ కొడవలి నూతనంగా సృజింపబడిన వేరొక పనిముట్టు. కొయ్యపిడిలో రంపపు పండ్లున్న రాతికత్తి, అదే వారి కొడవలి.

పచ్చగా ఆ కొండపై కనుపించినది ఒక పొలం. కాని, యిట్టి పొలా లెక్కువగా లేవు. ఉండే కొద్ది పొలాల్లోనూ కలుపు ఎక్కువగా పెరిగింది. కలుపుతీయటం వారి కింకా తెలియలా.

దూరాన కనుపించే ఆ నదీతీరపు పచ్చని బయలులో ఏవో చిన్న జంతువులు తిరుగుతున్నాయి. తెలుపూ, పసుపూ,

మచ్చలూ; ఆ మృగాలు గుంపులు గుంపులుగా ఉన్నాయి. అవేవో తెలుసా? పశువులూ, గొఱ్ఱెలూ, మేకలూను. ఇట్లా మచ్చిక చేయబడిన మందలు యెక్కువగా లేకపోయినా, అడవుల్లో తిరిగేవానికన్నా యివి త్వరత్వరగా పెరుగుతాయి. వీనికి వెతుక్కోకుండా కావలసిన ఆహారమంతా మనుజులుసిద్ధపరుస్తారు. కొన్ని వేల యేండ్లలో యీ మచ్చిక చెందిన ఆవులూ, ఎడ్లూ ఆడవిలోవుండే దున్నలూ, పశువులకంటె యెక్కువగా పెరుగుతాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

పొలాలూ, మందలూ - యీ రెండూ మన కగుపించాయంటే, యెక్కడో దగ్గరలో మానవ నివాసా లున్నాయా? సరే కాలు సాగనిచ్చి పరీక్షిద్దాము ... అదిగో! ఆ నదీతీరపు నిట్రమైన గట్టునంక చూడు. అదే ఒక గ్రామం. పురాతన వేటకాండ్ర యిండ్లకూ వీనికీ యెట్టి పోలికాలేదు. వారివి కఱ్ఱలు పాతి, కొమ్మలూ, ఆకులతో అల్లిన గుడిసెలైతే, యివి రెండు ప్రక్కలా స్లోపుగా ఉండే పైకప్పుగల చక్కని కుటీరాలు. గోడలకు సాఫీగా బంకమన్ను పూశారు. ఇంటి గుమ్మం ముందు చక్కని కొమ్ములు పెరిగిన యెద్దుతల, కొయ్యతో చెక్కి తగిలించారు. ఆ తల వారందరినీ యెట్టి అపాయమూ రాకుండా కాపాడుతుంది. గ్రామంచుట్టూ ఎత్తు కఱ్ఱల దడీ, నీటి భయం లేకుండా ఎత్తుగాపోసిన మట్టిగట్టూ ఉన్నాయి.

ఊరంతా పొగా, పచ్చిపేడా, పాలయొక్క చక్కని పల్లెటూరు వాసన వేస్తుంది. ఇండ్ల చుట్టూ సరదాగా పిల్లలాడుకొంటున్నారు. బురదలో బ్రతుకు జీవుడా అని హాయిగా పందులు తమ పిల్లలతో దూరుకుపోతున్నాయి. ఒకయింటి

తలుపు తెరచివున్నది. లోపల ఎవరో ముసలి స్త్రీ రొట్టెలు కాలుస్తోంది. ఒత్తిన రొట్టెలు వెచ్చని నిప్పులపైనుంచి,కుండలో వానిని మూస్తుంది. ఆమె కుడిప్రక్క అలమారులో కొయ్య లోటాలూ, గిన్నెలూ చక్కగా నగిషీచెక్కిన వున్నాయి.

అదిగో! నీటిఒడ్డున యేదో పడవొకటుంది. వెళ్ళి చూద్దామా! ఆ పడవసగంవరకూ నీళ్ళుపోసుకొని, పైకీ క్రిందకూ నీటి అలలపై ఊగుతోంది. దీన్నెక్కి నదిపైగా పోతే ఒక సరస్సు మనకు తగులుతుంది. దాన్నుండే యీనది ప్రవహిస్తోంది. ఆ సరస్సుతీరాన ఇంకొక గ్రామం ఉన్నది.

ఈక్రొత్తగ్రామంలోని జీవితమంతా వేరేతరహా. అసలు ఈగ్రామం సరస్సుఒడ్డునకాక, దానిమధ్య యేదో ఒక లంక లాగావుంది. నీటియడుగు నేలలో పెద్ద ద్రమానుగూటాలుదింపి, వాటిమీద అడ్డంగా కొయ్య లమర్చారు. ఆ కొయ్యలమీద వీరి యిండ్లున్నాయి. తీరంనుండి ఇండ్లకు కొయ్యవంతె నెక్కి పోతారు. ఇంటి గోడల పొడుగునా చేపలవలలు ఆరేశారు. చెఱువులో చాలా చేపలున్నాయని వేరే చెప్పటమెందుకు? కేవలం చేపలేతింటారనుకోరాదు. ఇండ్లమధ్య చెట్లకొమ్మలతో అల్లిన ధాన్యపుగాదె లున్నాయి. చేసువనున్న పశువుల పాక నుండి అంబా అని ఆవొకటి అరుస్తోంది.

నిజానికి మనం వర్ణించిన ఈ లంకగ్రామం ఇప్పుడు లేదు. ఎన్నడో నీటియడుగున మునిగి పూడ్చుకుపోయింది. కాని ఆ ప్రదేశంలో నిజంగా యీ గ్రామముండేదని శాస్త్ర జ్ఞులు కనుగొన్నారు. "అదంతా పూర్తి దబాయింపు. నేను నమ్మ"నంటావు నీవు కాదూ? సరే ఋజువుచేస్తాము చూడు.

# గ్రామ జీవితం



అదిగో! ఆ నదీతీరపు నిట్రమైన గట్టువంకచూడు. అదే ఒక గ్రామం.

## స రో వ ర గా థ

1853 సంవత్సరం స్విట్జరులాండులో వానలు లేక, భూమంతా యెండిపోయింది. ఆదేశపు ప్రఖ్యాతిచెందిన సరో వరాల నీరు దిగటార్చుకుపోయింది. అడుగు నేల చాలా భాగం బయటపడింది. జూరిక్ సరస్సు తీరాన ఓబర్ మీాలెన్ అనే ఒక గ్రామముంది. ఆప్రజ బయటపడ్డ నేలభాగాన్ని ఇండ్లు కట్టుకోడాని కుపయోగించుకొందామనుకొన్నారు. వారందరికీ అప్పటి గ్రామం కొంచెం యిరకాటంగా ఉండేది.

తిరిగీ నీరురాకుండా పెద్దకట్ట పోయాలని బయటపడిన చెఱువు అడుగునేలను త్రవ్వటం ప్రారంభించారు. మట్టిబండ్లు లాగే తమ గుఱ్ఱాల నదలిస్తూ, కేకలేస్తూ యెందరో పనిచేస్తు న్నారు. ఇదే స్థలంలో అంతకుముందు నీలం, యెరుపూ రంగుల పడవల్లో జనులు తేల్తేసుకొంటూ, విలాసార్థం తిరుగుతూ ఆనందించేవారు. కాలచక్రం తిరిగేకొలదీ, చూడు యెట్టి విచిత్ర మార్పులు కలుగుతాయో !

ఒకనాడు ఆ త్రవ్వేవారిలో ఒకని పారకు యేదో గట్టిగా తగిలింది. పరీక్షిస్తే అది సగం హరించిపోయిన ఒక ద్రమాను గూటం అని తెలిసింది. దాని ప్రక్కనే యింకొకటీ, తిరిగీ మూడోదీ...యిట్లా కనుపించాయి యెన్నో. మన్నుత్రవ్వే కొలదీ యెన్నో రాతిగొడ్డళ్ళూ, చేప గాలపు కొక్కాలూ, పగిలిన కుండముక్కలూ కనుపించాయి. శాస్త్రజ్ఞులు ప్రదేశ మంతా బాగా త్రవ్వి తీయించారు; కనుపడిన ప్రతిచిన్న వస్తు వునూ పరీక్షించారు. ఈ జూరిక్ సరస్సు ఉండేచోట పూర్వం

వెనుక వర్ణించినటువంటి గ్రామాలుండేవని నిర్ణయించారు. ఇప్పు డట్టి గ్రామాలెన్నో అనేక ప్రదేశాల్లో కనుపించాయి.

తిరిగి స్విట్జర్లాండులోనే యీమధ్య న్యూచాటెల్ సరస్సులో పరీక్షించారు. దాని అడుగు భూమిని జాగ్రత్తగా త్రవ్వి చూచారు. అదంతా పొరలు, పొరలుగా యేర్పడి యుంది. అడుగున యిసుకా, దానిమీద వండ్రుమట్టీ. ఈ మట్టిలో మనుజులు నివసించిన చిహ్నా లెన్నో కనుపించాయి: ఇండ్లభాగాలూ, వా రుపయోగించిన పాత్రసామానులూ, పని ముట్లూ. తరువాత అంటే, దానిపైన మరొక యిసుకపొరా; దానిమీద వండ్రుమట్టీ; ఇట్లా యెన్నోపొర లగుపించాయి. కాని ఒకే ఒకచోటమాత్రం రెండు యిసుకపొరలమధ్య వండ్రుమట్టి బదులు దళసరిగా పేరుకొన్న బొగ్గుబూడిద ఉన్నది. ఇది నేలబొగ్గు కాదు; కట్టెలు కాలిన బొగ్గు.

నీరు యిసుకనూ, వండ్రుమట్టినీ తెస్తుందేకాని బొగ్గును తేలేదుగా ? ఈబొగ్గుపొర యేదో అఖండ అగ్నిప్రమాదం కలిగి యేర్పడి యుండాలి. చాలాకాలంక్రితం జను లీసరస్సుండే ప్రదేశంలో దాని తీరాన వసించారు. తరువాత సరస్సునీరు యెక్కువగా వచ్చి గృహాలన్నిటినీ ముంచివేసింది. తమయిండ్లు వదలి వారంతా వెళ్ళిపోయారు. ఆ యిండ్లన్నీ విరిగి పడి కుళ్ళి పోయాయి. నీటి యడుగునున్న ఆయింటి కప్పులమీద చేపలు యీదాయి. ఆ యిండ్ల కిటికీలలోదూరి బయటకువస్తూ పెద్ద చేప లెన్నోదాగుడుమూత లాడాయి. వంటింటి అలమారు లలో దూరి తమ మీసాలతో స్పృశిస్తూ పీతలు వెతికాయి.

క్రమంగా సరోవరం నీరు తీసింది. తిరిగీ దాని తీరం బయటపడింది. దానిపై కప్పిన యిసుక త్వరలో ఆరిపోయింది. దాని అడుగు నొక గ్రామం పూడిపోయిందనే గుర్తు లేవీ కనుపించాయి కావు. అంతా మామూలుగా ఉన్నది. తిరిగి జనులాతీరానికి వచ్చారు. గొడ్డలిశబ్దం వినబడింది. తెల్లని చిత్రికపొట్టును తీరమంతా పరిచారు. ఇండ్లూ, వాకిళ్ళూ నిర్మించారు మరొకసారి. ఈ విధంగా మనుష్యులూ, సరస్సు నీరూ యెన్నిపర్యాయాలో పెనగులాడారు. వారిండ్లు కట్టటమూ, సరస్సు వాటిని ముంచివేయటమూ, ఇట్లా యెన్నో పర్యాయములు జరిగింది.

చివరకు విసుగుజెంది ప్రజ తమ యిండ్లను కట్టేతీరు మార్చుకొన్నారు. పెద్ద ప్రమానులదెచ్చి, గూటాలుగా చెక్కి నేలలో దిగగొట్టారు. వానిపై కట్టెల బిగించి బలమైన పునాది లేవనెత్తారు. దానిపై ఇండ్లు కట్టుకొన్నారు. వారి ఇండ్లనుండి చూస్తే క్రింద నీరూ, చేపలూ కనుపించేవి. ఎంత యెత్తుగా నీరు లేచినా వారి యిండ్లకేమాత్రమూ ప్రమాదం కలిగేది కాదు. పునాది అడుగున యెక్కడో అలలు విరిగిపడి తాండవించేవి; వానిని చూస్తూ పిల్లలు సరదాగా, నిర్భయంగా కాలం గడిపేవారు.

ఆవిధంగా నీటిప్రమాదంనుండి తప్పించుకుంటే, ఇంకొక భయంకర శత్రువు వారికెదురైంది. పాపం! కొండ గుహల్లో బ్రతికేరోజుల్లోనే మానవుడు నిప్పును కనిపెట్టాడు. వారికది వెచ్చదనాన్నిచ్చి, వంటలూ వగైరాల కుపయోగపడేది. ఆ గుహల రాతిగోడల నా నిప్పు యేమీ చేయలేకపోయింది.

కాని, కొయ్యఇండ్లను నిర్మించటంతోనే అగ్ని వారికి భయంకర శత్రువుగా మారిపోయింది. ఎన్నితరాలుగానో వారికి ఆప్త మిత్రుడై సేవజేసిన అగ్ని తన భయంకరత్వాన్ని చూపి, వారినీ, వారి ఇండ్లూ, వాకిళ్ళనూ తనదగ్ధహృదయానికి హత్తుకొన్నది... న్యూచాటెల్ సరస్సు అడుగున కనుపించిన బొగ్గుపొరకు ఆ పురాతన అగ్నిహోమమే కారణమని మనకు విశదమవు తోంది.

నిప్పంటుకోగానే, తమ బిడ్డలను చంకల్లోపెట్టుకొని జన మంతా సరస్సులోకి దుమికారు. కాలిపోయే పశువుల పాకల నుండి జంతువులు కడుపు చెరువయ్యేటట్లు అరిచాయి. కానీ, వారేమీ చేయలేకపోయారు. పెద్ద మంటలులేచి ఆ కొయ్య దూలాల యిండ్లన్నీ భస్మమైపోయాయి. వారి పల్లెనంతా భస్మంచేసిన ఆ నిప్పే కొయ్యసామానులూ, చేపల వలలూ, మొక్కల గింజలనూ పాడైపోకుండా ఇన్నేండ్లుగా దాచింది. అవన్నీ కాలి భస్మంకాకపోవడానికి కారణం బహు విచిత్ర మయింది. నిప్పంటుకోగానే పైనుడివిన రకరకాల వస్తువులూ కాలి, నీటిలోపడ్డాయి. వెంటనే నీరు వాని నార్పివేసింది; అవన్నీ చల్లారి నీటియడుగుకు దిగజారాయి. నీళ్ళల్లో వుండే వస్తువులు కొద్దిరోజుల్లో కుళ్ళీ, చిమికీ, పాడైపోతాయని మనకు తెలుసు. కాని, నిప్పంటుకొని వెంటనే నీటిలో పడటంచేత వానిమీద బొగ్గుపొర పల్చగా యేర్పడింది. ఈ బొగ్గుపొర మూలాన నీటిలోనున్నా పాడైపోకుండా అవి ఉండగలిగాయి. నీరో, నిప్పో, ఏదైనా ఒక్కటే గనుక వానికి తగిలితే నశించే వస్తువులు రెండు చేతులూ జోడించి వీనిని స్పర్శించటం

మూలాన ఎన్నివేల యేండ్ల క్రితమో అల్లిన నారబట్ట పీలిక కూడా పాడైపోకుండా నిలిచింది.

## మొదటి వస్త్రాలు

మొదట్లో జనులు మగ్గాలమీద తమబట్టలను నేయలేదు. ఏదో మనం జడ అల్లినట్లు చేత్తో అల్లారు. ఉత్తరధృవ ప్రాంతపు యెస్కిమోలు ఇప్పటికీ తమ బట్టలను ఇట్లాగే అల్లుతారు. పొడుగుదారాల నొక చట్రంమీద బిగిస్తారు. అడ్డదారాలను చేత్తో తీసుకొని, పైకీ క్రిందికీ మార్చిమార్చి, మనం నవారును మంచాలకు అల్లినట్లు అల్లుతారు. ఆ పురాతన చట్రంనుండే మన ఈ కాలపు మగ్గాలు యేర్పడ్డాయి.

బొగ్గుపొర కప్పి నీటియడుగున దొరికిన నారబట్టనుండి మనకు తెలిసేదిది. అంతవరకూ జంతువులచర్మాలను కట్టుకొనే జనులు బట్టల నల్లటం కనిపెట్టారు. ఈ బట్టల అల్లిక ఆడవారికి ఇంకొక కొత్తపనిని కల్పించింది. నీలిరంగు పూవుల నార మొక్కలన్నింటినీ కొడవళ్ళతో కోసేవారు. ఆపనైందో లేదో! వంగి పనిచేస్తే కలిగిన నడుమునొప్పి తగ్గకముందే, దాన్ని యెండబెట్టి, శుభ్రంగా కడిగి, తిరిగీ ఆరబెట్టేవారు. అది బాగా ఆరిన తరువాత, మెత్తగా దంచి చిక్కులేకుండా దువ్వేవారు. ఆ దువ్విన నారను తక్లీకి గిరున త్రిప్పి చుట్టేవారు. తరువాత మగ్గంమీద చేత్తో అల్లేవారు.

ఇట్లా శ్రమపడి తమకూ, తమవారికీ అందమైన చేతి రుమాళ్లూ, పమిటలూ, లంగాలూ యేవేవో చేసుకొనేవారు.

ప్రథమ లోహపు పనివారు

సృష్టిలో అనేకరకాలపదార్థాలు దొరికినా, ఈకాలంలో మన ముపయోగించే వస్తువులెన్నో మనుష్యులు కొత్తగా తామే ఉత్పత్తి చేసే పదార్థాలతో తయారవుతున్నాయి. ఇటు కలూ, పింగాణీ సామానులూ, కాగితమూ, పోత ఇనుమూ–ఇవన్నీ మనుషులు తయారుచేస్తారేకాని, సృష్టిలో ఇటువంటి పదార్థాలు దొరకవు. పోతయినుముకూ, ప్రకృతిలో దొరికే ఇనుముకూ ఎట్టి పోలికాలేదు. చక్కగా పూవులూ, పక్షులూ చిత్రించిన పలుచని పింగాణీ గిన్నెకూ, నల్లని బంకమన్నుకూ మాత్రం యేమంత పోలికున్నదో, ఆలోచించి చూడు! ఇదే మాదిరి కంకరరాయీ; ఫౌంటెన్ పేనాలూ, జపానుబొమ్మలూ వగైరాలుచేసే వల్కనైటూ; సెల్యులాయిడ్; కృత్రిమ పట్టు నూలూ, కృత్రిమ రబ్బరూ ఇట్లాంటి వెన్నోవున్నాయి. ఇంకా మనుష్యులు చేసేటట్టు కొయ్యనుండి యే పట్టుపురుగూ పట్టును చేయలేదు. కాగితాన్ని కొయ్యా, గడ్డీనుండి చేస్తారు.

వేర్వేరు వస్తువులు చేసుకోటంలో మనుజుడు, పదార్థాలను పూర్తిగా మార్చివేయటం కనుగొన్నాడు. మొదట్లో ఒక రాతిని ఇంకో దానితో రుద్ది గరుకురాతిని సాఫీచేసేవాడు. ఇప్పుడో! సూక్ష్మాణువులనే మార్చివేసి కొత్తరకాల పదార్థాలను సృష్టిస్తున్నాడు. ఈ చిన్న అణువులను సూక్ష్మవస్తు దర్శనీ యంత్రంలోకూడా మనం చూడలేము. ప్రస్తుత రసాయన, భౌతిక శాస్త్రాలంటే ఏమిటో తెలియని పూర్వపు రోజులనుండే క్రమక్రమంగా మనుజుడు పదార్థనిర్మాణాన్ని మార్చడానికి ప్రారంభించాడు.

రేగడిమట్టిని కాల్చి కుండలుచేసిన పూర్వకాలంలోనే వారికి తెలియకుండానే వారు పదార్థాన్ని మార్చటం మొదలు పెట్టారు. ఇట్లా పదార్థాలను మార్చాలంటే చేత్తో అదిమో, నున్నగా రాచీ, అరగదీస్తే లాభంలేదు. దాని అణుసిర్మాణాన్నే మార్చగల అద్భుతశక్తి మన స్వాధీనం కావాలి. ఆ శక్తిని అగ్ని అతనికి ప్రసాదించింది. బంకమన్నునుండి అగ్ని ఆతని కుండల తయారుచేసింది; పిండినుండి రొట్టెల నిచ్చింది; ఖనిజాన్ని కరిగించి రాగిలోహాన్ని మానవునకు ప్రసాదించింది. ఎన్ని వేల యేండ్లుగానో రాతి పనిముట్లు చేసుకొన్న జనులు, కొత్తగా లోహపు సామానులు తయారు చేయుటం ప్రారంభించారు. ఈ లోహమేమిటి? వారి కెక్కడదొరికింది? ఏరూపంగా? ఇవన్నీ ఆలోచించాలి.

పొలాల్లోనో, అడవిలోనో నడిచి వెడుతుంటే రాగి లోహపు ముక్కలు మన కగుపించవు యీ రోజుల్లో. కాని కొన్ని వేల యేండ్లక్రితం రాగి బాగా విరివిగా దొరికేది. ప్రజకు దాని నుపయోగించవచ్చునే ఉద్దేశం కలిగిందికాదు ఎంతోకాలందాకా. చెకుముకిరాతితో వస్తువులు చేసే టప్పుడు పనికిరాని చిన్నచిన్నముక్కలు, తునకలు చాలా మిగిలి పోయేవి. అవన్నీ పెద్ద గుట్టలుగా యేర్పడ్డాయి. క్రమంగా చెకుముకి అరుదైపోయింది. ఈరోజుల్లో మనంగనుక చెకు ముకితో మన పనిముట్లన్నీ చేద్దామని మొదలుపెడితే సాధ్య పడదు. పూర్వీకులు కనుపించిన చెకుముకినంతా వాడేశారు.

రానురాను చెకుముకిరాయి దొరకటం దుర్లభమైంది. వారికి ఉన్నట్లుండి మన గనులలో ఇనుము అయిపోతుందనుకో.

ప్రతిదానికీ మనం ఇనుమే వాడుతాము కాబట్టి, ఇంకాలోతుగా భూమిలో గనులు తొలుచుకుపోయి, పెకలించాలని చూస్తాము. అట్లాగే మన పూర్వీకులూ, నేలమీదుండే చెకుముకి హరించటంచేత గనులు త్రవ్వటం ప్రారంభించారు. అవే ప్రథమ గనులు. ఈలోకంలో సీమసున్నపు రాయీ, చెకుముకీ కలిసి సృష్టిలో దొరుకుతాయి. ముప్ఫైఆరడుగుల లోతున్న పురాతన చెకుముకి గనులెన్నో అగుపించాయి అనేక చోట్లలో.

ఆరోజుల్లో నేల అడుగున, గనుల్లో పనిచేయటం చాలా ప్రమాదంగా వుండేది. ఏదన్నా గట్టి త్రాడో, గుంజ్లుచెక్కిన కఱ్ఱనో పట్టుకొని క్రిందికి దిగేవారు. క్రిందంతా పొగా, చీకటీ. కాగడాలో, చిన్న నూనెదీపాలో పెట్టుకు పనిచేసేవారు. ఈకాలపు గనులను గట్టిగా కఱ్ఱలతో పడిపోకుండా బిగిస్తారు; గుండ్రని ఆర్చిలు కడతారు పడకుండా. పూర్వీకుల కట్టివేవీ చేతయ్యేవికావు. అందుకనే తఱచుగా నేలవంగి క్రిందికి కూలేది. అనేక పురాతన గనుల్లో మనుష్యుల అస్థిపంజరాలూ, వారుపయోగించిన పనిముట్లూ కనుపించాయి. జింకకొమ్ము గొడ్డళ్ళతో చెకుముకిని పగులగొట్టేవారు కాబోలు. అట్టివెన్నో కనుపించాయి గనుల్లో. ఒక గుహాలో రెండస్థిపంజరాలున్నాయి; ఒకటి పెద్దదీ, ఇంకొకటి బాలునిదీ. ఎవరో తండ్రి తనతో తన కుమారునీ లోనికి తీసుకువెళ్ళాడు. ఆతని భార్యా బిడ్డ లెంతపడ్డారో, పాపం!

గొడ్డళ్ళూ, కత్తులూ, నాగళ్ళూ, అన్నీ చెకుముకితో చేసేవారు కాబట్టి, ఎంత దొరికినా వారికది సరిపోయిందికాదు. వేరొక వస్తువేదన్నా దాని బదు లుపయోగించవలసిన అవ

సరం యేర్పడ్డది .ఆ రోజుల్లో రాగిమీదికి వారిదృష్టి మరలింది. దాన్ని జాగ్రత్తగా పరీక్షించటం మొదలు పెట్టారు. రాగి రాళ్ళు నీలంగా అనేకచోట్ల కనిపించేవి. అదెందుకన్నా తమ పనిముట్ల కుపయోగిస్తుందేమోననే ఆశతో సుత్తిదెబ్బలుకొట్టి పగలగొట్టాలని చూచారు. అదీ చెకుముకివంటి ఒక రాయి మీద రుండబట్టి, అలవాటుకొద్దీ సుత్తికి స్వాధీనం కావచ్చను కొన్నారు. కొట్టేకొద్దీ అది మరింత గట్టిపడింది. దానిరూపం మారింది. ఇంకా కొడితే, దానిలోనుండే స్వచ్ఛమైన రాగి లోహం చిన్న స్ఫటికాలుగా మారి ఇటూ అటూ చెదిరింది.

మొదట్లో వారు నిప్పులేకుండా రాగినట్లా గట్టిగా కొట్టి, కొట్టి కరిగించారు. బహుశా అట్లా దెబ్బలు కొట్టేటప్పుడు యే చిన్న రాగితునకో లేక రాగియో యెగిరి ప్రక్కనుండే నిప్పులో పడియుండవచ్చు, లేదా కుండలకని బంకమన్నును కాల్చినట్లే కావాలనే రాగిరాతినీ వారు కాల్చారుకాబోలు. నిప్పారింతరువాత చూస్తే చిన్న రాగిముక్క ఆ బొగ్గులూ, రాళ్ళమధ్యా వారి కగుపించింది. ఈ విచిత్రాన్ని చూచి వారెంతో ఆశ్చర్యపడ్డారు. నీలిరంగు రాతినుండి, ఆ లోహాన్ని అగ్నిదేవుడు తమకు ప్రసాదించాడని వారనుకొన్నారు పూర్వాచారాన్నిబట్టి.

ఆ రాగిని తమసుత్తులతో కొట్టి చిన్నముక్కలు చేశారు. దెబ్బమీద దెబ్బకొట్టి దాన్ని సాగగొట్టి కత్తులూ, వగైరా చేసుకొన్నారు.

స్వశక్తి నుపయోగించి యింకొక నూతన పదార్థాన్ని మానవుడు ఈ విధంగా సృష్టించుకోగలిగాడు.

## కార్మిక పంచాగం

పంచాంగం మనకు సంవత్సరాలూ, నెలలూ, వారాలూ గంటలూ, తిథి నక్షత్రాలూ తెలుపుతుంది. కాలాన్ని యీ రోజులూ, నెలలూ, సంవత్సరాలతోనే కొలిచి తెలుసు కొంటాము. కాని పురాతన మనుజు లేకాలంలో వసించారో చెప్పాలంటే, ఇన్ని వేల సంవత్సరాల క్రితం అనే బదులు యింకో విధంగా చెప్పుతాము. "పురాతన రాతి యుగము", "క్రొత్త రాతియుగము", "రాగియుగం", "కంచు యుగం" అని యీ విధంగా కాలనిర్ణయం చేస్తాము. ఇట్లా చెప్పటంతోటే మనుజు డాయాసమయాల్లో ఎట్టి నాగరికత కలిగియున్నదీ, ఎట్టి వృత్తులు నేర్చిందీ తేలికగా తెలుస్తుంది. సాధారణ గంటలూ, నెలల పంచాంగం మాదిరికాక, ఆయా వృత్తి జరిగేకాలం తెలుపుతుందికాబట్టి కార్మిక పంచాంగమని దీనికి మనం పేరుపెట్టవచ్చు. కార్మిక పంచాంగాన్నే అవసర మయినప్పుడు సాధారణ సంవత్సర పంచాంగంతో పోల్చి ఇన్ని వేల యేండ్లనికూడా చెప్పవచ్చు. కాని యీ రెండు పంచాం గాలూ సరిపోల్చటం ఎల్లప్పుడూ వీలుపడదు. లోకంలో ఇప్పటికీ కొన్ని ప్రదేశాల్లోని జనులు రాతియుగపు జీవితాలనే గడుపు తున్నారు. పాలినీషియాలో కొయ్యదూలాలమీద నీళ్ళలో కట్టిన నివాసా లిప్పటికీ వాడుతున్నారు.

జనులందరూ ఒకేసారిగా అన్ని తావుల్లోనూ ఒకే మాదిరి మారకపోవటమే దీనికి కారణం. లోకపు ఇతరభాగాల నుండి ఎప్పుడో విడిపోయిన ఆస్ట్రేలియాలోని ప్రజకూ, ఇతర భాగాలవారికీ ఎట్టి సంబంధమూ లేకపోయింది. వారంతా

యెంతో వెనుకబడి అట్లాగే నిలిచిపొయ్యారు. ఐరోపాఖండంలో అట్లా కాదు; యెక్కడైనా ఒకచోట రాగిగొడ్డలీ, మట్టి కూజాలూ తయారు కాగానే, త్వరలో అన్ని తెగలవారికీ అవి వ్యాపించేవి.

నదులమీద తమ చిన్న పడవల్లో ఊరూరికీ జనులు వ్యాపారంచేస్తూ వెళ్ళేవారు. తోళ్ళిచ్చి నారబట్టలూ, ఇంకేదన్నా ఇచ్చి రాగీ తెచ్చుకొనేవారు. ఒకరికి చెకుముకి యెక్కువగావుంటే, ఇంకొక జాతివారికి చేపలూ, మరొకరికి కుండ సామానులూ సమృద్ధిగా వుండేవి. సరస్సుల్లో కొయ్యదూలాల ఇండ్లలో నివసించే వారిదగ్గరకు యెవరో ఒకజాతివారు యెప్పుడూ వస్తూనే యుండేవారు. వస్తువుల నిచ్చిపుచ్చుకోటంలో ఒకరి అనుభవాలు ఇంకొకరూ, యీ జాతి జనులు నేర్చిన కొత్త పనులు ఆ జాతి వారూ ఇట్లా తెలుసుకోటం జరిగేది.

సాధారణంగా ఒకరిభాష ఇంకొకరికి తెలియకపోవటం చేత సంజ్ఞాభాషనే తరుచు వాడేవారు. కాని వ్యాపారానంతరం తమతమ ఊళ్ళకు తిరిగి వెళ్ళేటప్పుడు కొత్త వస్తువులతో పాటు, కొత్తమాటలు కొన్ని వారు తమతో తీసుకు పోయేవారు. తమజాతి దేవుళ్ళతోపాటు, అన్యజాతి దేవుళ్లూ వారి దేవాలయాల నలంకరించేవారు; కొత్త ప్రదేశాల్లో ఆ దేవుళ్ళ పాతపేర్లు మార్చబడేవి. కాని, అసలు ఆత దేజాతి దేవుడో పేర్లనుబట్టి సులభంగా కనుక్కోవచ్చు. పురాతన బాబిలోనియను టామూజ్, ఈజిప్టు దేశపు ఒసైరిస్, గ్రీసు దేశపు ఎడోనిస్ అనే ముగ్గురు దేవుళ్ళూ నిజానికి ఒక్కరేనని మనకు విశదమవుతోంది.

జనులచే పూజింపబడే వేర్వేరు దేవుళ్ళ ప్రయాణాల గురించి యొక గ్రంథం వ్రాయవచ్చు. ఆ దేవుళ్ళ ప్రయాణాలు మన కెన్నెన్ని విషయాలలో ఆయాకాలపు జనులను గురించి తెలుపుతాయి. సిరియానుండి ఎడొనిస్ దేవత గ్రీసు దేశానికి వచ్చింది. సిరియా దేశపు భాషలో "ఎడొనిస్" అంటే 'ఆర్యా' అని అర్థం. గ్రీకుల కీవిషయం తెలియక అదేదో యొక ప్రత్యేక పేరనుకొని ఆ దేవతను "ఎడొనిస్" అన్నారు. ఈ విధంగా వస్తువులూ, మాటలూ, అభిప్రాయాలూ ఒకజాతి వింకొకజాతి జనులకు అలవాటుపడ్డాయి.

ఇట్లా వస్తువుల యిచ్చిపుచ్చుకోనే వ్యాపారం యెప్పుడూ శాంతంగా, సరళంగా జరిగిందనుకోరాదు. జనులు రాగినో, బట్టలనో, ధాన్యాన్నో ఆశించి వచ్చేవారుగా? దౌర్జన్యం చేసి తినగు వస్తువులు తమ వేపీ ఈయకుండా తీసుకోవాలని కొందరు చూచేవారు. అప్పుడు పెద్ద పోట్లాటలు జరిగేవి. గెలిచినవారు చేతికందిందల్లా పట్టుకుపోయేవారు. రాను, రాను గ్రామాలు యేకో పెద్ద కోటల్లాగా మారిపోయాయి. కట్టుబపాతీ, గోడలు పెట్టీ శత్రువులు చులకనగా రాకుండా వాటిని బందోబస్తు పెసేవారు.

అన్య తెగలవారంటే అనుమానం జనుల్లో పెరిగిపోయింది. బలాత్కారంగా లాక్కోటం, బందిపోటు చేయటమూ, పరాయివారిని చంపటమూ పరిపాటైంది. తామే మనుష్యుల మనీ, యితర తెగలవారు అసలు మనుష్యులే కారనేభావం తలయెత్తింది. అప్పుడే "సూర్యవంశీకు"లనీ, "కైలాసనాథుని బిడ్డ"లనీ తమ్ముతాము గౌరవంగా పిలుచుకొనేవారు. అన్య

జాతులకు మారుపేర్లు పెట్టారు. కొన్ని జాతులకా పేర్లు శాశ్వతంగా నిలిచిపోయాయి. ఒక యొట్టియిండియను జాతివారికి "దుమ్ముముక్కు"లనీ, యింకొకరికి, "పోకిరి"వారనే పేర్లున్నాయి. ఇటువంటి పేర్లు, యెవ్వరూ తమకు తామే కావాలని పెట్టుకోరుగా ?

ఇప్పటికీ అన్యజాతి జనులంటే అనుమానమూ, అసహ్యమూ మనలో నశించ లేదనేవిషయం మన మెఱుగున్న దే. ఇది కడుశోచనీయం. సర్వమానవ భ్రాతృత్వాన్ని నెలకొల్పేబదులు, ఎంతో నాగరికతజెందిన యీ 'అట్యామినమూ, విద్యుచ్ఛక్తి యుగంలో' కూడా ఇతర జాతులయెడ ద్వేషము పెంపొందించబడుతోంది. ఇతరులకు మనుజు లనిపించుకొనే అర్హత లేదని మనలో కొన్ని జాతు లనుకొంటారు. ఇట్టి భావాలన్నీ అవివేకంతో కూడుకొన్న పురాతన కాలంనాటివని తెలుసుకొని, అర్థంలేని మన అహంకారాన్ని అడుగంటా నిర్మూలం చేస్తేనేగాని మనం నాగరికుల మనిపించుకొ లేము.

చరిత్రంతా చదివి పరిశీలిస్తే ఎక్కువ జాతనీ, తక్కువ జాతనీ యున్నట్లు మనకెక్కడా కనుపించదు. ఎక్కువగా వృద్ధి జెందినవారూ, ఇంకా అదేమార్గంలో ప్రయాణంచేస్తూ వెనుక బడినవారనీ యున్నారేకాని ఎక్కువతక్కువలని లేవు. ఈయెక్కువ తక్కువలు మనం తెచ్చిపెట్టినవి. ఒకేకాలంలో నివసించే జనులు, కార్మిక పంచాంగంప్రకారం వివిధ యుగాల్లో జీవిస్తూ ఉంటారని ముందే చెప్పాము. ఇంతకన్న వేరే భేదమున్నదనుకోటం మన బుద్ధిమాంద్యాన్ని తెల్పుతుంది. కొందరు యంత్ర యుగంలో వుంటే, మరికొందరు కొయ్యనాగళ్ళతో దున్నుతూ,

చేతిమణిగాలమీద బట్టలు నేసుకొంటున్నారు. మన ఇండియాలో మాదిరి, తమ ఆయుధాలన్నిటినీ యెముకతో చేసుకొనేవా రున్నారు. ఇప్పటికీ లోకంలో యినుమనే ఒక వస్తువున్నదనే వారికి తెలియదు.

ముందున్నవారు యీ మానవ ప్రయాణంలో, వెనుక బడినవారికి మార్గదర్శకులై, చేయూతనిచ్చి నడిపించటం తమ కర్తవ్యమని గ్రహించాలి. మధ్యఆసియా, సైబీరియా, ఉత్తరపు దూర దేశాల ప్రజలూ సుమారొక నూరుసంవత్సరాల్లో పెరిగే టంత జరిగిన యిరవైయేండ్లలోనూ పెరిగారు. ఆస్ట్రేలియా నాక్రమించుకొన్న ఐరోపియనుజాతులు, అచ్చటి ప్రజల ప్రస్తుత జీవితాన్నే తమ పూర్వీకులూ జీవించారనేవిషయం మరచి పోయారు, ఇట్లా మరచిపోవటంచేత యెన్ని కలహాలో సంభ వించాయి.



# అర్థంలేని యుద్ధాలు

**జ**నులు సముద్రయానం చేసి అనేక కొత్తదేశాలు కనిపెట్టారు. ఎన్నడో నివసించిన ప్రజల జీవిత విధానాలు కండ్లారా చూడగలిగారు. కొన్ని ప్రదేశాల్లో ఐరోపీయనులు, ఆస్ట్రేలియాను కనిపెట్టడంమూలాన ఒక బ్రహ్మాండమైన భూప్రదేశం వారి స్వాధీనమైంది. వారి కదెంత గొప్ప అదృష్టమో అంతకంత దురదృష్టంగానూ ఆస్ట్రేలియనుప్రజకది వర్తించింది. కార్మిక పంచాంగంప్రకారం ఆస్ట్రేలియను లోక పురాతన యుగంలో జీవిస్తున్నారు. ఐరోపియనుల పద్ధతులు వారి కర్థం కాలేదు; వారిమాదిరి జీవించటం వారికి ఇష్టముందికాదు. అందుమూలాన యేవో అరణ్యమృగాల తరిమి, వేటాడినట్లు ఐరోపియనులు వారిని తరిమి బాధించారు.

## ఒకరి మేలు ఇంకొకరి కీడు !

ఆస్ట్రేలియనులంతా సాధారణ పాకల్లో నివసిస్తే, ఐరోపియనులకు వారి దేశాల్లో యెత్తెత్తు మేడలూ, మిద్దెలూ ఉండేవి, ఆస్ట్రేలియావారికి ప్రత్యేకపుటాస్తి అంటే యేమిటో తెలిసేది కాదు. ఐరోపాలో ఇతరుల జింకనో, లేడినో అడవిలో కను

పడినపుడు కాలిస్తే, ఆ కాల్చినవాడిని ఖైదులో పెట్టేవారు. ఆస్ట్రేలియనులకు ఆచారమయిందీ నలుగురూ అనుష్ఠించేదీ, ఐరోపియనులకు గొప్ప చట్టవిరుద్ధంగా తోచేది. తమ కంటికి ఏదన్నా గొర్రెలమంద కనుపించగానే సంతోషంగా పెద్ద కేకలు పెట్టి, పరుగెత్తి తమ యీటెలూ, బూమెరాంగులూ వానిపై వదలేవారు ఆస్ట్రేలియావారు. వెంటనే ఐరోపియను తుపాకుల ప్రేలుడు శబ్దం నల్దిక్కులా మారుమ్రోగేది.

ఒక మందకాపరి జీవితాని కలవడిన యూరపియనులకు గొర్రె ప్రత్యేకపుటాస్తి. వేటాడి మృగాలపట్టే ఆస్ట్రేలియా వారు గొర్రె కనుపిస్తే అది గొప్ప అదృష్టమనుకొనేవారు. యూరపియను చట్టంలో "గొర్రెలు కొనుక్కొన్నవారికీ, పెంచినవానికీ చెందుతాయి; అవి వారి ప్రత్యేకపుటాస్తి" అని ఉంటే, ఆస్ట్రేలియను ఆచారంప్రకారం "ఎవడైతే తరిమి వేటాడుతాడో, వాని కా మృగం చెందుతుంద"ని యుండేది. తమ అనుష్ఠానప్రకారం, అలవాటు చొప్పునా ఆస్ట్రేలియనులు ప్రవర్తించారు. ఇది ఐరోపియనులకు గొప్ప నేరంగా కనుపించింది. వెంటనే వారందరినీ యేవో పిచ్చికుక్కలను తరిమి చంపినట్లు కాల్చివేశారు.

ఆస్ట్రేలియను స్త్రీలకు చక్కగా పెరిగే బంగాళదుంపల చేను కనుపిస్తే యెంతో సంతోషమయ్యేది. వేరే ఆలోచనలతో కాలయాపనచేయక, తక్షణమే దానిని తమ కట్టెలతో త్రవ్వేవారు. అన్ని దుంపలూ తిరిగీ, తిరిగీ వెతుక్కోకుండా, ఒక్కచోటే దొరికేటప్పటికి వారికి పట్టరాని సంతోషం కలిగేది. నెలరోజులూ కష్టపడి వెతకి తెచ్చుకొనే దుంపలకన్న

యెక్కువగా ఒక్కగంటలో ఆ పొలంనుండి త్రవ్వవచ్చు. ఎంత గొప్ప అదృష్టమో తమది అని వారు అనుకొనేవారు. కాని అది గొప్ప దురదృష్టంగా మారిపోయేది. పాపం! పిడుగుశబ్దం లాగా తుపాకిగుండ్లు పేలిపోయేవి. స్త్రీలు అంతకష్టపడి త్రవ్విన దుంపల సంచులతోనూ చూస్తుండగా నేలకూలేవారు. ఎవరు వారిని చంపారో, యెందుకనో పాపం ఆ అమాయకుల కేదీ తెలిసేదికాదు.

అమెరికాను ఐరోపియను లాక్రమించుకొన్నప్పుడు ఇట్టి ఘోరకృత్యాలే జరిగాయి.

## అమెరికాను కనుగొన్నప్పుడు

అమెరికాను కనుగొన్నప్పుడు ఐరోపియనులు తామేదో క్రొత్త ప్రపంచాన్ని కనిపెట్టామనుకొన్నారు. కొలంబసును గౌరవించి "అమెరికాను కనుపెట్టినందులకు"ను యొక పతాకా న్నతనికి ప్రసాదించారు. నిజానికా క్రొత్త ప్రపంచకం క్రొత్తది కానేకాదు. అందులో క్రొత్త విషయాలు లేనేలేవు. తమ ఐరోపాఖండపు పురాతన జీవితాన్నే, వారమెరికాలో తిల కించగలిగారు అంతే. తమదేశీయులూ అట్టిస్థితిలో నుండేవారనే విషయం మరచిపోబట్టి అంతా వారికి క్రొత్తగా కనుపించింది.

అమెరికా ప్రజల ఆచార, వ్యవహారాలన్నీ యీ ఐరో పియనులకు విడ్డూర్యంగానూ, అనాగరికంగానూ కనిపించాయి. ఇండియనుల యిండ్లకూ, వారి దుస్తులకూ, ఆచారాలకూ, ఐరోపావారి యిండ్లూ, బట్టలూ, ఆచారాలకూ యేవిధమైన పోలికా యుండేదికాదు. ఉత్తరభాగాల్లోనుండే ఎట్టి యిండి యనులు వారి గదలనూ, బాణాలనూ రాతితోనూ, యెముక

తోనూ చేసుకొనేవారు. ఇనుమంటే వారికి తెలియనే తెలియదు. వ్యవసాయం వారెరిగున్నదే. మొక్క జొన్నా, గుమ్మడి, చిక్కుళ్ళూ, పొగాకూ బాగా పండించేవారు. ఇవన్నీ చేతనయినాకూడా వారు జంతువేటనే ముఖ్యంగా తమ జీవనాధారం చేసుకొన్నారు. వారి గ్రామాలచుట్టూ యెత్తు దిడులూ, గోడలూ యుండేవి.

దక్షిణాన మెక్సికో దేశపు ఇండియనులు రాగీ, బంగారు నగలూ పెట్టుకొనేవారు. పొడుగుపాటి, పెద్ద యిండ్లు కట్టుకొని, వానిమీద తెల్లని సున్నవంటి వస్తువును పూసేవారు. ఇట్టి వెన్నో విషయాలను గురించి తమ పుస్తకాల్లో అమెరికాకు వెళ్ళిన మొదటి యూరోపియనులు వ్రాసిపెట్టారు. జనుల ఆస్తి వివరాలూ, వృత్తులూ మొదలైనవి ఎవరుపడితే వారికే అర్థమవుతాయికాని, వారి ఉద్దేశాలూ, ఆచారాలూ, మనోభావాలూ తెలుసుకోటం కష్టం. కొత్తగావచ్చిన యూరపియను జాతులకు ఎఱ్ఱఇండియనుల ఆచార వ్యవహారాలేమాత్రం బోధపడ్డాయికావు.

ఆ కొత్త ప్రపంచంలో అనేక ప్రదేశాల్లో డబ్బూ, వర్తకులూ, ధనికులూ, బీదవారూ అనే మాటల కెట్టి అర్థమూ ఉండేదికాదు. బంగారమును విరివిగా యుపయోగించే తెగలుండేవారే కాని, వారికి దాని విలువ తెలిసేదికాదు. కొలంబసుతో వెళ్ళిన ప్రథమ నావికులకు కనుపించిన ఎఱ్ఱయిండియనులనేకులు బంగారపు టాభరణాలు పెట్టుకొన్నారు. ముక్కులకున్న పెద్ద గుండ్రనిపోగులూ, మెడ గొలుసులూ యిచ్చి గాజు పూసలూ, ఏవేవో రకాల బట్టలూ పుచ్చుకొన్నారు.

నావికులనుండి కొత్తగా వచ్చిన ఐరోపియనులు తమ దేశాల్లో మాదిరే, లోకమంతటా అధికారులూ, నవుకరులూ, భూస్వాములూ, పాటకజనమనీ ఉంటారనుకొన్నారు. ఇండియనులు విరోధులను పట్టుకొంటే, వారిని నవుకర్లుగానో బానిసలుగానో చేసేవారుకారు. వారిని చంపనన్నా చంపేవారు. లేదా, తమ జాతి జనుల్లో పెంచుకొనేవారు. ఒకజాతి జనుల్లో ప్రత్యేకపు టిండ్లనీ, భవనాలనీ ఉండేవికావు. అందరూ "పొడుగు గృహా"లనబడే యిండ్లలో కలిసి జీవించేవారు. అందరూ చేరి పనిపాట్లు చేసేవారు. పొలాలు మొత్తంమీద ఆ తెగవారందరికీ చెందేవే కాని, ప్రత్యేకంగా యే వ్యక్తికీ హక్కులుండేవికావు వాని మీద. ఇతరుల పొలంమీద కూలికి పనిచేసేవారని యెవరూ ఉండేవారుకాదు.

ఈ పద్ధతులన్నీ ప్రత్యేకపుటాస్తికి అలవడిన యూరపియనులకు అర్థముకాలేదు. ఒకరి వస్తువు నింకొకరు తీసుకొంటే వెంటనే యే పోలీసో వచ్చి జైలుకు తీసుకువెళ్ళేవాడు ఐరోపాలో. ఇండియనుల దేశంలో పోలీసులూ లేరు, జైళ్లూ లేవు. వారి సంఘజీవితం అంతమూలాన అరాచకంగా వుండేదా అంటే, అదే ఐరోపియనులకగుపించిందికాదు. అంతా సవ్యంగా జరిగిపోయేది. ప్రతివ్యక్తినీ ఆతని తెగవారంతా కాపాడేవారు. తమ మనిషి నెవరినన్నా చంపితే, ఆ తెగజనులంతా కలిసి పగదీర్చుకొనేవారు. సాధారణంగా ప్రాణానికి ప్రాణం తీయకుండా ఏదో సమాధానపర్చుకోటంకూడా జరిగేది. హంతకుని జాతిజనులు క్షమాపణకోరి, కొన్ని బహుమతులు చంపబడినవాని జనుల కిచ్చేవారు.

ఐరోపాలో రాజులూ, చక్రవర్తులూ వుంటే, అమెరికాలో అట్టివారెవరూ లేరు. జాతిప్రజలందరి యెదుటా వారి పెద్దలు సభచేసి తగవులన్నీ తీర్చి, జాతి జీవితం సవ్యంగా గడిచేటట్లు చూచేవారు. ఎవరెక్కువగా జాతికి సేవచేస్తారో, అట్టి వారినే పెద్దలుగ యెన్నుకొనేవారు. తమ కర్తవ్యాన్ని నిర్వహించ టంలో అశ్రద్ధచూపిన పెద్దలను ఆ పదవినుండి తొలగించేవారు. ఆ పెద్దలకు వారిభాషలో మార్గదర్శకు లనేపదం వాడేవారు. ఈ పదము "ఉపన్యాసకు" డనే మాటనుండి పుట్టింది. మార్గ దర్శకుడుగదా అని ఇతరులమీద తన అధికారం చలాయించ డానికి యేమాత్రం వీలుండేదికాదు.

పాత ప్రపంచంలో దేశానికి పెద్ద రాజు; ఇంటికి పెద్ద తండ్రి. సంఘపు యీ చిన్నభాగాలకూ, పెద్ద భాగాలకూ అట్టే భేదాలేవీ యుండేవికావు. ప్రజల కేసులు విచారించి, తీర్పుచెప్పి శిక్షించేవాడు రాజు. తండ్రి తన పిల్లలపై అట్టి అధి కారమే చూపేవాడు. రాజు తనతరువాత రాజ్యాన్ని తనకుమా రునకు వప్పగించినట్లే; తండ్రి తన యావదాస్తినీ కుమారునకు యిచ్చేవాడు.

కాని కొత్తగా కనుపెట్టిన ఎర్ర ఇండియనుల ప్రపంచ లోని ఆచారాలన్నీ వేరేవిధంగా వుండేవి. కొన్ని తెగలలో తండ్రికి తన బిడ్డలమీద యెట్టి అధికారమూ ఉండేదికాదు. "పొడుగు యిండ్లలో" సర్వాధికారమూ తల్లి వహించేది. పిల్లలు ఆమె చెప్పుచేతల్లో నుండేవారు. ఐరోపాలో కొడుకు లెప్పుడూ పుట్టినింటిలోనే వుండేవారు. ఆడపిల్లలు పెండ్లిండ్లుచేసు కొని వెళ్ళిపోయేవారు. ఈ ఎర్ర ఇండియనుల దేశంలో మొగ

వాడు తన యింటికి తన భార్యను తీసుకువచ్చేబదులు, ఆడది పెండ్లాడి తన ఇంటికి మొగుణ్ణి తెచ్చుకొనేది. ఆ దేశానికి వెళ్ళిన నొక ప్రయాణీకుని గ్రంథంలో ఇట్లు వ్రాసియున్నది :

"స్త్రీలు, గృహకృత్యాలన్నిటినీ, సర్వాధికారం వహించి నిర్వహిస్తారు. ఆహారపదార్థాలన్నీ దాచిపెట్టి నలుగురూ చేరి యుపయోగించుకొంటారు. ఏ మొగవాడైనా తగినంత ఆహార పదార్థాలు తేలేకపోతే వాడిబ్రతుకు బహు కష్టమయ్యేది. వానికెందరు పిల్లలున్నా, ఆయింట్లో వాని వస్తువు లెన్నియున్నప్పటికీ వాడిని తరిమివేసేది అతనిభార్య. ఆమె మాటకెదురు తిరుగుతే లాభించేదికాదు యేమాత్రమూ. ఏమేనత్తో, అమ్మమ్మో ఆతని వెనుక వేసుకు వస్తేనేతప్ప ఒక్క దణ్ణంపెట్టి తిరిగి తన స్వంత జాతి జనులదగ్గరకు వెళ్ళాలి. లేదా ఇంకో జాతి స్త్రీని పెండ్లాడాలి. స్త్రీలకుండే అధికారం చాలా గొప్పది. మార్గదర్శకుని "కొమ్ములు విరుగకొట్టి మూలకూర్చోబెట్టడా" నికీ వారికుండేశక్తి యెంత గొప్పదో, అటువంటి వాక్యం వారి భాషలో నుండడాన్నిబట్టే గ్రహించవచ్చు. మార్గదర్శకుని కొత్తగా యెన్నుకోడంలో స్త్రీలకుండే పలుకుబడి అపారమైంది."

పాత ప్రపంచంలో స్త్రీలందరూ తమ పురుషులకు లోకువగా వుండేవారు. ఈ ఇండియనులలో ఇంటికంతా పెద్దగా స్త్రీ యుండేది. ఒక్కొకసారి జాతి పెద్దగా స్త్రీలనే యెన్నుకొనేవారు. పుష్కిన్ అనే రష్యను గ్రంథకర్త చెప్పిన ఈ విచిత్ర విషయం ఈ సందర్భంలో జ్ఞాపకంవస్తోంది. "జాన్ టానర్" అనే అమెరికనువాడు ఇండియనులకు స్నేహమయ్యాడు.

"నైయట్-నో-కూవా" అనే ఇండియను స్త్రీ ఆతని పెంచు కొన్నది. ఆమె అట్టావాజాతి ప్రజల "మార్గదర్శకురాలు." అంటే ఆజాతి పెద్ద. ఆమె పడవపై ఎప్పుడూ ఒకపతాకం ఎగు రుతూ యుండేది. ఆంగ్ల దేశ తీరాల కాపడవ వచ్చినప్పుడల్లా, గౌరవసూచకంగా ఫిరంగులు ప్రయోగించేవారు ఆంగ్లేయులు. ఆమెను చూస్తే ఇండియనులకూ, తెల్లజాతులకూకూడా యెంతో గౌరవముండేది.

అట్టి పరిస్థితుల్లో, జనులు తమ వారసత్వ హక్కులను తల్లులద్వారా పొందటం సహజంగా వుండేది. యిరోపాలో తండ్రి నుండి ఆతని పిల్లలపేర్లు వస్తే, ఇండియనులలో వారి తల్లి పేరు నుండి వచ్చేవి. అంటే 'అవధానిగారి అబ్బాయి' అనేబదులు 'కామాక్షమ్మగారి అబ్బాయి' అన్నట్లు. తండ్రి "జింక" జాతి వాడూ, తల్లి "ఎలుగుబంటి" జాతిదీ అయితే పిల్లలంతా "యెలుగుబంటి" జాతివారయ్యేవారు. ప్రతిజాతిలో స్త్రీలూ, వారి కుమార్తెలూ, వారి పిల్లలూ, కుమార్తెల పిల్లల పిల్లలూ యీవిధంగా వుండేవారు మొగవాళ్ళంతా పెండ్లిండ్లు చేసు కొని తమ భార్యలతో కాపురాలకు వెళ్ళిపోయేవారు. ఇవేవీ యూరపియనులకు అర్థముకాలేదు. ఇండియనులు కేవలం అనా గరికులనుకొన్నారు. తమ దేశంలోనూ, పూర్వం విల్లంబులూ, పురాతన పడవలూ, నాగళ్ళూ ఉపయోగించే రోజుల్లో అట్టి ఆచారాలే ఉండేవనేసంగతి వారికి జ్ఞప్తికి వచ్చిందికాదు.

"జాతిపెద్ద" అంటే యిరోపియనులు అతను యేరాజో, జమీందారో అనుకొనేవారు. అది ఒక పెద్దబిరుదని వారి తలంపు. పెద్దలసంఘాన్ని తమ దేశాల్లో వుండే శాసనసభ

మాదిరీ, ఆసంఘం పెద్దని రాజనీ వారు భావించుకొన్నారు. ఏదైనా సైన్యాని కధిపతిని ఆసైనికులందరికీ వాడు రాజు అన్న ట్లుంది వారి ఉద్దేశం.

ఈవిధంగా యెంతో కాలంవరకూ ఐరోపియనులు, అమెరికను ఇండియనుల ఆచార వ్యవహారాలు గ్రహించుకో లేకపోయారు. మార్గన్ అనే ఒక అమెరికను శాస్త్రజ్ఞుడు "పురాతన సంఘాలు" అనే ఒక గ్రంథం వ్రాశాడు. దానిలో ఇరోకాయ్, ఏజ్ టెక్ ఇండియనుల సంఘాచారాలను విశదీ కరించి, ప్రస్తుత ఐరోపియను జాతుల పూర్వీకులకూ అట్టివే ఆచారాలుండేవని నిరూపించాడు. ఎఱ్ఱయిండియనుల ఆచారా లనే, నాగరికత చెందిన యిప్పటి జనుల పూర్వీకులందరూ అవ లంబించేవారని మనం గ్రహించుకోవాలి.

మార్గన్ తన పుస్తకాన్ని 1877 సంవత్సరంలోగాని వ్రాశాడుకాదు. కాబట్టే అంతకుపూర్వం అమెరికాకు వెళ్ళిన ఐరోపియను జాతులందరూ, ఇండియను ప్రజలను సరిగా అర్థం చేసుకోలేకపోయారు. అదేమాదిరి ఇండియనులూ, తమ దేశా నికి వచ్చిన తెల్లజాతుల పద్ధతులను గ్రహించుకోలేకపోయారు. కొంచెం బంగారంకొరకు తెల్లజాతివారు, ఒకరినొకరు ఎందుకు పోడుచుకొని చంపుకొంటారో అమెరికా ఇండియనులకు అర్థ మయిందికాదు. "అన్యదేశాల జయించట" మంటే యేమిటో వారికేమాత్రం తెలిసేదికాదు. ప్రతిజాతికీ ఉండే భూమిని ఆ జాతి పితృదేవతలు సంరక్షిస్తారు; ఆజాతి ప్రజలందరియొక్క ఉమ్మడి ఆస్తీ, యీభూమి. ఎవరన్నా యింకోజాతి ప్రజల భూమిని బలాత్కారంగా తీసుకొంటే పితృదేవతల ఆగ్రహానికీ,

కఠినశిక్షకూ వారు గురి అవుతారు; ఇట్టి ఉద్దేశాలు ఇండియనుల కుండేవి.

ఇండియనులూ యుద్ధాలు చేసేవారు. కాని శత్రువుల జయిస్తే వారి అధికారిని ఉద్యోగంనుండి తొలగించటమూ, ఓడిపోయినవారందరినీ బానిసలుగా చేయటమూ, వారంతా తమ మాదిరే జీవించటమూ అనేటట్టి పనులేవీ వారు చేసేవారు కాదు. తగిన ద్రవ్యమిచ్చి, ఓడిపోయినవారు తమజాతి పెద్దను తిరిగి గెలిచినవారినుండి తెచ్చుకొనేవారు. అతనిని ఆ పదవి నుండి తొలగించడానికి ఆ జాతి ప్రజలకేతప్ప వేరెవరికీ యెట్టి అధికార ముండేదికాదు.

ఈ విధంగా రెండు ప్రపంచకాలు, రెండు వేర్వేరు జీవిత విధానాలు ఒకదాన్నొకటి గ్రహించుకోలేకపోయాయి. వాని మధ్య ఎన్నో కలహాలు జరిగాయి. అమెరికాను కనిపెట్టిన మొదటి సంవత్సరాలన్నీ యిట్టి కలహాలతో నిండిపోయాయి. వానిమూలంగా దేశీయప్రజల కెంతో అన్యాయం జరిగింది; వారెందరో నశించిపోయారు. దీని కుదాహరణగా స్పెయిను దేశీయులు మెక్సికోను జయించిన గాథ యిచ్చట వివరించుదాం.

మెక్సికోను జయించుట

1519 సంవత్సరంలో పదకొండుపడవలు మెక్సికోతీరాన ఆగాయి. ఒక్కొక్కదానికీ మూడేసి తెరచాపలూ, వానినిండా ఫిరంగులూ, ఈటెలూ, లోహపు శిరోకవచాలూ ఉన్నాయి. ఒకపడవ తెరచాపచివర స్పెయినుదేశపు పతాకం మెరుస్తోంది. ఆ పడవ టాపుమీద మాంచి విశాలవక్షమూ పొడుగు గడ్డమూగల మనిషొకడు నిలబడియున్నాడు. నుదురుమీదికి

దిగినట్లోపీ అతని కండ్లను సగం కప్పినట్లుంది. దూరానికి పడవలు రావటంతోనే సముద్రతీరానికి చూడడానికి వచ్చిన ఇండియను లనూ, ఆ తీరప్రదేశాన్ని అతను తదేకదృష్టితో చూస్తూ నిల బడ్డాడు.

అతని పేరు హర్నాండో కార్టెజ్; స్పెయిను దేశస్థుడు. స్పెయిను దొరతనమువారు అతనిని తమ నావికాదళంనుండి తరిమివేసారు. అతని నడవడిక బాగుండకపోవటంచేత, అయి నప్పటికీ ఏవో కొన్ని పడవల చేర్చి, స్పెయిను దేశంపేరిట మెక్సికోను ఆక్రమించుకోవాలనే ఉద్దేశంతో కార్టెజ్ వచ్చాడు. ఆ పడవలలోని వారందరికీ యితనంటే యెంతో భయం! అతని మాట కెదురాడేవారుకాదు.

నెమ్మదిగా పడవలన్నిటికీ లంగరువేసారు. వచ్చేదారిలో లంకల్లోని కొందరు ఇండియను ప్రజలను పట్టుకొని తమ బానిస లుగా చేసుకొన్నారు ఈ స్పెయినువారు. ఆ బానిసలు జాగ్ర త్తగా పడవలనుండి పెద్ద ఫిరంగులనూ, ఫిరంగి బండ్లనూ, తూటాల కట్టలనూ చిన్నపడవలలోకి యెక్కించారు. సకిలిస్తూ పడవల్లోకి దిగడానికి తెగ బెదిరిపోయే గుఱ్ఱాలను యెన్నో తిప్పలుపడి చిన్న దోనెల్లోకి నడిపించారు.

ఏవో నీటిపై తేలే ఇండ్లమాదిరిగా, ఆ పడవలన్నీ ఇండియనులకు కనుపించాయి. అంతమంది జనులూ, వస్తు వులూ, మృగాలూ వాటినుండీ దిగుతోంటే వారి కాశ్చర్యం కలిగింది. తెల్లగా పాలిపోయినట్లున్న శరీరాలూ, ఎక్కడా శరీరమే కనుపించకుండా తొడుగుకొన్న వారి దుస్తులూ, విచిత్రపు టాయుధాలూ ఇండియనులకు వింతగా కనుపించాయి.

సకిలిస్తూ, మెడల నెగురవేస్తూ, తోకల నిటూ, అటూ తెగ ఆడిస్తూన్న గుర్రాలు వారికి మరీ ఆశ్చర్యం కలిగించాయి. అట్టి జంతువులను వారిదివరకెన్నడూ చూడలా.

ఈ తెల్లజాతివారు వచ్చిన సంగతి వెంటనే అన్ని చోట్లకూ ప్రాకిపోయింది. దూరపు గ్రామాలకూ, కొండ లోయల్లోని ఊళ్ళకూ ఈ సంగతి తెలిసింది. ఎత్తైన కొండ గోడల వెనుక ఆజ్ టెక్కులనే ఇండియను జాతి వారొకరు కనుపిస్తున్నారు ఆ మెక్సికోలో. వారి పట్టణా లన్నిటిలోనూ టినాక్ టిట్లాన్ అనేది పెద్దది. ఒకసరస్సుమధ్య నిర్మించబడి, గట్లమీదికి రావడానికి వంతెన లుండేవి. దూరానికే ఆ పట్టణపు గోడలు తెల్లగానూ, గుడిగోపురాల బంగారు రేకులు మెరిసిపోతూనూ కనుపించేవి. అన్నిటికన్నా పెద్దగృహంలో ఈ ఆజ్ టెక్కు జాతి సైన్యాధిపతి మాంటెజూమా నివసిస్తున్నాడు.

తెల్లవారు వచ్చారని వినగానే తనజాతి పెద్దలందరినీ ఏమిచేయాలో ఆలోచించడానికని పిలిపించాడు. అసలు వా రెందుకు తమదేశానికి వచ్చారో, వారి కేమికావాల్లో కూడా వారికి తెలియలా. సరిగ్గా నలుగురూ అనుకొనే మాటలను బట్టి తెల్లజాతివారికి బంగారమంటే చాలా ఇష్టమని వారికి తెలిసింది. కాబట్టి బంగారపువస్తువులు వారికి బహుమతిగా పంపించి, వచ్చినదారినే వెళ్ళమని కబురు పంపాలని, ఆ జాతి పెద్దలంతా నిశ్చయించారు.

బండిచక్రాలంత పెద్ద బంగారపు చక్రాలూ, బంగారు నగలూ, మనుష్యులూ, జంతువుల బంగారపు విగ్రహాలూ,

ఇట్లా యెన్నో వస్తువులు తీసుకొని జనులు వెళ్ళారు. అదే వారు చేసిన గొప్ప పొరబాటు. బంగారం చూచే కొలదీ తెల్లవారికి అంతులేని ఆశ పుట్టుతుందనీ, ఆ బంగారం కొరకు వారెంతటికైనా సాహసిస్తారనీ ఇండియనులకు తెలియదు. తమ జీవితాచారాలకూ, నాగరికతకూ, తెల్లవారి నాగరితకూ భేదమున్నదని వారు కలలోకూడా అనుకోలా. అట్లా బంగారువస్తువులు కానుకలిచ్చే బదులు జాగ్రత్తగా వానినన్నిటినీ యెక్కడన్నా పూడ్చిపెడితే యెంతో బాగుండేది. ఆ బంగారు వస్తువుల చూచీ చూడటంతోనే, స్పెయినువారికి ఒక విధమైన "బంగారపిచ్చి" యెత్తింది. తమదేశాన్ని వదలి వెళ్ళిపొమ్మని ఇండియను లెంత బ్రతిమాలినా వారు వినలా. ఆజ్టెక్కులు తమ పట్టణాల సమీపించటం చాలా కష్టమనీ, కొండలమీద ప్రయాణం చాలా ప్రమాదకరమనీ భయపెట్టయత్నించారు. అది లాభించిందికాదు.

ఇంతకుముందు మెక్సికోలో బంగారం దొరుకుతుందని స్పెయిను దేశీయులు విన్నారేకాని, ఇంత యెక్కువగా ఉంటుందని వారెన్నడూ అనుకోలేదు. ఒక్కసారిగా మెక్సికో బంగారాన్నంతా తమస్వాధీనం చేసుకోవాలనే ఆశను వారు అణచుకోలేకపోయారు. తిరిగీ తమ దేశానికి వెళ్ళమని ఆజ్టెక్కులు ప్రార్థిస్తూంటే వారికి నవ్వువచ్చింది. అంతకంటె వెఱ్ఱితనం యింకొకటుండదనిపించింది. వారెన్ని యిబ్బందులుపడి యీ మెక్సికోకి వచ్చారో భగవంతుడికే తెలియాలి. గట్టి కొండ రాళ్ళపై నడకా, సరిగా తలయెత్తి నిలబడడానికైనా చాలని యిరుకుగదుల్లో తమ పడవల్లో పడుకోటమూ, తుపానులకు

పడవలు విరిగి చెదరి మునిగిపోకుండా యెప్పటికప్పుడు గజగజ వణుకుతూ తెరచాప కొయ్యలపై కెక్కి బిగించటమూ, కట్ట టమూ - యీ కష్టాలన్నీ భరించి చివరకు చేయిజాచితే బంగారం అందే సమయం వచ్చినప్పుడు దాన్ని విడచివెళ్ళట మంత వెఱ్ఱిబాగులతనం వారి కింకొకటి స్ఫురించిదికాదు.

కార్టెజ్ తన జనులందరినీ ప్రయాణానికి సిద్ధపరచాడు. బానిసల వీపులమీద పెద్ద మూటలెత్తారు; ఆయుధాలు పేర్చారు. వానిని మోసుకొని, వంచిన తల లెత్తకుండా కొండ దారివెంబడి వారు నెడుతూంటే ఏవో బరువులమోసే జంతు వులమాదిరగుపించారు. కొంచెం నెమ్మదిగా నడచినా ఆగినా వెంటనే స్పెయిను సిపాయిలు వాళ్ళని తమ వాడికత్తి మొన లతో గుచ్చి ముందుకు తోలేవారు. ఎదురు తిరిగిన వారిని తలలు పగిలి చనిపోయేటట్లు కొట్టేవారు. ఈ ప్రయాణాన్ని యెవరో గొప్ప ఆజ్ టెక్కు చిత్రకారుడు ఆరోజుల్లో చిత్రిం చాడు. ఆ చిత్రంలో పెద్ద మూటలు మోసుకుపోయే జనులు మూడు బాటలపొడుగునా ఉన్నారు. పెద్దఫిరంగీ, బండిచక్రా న్నొకడూ, తుపాకులకట్ట నింకొకడూ, ఏవేవో వస్తువుల పెద్ద పెట్టెనింకొకడూ మోసుకుపోతున్నారు. స్పెయిను ఉద్యో గొకడు ఒక బానిస జుట్టును చేతబట్టుకొని రెండోచేతితో గద నెత్తి వానిని కొట్టబోయేటట్లు బెదరిస్తున్నాడు. ప్రక్కనున్న యొక కొండమీద యేసుక్రీస్తు త్యాగచిహ్నమైన శిలువ నాట బడియున్నది. తామెంతో యోగ్యులైనవారనీ, నిజమైన క్రైస్తవులనేభావం వారిలో పూర్తిగాఉండేది. అందుకనే ప్రతిచోటుకూ తమతో శిలువను తీసుకువెళ్ళేవారు. నేలమీద

యెక్కడ చూచినా నరికివేయబడిన కాళ్ళూ, చేతులూ, తలలూ ఉన్నాయి ఆ పటంలో. అట్టి పరిస్థితులలో స్పెయిను జనులు తమ ప్రయాణం సాగించారు.

వెళ్ళగా వెళ్ళగా ఒక కొండకనుమను చేరారు. అక్కడనుండి చూస్తే దూరాన చక్కని సరోవరమూ, దాని మధ్య అందమైన యొక పట్టణమూ కనుపించాయి వారికి. ఆజ్ టెక్కులు ఎట్టి తిరుగుబాటూ చేయలేదు. వచ్చిన స్పెయిను ప్రజ నిరాటంకంగా ఆజ్ టెక్కులపట్టణం ప్రవేశించారు. వెళ్ళీ వెళ్ళడంతోనే మాంటెజూమాను చెరబట్టారు. అతనే వారందరకూ రాజని వారనుకొని అతనిని బంధించారు. కార్టెజు, అతన్ని పిలిపించి స్పెయినురాజు క్రింద తానొక సామంతరాజుగా వుంటానని వాగ్దానం పుచ్చుకొన్నాడు. రాజులూ, చక్రవర్తులూ, సామంతరాజులూ అంటే యేమిటో యేమాత్రమూ తెలియని మాంటెజూమా స్పెయినువారు చెప్పిన షరతులన్నీ చిలుకపలుకుల్లాగా పలికాడు. కార్టెజు కమితసంతోషం కలిగింది. మాంటెజూమా మెక్సికో దేశానికంతటికీ రాజనీ, అతను తన వశం కావటంచేత ఆ దేశం యావత్తూ తాను జయించాననీ కార్టెజు అనుకొన్నాడేకాని, మాంటెజూమా కేవలం యొక సేనాని మాత్రమేనని అతడు తెలుసుకోలేకపోయాడు. తన దేశాన్ని ఇతరులకు నప్పగించడానికి కాతని కెట్టియధికారమూ లేదని కార్టెజుకు తెలియదు.

తన మిథ్యావిజయానికి కార్టెజు సంతోషపడుతూంటే ఆజ్ టెక్కులు మాంటెజూమా తమ్ముని తమ సేనానిగా యెన్నుకొన్నారు. వెంటనే అతను జాతీయులందరినీ చేర్చి స్పెయిను

ప్రజలున్న పెద్ద ఇంటిని ముట్టడించమని ఆజ్ఞాపించాడు. స్పెయిను వారు ఫిరంగులూ, తుపాకులూ ప్రయోగిస్తే, ఆజ్ టెక్కులు తమ విల్లులనుండి బాణాలనూ, రాళ్ళనూ వారిపై వదిలారు. ఆకొత్త మారణయంత్రాలముందు నిలువలేక ఎందరో ఆజ్ టెక్కులు నశించారు. కాని తమ స్వాతంత్ర్యస్థాపనకు పోరాడటం చేత మితిలేని ఆవేశంతో ఒక్కడు నేలకూలితే వెంటనే పదిమంది ఆస్థానాని కురికారు. తమజాతి గౌరవస్వాతంత్ర్యాలునిలుపడానికి ప్రాణత్యాగం చేయడానికి వారెవరూ వెనుకాడారుకారు.

కార్టెజు అనుకొన్నట్లు యేదీ జరిగిందికాదు. ఆజ్ టెక్కులు ఎందరు నష్టమొందినా వెనుకంజ వేయక పోరాడుతూనే యున్నారు. మాంటెజూమాను పిలిపించి అతనిచేత పోరు నిలుపవలెనని ఆజ్ టెక్కులకు చెప్పించాలనుకొన్నాడు. వారు తప్పక ఆతనిమాట వింటారనే గట్టినమ్మకం ఆతనికున్నది. గొలుసులు విప్పి మాంటెజూమాను ఇంటి డాబామీదకు ఎక్కించారు స్పెయినువారు. అతనిని చూడటంతోటే ఆజ్ టెక్కులకు ఎక్కడలేని కోపమూ వచ్చింది. రాళ్ళూ, బాణాలూ అతనిపై లెక్కలేనన్ని విసరారు. "అప్రయోజకుడు! పిరికి పంద? ఆడది! ఇంట్లో కూర్చొని నూలు వడుకో! వాళ్ళ చేతుల్లో చిక్కి తిరిగి ఏ ముఖం పెట్టుకొని మమ్మల్ని చూస్తావు" అని ఇష్టంవచ్చినట్లల్లా అతన్ని నిందించారు. గొప్ప దెబ్బలు తగిలి మాంటెజూమా క్రింద పడిపోయాడు.

స్పెయిను జను లెందరో నశించారు. మిగిలినవారితో యెట్లాగో కార్టెజు తప్పించుకుపోయాడు. వారి అదృష్టంకొద్దీ ఆజ్ టెక్కులు వారిని తరమకుండా విడిచిపెట్టారు. కార్టెజ్

కొంతకాలానికి తిరిగి పెద్ద సైన్యంతో వచ్చి, జెనాక్ టిట్లాన్ పట్టణాన్ని ముట్టడించాడు. కొన్ని నెలలపాటు ఆజ్ టెక్కులు వారితో పోరాడి, చివరకు ఓడిపోయారు. ఫిరంగి గుండ్లకు రాళ్ళూ, బాణాలూ ఎట్లా సాటికాగలవు? పాపం! వారి పట్ట ణాన్ని పూర్తిగా దోచివేశారు స్పెయినువారు.

పురాతన నాగరిక ప్రజలు నవనాగరికుల ఫిరంగులూ, తుపాకులూ, మితిలేని సామ్రాజ్య కాంక్షా, బంగారు పిచ్చుల ముందు నిలువలేకపోయారు. ఒకప్పుడు బంగారు నగలూ, వస్తువులతో తూగిన ఆజ్ టెక్కు జనులు యీ రోజుల్లో తెల్ల జాతివారి తోటల్లో నవుకర్లుగా పనిచేసి అర్ధాకలి జీవితాలు గడుపుతున్నారు.



# ప్రాణమున్న పనిముట్లు

## వేయి ఆమడల చెప్పులు

గత శతాబ్దంలో ఒకవిచిత్ర గ్రంథాన్ని లిఖించాడొక గ్రంథకర్త. ఆ కథలో ఒకడు సాధారణ చెప్పులకు మారుగా, వేయి ఆమడల చెప్పులు పొరబడి కొనుక్కొన్నట్లు చెప్తాడు. ఆ మనిషి కొంచెం పరధ్యానం కలవాడేమో, మొదట్లో తన కొత్త చెప్పుల శక్తిసామర్థ్యాలు అతనికి తెలిశాయి కావు. షాపు నుండి యింటికి బయలుదేరాడు. కొత్త బూట్సులు ధరించి, ఏవేవో సంసార తాపత్రయపు టాలోచనలలో తానెచ్చటకు పోతున్నాడో అతనికి తెలిసింది కాదు. ఉన్నట్లుండి గజగజ వణుకు పుట్టిం దతనికి. 'ఏమిటీ చలి?' అని నల్దిక్కులా చూచాడు; అక్కడ తెల్లని మంచుగడ్డలు గడ్డలుగా పేరుకొని కనుపించింది. ఆకాశంలో క్రిందుగా ఎఱ్ఱగా, కాంతి విహీనంగా సూర్యుడగుపించాడు. ఆతనికి తెలియకుండానే ఆ కొత్త వేయి ఆమడ చెప్పులతన్ని ఉత్తరధ్రువప్రాంతాలకు తీసుకొని పోయాయి.

# మొట్టమొదటి యంత్రం



ఎద్దులు నాగలి యీడ్చుకొంటూ పోయేవి. పూర్వం మనుజులు దున్నగలిగినదానికన్న ఎక్కువ నేలను ఎక్కువలోతుగా దున్నేవి.

అటువంటి బూట్సులే కనుక మనకు దొరికితేనో! అబ్బ! యెంత డబ్బు సంపాదిస్తామో! కాని మన కథానాయకులకు ద్రవ్యంకన్న శాస్త్రపరిశోధనలంటే యెంతో యెక్కువయిష్టము. అందుకని భూలోకపర్యటనం ప్రారంభించాడు. ఆ బూట్సుల సహాయంచేత ఉత్తరంనుండి దక్షిణ చివరకూ, దక్షిణాన్నుండి ఉత్తరానికి భూమంతా తిరిగాడు. సైబీరియా మంచు ఎడారులలో చలికాలపు చలిభరించలేక ఆఫ్రికా ఖండపు వేడి యెడారులకు వెళ్ళాడు. తూర్పుగోళమంతా చీకటిపడితే వెలుతురు కొరకని పడమర భాగానికి వెళ్ళాడు. ఆస్ట్రేలియానుండి ఆసియాకూ, ఆసియానుండి అమెరికాకూ తిరిగి చిత్రవిచిత్ర వస్తువుల నెన్ని టినో సేకరించాడు. సముద్రంలోవుండే ఒక లంకనుండి యింకో దానికి అడుగులుపెట్టి దాటివెళ్ళాడు.

కొండ శిఖరాలపై ఎత్తెత్తి కాళ్లుంచి అగ్నిజ్వాలలూదే నిప్పుకొండలూ, మంచుటోపీల ధరించిన యెత్తుశిఖరాలూ దాటిపోయాడు. ఇక్కడ వింత వింత ఖనిజాలూ, అచ్చట విచిత్ర గడ్డిజాతులూ ప్రోవుచేశాడు. పురాతన గృహులూ, గోపురాలూ, గుహాలూ చొచ్చి భూలోకాన్నీ, అందుండే ప్రతిదాన్నీ పరీక్షించాడు. ఈ తీరుగా ఎంతో చమత్కారంగా ఆ కథంతా వ్రాయబడింది.

మానవుని యీ విజయగాథను పరిశీలించడానికని మనమూ వేయి ఆమడ బూడ్సులు తొడుగుకొని తిరిగాము. ఒక ఖండంనుండి ఇంకోదానికీ, ఒక యుగంనుంచి ఇంకోయుగానికీ మనం దాటుతూపోయి మానవజీవితం యెట్టెట్టి మార్పులు చెందిందో చూచాము. మానవజీవితమేకాక, చెట్లు చేమలూ,

జంతువులూ కూడా ఏ విధంగా మారాయో తెలుసుకొన్నాం. అదే మాదిరి భాషా, పనిముట్లూ, మతాభిప్రాయాలూ, రాజ్యాలూ ఏ యే విధంగా మారుతూ వృద్ధిచెందేయో గ్రహించాము ఇదంతా మన వేయిఆమడ బూడ్సులమూలానే వీలయింది. కాని సాధారణబూడ్సులు తొడుగుకొంటేవీలయ్యేది కాదు. తాను వృద్ధిజెందేకొలదీ మానవుడు తన పనిముట్లనూ, శాస్త్రాలనూ, భాషనూ, మతాభిప్రాయాలనూ మార్చుకొంటూ తన నాగరికత కనుగుణ్యంగా వృద్ధిచేసుకొన్నాడు.

వెనుకటిభాగంలో కార్టెజు అమెరికాకు వెళ్ళిన విషయాన్ని గురించి తెలుసుకొన్నాము. మనది ఇరువదవ శతాబ్దమని నీకు తెలుసుగా? సరే, మూడూ, నాల్గవ శతాబ్దాల్లో యూరపుఖండమందలి మానవజీవితం యేలాగుండేదో చూడబోదాము.

ఆజ్ టెక్కులమాదిరే వారి జీవితమంతా యుండేది. వారూ "పొడుగు గృహాల్లో" నివసించేవారు. ఇంటి అధికారం యావత్తూ స్త్రీలచేతుల్లో వుండేది. ప్రతివారూ స్త్రీని గౌరవించేవారు. ఆమె యుద్దేశాలప్రకారం నడచుకొనేవారు. చలికాలానికి కావలసిన ఆహారపదార్థాలు దాచటమూ, నేలను త్రవ్వి మొక్కలు పెంచటమూ, పైరుపంటలు పండించటమూ ఆమెవంతు. మొగవాడికన్నా యెక్కువగా పనిచేసేది; ఎక్కువ కష్టపడేది. ఆ రోజుల్లో ప్రతి ఇంటిలో ఎముకతోనో లేక రాతితోనో చేసిన "తల్లి" విగ్రహం ఒకటుండేది. ఆ మాతృదేవతను జనులారాధించేవారు. తమకు కావలసిన అన్నవస్త్రాలిచ్చి, ఎట్టి కష్టములూ రాకుండా కాపాడాలని వారామెకు

మొక్కేవారు. క్రమంగా యీ మాతృదేవత, నగర సంరక్షక దైవంగా మారిపోయింది. ఆమెకు "ఎతీనా" అని పేరుపెట్టారు. గ్రీసు దేశంలోనున్న ఏతెన్సు పట్టణానికీ పేరు "ఎతీనా" నుండే వచ్చింది. ప్రతియింటావుండే చిన్నవిగ్రహంమారి యీఏతెన్సు నగరంలో బ్రహ్మాండమైన విగ్రహంగా వెలిసింది. చేతిలో యీటె పట్టుకొని తన ప్రజ కెట్టి ఆపత్తులూ రాకుండా ఆమె కాపాడుతుంది.

పురాతన సంఘాచారాలనూ, ఉద్దేశాలనూ తెలిపే మాట లెన్నో ఇప్పటికీ మనం వాడుతాము. ఎవరన్నా క్రొత్త వాసిని "సోదరా" అనీ, చిన్న పిల్లవాసిని "పుత్రకా" లేక "కుమారా" అనీ అనే అలవాటుంది. జాతి యావత్తూ ఒక్క కుటుంబం మాదిరి వ్యవహరించే పురాతనకాలంలో ఒకరికొకరు "సోదరులు" చిన్నపిల్లలను "కుమారుల"ని పిలిచేవారు. జర్మను భాషలో మేనల్లుడూ, మేనకోడలూ అనే మాటలే ఉన్నాయి. అన్నదమ్ముల బిడ్డలకు ప్రత్యేకపదం లేదు. మొగవారు వివాహము చేసుకొని తమ భార్యల ఇండ్లకు కాపురాలకు వెళ్ళే వారు. అక్కచెల్లెండ్రుమాత్రం పుట్టినింటే యుండేవారు. కాబట్టి ఆడపిల్లలయొక్క బిడ్డలబాంధవ్యం చూపడానికిమాత్రం "మేనల్లు"డనే మాట అవసరమైంది. కుమాళ్ళబిడ్డలు పరాయి వాళ్ళుగా భావించబడేవారు.

క్రమంగా జాతంతా ఒక్కటేననేభావం మారటం మొదలు పెట్టింది ప్రజల్లో. అమెరికాను ఐరోపియనులు జయించటం మూలాన ఆ ఉద్దేశం అమెరికానుండి తొలగిపోయింది. ఐరోపాలో, అమెరికా ఆక్రమణకు కొన్ని వేల ఏండ్లకుపూర్వమే

యీ జాతి ప్రాముఖ్యత నశించింది. స్త్రీలనుండి క్రమంగా ఇంటి నిర్వహణభారం పురుషులు తీసుకోటమే ఈ మార్పుకు కారణం. ఈ మార్పు యెట్లా కలిగిందో గ్రహించుదాము.

స్త్రీలు నేలనున్నటమూ, మొక్కలు మొలిపించడమూ చేస్తే, పురుషులు మందకాపరులుగా వుంటూవుండేవారు. మొదట్లో పశువు లెక్కువగా లేనప్పుడు, పైరుపంటలు పండించే స్త్రీలపని యెంతో ముఖ్యంగా వుండేది. అందరికీ సరిపోయే టన్ని పాలు యెప్పుడూ దొరికేవికావు; మాంసము నెప్పుడో ఒకప్పుడుమాత్రం తినేవారు. స్త్రీలు పంటలు పండించి, ధాన్యం దాచకపోతే ప్రజకు తినడానికేదీ ఉండేదేకాదు. నీటిలో నానవేసిన యిన్ని గింజలో లేక ఓట్సు ధాన్యపు రొట్టెనో తిని యిన్ని నీళ్ళు త్రాగేవారు. అడవి తేనే, పండ్లూ స్త్రీలు వెదకి పట్టుకువచ్చి భోజనసమయానికి అమర్చేవారు. ఈ విధంగా యింటి పనులన్నీ పూర్తిగా స్త్రీల చేతుల్లో వుండబట్టి వారి కెక్కువ అధికారం ఉండేది.

మైదానాల్లో కొన్నిచోట్ల ధాన్యం బాగా పెరిగేది కాదు. గడ్డిమబ్బులు వెట్టిగా పెరిగి ధాన్యానికి తావిచ్చేవే కావు. దుబ్బుమొక్కల వ్రేళ్ళను పెకలించి, పొలము సాగు బడి చేయటం యెంతో కష్టమైపోయింది. ఇద్దరు, ముగ్గురు స్త్రీలు చేరి నాగలిని లాగినా భూమినంత యెక్కువగా దున్న లేక పోయేవారు. లోతులేని ఆ నాగలి చాళ్ళలో పడిన గింజలు యెండకెండేవి; పక్షు లెత్తుకుపోయేవి. మొలచిన కొద్ది మొక్కలూ అక్కడొకటీ, అక్కడొకటీగా మొలిచేవి. వానికే మాత్రం బలం లేకపోవటంచేత యేమంత కొద్ది ఎండ కాచినా అవన్నీ

యెండిపోయేవి. దుబ్బు మొక్కలుమాత్రం యెప్పటియట్లే చక్కగా నిలిచియుండేవి.

పంటకోత కాలంలో పనేయుండేదికాదు. స్త్రీలకు దట్టంగా పెరిగిన గడ్డి, దుబ్బు జొంపాలమధ్య ధాన్యపుకంకు లగుపించేవికావు. తన విజయపతాకం ఎగరవేస్తున్నట్లు దుబ్బు గడ్డి గాలిలో కులాసాగా అలలు అలలుగా ఊగుతూ నిలబడేది. ధాన్యంబదులు, వెన్నెతలలు వేసిన దుబ్బుగడ్డిని చూచి వారికి వ్యవసాయంమీద మోజు తగ్గిపోయింది. అంతకష్టపడీ చివరకు వారి కేప్రయోజనమూ కనుపించిందికాదు.

జనులకు పనికిరాని ఆగడ్డి యీావత్తూ పశువులకు యెంతో యుపయోగపడింది. గొఱ్ఱెలూ, పశువులూ ఆగడ్డి తిని ఎన్నెన్నో తెగబలిసి యీతలీనేవి. వాటిసంఖ్య చూస్తూండగా పెరిగి పోయింది. నడికట్టులో కత్తిని దోపి మొగవారు పశువులనూ, గొఱ్ఱెలనూ మేపడానికి వెళ్లేవారు. కుక్కలు మందకాపరి యుద్యోగములో తమ యజమానికి యెంతో సహాయపడ్డాయి. పాలూ, వెన్నా, ఉన్నీ కావలసినంత దొరికేవి.

ఇంట్లో ధాన్యం తగ్గిపోయినా, కావలసినంత గొఱ్ఱె జున్నూ, రుచ్యమైన మేకమాంసమూ యెప్పుడూ వారి కందుబాటులో నుండేవి. మైదానపు జనుల జీవితంలో మంద కాపరియుద్యోగం యెక్కువ ప్రాముఖ్యత నొందజొచ్చింది. పురుషులే ఆపసిని నిర్వర్తించేవారు.

స్విట్జరులాండ్‌లో ఒక కొండమీాద యెద్దులగట్టి కొయ్య నాగలితో పొలము దున్నుచున్న మనుజుని చిత్రమొకటి కనుపించింది. ఇదెంతో పురాతన చిత్రం, చూడడానికి తమాషాగా

చిన్నపిల్లలెవరో గీచినట్లుం దీచిత్రం. దీన్నిబట్టి మానవులు పూర్వంమాదిరి తామే నాగలిని లాగేస్థితినుండి ఎద్దుల నుపయోగించేపద్ధతికి మారేరని తెలుస్తుంది. తన పనులను తానే చేసుకొనే బదులు తనకు చేసిపెట్టే యంత్రాల నెన్నిటినో మానవు డీరోజుల్లో వుపయోగించుకొంటున్నాడు. రైలు, మోటారు, పిండిమరలు, కుట్టుపని యంత్రాలు మొదలైన వెన్నో ఉన్నాయి. ఇట్టి యంత్రాలలో ఎద్దులచే లాగబడిన నాగలి మొట్టమొదటిదని మనం గ్రహించాలి. ఎద్దు మెడ మీద యెప్పుడైతే కాడినెత్తాడో అప్పుడే తన పనినంతా మూట కట్టి యెద్దునెత్తిన బెట్టగలిగాడు మనుజుడు. అంతకు పూర్వం మాంసమూ, పాలూ, తోళ్ళూ యిచ్చిన పశువులు యికమీద తమ శరీర కష్టఫలాన్నికూడా అతని వశంచేశాయి.

ఎద్దులు నాగలి యీడ్చుకొంటూ పోయేవి. పూర్వం మనుజులు దున్నగలిగినదానికన్న యెక్కువనేలను, ఎక్కువ లోతుగా దున్నేవి. పొలాలన్నీ లోతునాగలి చాళ్ళతో, పెళ్లించబడిన లోతుమట్టితో గింజ నాటడానికి సిద్ధంగావుండేవి. ఎద్దు లాతనిపొలం దున్నేవి. పంటకళ్ళం తొక్కేవి. ధాన్యపు గింజలను ఇంటికి మోసుకువెళ్ళేవి బస్తాల్లో. పశువుల పెంచటం క్రమంగా వృద్ధియైంది. మందకాపరిగావుండే మనిషీ చూస్తూం డగా వ్యవసాయదారుడుగా మారిపోయాడు. ఈ మార్పు మూలంగా మొగవాళ్ళకు పూర్వంకన్న ఎక్కువఅధికారం ఇంటివ్యవహారాల్లో చేజిక్కింది.

స్త్రీలకు ఇప్పటికీ ఇంట్లో చేయవలసిన పను లెన్నో యుండేవి. నూలు వడికి బట్టలు నేయటమూ, పంట తయారయి

నపుడు కోతకోయటమూ, పిల్లల పోషణా, స్త్రీలే చూచుకొనే వారు. పొలాలు దున్ని పండించడమూ, మందల మేపటమూ మొగవారివంతు కావటంమూలాన, స్త్రీలకు యింటి వ్యవహారాల్లో పూర్వమంత బాధ్యతా, అధికారమూ ఉండేవికావు. ముసుపట త చులకనగా మొగవాళ్ళని చూడటమూ, తిట్టటమూ మారిపోయాయి. పురుషులే అప్పుడప్పుడు ఆడవారిని బెదరించి, అదలించడం మొదలుపెట్టారు. పూర్వం, అప్రయోజకుడైన మొగవానిని అతని అత్తలూ, మేనత్తలూ, అమ్మమ్మలూ, ఎవరుపడితే వారే బెదిరించేవారు; ఇంటినుండి నెడల గొట్టేవారు. క్రమంగా ఆ పరిస్థితులు మారిపోయాయి. ఇం కొక ఇంటినుండి వచ్చే యీ క్రొత్తపురుషుని వారంతా గౌరవించటమూ, అతని చెప్పుచేతల్లో వుండటమూ ప్రారంభమైంది. అతన్ని వదలియుండటం దుర్లభమైపోయింది. అతను కష్టపడి సంపాదిస్తేనే గాని వారెవరికీ తినడానికి తిండి యుండేదికాదు.

ఈ విధంగా సనాతన, పురాతనపు టాచారాలు మారటం మొదలైంది. పూర్వం స్త్రీలు తమ మొగుళ్ళను తమతో కాపురాలకు తమయింటికి తీసుకువచ్చేవారు. ఇటుపై తామే తమ భర్తల ఇండ్లకు వెళ్ళి కాపురం చేయటం అలవాటు చేసుకొన్నారు. మొదట్లో స్త్రీలు తమ భర్తలతో కాపురాలకు వెళ్ళటం వారందరకూ వింతగా తోచింది. పురుషునితో వారంతట వారే యిష్టపడి వెళ్ళరనీ, స్త్రీలను బలాత్కారంగా తీసుకొనిపోవాలనీ వారనుకొన్నారు. అందుకని యొక కొత్త ఆచారం వారి కలవాటైంది. రాత్రిపూట పెండ్లి కుమారుడూ, అతని స్నేహితులూ యెవరికీ తెలియకుండా

యీటెలూ, బాకులూ పట్టుకొని కాబోయే పెండ్లికూతురు ఇంటిని సమీపించేవారు. వారిని చూచి కుక్కలు మొరిగేవి; నలుగురూ లేచేవారు. పెండ్లికుమారిత బంధువులంతా ముసలి తాతనుండి నూనూగుమీసాల తమ్ముడివరకూ ప్రతిపురుషుడూ నిద్ర మేల్కొని యీటెల చేబట్టేవారు. మొగవాళ్ళ అరుపులూ, స్త్రీల యేడ్పులూ, కుక్కల మొరుగులూ అంతా పెద్ద గందరగోళంగా వుండేది. అతనివారంతా యెట్టిప్రమాదం రాకుండా పెండ్లికొడుకు చుట్టూ మూగేవారు. పెండ్లికూతురు నెత్తుకొని అతను పరుగెత్తుకు పోయేవాడు.

ఇట్లా పెండ్లికూతురు నెత్తుకుపోవటం పురాతనపు టాచారానికి విరుద్ధంగా బయలుదేరిన ఒక యేర్పాటు. కొన్నియేండ్లు గడిచేటప్పటికి యేదైతే ఆచార విరుద్ధంగా ప్రారంభించిందో, అదే ఒక నూతనాచారంగా మారిపోయింది. కత్తులూ, కటారులూ పట్టుకొని పెండ్లిళ్లవారు పోరాడే బదులు కానుకలూ, కట్నాలూ ఇచ్చి పుచ్చుకోటం ప్రారంభించేశారు. స్త్రీలు, పెండ్లికూతురు వెళ్ళిపోతుందని యేడ్చి, రాగాలు పెట్టేబదులు రాగయుతంగా జాలిగొలిపే పాటలు పాడటం ప్రారంభించారు. చివరకు నలుగురూ కూడి గొప్ప విందుభోజన మారగించేవారు. మొదట్లో తన భర్త యింటికి కాపురానికి వెళ్ళడానికి ప్రతిబాలికా భయపడేది. ప్రతిదీ అతని యిష్టప్రకారం చేయాలి. ఏదన్నా చెప్పుకొందామంటే వినే ఆప్తులెవరూ ఉండరు. అత్త మామలు ఎప్పుడూ తమ అబ్బాయి పక్షమే పలికేవారు. ఏదో జీతం, బత్తెం లేకుండా దొరికిన ఇంటి నవుకరు మాదిరి ఆ అమ్మాయిని చూచేవారు. ఎంతో కష్టపడి



కొంతకాలానికి గ్రామవాసులంతా, తమ మూటా, ముల్లా కట్టుకొని మందలతో దేశమంతా తిరుగుతూ వెళ్ళటం ప్రారంభించారు.

పనిచేసీ, నలుగురికీ సహాయంగావుండి తన తిండీ, బట్టా సంపాదించుకోవలసిన స్థితికి స్త్రీ వచ్చింది. చిట్టచివరకు మాతృవంశ ప్రాముఖ్యత తగ్గిపోయి, జాతియావత్తూ పితృవంశావళిమీద ఆధారం కాజొచ్చింది.

పిల్లలు, పూర్వంమాదిరి తమ తల్లులతోవుండే బదులు తండ్రులతోవుండేవారు. ప్రతివాడికీ జాతీ, స్వకీయమైన పేర్లతో బాటు ఫలానావాని కుమారుడనే నామధేయంకూడా యింకొకటి చేర్చారు. ఆంగ్లంలో 'సన్' అంటే కుమారుడని అర్థం. అందుకనే రాబర్టుసన్, జాన్‌సన్ మొదలైన పేర్లున్నాయి యిప్పటికీ ఆంగ్లంలో. మనలోకూడా జానకి – జనకుని కూతురు – పార్వతి – పర్వతరాజ తనయ – మొదలైన పేర్లు తండ్రియొక్క ప్రాముఖ్యతనే చూపుతాయి. తల్లి పేరిట వచ్చిన నామధేయాలు అరుదు.

## మొదటి దేశద్రిమ్మరులు

మచ్చిక జేసిన పశువుల మందలూ, గొర్రెలూ మనుజునకు కావలసినంత ఆహారపదార్థాల నీయ మొదలిడాయి. ప్రతి బయలుపైనా, మైదానం మీదా వేలకొలదిగా యీజంతువులు మేసేవి పొలాలన్నీ. నేలదున్నే పోలము కాపుల గదమూ యింపులూ, అరుపులతో మారుమ్రోగాయి.

లోయల్లోని తోటలూ, ద్రాక్షతీగలూ రుచ్యమైన పండ్లతో నిండి యుండేవి. సాయంకాలమపుడు సేదదీర్చుకొంటూ మేడిచెట్ల నీడలో నలుగురూ కూర్చునేవారు. కష్టపడి పనిచేస్తేనేకాని వారందరకూ తగినంత ఆహారం దొరికేది

కాదు. కానీ ఎంతకష్టపడితే అంతకంత యెక్కువగా ద్రాక్షా, గోధుమా తయారయ్యేవి.

ఒక్క ద్రాక్షతోటల్లోనే యెంతో పనుండేది వారికి. తెచ్చిన ద్రాక్షగుత్తులన్నిటినీ పెద్దకొయ్యతొట్టిలో వేసి మెత్తగా త్రొక్కేవారు. ఎర్రగా రక్తంలాగా కారే ద్రాక్షరసాన్ని మేక చర్మపు తిత్తులలోపట్టి నింపేవారు. మేకతోలు దుస్తులు తొడుక్కొని ఆ ద్రాక్ష దేవత నభినందించి నృత్యంచేస్తూ జనులు పాడేవారు.

నదీతీరపు నేలల్లో బాగా పంటలు పండేవి. ఏటేటా నదినీరు పొంగి గట్లపైకెగ్రబాకి, పొలాలన్నిటినీ ముంచివేసేది. నీరు తీసినతరువాత మెత్తనివండ్రుమన్ను నేలపై కప్పి యుండేది. ఆ ఎరువుకు పంటలు విశేషించి పండేవి. ఈ పొలాల్లో కూడా మనుజునికి యెన్నో పనులుండేవి చేయడానికి. కాలువలు త్రవ్వి కావలసినచోట నీరు పారునట్లు చేసీ, గట్లువేసీ నీరు వృధాగా కారిపోకుండా ఆపుతూ అతడెంతో కష్టపడే వాడు. తమకు మంచి పంటల నిచ్చినందుకు నదిని శ్లాఘించ డమూ, ప్రార్థించడమూ జనుల కాచారమైంది. వారేవిధం గానూ తోడ్పడి పనిచేయక యూవత్తూ నదికే వదిలితే పండే పంటలెంత బలహీనంగా వుంటాయో, ఎట్లు నేలంతా గడ్డిమయ మవుతుందో వారికి తెలిసికూడా నదీజలాన్ని పావనంగా పూజించేవారు. తమ పంటలు నది పెట్టిన భిక్షమేననే యుద్దేశం వారిలో మారిందికాదు.

రానురాను వ్యావసాయకుని జీవితం కష్టంగా మారినట్లే మందకాపరిబ్రతుకూ మారజొచ్చింది. బాగా గడ్డి దొరికే

మైదానాలమీద మందలు త్వరత్వరగా పెరిగిపోయేవి. అందు మూలాన వారికి కావలసినంత పని యెప్పుడూ యుండేది. ఏవో పదో, పదిహేనో గొఱ్ఱెలను పెంచడానికీ, వేలకొలదిగా మందలను పెంచడానికీ యెట్టిసామ్యమూ లేకపోయింది. ఎంత పెద్ద గడ్డి పొలాలైనా, ఆ మందలకు సరిపోయేవి కావు. అంత గడ్డినీ యిట్టే తినేసేవి జంతువులు. వాని వెనుకనే మందకాపరులు తిరుగుతూ తమ ఇండ్లకు దూరదూరంగా సాగిపోయేవారు.

కొంతకాలానికి గ్రామవాసులంతా, తమ మూటా ముల్లా కట్టుకొని, మందలతో దేశమంతా తిరుగుతూ వెళ్ళటం ప్రారంభించారు. ఒంటెలమీద తమ వస్తువులన్నీ అమర్చి, మందల తోలుతూ ఎక్కడ గడ్డిదొరికితే అక్కడకంతా వెతుకుతూ వెళ్ళేవారు. గడ్డిదుబ్బూ, పనికిరాని మొక్కలూ పెరిగిన బయళ్ళు యెన్నో ఉండేవి. అక్కడంతా వారిమందల కాహారం తగినంత దొరకేదికాదు. అటువంటప్పుడు వ్యవసాయం చేసుకొని జీవించే ప్రజకు తమ గొఱ్ఱెల నిచ్చి, ధాన్యం పుచ్చుకొని, వాని జనాభా తగ్గించుకొనేవారు. ఇట్లా పంటలుపండే గ్రామాల నుండి గ్రామాలకు పోతూ గొఱ్ఱెలూ, పశువులూ, ధాన్యమూ యిచ్చి పుచ్చుకొంటూ, వారు దేశద్రిమ్మరి జీవితాలు గడిపే వారు. నేలదున్ని, గ్రామా లేర్పరుచుకొని నికరంగా జీవించే ప్రజలకన్న వారిది స్వేచ్ఛాజీవితంగా వుండేది. ఆరుబయట, చెట్టుచేమలు లేనిచోట తమ గుడారాలు నిర్మించుకొనేవారు. చుట్టూ చూపుమేరవరకూ కనుపించే పొలమంతా వారియిల్లు. ఒంటెలు నడిచేటపుడు వానిమూపురంమీద మెత్తగా బట్టల్లో పడుకొన్న పసిపిల్లలకు, ఉయ్యాలలో ఊగుతున్నట్లు హాయిగా నిద్రపట్టేది. అదీ వారిజీవితం.

## ప్రాణమున్న పరికరాలు

పంటలు పండే పొలాలకూ, మందలు మేసే మైదానాలకూ వెళ్ళి యీ దేశద్రిమ్మరులు చేతికందినదంతా దోచుకునేవారు. కొండకనుమలనుండి దిగి లోయల్లో వుండే జనులనూ, అరణ్యాల పొలిమేరల వెంబడే వెడుతూ, అచ్చట దారిలోనుండే గ్రామాలనూ దోచుకునేవారు. ధాన్యం యెత్తుకుపోయీ, వారి పశువులనూ, గొఱ్ఱెలనూ తోలుకుపోయీ, పంటలన్నీ తొక్కి పాడుచేసీ చాలానష్టం చేసేవారు. జంతువులనే కాక, మనుష్యులనుకూడా యెత్తుకువెళ్ళేవారు. వారిని బానిసలుగా చేసి, తమ మందలను కాపాడటానికి నియమించేవారు.

వ్యవసాయపు జనులుకూడా వీలైనప్పుడల్లా తమ యిరుగు పొరుగువారిని దోచుకోడానికి యత్నించేవారు. ఆకురాలు కాలానికి పంటలన్నీ కోసేవారు. ధాన్యం దాచేవారు. అటువంటప్పుడు దోపిడీకని జనులు బయలుదేరేవారు. ధాన్యమూ, నగలూ, పనిముట్లూ, బట్టలూ అందినవన్నీ యెత్తుకుపోయేవారు. వీలైనంతమట్టుకు మనుష్యులను చెఱపట్టి బంధించి తీసుకుపోవడానికి చూచేవారు. తమ పొలాల్లో కాలువలు త్రవ్వనూ, కట్టలుపోయనూ, పొలం దున్ననూ వారి కీజనం పనికివచ్చేవారు. వ్యవసాయమూ, పశువులమందలూ యెక్కువగా పెఱుగని మొదటిరోజుల్లో యితర జాతిజనులను బట్టి బానిసలుగా చేసేవారుకారు. ఎందుకంటే, అట్టి బానిసలు యేదో ఆపనీ యీపనీ చేసినా, వారి భోజనానికీ, బట్టకూ చాలా ఖర్చయ్యేది. ఆ రోజుల్లో పాడిపంటలు బలంగా వుండేవి కావు.

వ్యవసాయమూ, పశువులమందలూ యెక్కువగా పెఱగటంచేత తనకు కావలసినదానికంటె యెక్కువ ధాన్యమూ, పాలూ, మాంసమూ, ఉన్నీ ప్రతివాడూ తయారుచేసుకో గలిగేవాడు. అటువంటి పరిస్థితుల్లో బానిస లుపయోగపడేవారు. తనకూ, తన యజమానునకూ కావలసిన వస్తువులన్నీ బానిస వారే పండించగలిగేవారు. క్రమంగా అధికార్ల యొక్క పని తమ బానిసలు ఒళ్ళువంచి పనిచేసేటట్లూ, వీళ్లైనంత కొద్దిగా తినేటట్టూ చూచుకోటంగా మారిపోయింది.

ఈవిధంగా మనుజుడు తన సోదరమానవుని ఆపనీ, ఈపనీ చేసే యొక ప్రాణమున్న పనిముట్టుగా మార్చాడు. తన నవుకరుల వ్యక్తిత్వాన్ని నశింపజేసి, బానిసశృంఖలాలతో వారిని తనకు బంధించుకొన్నాడు. ఎద్దుమెడకు కాడినెత్తి బిగించినట్లే, సోదరమానవునీ యుపయోగించటం ప్రారంభించాడు. నవుకరులు దున్నే పొలాలు వారివికావు. వారు నూర్చే పంటపై వారి కేట్టి హక్కూ ఉండేదికాదు. కష్టమంతా నవుకరులదైతే, కష్టఫలితానికి హక్కుదారుడు యజమానుడై పోయాడు.

## గోరీలు - వాని సందేశమూ

పురాతనకాలంలో మానవజీవితం యెల్లున్నదో గ్రహించడానికి యెన్నోవేల యేండ్ల క్రితపు ప్రపంచానికి మనం పయనమై వెళ్ళాము. ఆ ప్రయాణంలో ఏదో ఒక వ్యూహంలో మాదిరి గుహల్లో చిక్కుబడిపోయాము. లోతుగా త్రవ్వే కాలువలూ, నదీతీరాల ప్రాంతాలలో దారితప్పిపోయాము. మార్గాన్ని సూచించే గుర్తులూ, "ఈ బాట ఫలానా చోటుకు"

అనేసంజ్ఞలూ ఏవీ మన కగుపించాయికావు. అసలు వ్రాతంటే యేమిటో తెలియని పురాతన రాతియుగప్రజలు మన కట్టి గుర్తులూ, సంజ్ఞలూ యేర్పర్చడానికి యెట్లా వీలవుతుంది? మన ప్రయాణంలో కనుపించిన ప్రతి విషయమూ, వస్తువూ యొక గొప్ప సమస్యగా పరిణమించింది.

క్రమంగా ఆదారీ, తెన్నూ లేని బాటలన్నీ వదలి యేదో కొంత నలిగిన కాలిబాటను యిప్పటికి త్రొక్కగలిగాము. చనిపోయినవారి గోరీలమీదా, దేవాలయ గోడలపైనా అప్పటి జనుల వ్రాత మన కగుపిస్తుంది. దీన్ని నిజానికి వ్రాత అనడానికి వీలులేదు. ఎందుకంటే యీ వ్రాతలో అక్షరాలులేవు. ప్రతి చెప్పేవిషయమూ పటాలచేత నిరూపింపబడియుంటుంది. ప్రజలకు కథలూ, ప్రజల జీవిత గాథలూ, అన్నీ బొమ్మల వ్రాతలో లిఖించారు. ఎద్దునుగురించి చెప్పాలంటే ఎద్దుబొమ్మా, చెట్టును గురించి వ్రాయాలంటే ఆకులూ, కొమ్మలతో నిండిన చెట్టు బొమ్మా వ్రాశారు.

వ్రాత ప్రథమంలో బొమ్మ వ్రాతగానే ప్రారంభమైంది. క్రమంగా యీ బొమ్మలు మారిపోయి మన మిప్పు డెరుగున్న అక్షరాలనే గుర్తులు యేర్పడ్డాయి. మన అక్షరాలను చూస్తే అవి యేవేవో బొమ్మలనుండి వచ్చాయనుకోవటం కష్టం. ఆంగ్లంలో మొదటి అక్షరమైన A అనేది యెద్దుతల యొక్క బొమ్మనుండి వచ్చింది. ఈ A ను తలక్రిందుగా త్రిప్పితే ఒక తలా రెండు కొమ్ములూ కనుపిస్తాయి. V యీ విధంగా పూర్వం సిమైట్ జాతిజనుల అక్షరాల్లో యీ రెండుకొమ్ముల తల A అనే అక్షరాన్ని చూపించేది. "Aleph" అంటే వారి భాషలో

"యెద్దు"; మొదటి అక్షరమైన A ను ∀ యీ గుర్తుతో లిఖించే వారు. ఇదేమాదిరి ఆంగ్ల భాషయొక్క ప్రతి అక్షరపు పూర్వ గాథను శాస్త్రజ్ఞులు విచారించి కనుగొన్నారు. "O" అనే అక్షరము "కన్ను"నుండీ, "R" అనేది పొడుగు మెడపైనున్న తలనుండీ. . .యీ విధంగా వచ్చాయి.

యెంతో ప్రయాసమీదగానీ, జనులు వ్రాయటం నేర్చుకోలేకపోయారు. చాలా కొద్ది విషయాలే తెలిసిన పురాతన కాలంలో ఆ విషయాలన్నిటినీ జ్ఞప్తికుంచుకొనేవారు. ఆచారాలూ, కథలూ, గాథలూ తరతరాలవారు, వారి పూర్వీకులనుండి విని తెలుసుకొనేవారు. పెద్దవాళ్ళంతా ఒక విధంగా మాట్లాడే పుస్తకాలమాదిరుండేవారని చెప్పవచ్చు. ఒక్క అక్షరమైనా పొల్లుపోకుండా వారికి తెలిసిన కొద్ది విషయాలూ తమ పిల్లలకు పెద్దవాళ్ళు చెప్పేవారు. పిల్లలు వానిని శ్రద్ధగా వల్లించేవారు.

క్రమంగా వ్రాత కనిపెట్టబడింది. అందుమూలాన జ్ఞాపక శక్తికి, మునుపటంత ప్రయాస తగ్గింది. విషయాలను లిఖించ టము ప్రారంభించారు జనులు. జాతివీరుల సమాధులమీద వారు పోరాడిన యుద్ధాలూ, జయించిన విజయగాథలూ బొమ్మల వ్రాతలో లిఖించేవారు. వచ్చేతరాల జనులీవ్రాత నుండి తమ పూర్వీకుల శక్తిసామర్థ్యాలను తెలుసుకోగలిగే వారు. అన్యజాతులకు రాయబారులను పంపేటపుడు, ముఖ్య విషయాలను, యే చెట్టుబెరడుముక్కమీదో లేక కుండ తునకపైనో బొమ్మల వ్రాతలో గుర్తించి, మరచిపోకుండా

ఉండడాని కాతని చేతి కిచ్చేవారు. భూలోకపు ప్రథమ గ్రంథం గోరీపైనా, ప్రథమాక్షరం చెట్టుబెరడుపైనా వ్రాయబడ్డాయి.

ఈ రోజుల్లో శాస్త్రపరిశోధనల ఫలితంగా మనం చెప్ప దలుచుకొన్న విషయాలు నలుగురికీ అందేటట్టు బహు తేలికగా చెప్పగలుగుతున్నాము. టెలిఫోనూ, రేడియో, గ్రామఫోనూ, టాకీలూ - వీనిమూలాన ఎంతెంత దూరాన్నుండేవాటినైనా వినవచ్చు. ఎవరో యెప్పుడో చెప్పిన మాటలనూ, పాడిన పాటలనూ వినడానికి వీలవుతోంది. ఇప్పటి గ్రామఫోను రికార్డుల పాటలు యింకొక నూరు సంవత్సరాల తరువాతకూడా వినడానికి అవకాశాలున్నాయి. ఇందుమూలాన మనం, మన పూర్వీకులకన్న యెన్నో విధాల ముందంజవేశామని తెలుస్తోంది. కాని యిట్టి నూతన పరికరాలకు పునాది నాటింది మన పూర్వీకులేననేవిషయం మరచిపోరాదు. చెట్టుబెరడుముక్కమీందా గోరీలపైనా బొమ్మల భాషను చిత్రించినపుడే మానవుడు తన ఉద్దేశాలనూ, అనుభవాలనూ రాబోయే తరాలవారి కందుబాటులోవుండే విధానం కనిపెట్టాడు. అసలే యెట్టి యేర్పాటూ లేనపుడు బొమ్మలవ్రాతను కనిపెట్టటం యెంతో గొప్ప విషయమని మనం వప్పుకోవాలి. ఆ బొమ్మల భాషనే క్రమంగా మార్చి, అక్షర లిపిని తరువాత వచ్చిన ప్రజలు కనిపెట్టారు.

కత్తీ, డాలూ పట్టుకొని యుద్ధంచేసే వీరాధివీరుల చరిత్రలెన్నో బొమ్మలరూపంగా అనేకచోట్ల లిఖించబడ్డాయి. విజయమొందినవారు మేళతాళాలతో సగర్వంగా వెడుతూంటే ఓడిపోయిన ఖైదీలు తలలు వంచుకొని దీనంగా వారిని వెంబ

డిస్తారు. వారి చేతులకు తొడగిన సంకెళ్ళూ, బంధించిన గొలుసులూ బానిసవృత్తి యేవిధంగా ప్రారంభించిందో చెప్పక చెబుతాయి యీ పటాల భాషలో.

ఈజిప్టు దేవాలయపు గోడలమీద ఇట్టివే చిత్రాలెన్నో వున్నాయి. ఒకదాంట్లో అనేకమంది బానిసలు వరుసగా నిలబడి ఇల్లుకట్టడానికి ఇటుకరాళ్ళను అందిపుచ్చుకొని ప్రక్కవారి కిస్తూన్నట్లు చిత్రించారు. ఒకని నెత్తిన యిన్ని ఇటుకలతో నిండిన పెట్టెయుంటే, ఇంకొకడు కావిడిలో ఇటుకలు మోసుకవెడుతున్నాడు. తాపీ పనివాళ్ళు గోడలు కట్టుతోంటే మేస్త్రీ యొకడు రాతిపై కూర్చుని పని చేయిస్తున్నాడు. మోకాళ్ళపై చేతులాన్చి, చేతిలో పెద్ద బెత్తమొకటి పట్టుకొన్నాడామేస్త్రీ. తానే ఎట్టిపనీ చేయడు; ఇతరులు కష్టపడి పనిచేసేటట్లు చూడటం అతనిపని. కట్టుతున్న భవనందగ్గర యింకొక అధికారి నిలుచొని, చేతిబెత్తము నెత్తి బానిస నొకని కొట్టబోతున్నాడు. ఆతడేదో తప్పుచేసాడు కాబోలు పాపం!

### బానిస జీవితం

బానిసలపట్టి, అమ్మే బానిస వ్యాపారం అనేక దేశాల్లో బాగా అల్లుకుపోయింది. ఆ రోజుల్లో తియోగ్నిస్ అనే గ్రీసు దేశపు కవి యిట్లా వ్రాసాడు: "గులాబినుండి ఉల్లిపాయలూ, బానిస స్త్రీనుండి స్వాతంత్ర్య వ్యక్తులూ పుట్టరు." మొదట్లో బానిసలను తక్కువజాతి జనంగా యెవరూ భావించేవారు కారు. స్వాతంత్ర్య వ్యక్తులూ, బానిసలూ అంతా కలిసి పని చేసేవారు; జీవించేవారు. ఒక్కొకయింటికి తండ్రి "కులపెద్ద"గా వుండేవాడు. అతని కుమారులూ, వారి భార్యాబిడ్డలూ, బాని

సలూ, వారి సంతానమూ, అందరూ చేరి కులపెద్ద యింట్లో నివసించేవారు. ప్రతివిషయంలోనూ అతని మాటప్రకారం అంతా నడచుకొనేవారు. అవిధేయతకు తండ్రి తన బానిసలను కొట్టి శిక్షించినట్లే తన కుమారులనూ శిక్షించేవాడు. ముసలి బానిసలు చాలాకాలంగా ఆయింటి నవ్కరీలో నున్నవారు. కొత్తగా వచ్చిన కుర్ర యజమానిని "బిడ్డా" అనీ, "కుమారా" అనీ పిలిచేవారు. యజమాని అట్టి వృద్ధబానిసను "తండ్రీ" అనే వాడు. అదీ అప్పటి ఆచారం. కొందరు బానిసలు తమ యజమానునితో సహాపంక్తిని కూర్చుని భుజించేవారుకూడా.

ఇట్టి అన్యోన్యప్రేమా, గౌరవమూ ఉన్నప్పటికీ, బానిస యెప్పటికీ బానిసగానే యుండేవాడు. అంటే అతనికి స్వాతంత్ర్యమనేది ఉండేదికాదు. తన యజమానికిసంతృప్తి కలిగేట్లు యెప్పుడూ అతను నడుచుకోవలసియుండేది. ఇంటిలో నితరులకన్న అతనికే యెక్కువపని యుండేది. ఎప్పుడూ తన యజమానియొక్క ఆస్తిలో బానిసా ఒక భాగమేగాని, స్వతంత్రుడుగా ఎన్నటికీ ఉండేవాడుకాడు. యజమాని చనిపోగానే అతని పశువులూ, పొలాలతోపాటు బానిసలపైనా అతని కుమారునకు వారసత్వపు హక్కు యేర్పడేది.

క్రమంగా పూర్వము యజమానికీ, బానిసలకూ ఉండే అన్యోన్యప్రేమా, గౌరవమూ నశించాయి. పిల్లలందరకూ యజమాని వారితండ్రి. భార్యకు అధికారి ఆమెభర్త. కోడలు తన మామకు వినయ విధేయతలు చూపేది. కొత్తకోడళ్ళు, పెద్ద కోడళ్ళ చెప్పుచేతల్లో వుండేవారు. ఈవిధంగా ఒకరిపై

నౌకరు అధికారం చెలాయించేవారు. అందరికీ లోకువగా ఎవ రేది చెప్పినా చేయవలసినవారుగా బానిసలుండేవారు.

ఒక తెగకూ, యింకో తెగకూ గల సమత్వం క్రమంగా అంతరించింది. ఒకరికి చాలా పశువులుంటే యింకొకరి కుండేవి కావు. వానినిచ్చి యితరులనుండి తమకు కావలసిన వస్తువులను కొనుక్కోడానికి వీలుండేది. మొదటి నాణ్యములు ఎద్దు చర్మం తోనే చేయబడ్డాయి.

బానిసలు, పశువులకన్నా యెక్కువగా అనేకపనుల కుపయోగపడేవారు. పశువులూ, గొఱ్ఱెలూ, పందులూ మొదలైనవానిని కాపాడేవారు; మేపేవాడు. సాయంత్రం కాగానే వానిని దొడ్లలోకి తోలి తాళం వేస్తాడు. పండిన పంటల నూర్చి ఇంటికి తెస్తాడు. ద్రాక్షగుత్తులనుండి రసం పిండటమూ, పాలనుండి వెన్నా, జున్నూ తయారుచేయటమూ అతనే చూచుకొనేవాడు. యజమానుల గాదెలన్నీ పుష్కలంగా ధాన్యంతో నింపేవాడు. సువాసన నూనెలతో పెద్ద జాడీలను నింపియుంచేవాడు. ఇన్నిపనులూ చేయగల బానిసల కోసం తరుచుగా యుద్ధానికి వెళ్ళే సమయాల్లో తమ బానిస లను ఇండ్లదగ్గర వదలి వెళ్ళేవారు. ఆ బానిసలు పాడిపంటలను కాపాడుతూ కాలం గడిపేవారు.

## కో ట ము ట్ట డి

యుద్ధాలు సాగేకొలదీ ప్రజలకు యెక్కువ పని కలిగేది. ఈటెలూ, ఖడ్గాలూ, రథాలూ మొదలైన యుద్ధ పరికరాలు చేయవలసియుండేది! శత్రు ఖడ్గాలనుండి తప్పించుకొను దేహా నికీ, ముఖానికీ లోహపుకవచాలూ, యీటెలు గుచ్చుకో

కుండా ఆపుకోను డాలులూ చేశారు. వారి సిరీ, సంపదా యెక్కువవటంచేత, పూర్వంకన్నా యెక్కువ బందోబస్తుగా ప్రతిజాతివారూ ఆత్మరక్షణకు తగినయేర్పాటులు చేసుకొన్నారు. పెద్ద కోటగోడలూ, బురుజులూ, అనేక పెద్ద గదులూ, వివిధ రకాల సామాగ్రిని దాచే గిడ్డంగులూ, బలమైన ద్వార బంధాలూ, తలుపులూ యెత్తుగావుండే కొండలమీద త్వర త్వరగా నిర్మించబడ్డాయి.

కోటబురుజులనుండి యెన్నో మైళ్ళవరకూ చుట్టూ దేశం కనుపించేది. దూరాన యెక్కడో దుమ్ము మేఘంలేచేది. సూర్యకాంతిలో శత్రువుల యీటెలు తళతళలాడేవి. వెంటనే కోటలో పెద్ద కోలాహలం ప్రారంభమయ్యేది. యుద్ధ సన్నాహాలతో, పొలముకాపు త్వరత్వరగా తన నాగలియెడ్లను కోట లోనికి తోలుకుపోయేవాడు. మందకాపరులు గొర్రెలను వెంటనే యింటిముఖం పట్టించేవారు. ప్రతివాడూ, ప్రతి జంతువూ లోనికి రాగానే కోటద్వారం బంధించబడేది. పెద్ద పిడుగుశబ్దంతో తలుపులు దిగజారేవి. రహస్యంగా బురుజుల రంధ్రాలనుండి యుద్ధవీరులు శత్రురాకను కనిపెట్టేవారు. సమయం కనిపెట్టి వారిపై శరవర్షం కురిపించేవారు.

శత్రుసైన్యం కోటగోడల వెలుపల తమ విడిది నేర్పరుచు కొనేవారు. అంత బలమైన కోటను ముట్టడించి స్వాధీనం చేసు కోడానికి కొన్ని నెలలకాలం పట్టినా పట్టవచ్చని వారికి తెలుసు. ప్రతిదినమూ ప్రొద్దున్నే కోట తలుపులు తెరువబడేవి. లోపల నుండి యీటెలూ, ఖడ్గాలూ పుచ్చుకొని కొందరు సైనికులు వచ్చి, శత్రు పటాలాలను సంధించేవారు. ఒకొక్కరూ తమ

యాంవచ్ఛక్తినీ వినియోగించి పరాయివానిని ఓడించాలని యత్నించేవారు. కోట ప్రజలకు తమ భార్యాబిడ్డలనూ, ఇళ్ళు వాకిళ్ళనూ కాపాడాలనే ఆవేశం యెంతో, అంతే పేరాశ ధనధాన్యాలు దోపిడిచేసి సంపాదించాలని కోట వెలుపల వాళ్ళ కుండేది. పగలంతా పోరాడి, చివరకు రాత్రి చాలా చీకటి పడ్డ తరువాత, యెవరకూ తెలియకుండా, తమ సోదరుల శవాలను యుద్ధభూమిపై వదలి, జనులు తిరిగి కోటలోనికి వెళ్ళే వారు. తెల్లారేదాకా యుద్ధం ఆగిపోయేది.

రోజులు గడచిపోయేవి. ఎంత ధైర్య సాహసాలతో కోటలోప ప్రజలు పోరాడినా కొద్దికాలానికి వారికి అన్నపానీయాలకు కరువు ప్రారంభమయ్యేది. శత్రుశూలాలకన్నా, ఖడ్గాల కన్నా, క్షుధాగ్నిబాధ దుర్భరమయ్యేది. గిడ్డంగులలోప ఆఖరు ధాన్యపుగింజ లైపోయేవి. నూనెజాడీలు పూర్తిగా యింకి పోయేవి. కోటంతా ఆకలిగొన్న పిల్లల ఆక్రందనాలతో నిండి పోయేది. తల్లులు తమ హృదయాల్లో పొంగిపొరలివచ్చే దుఃఖాన్ని దిగమ్రింగుకొని బిడ్డల కన్నీరు నద్ది ఓదార్చేవారు. మొగవారు వింటే ఏం తిట్టిపోతారో అనే భయంకాదూ పాపం!

ఇట్లా కొన్నిరోజులు గడిచేటప్పటికి కోటను సంరక్షించే జనుల సంఖ్య తగ్గిపోయేది. శత్రువులు చులాగ్గా లోపలకు వెళ్ళే వారు; కోటగోడలు పడగొట్టి జనుల గృహాలనూ, గాదెలనూ, కర్మాగారాలనూ భూమట్టం చేసేవారు. స్త్రీ పురుషులనూ, పిల్లలనూ చెరబట్టి బానిసలుగా పట్టుకుపోయేవారు. అంతవరకూ స్వతంత్ర జీవితాలు హాయిగా గడిపిన ప్రజ పాపం! బానిస శృంఖలాల కర్పితమయ్యారు.

## విచిత్ర సమాధులూ - వాని గూఢార్థమూ

చాలా దేశాల్లో మైదాన భూముల్లోనూ, సమప్రదేశాల్లోనూ కొన్ని చోట్ల పొడుగైన గట్లులవంటి దిబ్బ లనేకం కనుపిస్తాయి. ఒక్కొకచోట పెద్ద గట్టు ఒక్కటే ఒకటుంటుంది. కొన్నిచోట్ల యీ గట్టులన్నీ చిన్న పర్వతపంక్తిలాగా చేరియుంటాయి. ఆయా దేశపు చాలమంది ప్రజ కీగట్లేమిటో తెలియదు. పురాతనంనుండీ యీ గట్టు లుండటంమూలాన వానినిగురించి రకరకాల గాథలు ప్రజల్లో అల్లుకుపోయాయి. నిజమేదో తెలియనపుడు ఇట్టి కథలు విశేషంగా పెరుగుతాయిగా!

భూతత్త్వశాస్త్రజ్ఞు లీ విచిత్ర గట్లను త్రవ్వారు. అందగుపించిన విషయాలనుబట్టి వారేమి చెప్తారంటే: చాలాకాలం క్రితం ఆ మైదానంలో వసించిన జనులసమాధు లీగట్లు. లోతుగా యీ గట్లలో మానవ అస్థిపంజరాలూ, కుండలూ, జాడీలూ, రాతివీ, కంచువీ పనిముట్లూ, గుఱ్ఱపు యెముకలూ అనేకం కనుపించాయి. చనిపోయినవారు పరలోకంలో సమాధిలో పాతిపెట్టిన సామానుల నుపయోగించుకొంటారని వారి యుద్దేశం. అందుకనే వాని నావిధంగా పూడ్చిపెట్టేవారు. కాని చాలా పురాతనజనుల సమాధుల్లో అట్టి వస్తువు లంతగా యేవీ యుండేవికావు. "తనది" అనబడే వస్తువు లాకాలంలో మనిషికి యుండేవి కావు. మెడకు కట్టుకొన్న రక్షరేకులూ, జంతువేటకుపయోగించే యీటెలూ, ఇటువంటి వేవో ఒకటిరెండురకాలు మాత్ర ముండేవి. ఇంటిలోవుండే వస్తువులన్నీ ఉమ్మడిగా అందరూ వాడుకొనేవారుగా? అందుకని ప్రత్యేకించి "తనవి" అనడానికి

అవసరమే కలిగింది కాదు. అందుకనే ఆ పురాతనకాలపు సమాధులన్నీ ఒకేమాదిరుంటాయి. వానిలో ధనికులవనీ, పేదవారివనీ భేదాలుండవు.

ధనికులూ, బీదవారూ అనే తారతమ్యం ఎంతో కాలానికి తరువాతే ఉత్పత్తియైనదని సమాధులు పరీక్షిస్తే విశదమవుతోంది. డాన్‌నదీతీరాన మూడురకాల సమాధు లగుపించాయి. మొదటిదానిలో ధనికులూ, రెండోదాంట్లో సామాన్యులూ, ఆఖరుదానిలో నిరుపేదలూ పాతిపెట్టబడ్డారు. ఒక పెద్ద సమాధిలో, సరిగ్గా మధ్యలో చాలా లోతైన గోయి ఒకటి కనుపించింది. అందులోనే శవాన్ని పాతిపెట్టారు. గ్రీసుదేశపు మట్టికూజాలూ, బంగారు నగిషీ పనిగల యుద్ధకవచాలూ, చక్కని చెక్కడపు పనివానితనం చూపే పిడులున్న చిన్న బాకులూ అందులో కనుపించాయి.

మధ్యరకం సమాధుల్లో బంగారునగలనేవి అంతగా కనుపించలా. గ్రీసు కూజాలవంటి వసలేలేవు. మూడోరకం బీదవారి సమాధులు, వారి బ్రతుకులాగానే, నిరాడంబరంగా, దైన్యం గొల్పుతూ కనుపించాయి. ఇట్టి బీదవారి సమాధులే యెక్కువగా వున్నాయి ఆ నదీతీరంలో. ఆ పేదవాని తల కొక ప్రక్క యీటె, యింకోప్రక్క నీళ్ళుత్రాగేటందుకు మట్టి ముంతామాత్రం ఉంటాయి. పరలోకంపోయినా, బీదవాడిగా నుండమనే యీలోక ప్రజల శాపం ఆతని వదలదు కాబోలు, పాపం!

ఈ సమాధుల ప్రక్కనే యున్న పల్లెను పరీక్షిస్తే పూర్వప్రజనుల జీవితవిషయా లింకా యెన్నో విశదమైనాయి.

గ్రామంచుట్టూ యొక ప్రాకారమూ, దానిమధ్య నింకొకటీ యున్నాయి. ఈమధ్య భాగంలో గ్రీసుదేశంనుండీ, యితర ప్రదేశాలనుండీ వచ్చిన చాల ఖరీదైన సామాగ్రి యెంతో కనుబడింది వెలుపలిభాగంలో. అంటే లోపల గోడకూ బయట ప్రాకారానికీ మధ్యభాగంలో అటువంటి వస్తువు లేవీ కనుపించాయికావు. సాధారణ కుండలూ, కూజాలవంటివీ మాత్ర మున్నాయి. అంతకంటే యెక్కువ ఖరీదైనవీ, సుందర మైనవీ కొనడానికి ఆ గ్రామానికి వెలుపలిభాగంలో వుండే యీ జనులకు సాధ్యపడిందికాదు.

ఈవిధంగా ఏకాలంలోనో చనిపోయిన జనుల సమాధులు మనకెన్నో విచిత్రవిషయాల తెలుపుతాయి ఒక్కొక సారి. తమ యజమానితోసహా యెందరో బానిసలు పూడ్చి పెట్టబడేవారు. భర్తలతోపాటు సమాధిలో వారి భార్యలూ, దిగి పాతిపెట్టబడేవారు. మన హిందూదేశపు రసపుత్రుల సహగమనాచారంలాగా వారికీ అట్టి ఆచారముండేది. ఇన్నేసి పుటలు వ్రాసిన గ్రంథాలకన్నా యీ సమాధు లెన్నో యిట్టి ఘోరవిషయాలను మనకు చెప్పక చెబుతున్నాయి. తండ్రి చనిపోతే తనతోపాటు తన యిద్దరి భార్యలనూ, బానిసలనూ భూగర్భానికి లాక్కొనిపోయేవాడు. కారణం ? వారంతా అతని ప్రత్యేకపుటాస్తి! ఆ ఆస్తిపై ఆతనికి సర్వాధికారం ఉండేది !!!

## మనుజుడు క్రొత్త లోహాన్ని సృష్టిస్తాడు

భూగర్భంలో, పురాతన సమాధుల్లో దాచియుంచబడిన యెన్నో వస్తువులు బయటకు తీశారు. వానిని వస్తుప్రదర్శన శాలల్లో మనం చూడవచ్చు. గాజు అలమారుల్లోనున్న

యీ వస్తువులను చూస్తూ నిలబడితే ఆలోచనాపరంపరలతో నిండిపోతుంది. బంగారు పిడిగల ఖడ్గాలూ, బహుసున్నితంగా పెనవేయబడిన లోహపుగొలుసులూ, బంగారూ, వెండి జింకలూ, రెయిన్‌డీరులూ – యీవిధంగా యెన్నో మన దృష్టి నాకర్షించి బంధించివేస్తాయి.

అంత సౌందర్యంగా వస్తువులు చేయడాన్నిబట్టి వారికి, కళలయం దభిరుచీ, నైపుణ్యమూ యెంత యెక్కువగా వుండేవో గ్రహించవచ్చు. కంచుతో ఒక బాకును చేయడానికే యెంతో కాలంపట్టేది. మొట్టమొదటగా భూమినుండి ఖనిజపురాళ్ళను త్రవ్వాలి. రాగిలోహము ముద్దలుముద్దలుగా దొరికేరోజు లప్పటికే గతించిపోయాయి. చెకుముకిరాతికోసం త్రవ్వినట్లే, లోతుగా గనులు త్రవ్వి రాగి ఖనిజాన్ని తీసేవారు. ఆ లోతు గనులలో దిగి తమ గొడ్డళ్ళతో ఖనిజపురాళ్ళ నూడగొట్టి, తోలుసంచుల్లో నింపి పైకి తెచ్చేవారు.

తరువాత వారింకొక నూతన పద్ధతి కనిపెట్టారు. గనులలో పెద్దమంటలు వేసేవారు. ఖనిజరాయి బాగా కాలినపుడు, ఆ గనిగోడలను చన్నీటితో తడిపేవారు. వేడికి నీరంతా ఆవిరై మేఘాలుగా లేచేది. రాయి పగిలి ముక్కలై క్రిందబడేది. ఆరోజుల్లో గనులు అగ్నికొండల్లాగా వుండేవి. వానిలోనుంచి నిప్పుకొండలనుండి వచ్చేటట్లు పొగలూ, ఆవిరీ, మంటలకాంతీ వచ్చేవి. ఇంగ్లీషులో అగ్నిపర్వతానికి "వాల్కనో" అంటారు. ఈ మాట "వల్కన్" అనే పదంనుండి వచ్చింది. వల్కన్ ఒక పురాతన దేవుని పేరు. ఆ దేవుడు పెద్ద కమ్మరివాడట!

ఖనిజరాతిని తెచ్చి కరిగించేవారు. ఇష్టంవచ్చినట్టి రూపంగా పోతపోయడానికీ, గట్టిగా వుండేటందుకూ, ఆ రాగిర్రాళ్ళతో తగరప్రుముక్కలుకలిపి కరిగించేవారు. తగరమూ, రాగీకలిసి కంచులోహం తయారయ్యేది. కొత్త గుణగణాలు ఉపయోగాలుగల యీ కంచును, మనుజుడు తానే నిర్మించాడు; సృష్టించగలిగాడు.

పురాతనరోజుల్లో జాతిలోని ప్రతివాడూ వేటకాడుగా వుండేవాడు. అందుకని ప్రతివానికీ రాతిపనిముట్లూ, విల్లులూ, అంబులూ చేయటం తెలిసియుండేది. ఒకడు కాకుంటే ఇంకొక డా పనిని కావలసినప్పుడల్లా చేయగలిగేవాడు. ఆ పనికి ప్రత్యేక నైపుణ్య మేదీ అంతగా అవసరమయ్యేదికాదు.

రాగీ, తగరాలనుండి కంచును చేయటమూ, దానితో రకరకాల వస్తువులు చేయటమనేది అట్లా తేలికైనపని కాదు. ఏదో లేతకొమ్మను తీసుకొని దాని రెండుచివరలూ వంచి బిగించి విల్లుచేయడానికీ, కంచు వస్తువులు చేయడానికీ యెంతో తేడావున్నది. కొన్ని యేండ్లు కృషిచేస్తేనేగాని లోహపు కవచాల చేసేవృత్తిలో ఆరితేరటం వీలయ్యేదికాదు జనులకు. తండ్రినుండి అతనిపిల్లలు అట్టివృత్తుల నేర్చుకొనేవారు. ఒక్కొక్క జాతి జనులు ఒక్కొకరకపు శిల్పాన్ని తమ స్వాధీనం చేసుకొని వృద్ధి పర్చేవారు. ఒక జాతివారంతా కమ్మరులైతే, యింకొకరంతా కవచాలు చేసేవారు గానూ, వేరొక తెగవారు రాగిలోహపు పనివారుగానూ పేరు సంపాదించుకొన్నారు. వారి ప్రఖ్యాతి నల్దెసలా వ్యాపించింది.

## నాదీ_నీదీ

మొదట్లో కార్మికులంతా తమజాతికీ, తమ గ్రామానికీ కావలసిన వస్తువులుమాత్రమే చేశారు. కాలక్రమంగా లోహపు కవచాలూ, మట్టిపాత్రలూ మొదలైనవిచేసేవారు. తమవస్తువుల నితరులకిచ్చి వారినుండి ధాన్యమూ, బట్టలూ, ఇంకా యితర వస్తువులూ పుచ్చుకోటం మొదలుపెట్టారు. ఇందుమూలాన జనులలో వృత్తిపనివారనీ, వ్యవసాయకులనీ రెండు తెగల భాగా లేర్పడ్డాయి. ఆ కాలంలోనే ధనికులూ, బీదలనే భేదం కూడా తలయెత్తింది. క్రమంగా యిట్టినూతన భావాలు బలపడి పూర్వం ఐక్యంగావుండే సంఘంలో భేదాలూ, తారతమ్యాలూ పెరిగాయి.

మొదట్లో వృత్తిపనివారు సంఘానికి కావలసిన వస్తువులన్నీ చేసేవారు. సంఘప్రజ లావస్తువుల నుపయోగించుకొనేవారు. వృత్తిపనివారికి యితరులనుమాదిరే ఆ సంఘం యావత్తూ అన్నవస్త్రాలిచ్చి, యింకా తగిన సదుపాయాలు చేసీ కాపాడేది. క్రమంగా తాను చేసిన వస్తువులను యితరులకిచ్చి, తనకు కావలసిన వస్తువులు వారినుండి తెచ్చుకోటం మూలాన అట్లా తెచ్చుకొన్న వస్తువులు ప్రత్యేకించి తనవనే భావం మనుష్యుల్లో పుట్టింది. వానిని తమ సంఘజనుల కొరకు వినియోగించవలసిన అవసరం వారి కగుపించిందికాదు. తను రెక్కల కష్టంతో చేసిన వస్తువు "నాది" అనే భావం మనుజునికి కలిగింది. అతనూ, ఆతని కుటుంబీకులూ ఆ కష్టఫలితానికి హక్కుదారులేగాని అన్యులుకాజాలరని వారనుకొన్నారు. ఆ వస్తువులుచేయడానికీ, వాని నిచ్చి ఇతరులనుండి వేరేవస్తువులు

తెచ్చుకోడానికీ వారికి సంఘం యేవిధంగానూ తోడ్పడ లేదనే భావం వారికి కలిగింది.

జనులు విడివిడిగ "తమ" యిండ్లలో వుండటం ప్రారంభించారు. గ్రీసూ, మైసినే, టైరిన్స్ దేశాలలోవుండే పురాతన గ్రామ శిథిలా లీవిషయం స్పష్టంగా చూపుతాయి. అందరి కన్నా యెక్కువ ధనికులు కొండమీద గట్టి ప్రాకారాలమధ్య యిండ్లు కట్టుకొని నివసించేవారు. ఇతరుల కందకుండా తమ ధన, ధాన్యాలను దాచుకోవాలనే ఉద్దేశమే ఆ ప్రాకారాలకూ, బందోబస్తుగా యితరుల కందకుండా కొండలమీద యిండ్లు కట్టుకోడానికీ కారణం. ఆ యెత్తు గోడలమధ్య ఆ జాతికంతకూ అధిపతియైన సైన్యాధికారీ, అతని భార్యాబిడ్డలూ వసించేవారు. కొండక్రిందనున్న లోయలో నిరుపేదలైన పాలము కాపులు తమ మట్టిపాకల్లో వసించేవారు. ఈ కొండ కిరుగు పొరుగు భాగాల్లో వృత్తిపనివారు నివసించేవారు.

అట్టి గ్రామాల్లోనూ, నగరాల్లోనూ సమత్వమనే భావం మనుష్యుల హృదయాలనుండి త్వరలో అంతరించింది. సామాన్య ప్రజ – వారే యితరులకన్న యెప్పుడూ యెక్కువగా వుండేవారు. ధనికులనూ, తమ సైన్యాధిపతినీ, యితర పెద్దలనూ, వారి ధనధాన్యాలనూ చూచి ఓర్వలేకపోయారు. కాని, వారి నేమీ చేయలేకపోవటంచేత వారంటే భయము వారిలో జనించింది. ఆభయమే, తిరిగీ వారి అశక్తతా, అసూయతలతో మిళితమై గౌరవంగా తయారయింది. బీదలు ధనికులను . గౌరవించటమూ, వారంటే దిగ్భ్రమచెంది పూజించటమూ అనే వికృతభావాలు జనుల కలవాటైనాయి. ధనికులకు తామట్లా

ధనాఢ్యులుగా వుండటం గొప్ప అదృష్టమనీ, అది తమ పూర్వ సుకృతఫలమనీ తోచింది. ధనికులపట్ల దైవమున్నాడు. వారు ధనికులుగా వుండటమే ఆ దైవకటాక్షానికి సూచన అనే విషయాన్ని ధనికులు తమ బిడ్డలకు ఉగ్గుపాలతో రంగరించి పోసేవారు.

వ్యావసాయికులు, వృత్తిపనివారియెడల సోదరభావంతో మెలిగేవారుకారు. నేలను త్రవ్వి గనులలో దిగి పనిచేసేరంటే యెట్టి ఆదరణా చూపేవారుకారు. ఏదో అగ్ని పర్వతంలాగా పొగలూ, దుమ్మూ, మంటలూ, ఆవిరులూ పైకిజిమ్మే గనిలోకి దిగి, బయటకు వచ్చినపుడల్లా మసిపూతతో నల్లగా కనుపించేవారిని చూస్తే జనులకు ఒకవిధమైన భయంవేసేది. అతనిలో యేదో మంత్రశక్తి యుందికాబోలు. నేలక్రింద యేదయ్యామో? భూతమో అతనికి దారి చూపిస్తుంది కాబోలు. లేకపోతే ఆ చీకట్లో పనిచేయటం దుర్లభ మనుకొనేవారు. సాధారణ ఖనిజపు రాతినుండి మెరిసే యెర్రని రాగినీ, కంచునూ చేయడాని కాతని కేదో గొప్పమంత్ర, తంత్రాలు వచ్చియుంటాయని సాధారణజను లనుకొనేవారు. అతడంటే భయమూ, వాడికెంత దూరంగావుంటే అంత మంచిదనీ వారికి తోచింది.

ఇటువంటి యుద్దేశాలు కేవలం గ్రీసుదేశంలోనే కాదు; అన్నిచోట్లా ప్రబలాయి. ధనికులకు ధనం యెట్లా వచ్చిందో జనులు మరచిపోయారు. బీదవాడుగా పుట్టటమూ, గొప్పవాని కడుపున పుట్టటమూ కేవలం దైవాధీన మనుకొన్నారు. ధని

కులహట్ల దైవముంటాడు. పాపంచేసినవారు పేదవారుగా పుడతారు. వా రనుభవించే కష్టాలూ, బాధలూ, సమస్తమూ వారి పాపఫలితం. అన్యు లేవిధంగానూ వారిస్థితిని మార్చజాలరు. ఇట్టి వికృత, వింతభావాలు ప్రజల హృదయాల్లో బలపడిపోయాయి.



# పెరుగుతూన్న లోకం
# శాస్త్రీయ దృక్పథ ప్రారంభం

మొదటి రోజుల్లో యీ లోక మేమాత్రం అర్థమయిందికాదు. మనుష్యులకు అంతా విచిత్రంగా, దురూహ్యంగా వుండేది. కంటికి కనుపించని గొప్పశక్తులెన్నో ప్రతిచోటా దాక్కొని యుండేవి. కొన్ని మంచినీ, కొన్ని చెరుపునూ చేస్తాయి మనుష్యులకు. ఏదంటే ఎట్లా పరిణమిస్తుందో, ఏపని చేస్తే ఎట్టి ఫలం దక్కుతుందో వారికి తెలియక యెప్పుడూ భయపడుతూ జీవితాలు గడిపేవారు.

తగిన లోకానుభవం లేనందుచేత, చీకటి పడితే తిరిగి తెల్లవారుతుందో లేదో, ఈ సారి చలికాలం గడచి తిరిగీ చిగురింతకాలం వస్తుందో రాదో అనే భయా లెన్నో వారికుండేవి. సూర్యోదయం కావాలనీ, వర్షాలు కురవాలనీ, ఎండలు కాయాలనీ పూజలూ, పునస్కారాలూ చేశారు ఆరోజుల్లో. ఈజిప్టు దేశపురాజైన "ఫేరో"కు సూర్యునిపై గొప్ప అధికారమూ, శక్తీ ఉండేదని ఆదేశ జను లనుకొనేవారు. ప్రతిరోజూ ప్రొద్దున్నే గుడిచుట్టూ ఫేరోరాజు ప్రదక్షిణం

చేసేవాడు. ఆ ప్రదక్షిణం పూర్తియైతే సూర్యుడు ఆకాశ మార్గాన తన ప్రయాణాన్ని పూర్తి చేసుకోగలుగుతాడని వారనుకొనేవారు. ఆకురాలుకాలంలో సూర్యునియెండ అంత తీక్ష్ణంగా వుండేది కాదు. సూర్యుని కా కాలంలో బలం తక్కువ; సరిగా ప్రయాణం సాగించలేడు. అందుకని పట్టుకొని నడువ డానికి చేతికర్ర అవసరం అనుకొన్నారు. అందుకని ఆకురాలు కాలంలో "సూర్యభగవానుని చేతికర్ర" పండుగను చేసేవారు ఈజిప్టులో.

మానవజీవితం అట్టి యుద్దేశాలతో బయలుదేరింది. కాని తమ వివిధ జీవితానుభవాలమూలానా, కొత్త కొత్త పనులు కనిపెట్టి చేయడంచేతా జనులకు యీ సృష్టీ, దాని గుణతత్త్వాలూ, నియమాలూ విశదం కాజొచ్చాయి. రాతి ముక్కను చెక్కి బాణపు మొనను చేసేటప్పుడు ఆ రాతి గట్టి తనమూ, నునుపూ, గరుకుదనాలూ, యే ప్రక్క చెక్కితే చక్కగా చీలి ముక్కలవుతుందో అనే ఇట్టి విషయా లెన్నో మనుజునికి బోధపడ్డాయి. కాని ఇతర రాతిముక్కల చెక్కినా అదేవిధంగా జరుగుతుందా? ఈ ప్రశ్నకు "ఔ"ననేజవాబు మానవు డీయలేకుండేవాడు. ఈ రాయిని చెక్కితే ఇది యేడవా లేదూ, మాట్లాడా లేదు; కాబట్టి యితర రాళ్ళవిషయమూ అంతేనని అతడు గ్రహించుకోలేకపోయాడు మొదట్లో. ఒకవేళ కొన్ని రాళ్ళకు నొప్పికలిగి అవి మాట్లాడినా మాట్లాడవచ్చు; యేడ్చినా యేడువవచ్చు అని వారనుకొనేవారు. సృష్టిలో ఏ రెండువస్తు వులూ ఒకే మాదిరి యుండవని అతనికి తెలుసు. కాబట్టి కొన్ని అనుభవాల నాధారంచేసుకొని లోకవ్యవహారా లీవిధంగా

జరుగుతాయి. | | ఈ తీరుగా జరుగవని చెప్పటం దుస్సాధ్య మనుకొన్నాడు. రాతినాగలిని కొత్తగా చేయాలంటే, సరిగా పాతనాగలిమాదిరే దాన్ని చేయాలి. లేకపోతే అది నేలను దున్నుతుందనే ధైర్యం వారి కేమాత్రం ఉండేదికాదు.

క్రమంగా యెన్నోయేండ్లు, వేలకొలది సంవత్సరాలు గడచిపోయాయి. రకరకాలరాళ్ళతో పనిముట్లు చేయటంచేత వారికి రాయియొక్క తత్త్వం అర్థమయింది. రాళ్ళన్నీ గట్టిగా వుంటాయి; అంటే రాయి ఒక గట్టి పదార్థం అని వారు తెలుసుకోగలిగారు. ఏ రాయీ మాట్లాడేదికాదు. కాబట్టి రాళ్ళు మాట్లాడవు. ఈవిధంగా వస్తువులనైజమూ, గుణగణాలూ మొదలైనవి వారు గ్రహించుకోటం ప్రారంభం కావొచ్చింది. శాస్త్రపరిశోధనలకూ, శాస్త్రీయమైన ఉద్దేశాలకూ, దృక్ప థానికీ అప్పుడే పునాది నాటబడింది.

"చెకుముకి గట్టిరాయి" అని యేవృత్తిపనివాడైనా అన్నపుడు వాడు చెప్పిన విషయం ఏదో ఒక ప్రత్యేక చెకుముకి రాతికి మాత్రమే అన్వయించి, తక్కిన రాళ్ళ నైజాన్ని వర్ణించ దనే భావం అంతరించింది. ఆమాట అన్ని చెకుముకి రాళ్ళ స్వభావాన్నీ తెలుపుతుందని జనులు గ్రహించుకోగలిగారు. చెకుముకియొక్క గట్టితనం సృష్టిలో స్వభావసిద్ధమైన విషయ మనీ, అట్టి విషయాలే యింకా యెన్నో ఉన్నాయనీ వారికి తెలిసింది. "చలికాలం తరువాత, చిగురింతకాలం వస్తుం"దంటే కాదని యెవరూ అనరు. ఆవిషయం నిజమేనని మనందరకూ అనుభవంమూలాన తెలుసు. ఋతుక్రమాన్ని మన పూర్వీకులు అనుభవంమూలాన గ్రహించుకోడానికి కొంతకాలం పట్టింది.

అట్లా తెలుసుకోటంమూలాన ఒకే ఋతువు తిరిగి వచ్చేటప్పటికి ఒక యేడాది పట్టుతుందని వారు గ్రహించారు. అప్పటినుండీ సంవత్సరాలు లెక్కించటం జనుల కలవాటయింది.

ఈజిప్టులోని నైలునది యేటేటా వరదలువచ్చి నిండేది. ఆవరదలు వచ్చే సమయాన్నిబట్టిసంవత్సరాలులెక్కించటం వారు ప్రారంభించారు; నైలునది వారికి సుభిక్షంపెట్టే దేవతనే ఉద్దేశం ఉండేది. అందుకని పూజారులు నదీతీరపు దేవాలయాల మీద నీరెంత యెత్తుకువచ్చేదో యేటేటా గుర్తించేవారు. ఇప్పటికీ దేవాలయాలమీద ఆ గుర్తు లగుపించుతాయి.

వేసవికాలంలో పొలాలన్నీ యెండి బీళ్లుపడేవి. పసుపు రంగు బురదనీరు నది కెప్పుడు తగులుతుందా అని ఆతురతతో జనులు యెదురుచూచేవారు. వారిపై దేవత లాగ్రహించి నదికి నీరెక్కకుండా చేస్తే వారిగతి యేమవుతుందోననే భయపడేవారు. గ్రామ గ్రామాలనుండీ కానుకలూ, కట్నాలూ దేవాలయాలకు జనం తెచ్చేవారు. పూజారులకు వాని నర్పించి నైవేద్యాలుపెట్టి, నదికి నీరురావాలని దేవునిపూజింపమనేవారు గ్రామవాసులంతా. ప్రతిరోజూ ప్రొద్దునేలేచి గుడిపూజారులు నీరువచ్చిందేమోనని చూడడానికి నదికి వెళ్ళేవారు. సాయంత్రం దేవాలయపు విశాల మైన డాబాలపై కెక్కి నక్షత్రరాసులను పరికించేవారు. వాని స్థానాలనుబట్టి యింకెన్ని రోజుల్లో నదిలో వరదలు రాగలవో పూర్వానుభవాన్నిబట్టి లెక్కించుకొనేవారు. "దేవత లను గ్రహించారు; ఇక మూడురోజుల్లో నది నిండుతుం"దని జ్యోతిషం చెప్పినట్లు జనులకు చెప్పేవారు.

క్రమంగా అంతకు ముందు దగమ్యగోచరంగా వుండే భూలోకపు విషయాలెన్నో జనులకు అర్థంకాజొచ్చాయి. భూలోకపు ప్రథమ నక్షత్రాలయాలు ఐగుప్తు దేవాలయ డాబాలపై స్థాపింపబడ్డాయనటం అతిశయోక్తి కాదు. కుండలూ, లోహపు సామానులూ చేసిన పురాతన జనులే మొదటి శాస్త్ర పరిశోధకులనటమూ అబద్ధంకాదు.

విషయాలనూ, వస్తువులనూ పరిశీలించటమూ, లెక్కించటమూ, వానినుండి నికరమైన సిద్ధాంతాలను గ్రహించటమూ జనులు నేర్చుకొన్నారు. ఈ కాలపు శాస్త్ర పరిశోధనలకూ, శాస్త్రీయంగా విషయాల పరికించే అలవాటుకూ ఆ రోజుల్లోనే పునాది నాటబడింది. ప్రకృతీ, దానియందుండే శక్తులను గ్రహించడానికి జనులు యత్నాలుచేసే ఆకాలంలో వారి కింకా సూర్య, చంద్ర, నక్షత్రాలనూ, నదులనూ, మేఘాలు మొదలైన వానిని పూజించే అలవాటు వదిలింది కాదు. లోకతత్త్వం అర్థమయ్యేకొలదీ, క్రమంగా అట్టి ఆచారాలు వెనుకబడ్డాయే కాని ఒక్కసారిగా రూపుమాసిపోలేదు.

## దేవుళ్లు దేవలోకానికి వెళ్ళటం

మొదట్లో ప్రతిచెట్టులో, రాతిలో, జంతువులోనూ దేవత లుండేవారని మనుష్యు లనుకొనేవారు. క్రమంగా ఆయుద్దేశం మారటం మొదలు పెట్టింది. ప్రతి జంతువులోనూ ఒక్కొక దేవతాస్వరూపం ఉంటుందనే భావం మారి, అవన్నీ నివసించే వనానికంతా ఒక్క వనదేవత ఉంటుందనుకొన్నారు. అదే మాదిరి ప్రతి ధాన్యపు కంకిలోనూ దేవత లుంటారని పొలము కాపులు మొదట్లో అనుకొన్నారు. తరువాత వారికందరకూ

సుభిక్షంపెట్టే, పంటలను బాగాపండించే ధాన్యదేవత యొక్కటే ఉంటుందని ఊహించారు. అట్టిదేవతలు నలుగురు మనుష్యులూ తిరిగేచోట ఉండరనీ, యెక్కడో పుణ్యప్రదేశాల్లోనే ఉంటారనే భావం కలిగింది. దూరంగా యేకొండ శిఖరంమీదో అట్టి దేవతలకు స్థానా లేర్పాటుచేశారు. వివిధ పదార్థాల స్వభావాలూ, అవి వర్తించే విధానమూ క్రమంగా జనులకు అర్థం కావటంచేత వానిలో యేదో దేవుళ్ళున్నారంటే వారి మనస్సులకు సమంజసంగా తోచిందికాదు. అందుకనే జనులు సాధారణంగా వెళ్ళలేని ప్రదేశాలకు ఆ దేవతల నివాసాలు మార్చబడ్డాయి.

క్రమంగా జనులు దుర్గమారణ్యాల్లోకి వెళ్ళారు. మేఘాలు క్రమ్ముకొని యెప్పుడో ఒకప్పుడుగాని గోచరంకాని కొండ శిఖరాల నెక్కారు. అక్కడుండే సమస్త విషయాలూ వారు గ్రహించారు. అటువంటిచోట దేవత లున్నారనే పూర్వపు టుద్దేశాలు వారికి విడ్డూరంగా తోచాయి. కాబట్టి ఆ దేవుళ్ళంతా ఆకాశానికీ, భూగర్భానికీ తమ నివాసం మార్చుకోవలసి వచ్చింది. ఆకాశంలోవుండే ఆ దేవతలు తమ భక్తుల కెన్నో విధాల తోడ్పడి మేలుచేసేవారనే కథలు ప్రతిదేశంలోనూ ఉన్నాయి. యుద్ధసమయాల్లో దేవుళ్ళు తమపక్షం వారికి సహాయం చేసేవారు. మేఘాలూ, గాలిదుమారములూ శత్రువుల కడ్డంగా లేచేవి. దారీ తెన్నూ తెలియక వారంతా గల్లంతు పడేసమయంలో దైవసహాయంచేత వా రోడించబడేవారు. ఇటువంటి గాధలెన్నో ప్రతిదేశంలోనూ జనులు చెప్పు

కొంటారు. కాని యివన్నీ యెప్పుడో పూర్వం జరిగాయట. ఇప్పు డట్టి విచిత్రాలు జరుగుతాయని యెవ్వరూ ఒప్పుకోరు.

ఈవిధంగా దేవుళ్ళు మానవుని పరిసర ప్రదేశాలనుండి దూరస్థానాలకూ, అక్కడినుండి ఆకాశానికీ, పాతాళలోకానికీ వెళ్ళిపోయారు. ఈలోకంనుండి ఆకాశానికీ, పాతాళలోకానికీ తమ నివాసాలు మార్చుకొన్నారు. ఈరోజుల్లో అటువంటి దేవుళ్ళున్నారని నమ్మేవారు చాలా కొద్దిమందే ఉన్నారు. ఏవో కథల్లోని విషయాల్లాగా, ఆ పురాతన దేవుళ్లూ, వారి కృత్యాలూ మనం చెప్పుకొంటామేగాని, మన కంతకంటె వారితో యెట్టి జోక్యమూ లేదు. దగ్గరనుండి దూరానికీ, నేటి నుండి నిన్నటికీ దేవుళ్ళను దాటించివేశారు మనుజులు.

పూర్వం తమ కోర్కెలీడేరడానికి మనుష్యులు దేవుళ్ళకు పూజలూ, ప్రసాదాలూ అర్పించి తృప్తిపరచవచ్చునుకొనే వారు. ఒక్కొక కార్యసిద్ధికీ ఒక్కొకవిధమైన మతాచారమూ, పూజా విధానమూ ఉండేవి. మొదట్లో ఈ ఆచారాలు చాలా సర్వసాధారణంగానూ తమాషాగానూ ఉండేవి. వానలు కురవ డానికి నోట్లో నీరుపోసుకొని నృత్యంచేస్తూ ఆ నీటిని ఉమిసేవారు. అట్లా చేస్తే వాన దేవుడు తృప్తి జెంది వర్షాలు కురిపిస్తాడట. కారు మేఘాలను నల్దిక్కులకూ పారదోలడానికి దేవాలయపు డాబా నెక్కి, గాలి వీచేటట్లు గట్టిగా ఊదేవారు. క్రమంగా అట్టి ఆచారా లేవీ ఫలించవని జనులు గ్రహించుకోగలిగారు. ఆయా దేవతలను తృప్తి పరచడానికీ, తమ కార్యసిద్ధికీ యెట్టిపూజలు చేయాలో, ఏమంత్రాలు పఠించాలో అనే విషయాలన్నీ పూజారులకు వప్పగించారు. ఈ పూజారులు దేవాలయ పరిసరాల్లో నివసించే

వారు. గుడి డాబామీదికెక్కి, నక్షత్రాలను పరిశీలించి రానున్న విషయాలను జనులకు చెప్పేవారు. ఏదన్నా యుద్ధాని కుపక్రమించేముందు తన ప్రజ గెలుస్తారో, లేదో అనే విష యాన్ని ఆతడు దేవుళ్ళ నడిగి తెలుసుకొని చెప్పేవాడు.

ఈవిధంగా దేవుళ్ళు క్రమేపీ సాధారణ మనుష్యులకు దూరమైపోయారు. తమ జీవితాల్లో తారతమ్యాలూ, హెచ్చు తగ్గులూ ఉండటమూ, ధనికులూ, నిరుపేదలూ, గౌరవనీయ మైన వృత్తులు చేసేవారూ, హీనవృత్తి పనివారూ అనే భేదా లుండటమూ చూచి, దేవుళ్ళు జనులందరినీ నిష్పక్షపాతంగా చూస్తారని వారు నమ్మలేకపోయారు. ఈ హెచ్చుతగ్గులు దైవ కల్పితములనీ, రాజులు దేశాలు పరిపాలించేటట్లే, దేవుళ్ళూ మన జీవితాలను నియామకం చేసి పాలిస్తారనీ, ప్రతివాడూ తనకు దైవికంగా కల్పించబడిన స్థితిలో తృప్తి చెంది జీవి చాలనీ పూజారులు జనులకు చెప్పేవారు. ఎందరో ఆ మాటలు నమ్మారు. కాని, "అంతా దైవేచ్ఛ"అనీ, తమ కేమీ బాధ్యత లేదన్న సిద్ధాంతాన్ని కొందరంగీకరించాలేకారు. ఒక గ్రీసు దేశీయ కవి యిట్లా వ్రాశాడు: "జ్యూస్ — దేవుని పేరు— యొక్క నిష్పక్షపాత గుణమూ, న్యాయమూ నా కర్థంకావటం లేదు. మంచివారు కష్టపడుతున్నారు; దుర్మార్గులు సుఖజీవి తాలు గడుపుతున్నారు. తమ తండ్రులు చేసిన పాపాల శిక్షను, పిల్ల లనుభవిస్తారు. దేవుళ్ళంతా నరలోకాన్ని వదలిపెట్టి దూరంగా యే కైలాసానికో వెళ్ళిపోయారు నివసించడానికి."

మొదటి జనులకు నిజానికీ, కల్పిత విషయానికీ భేదం తెలిసేదికాదు. అనుభవంమీద సంపాదించిన జ్ఞానానికీ, ఋత

రులు చెప్పగా గ్రుడ్డి నమ్మకంతో సరేనని ఒప్పుకొనే విషయా లకూ పూర్వీకుల కెట్టి తేడా కనిపించిందికాదు. ఎన్నో వేల యేండ్లు గడిస్తేనేగాని మూఢనమ్మకాలూ, ఆచారాలూ త్యజించి, జనులు జ్ఞానసంపాదనకు కృషిచేయటం ప్రారంభిం చారుకాక. తామేవిషయాలనూ, వస్తువులనూ పరిశీలించి వాని నిజతత్త్వం కనుక్కోటమెంత అవసరమో వారు కొన్ని వేల సంవత్సరాలు గడిచిన తరువాతేగాని, అంతకుముందు తెలుసుకోలేకపోయారు.

పురాతన కథలూ, గాథలూ వింటోంటే, పూర్వపు గేయాలు చదువుతోంటే కేవలం జనులు తామే చేసిన పనులూ, నెరవేర్చిన కార్యాలేవో, ఏ దేవతలో వారికి సహాయపడి చేయించిన విషయాలనేవేవో విడివిడిగా తెలుసు కోటం కష్టం. మన రామాయణ, భారత, భాగవతాల్లోని విషయాలన్నీ ఇటేస్థితిలోనే యున్నాయి. అటువంటి కావ్యాలు చదివేటపుడు ఇది నిజమైన విషయమూ, యిది కల్పిత విష యమూ అని చెప్పటం కష్టం. ఏదైనా ఒక దేశాన్ని వర్ణిస్తే అందలి విషయాలెంతవరకు భూగోళశాస్త్రబద్ధమో, యెంత వరకు కల్పితమో తెలియటం కష్టం. గ్రహాలనుగురించీ, నక్షత్రాలనుగురించీ శాస్త్రబద్ధమైన యే విషయాలు వారికి తెలుసో, యెంతవరకూ తెలుసో కనుక్కోటం కష్టం. ఎందు కంటే నక్షత్రఫలాలూ, గ్రహబలాలూ అనే జ్యోతిష విషయా లనుకూడా ఆ నక్షత్రశాస్త్ర పరిభాషతో మిళితంచేసి ఉప యోగం చేస్తారు. ఇందులో నిజమేదో, కల్పితమేదో తెలుసు కోటం కష్టం. చారిత్రక విషయాలేవో, కల్పనాకంథాశము

లేదా పూర్వగాథలనుండి కనుక్కోనటం అంత తేలికైన పని కాదు. మహాభారతంలోని కౌరవులూ, పాండవులూ చారిత్ర కంగా ఉన్నారని అనుకొన్నా, అందులో వ్రాయబడిన అనేక విషయాలు ఎంతవరకు కల్పితమో యెట్లా చెప్పగలం? భూగోళశాస్త్ర సంబంధమైనవీ, చారిత్రకమైనవీ యెన్నో విష యాలు అట్టిగాథల్లో నిజానికి నిజంగా నిరూపింపబడినా, ఇతర విషయాలనేకం కవి ఊహించటంలో, వర్ణించటంలోనూ ఉండే చమత్కారంమూలాన పుట్టియుండవచ్చు. ఇదేమాదిరి శ్రీకృష్ణుని బాల్యలీలల్లో యెన్ని నిబద్ధమో, యెన్ని గ్రంథకర్త చమత్కృతిని చూపేవీ, యెన్ని గూఢార్థంగల ఉపమానా లంకారాల్లో చెప్పలేము. కాళీయమర్దన, మందరగిరి నెత్తటం వంటివి ఉన్న వున్నట్లే నిజమని యెవ్వరూ అనరు. అయినప్ప టికీ కొంతవరకూ పురాతనగ్రంథాలు భూగోళశాస్త్ర విషయా లనూ, చారిత్రక విషయాలనూ తెలిపే ప్రథమ గ్రంథాలని ఒప్పుకోవాలి.

పురాతనపు రోజుల్లో జనులు చాలామంది తాము పుట్టిన ఊళ్ళల్లోనే యుండేవారు. ఎవరో కొద్దిమంది వర్తక వ్యాపారంకొరకు ప్రయాణాలు సలిపినా, ఎక్కువ దూరానికి వెళ్ళేవారుకారు. కొంతమంది సముద్రయానం చేసినా, తమ తీరాన్ని వదలి ఆట్టేదూరం వెళ్ళలా. సూర్యునీ, నక్షత్రాలనూ చూచి దిక్కులూహించుకొని యెక్కువదూరం వెళ్ళటం అంత శ్రేయస్కరం కాదని వాళ్ళకు తెలుసు. ఈ రోజుల్లోలాగా దేశపటాలూ, "మారినర్సు కంపాస్" అనబడే నావికుల దిక్సూచి యంత్రాలూ ఆ రోజుల్లో ఎక్కడివి! ఓడల కీరోజుల్లో

దారి తెలిపే దీప స్తంభాలుంటే, వా రారోజుల్లో తీరాన్నుండే ఏ యెత్తు చెట్టునో, గుట్టనో గుర్తుగా పెట్టుకొని ఓడల్లో వెళ్ళేవారు.

సముద్రమంటే వాళ్ళ కెంతో భయంవేసేది. దాని పెద్ద కెరటాలకు వారి దోనెలు వికృతనృత్యం చేసేవి నీటిపై. గాలి విసురుకు చినిగి, పేలికలు కాకుండా తెరచాపల కాపాడటమూ, గాలిదెబ్బకు యిటూ అటూ తోసుకువెళ్ళే పడవల సరిగా నడిపించటమూ ఎంతో కష్టంగా వుండేవి. ఇన్ని కష్టాలూ పడి ఒడ్డుచేరితే, అక్కడ తిరిగీ కష్టా లెదురయ్యేవి. నలుగురూ చేరి పడవనులాగీ, యీడ్చి ఇసుకతీరాన్ని నిలబెట్టాలి. కొత్త దేశమైతే, పడవ నచ్చట నిలిపి ఊళ్ళోకి వెళ్ళితే, తిరిగి వచ్చే టప్పటికి పడ వేమవుతుందోననే భయముండేది. కొత్తదేశాల ప్రజలందరూ నరభక్షకులనే భావం చాలామంది కుండేది. ఏ కొత్త మృగాన్ని చూచినా అదేదో పెనుభూతమనే భయం వేసేది. అందుకనే తెగించి గట్టెక్కి యెక్కువదూరం వెళ్ళలేక పోయేవారు.

క్రమంగా ప్రయాణాలు సాగేకొలదీ అంతవరకూ అర్థం కాని దేశాలూ, భయంగొలిపే జనుల జాతులూ పరిచయం కాజొచ్చారు. ఒకరొకరికి దూరదేశాలంటే భయమూ, అన్య ప్రజలంటే అనుమానమూ తగ్గిపోజొచ్చాయి. ధైర్యంగల నావికులు దగ్గరసముద్రాలు దాటి మహాసముద్రపు పొలిమేరల తాకటం మొదలుపెట్టారు. ఆ మహాసముద్రానికి అంతున్నట్లే వారి కగుపించిందికాదు. ఏదో కొత్త ప్రపంచకానికి వెళ్ళినట్లనిపించేది, చుట్టూ నీళ్ళమయంగానుండే ఆ ప్రయాణం.

ఇట్లా, కొన్ని వేల యేండ్లు గడిచాయి. హిందూదేశీయులు చిరకాలంగా సముద్రప్రయాణాలు చేసి అన్యఖండాలకు వెళ్ళిన నిదర్శనాలెన్నో ఉన్నాయి. యిరోపియనులు ఇండియాకూ, చీనానుండి జనులు యిరోపాకూ వెళ్ళారు. మహాసముద్రాల కవతల ఏదీ లేదనే భావం పటాపంచలైంది. తమ దేశాల వంటివే యితర దేశా లెన్నో యున్నాయని వారు గ్రహించారు. ఆ కొత్త దేశాలంటే మొదట్లో ప్రయాణీకులకు బహు విచిత్రమైన ఉద్దేశాలుండేవి. అమెరికాను కొలంబసు కనుగొన్నాడని చాలామంది యెరిగేయుంటారు. ఆ అమెరికాలో చాలా యెత్తైన పర్వతం ఒకటుందనీ, దానిమీదే కైలాసమున్నదనీ అత డనుకొన్నాడు. ఎవరెస్టు శిఖరంపైన గౌరీశంకరు లుంటారనే అభిప్రాయంమూలాన్నే గదా మనం దాన్ని గౌరీశంకర శిఖరమంటాము? స్పెయిను రాణికి, తాను కైలాసపర్వత పరిసరాల్లో తిరిగి అందున్న వైభవాన్ని చూడబోతానని కొలంబసు వ్రాశాడు.

యూరల్ పర్వతాల కవతలప్రక్క చలికాలమంతా మేల్కొ్కకుండా యెలుగుబంట్లలాగా నిద్రపోయే మనుష్యులున్నారని రష్యావారు మొన్న మొన్నటి పదిహేనో శతాబ్దంలో కూడా అనుకొనేవారు. "తూర్పుదేశపు విచిత్ర ప్రజల గురించి" అనే యొక పురాతన పుస్తకం దొరికింది. ఆ దేశంలో నోరులేనివారూ, తలలు లేనివారూ, వక్షంలో నేత్రాలుగల జనులూ యుంటారని వ్రాయబడియున్నది. ఇదంతా చదువుతోంటే మనకు "ఓరి! యెంత వెఱ్ఱివాళ్ళురా!" అనిపిస్తుంది కాదూ? మన సంగతీ నిజానికంతే సరిగా ఆలోచిస్తే. తనకర్థం

కానిదీ, తాను చొరబడలేనిదీ ఏదన్నా యొక ప్రదేశమున్నట్లయితే దాంట్లోవుండే విషయాలన్నీ యెంత విక్రుతంగా యుంటాయన్నా మానవు డాక్షేపించడు. అదీ మన స్వభావం. స్వర్గంలో దేవతలకు నిద్రలేదు. ఎప్పుడూ పాటలే; గాలిలో యెగురుతారు. ఇంకా యిట్లాంటివెన్నో విచిత్రాలుంటాయి. ఎందుకని? మన మెవ్వరమూ స్వర్గాన్ని చూడలేదుకాబట్టి.

మొదటి గాయకులూ, కవులూ

సృష్టిని పరిశీలించీ, తమ అనుభవాల పునర్విమర్శించుకొనీ మనుజులు క్రమంగా ఎట్టెట్టి నియమాలు సృష్టిలో వర్తియోనా తెలుసుకోగలిగారు. ఇట్టి జ్ఞానం పెరిగేకొలదీ మంత్రతంత్రాలన్నా, పూజా పునస్కారాలన్నా నమ్మకం తగ్గిపోవటం ప్రారంభించింది. అనుదినచర్యలో అటువంటి నమ్మకం ఉన్నట్లు వారు వర్తించకపోయినా మతవిషయాల్లోనూ, ఆచారాల్లోనూ మంత్రతంత్రాలంటే ఆదరణ చూపేవారు. జనుల రకరకాల పాటల్లోనూ, ఆటల్లోనూ అటువంటి నమ్మకమే ఉండేదనడానికెన్నో నిదర్శనా లగుపించుతాయి. అట్టి పాటలను చాలామంది కలిసిపాడేవారు; నలుగురూ కలిసి నృత్యంచేసేవారు. పాడుతూ ఆ నృత్యగానాల ఫలితంగా ఆయా దేవతలను సంతృప్తి పర్చవచ్చనే నమ్మకం ఉండేది. మన దేశంలోనూ ఇట్టి ఆచారాలెన్నో ఉన్నాయి. పొంగుచూపితే అమ్మవారి నూరేగించి నృత్యం చేస్తూ వెళ్ళటమూ, పీర్ల పండుగలో పీర్లనూరేగించి అగ్నిగుండాలు తొక్కటమూ, 'ఆలీ దూలా' అని రొమ్ము బాదుకొంటూ బాటలంబడి వెళ్ళటమూ, శక్తిపూజలు చేసి శక్తివేషం ధరించి ఆడుతూ నవరాత్రి పండుగలు చేయటమూ

ఇటువంటి వెన్నో ఉన్నాయి ఆచారాలు. నలుగురూ కలిసి ఆడీ, పాడేటప్పుడు వారిలో నొకడు వారందరికీ పెద్దగావుండేవాడు.

క్రమంగా అటువంటి ఆటపాటల్లో యేదో మాంత్రిక శక్తి యున్నదనే నమ్మకం జనుల్లో నశించింది. అమ్మవారి నూరేగించి తందనాలాడితే పొంగుజబ్బు పోతుందనే నమ్మకం నశించింది. అవి ఏవో సరదాగా నలుగురూ ఆచరించే సాంఘిక ఆచారాలుగా మారాయి. పూర్వం దేవతల యుద్ధాలూ, ప్రేమానురాగాలూ, కోపాలూ, యీర్ష్యలూ నిరూపించే ఆట పాట లుండేవి. కృష్ణలీలలూ, లంకాదహనమూ, దశావతారాల వంటివి. వాని స్థానే మనుజుల కష్టనిష్ఠూరాలూ, సుఖదుఃఖాలూ నిరూపించే ఆటలాడి, పాడటం జనులు అలవాటు చేసుకొన్నారు. నలోపాఖ్యానం, సావిత్రీ, సత్యహరిశ్చంద్రల వంటివి అలవాటైన తరువాత సుగుణమణి, ప్రతాప రుద్రీయం, శివాజీ, కన్యాశుల్కం, కమ్యూనిస్టుల ప్రస్తుత సమస్యల చూపే 'ఆకలి' వంటి నాటకాలూ వచ్చాయి. ఇట్టి మార్పులన్నీ ఎన్నో తరాలుగా మానవజీవితం గడిస్తేనే కాని వచ్చాయి కావు. మత సంబంధమైన నృత్యగీతాల్లో పూర్వం ముఖ్యమైన వాడొకడుండేవాడని చెప్పాము కాదూ? వాడే క్రమంగా జనులు వేసే నాటకాల్లో ముఖ్యపాత్రధారిగా మారాడు. తక్కిన జనమంతా ఇతర పాత్రలు ధరించేవారు. జనుల కిట్టి నాటకాలు ఆడటమూ, చూడటమూ అలవాటైనాయి.

ముఖ్యపాత్రధారి మొదట్లో నలుగురితో కలిసి పాటలు పాడేవాడల్లా, క్రమంగా ఒంటరిగా పాడటమూ, నలుగురూ చూపే భావప్రకటన కన్నా కష్టమైన విషయా

లను నటించటమూ తనవంతు చేసుకొన్నాడు. దానికి కారణం అతని విషయాల్లో నుండే అసమాన ప్రావీణ్యా తేనని మనం అనుకోవాలి. కొందరు గాయకులు తంబూరవంటి శ్రుతివాయిద్యాల పట్టుకొని శ్రావ్యంగా నలుగురికీ పాడి వినిపించటం నేర్చారు. బొబ్బిలికథ, రాజా దేశింగు కథలవంటివి చెప్పేవారు. భావానికి తగినట్లు అభినయిస్తూ పాడటం మనలో అలవాటుంది. ఇట్టి గాయకులు సాధారణంగా పూర్వపు వీరులను గురించీ, యుద్ధాలను గురించీ, ఒక్కొక్కపుడు ప్రేమ మయజీవుల విషాద చరిత్రలగురించీ పాడుతారు. పూర్వం లాగా ఈపాట పాడి వర్ష దేవతను మెప్పించి వానలు కురిపించాలనీ, ఆ పాట పాడి యింకొక దేవుని మెప్పించి మోక్షఫలం పొందాలనేభావం పోయి, మానవ జీవితగాథలనూ, సుఖ దుఃఖాలనూ గానంచేయటం అలవాటు కావచ్చింది. ఇట్టి పాటలు క్రమంగా జనులలో ప్రాకిపోయి నలుగురూ పాడటం మొదలుపెట్టారు. పొలాల్లో పంటకోసేటప్పుడూ, రాత్రిళ్లు దూరప్రయాణాలకు నలుగురూ బండ్లు కట్టుకు వెళ్ళేటప్పుడూ, పడవ నడిపేటప్పుడూ, పిల్లవాని ఊయలయందుంచి పాడేటపుడూ, నూలును రాట్నంపై వడికేటప్పుడూ యెన్నెన్నో జానపదాలు పాడేవారు జనం. ఈ అలవాటు మనలో యిప్పుడు చాలవరకు నశించినా, సినిమాపాటలు వాని స్థానాన్ని ఆక్రమించుకొంటు న్నాయి.

ఇట్టి జానపదాలనూ, యుద్ధవీరుల కృత్యాలనూ, ధైర్య సాహసాలనూ తెలిపే పాటలు ప్రతిజాతిలోనూ ఉన్నాయి. ఇవెన్నడో యెవరో కట్టిఉండాలి. కాలగతిని వానిలో యెన్నో

మార్పులు వచ్చాయనడానికి సందేహంలేదు. వీని నెవరు కట్టారంటే చెప్పటం కష్టం. తరతరాలుగా అవి ఒకరినుండి యింకొకరికి పిత్రార్జితపు టాస్థిలాగా వస్తూనే ఉన్నాయి. మొదట్లో విన్నది విన్నట్లే గాయకులు పాడేవారు. క్రమంగా వారిలో ఉత్సాహం పెరిగేకొలదీ పాతపాటలకు కొత్తచరణాలు చేర్చేవారు. ఉన్న చరణాల్లో తమ యుద్దేశాల కనుగుణ్యంగా కొన్ని మార్పులు చేసేవారు. క్రమంగా గేయాలు 'నేను వ్రాశాను' అనే భావం మనిషిలో తలయెత్తింది. మొదట్లో రకరకాల వృత్తిపనులమాదిరే, పాటలూ సంఘానికంతా మొత్తంగా చెందియుండేవి. ఆ పాటలు నలుగురూ పాడేవారు. కుమ్మరివాని కుండలను నలుగురూ యుపయోగించుకొన్నట్లే ప్రతివృత్తిపని వానివస్తువులూ నలుగురిసొత్తూ అన్నట్లే-పాటలూ నలుగురివీ అనే భావం ఉండేది. క్రమంగా వృత్తిపనివారిలో 'ఇది నేను చేశాను; అది నాది' అనే భావం యేర్పడ్డట్లే పాటల విషయాల్లోనూ 'ఈ పాటను నేను వ్రాశాను' 'ఆ కీర్తన నేను కట్టాను' అనే ప్రత్యేకత ప్రారంభమయింది. తరాలు గడిచేకొలదీ ఆ భావం బలపడింది. కొన్ని శతాబ్దాలు గడిచే టప్పటికీభావం యెంత పెరిగిందంటే కవులు యేగ్రంథం రచించినా అది ఫలానా ఊరులో వుండే ఫలానావారి కొమారుడు, యీ పేరుగలాయన రచించాడని వ్రాసుకొనేవారు. ప్రామిసరీ నోటులు వ్రాసేపద్ధతిలో తనఖాదస్తావేజుల్లో వ్రాసి యిచ్చే వాడూ, వ్రాయించుకొనేవాడూ తమ పూర్తివివరాలు లిఖించే పద్ధతిలో వ్రాయటం అలవాటైపోయింది. వాని ప్రత్యేకత లేదన్నా కొరతవస్తుందేమోనన్నభయంతో తన తాత ముత్తాతల

కాలంనుండీ తనకూ, యితర సంఘ ప్రజకూ యెట్టి సంబంధమూ లేదని నిరూపించడానికి తగినట్లు వ్రాసుకొనేవాడు కవి. తన భార్యపేరూ, బిడ్డలిందరూ, చిన్నప్పుడు ముద్దుగా ఫలానా పేరుతో పిలిచేవారూ అని యీవిధంగా వ్రాసుకోటం యెంతో గొప్పదనేభావం ప్రబలింది. సమిష్టిజీవితంలో ప్రారంభించిన మానవ సంఘంలో యీవిధంగా ప్రత్యేక వ్యక్తిత్వం పెంపొందింది; ఆ వ్యక్తి సంఘానికి పోటాపోటీగా నిలబడేవాడుగా మారిపోయాడు. ఏ సరస్వతీప్రసన్నమో, లేక యే శ్రీరాముని వరప్రసాదమో తన గ్రంథమును కవి వ్రాసుకొన్నప్పటికీ "నేను" అనే "అహంభావం" ఆ అంకితంలోనూ కనుపిస్తుంది. సంఘసమిష్టిజీవితానికే తన ప్రతిభనీ, తన ప్రతిశక్తి వినియోగించాలనే భావం పోయింది. 'తనది' అనే బదులు 'సంఘంది' అనే పదం ఒప్పైనదనే ఉద్దేశం అంతరించింది జనుల్లో.

ఈవిధంగా మానవుడు పెరుగుతున్నాడు. పెరిగేకొలదీ యింకా పైకెక్కడానికి కొత్త మెట్లతనికి కనిపిస్తున్నాయి; నడచిపోవలసిన మార్గం మునుపటికన్న స్పష్టంగా గోచరిస్తోంది.



